



# ద్రుత కార్యానుశీలనము

- డా॥ అంబడిపూడి నాగభూషణం



# ద్రుతకావ్యానుశీలనము

## ద్రుతవిషయసామగ్రి – తృతీయభాగము



అంబడిపూడి నాగభూషణం

డిసెంబరు - 1985

ప్రతులు : 500

రూ. 35 లు

ప్రకాశకురాలు :
అంబడిపూడి ఆదిలక్ష్మి

అంబడిపూడి నాగభూషణం
డా. కె. వి. కె. సంస్కృతకళాశాల,
3/3. అరండల్ పేట,
గుంటూరు - 2.

వెల్‌కం ప్రెస్, ప్రైవేట్ లిమిటెడ్,
బ్రాడీపేట, గుంటూరు - 2.

జ్ఞానచక్షువు దార్చు సార్వదిశం బైన
పాండిత్యనిభృతదృక్చండదీప్తి
సందేహముల దీర్చుసార్వకాలిక మైన
సహనసౌముఖ్యవిశ్వంభరతయు
వైమనస్యముల నింపుసార్వకామిక మైన
సౌహార్దదరహాసచైత్యకలన
సముచితోన్నతి నిచ్చుసార్వత్రికం బైన
చతురోపదేశవాక్యైకచక్షు

మానవిత్వ ధరిత్రిమిహిరాంశుతార
కముగ విద్యార్థిస్వయజనకు, విమలహృదయు
నేతపోలు రామబ్రహ్మవిద్వదీంద్రు
నెంచు నీగ్రంథ మభ్రాంబు వడ్డి నట్టు.

# మెచ్చుకోలు

**ఆచార్య తూమాటి దోణప్ప**

స్పెషల్ ఆఫీసర్

**తెలుగువిజ్ఞానపీఠం.**

తెలుగుభవనం :

ఉస్మానియాయూనివర్సిటీకాంపస్,

హైదరాబాద్ - 500007.

శబ్దవిద్యాసంప్రదాయానికి ఆదర్శస్థానం నాగభూషణు డని ఆచార్యమిత్రుల వచనం. ఆంధ్రమునిత్రయప్రవర్తిత మైనదానిని గురుముఖంగానూ, శాస్త్రముఖంగానూ శోధించి, సాధించినఉత్తమసాధకుడు మన ఈ నాగభూషణుడు.

ప్రక్రియాలాఘవమూ, ప్రయోగగౌరవమూ ఈ రచనలోని విశేషతలు. పదవగాహనమూ, శాస్త్రీయసమన్వయమూ శేఖరించిన ఈ వినయభూషణుని విద్యాపరిశ్రమం విశేషజ్ఞుల మెప్పునకు పాత్రం కాగల దని మా పరమవిశ్వాసం.

తూమాటి దోణప్ప

12-12-'85



# ప్రస్తావన



—*—

జననీజనకులు ఆదిలక్ష్మీప్రసాదులకు పాదాభివందనములు.

అక్షరభిక్ష పెట్టి పెంచినవారు మా పూజ్యగురువరేణ్యులు శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు. పిహెచ్.డి. పట్టమునకై పరిశోధనము మా గురువర్యుల మార్గదర్శకత్వములో నడచునవకాశము గల్గుటయే యసాధారణ మగు నదృష్టము కాఁగా వారియొద్ద డాక్టరేట్ పట్టము నందు వారిలోఁ బ్రప్రథముఁడ నగు నవకాశము సైతము గల్గుట నా సుకృతి ఫల మనుటకంటె గురువుల వాత్సల్యవిశేష ఫల మనుటయే యథార్థము. పితృసమానులైన శ్రీ రామబ్రహ్మంగారి శాశ్వతమగు నీ వాత్సల్యము నాపయి నుండ నొకలోటును లేదు.

ద్రుతవిషయసామగ్రిలోఁ తృతీయభాగ మగునీ 'ద్రుతకార్యానుశీలనము'ను పూజ్యులు శ్రీ రామబ్రహ్మంగారికి సమర్పించి వారిపై నాకుఁ గల మాటలకెక్కని భావములను మనసున దర్శించుటకు యత్నింతును.

అనేకానేక బాధ్యతలతో నాంధ్రభాషాసేవలో నవిశ్రాంతదీక్షితు లయ్యు నీ 'ద్రుతకార్యానుశీలనము'ను జూచి మెచ్చిన గురుతుల్యులు ఆచార్య తూమాటి దోణప్పగారియాదరవిశేషమున కెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈ గ్రంథముద్రణప్రక్రియలోఁ జేదోడు వాదోడుగా నున్న మిత్రులు శ్రీ కొండూరు సుబ్బరామయ్య, విద్యార్థులు చిరంజీవులు కళ్ళేపల్లి

శ్రీరామమూర్తి, వేదాంతం నరసింహామూర్తి, పాలుగుళ్ళ శ్రీనివాసరెడ్డి మఱియు మాకనిష్ఠసోదరి చి॥ అంబడిపూడి జయప్రద ప్రభృతుల కృషి మిక్కిలి ప్రశంసాపాత్రము.

ఎక్కువ యిబ్బందులకు గురి చేయక సాధ్యమైనంతవఱకు నాలస్యము తగ్గించుకొని తప్పుల కవకాశము పెంచక ముద్రించిన వెల్కం ప్రెస్సు వారి నభినందింపవలె.

ద్రుతవిషయకమైనవివిధాంశములవిచారణ మీగ్రంథముతో సాగినది. ఇంతటితో నియది సంపూర్ణ మని యింకఁ జెప్పవలసినది లేదని యెంతమాత్రము తలంపరాదు. లాక్షణికుల వ్యాఖ్యాతల యభిప్రాయసర్వస్వములో నిది యొకదేశ మని మాత్రము తలంపఁదగును. ప్రస్తావింపఁబడని లాక్షణికులమతములు కొన్నిగా పరిశీలనయాంశములతో పాటు ప్రస్తుతము లైన 'ద్రుతవ్యాకరణాన్వేషణము, ద్రుతప్రకృతికాన లోకనము, ద్రుతకార్యానుశీలనము' అను ముగ్రంథత్రయమునందలి లోటుపాట్లను సైతము తద్జ్ఞులు తెలియఁజేయ యర్థించుచు మెఱుంగ నపేక్షింతును. సత్యమును దెలియుటలోఁ దప్పులు సైతము కొన్నిమెట్లుగా నిల్చునందువలన నిట్టిగ్రంథరచనమునకు సాహసించుటను బండితు లామోదింపఁగల రనువిశ్వాసముతో సాంధ్రపండితలోకమునకు వినమ్రుండనై నమస్కరింతును.

విధేయుఁడు,

**అంబడిపూడి నాగభూషణం**

# ద్రుతకార్యానుశీలనవిషయసూచిక




1. ద్రుతస్వత్వసంశ్లేషములు 1
2. ద్రుతము-బిందువు 80
3. పరుషపరకద్రుతలోపము 92
4. వాక్యాంతద్రుతలోపము 139

చిన్నయభ్రాంతియేమి? 157

5. నకారద్విత్వము 166
6. అధర్వణోద్ధరణము (ద్రుతముపై ద్రుతము) 181


## అనుబంధములు


1. అజ్వత్కార్యము 208
2. ద్రుతపూర్వస్వరసంధి 241
3. నన్నెల - మమ్మెల 329
4. బిందువు - మకారము 351
5. వికృతివివేకోక్త ద్రుతకార్యాలు 365
   - i నుడితొలిహ్రస్వము - ద్రుతలోపము 380
   - ii నుడితొలిహ్రస్వము - ఖండబిందువు 386
6. ద్రుతకార్యపర్యాలోకనము 393
   - i స్వరపరకద్రుత కార్యములు 393
   - ii అజ్వత్కార్యము 394
   - iii పరుషపరకద్రుతకార్యాలు 396
   - iv సరళస్థిరపరకద్రుతకార్యాలు 401
   - v స్వత్వసంశ్లేషములు 406
   - vi పరుషపరకసంశ్లేషము 406
   - vii సరళస్థిరపరకసంశ్లేషము 408
   - viii సంశ్లేషస్వరూపము 411
   - ix స్వత్వము 412
   - x వాక్యాంతద్రుతకార్యము 184

# ద్రుతకార్యానుశీలనము



## ద్రుత స్వత్వ సంశ్లేషములు

ద్రుతమునకు విధింపఁబడిన బిందులోపసంశ్లేషస్వత్వము లను కార్యములు నాల్గింట బిందులోపములస్వరూపము విషయమున వివాదమున కవకాశమే లేదు. సంశ్లేషస్వత్వములు వివాదమునకు లోనైనవి. చేయఁబడిన వన్నను దప్పు లేదు.

ద్రుతము న (ని) స్వరూపముతోఁ జూపఁబడిన్నయు మీఁది హల్లుతోఁ గూడికొనుట సంశ్లేష మనియు, న (ని) స్వరూపముతో నుండుట స్వత్వ మనియుఁ బేర్కొనె నట వివాదము లేదు.

చింతామణి 'అలుకి చ సంశ్లేషస్స్యాత్' అని సంశ్లేషపదము నుచ్చరించి యున్నది. స్వత్వము నట్లు పేర్కొన లేదు. 'అవికార గతే తస్మి న్నపి సరళా ఏవ సన్తి తే పరత' యనుచో బింద్వాదివికారము లేనప్పటికిని బరముగ నున్న పరుషములు సరళములే యగు నని చెప్పఁబడుటచే నిందు ద్రుతమునకే విధ మగువికారమును లేదు గావున నిట్టిది స్వత్వ మనఁదగు. వి. వి. మాత్రము 'స్వత్వం ప్రశ్లేషతా బిన్దుః' అనుమున్నగురీతిగా స్వత్వసంశ్లేషములను బేర్కొనియే యున్నది.

చిం. వి. వి. ల మతమునఁ బొల్లునకారమె ద్రుత మని చెప్పఁగొనుటవలన బాలవ్యాకరణమునవలెఁ గాక యీ వ్యాకరణములలో సంశ్లేషస్వత్వముల విషయమున వివాదము తేర్పడిన దన వచ్చును

చింతామణికిఁ బ్రసిద్ధము లైనవ్యాఖ్య లగుబాలసరస్వతీయాప్పకవీయములు సంశ్లేషమును మీఁదిహల్లుతోఁ గూడికొనుటగాను స్వత్వమును నుఁ-ని, అనునాకారముతో నుండుటగాను జూపి యున్నవి.

అహోబలుఁడును 'పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ' యని సంశ్లేషమును, ఎన్నను అనురీతిగా పృథక్త్వమును 'వర్ణాన్తరత్వేన పరిగణనవేళాయాం పృథక్పరిగణనం తస్య ఫల'మ్మనుచును జేర్కొనెను. అట్లయ్యును 'లుక్సంశ్లేషౌ నాచి' యనుసూత్రమునొద్ద 'లుక్సంశ్లేషౌ నస్య న స్తో ఽచి' యని లుక్సంశ్లేషములు లే వని చెప్పుచునే 'కొల్లు నచ్యుతున్' అని చూపెను. 'కొల్లు నచ్యుతున్' అనుచో ద్రుతము పై నున్న యచ్చుతోఁ గూడినది. ఇది సంశ్లేషము కాక మఱే మగును? చిన్నయ మీఁదిహల్లుతోఁ గూడికొనుట సంశ్లేష మనెను. ఇట మీఁద హల్లు లేదు గావున సంశ్లేష మగు టెట్లు? అహోబలుఁడు పరశబ్దస్థిరములె యుద్దేశించె ననవచ్చును. కాని యటఁ 'బరవర్ణేన' అని సామాన్యముగాఁ జెప్పుట (మీఁదివర్ణ మచ్చైనను గావచ్చును గాన) మీఁది యచ్చుతోఁ గూడినను నయ్యది సంశ్లేషమే యగును. మఱి యిట సంశ్లేషము రా దని చెప్పుచు కొల్లు నచ్యుతున్ అని సంశ్లేషమునే చూపు టెట్లు? ఈసూత్రమున కహోబలపతి ప్రత్యేకప్రాముఖ్యము నీయ లేదు. నిర్గళితార్థానువాద మని యుపేక్షించి యున్నాఁడు అందుకే "నస్యాత్తద్ధర్మ్మోఽత' యనుదానికి లక్ష్యముగాఁ జూపిన వెలయు నతనికీర్తి వంటి దనఁ దగిన కొల్లు నచ్యుతు ననురీతి వుదాహరించెను. ఏమైనను దనసంశ్లేషపదార్థ మిట సరిగా సమన్వయింప దని తలఁచెనో లేదో కాని యంతకంటె లుక్సంశ్లేషావిత్యాదిసూత్రమును వివరింప లేదు. దీనిని బరిశీలింతము.

ద్రుతమునకు బింద్వాదికార్యములు హల్పరకత్వముననే చెప్పఁబడినవి. చిం. అభిప్రాయమునే సంగ్రహింపఁ బూనిన వి.వి. "ద్రుతస్య హలి బిన్దుస్స్యాత్" అని మున్నుగాఁ జేర్కొనుట స్పష్టమే. (అవసానమున లోపము విహితము) ఇంక నచ్పరకతలో ద్రుతమునకు బింద్వాదివికారములకుఁ బ్రాప్తియే లేదు. ప్రాప్తియే లేక నిషేధింప వలసినయవసర మేమి? అయ్యది సిద్ధించు చున్నయర్థమునే సా

ధించుచు నిరర్థక మనఁ దగి యున్న దని నిర్ణయింప రాదు. ప్రాప్తి లేకున్నను ద్రుతమున కగు బిందులోపసంశ్లేషస్వత్వములలో లోప సంశ్లేషములను నిషేధించుట ననుసరించి యిఁక మిగిలినబిందుస్వత్వ ములు స్వరపరకత్వమున సాధించి నట్లవుచున్నది. రాముఁ అరి భీమున్ రాముం అరిభీమున్ అనురీతిరూపము లున్నవా? స్వరపరకతలో ద్రుతమునకు బిందువుగూడ లేనవుడా బిందువును గూడ నిషే ధింపక లోపసంశ్లేషములను మాత్రమే నిషేధించు టేమి? ఇట్టిబిందు వింకొకతీరుగా వారింపఁబడునవకాశము లేదు. చిం. చెప్పలేదు గాని వి.వి. "బిందుర్వైకృతమధ్యేఽత్ర నాన్యవర్ణే పరే తు సః" అని పరుష సరళేతరవర్ణపరకతలో బిందు వుండ దన్నది. అయినను నట్టివిధానము వైకృతశబ్దమధ్యమునకే గాని శబ్దద్వయమధ్యమునఁ గాదు గదా. అయిన శబ్దద్వయమధ్యమునఁ బరుషసరళేతరపరకతలోఁ దెలుఁగున బిందు వున్నదా? అనఁగా నాచ్ఛికములయెడ నట్టి దసంభవము గావున లేక పోవచ్చును. (లతాంతములకుం బొనసి, మీఁదం మఱి అనురీతి మకారపరకతలోఁ గొందఱు బిందువును జూపుదురు) అవుఁ గాక. సంస్కృతసమేతరంబు లయినతెలుగుశబ్దములయం దనురీతిగాఁ గాక సామాన్యముగ శబ్దమధ్యే అని చెప్పిన వి.వి. వచనములో శబ్ద ద్వయమధ్యమునందును ననువిశేషార్థమును జెప్ప నవకాశము గలదు గదా, యనవచ్చును. దానివలనఁ గూడఁ గల్గునది యనర్థమే. తీఁగ అనుచో 'క్వచిద్గకారోపః' అని వకారమైన 'నాన్యవర్ణే పరే తు సః' అనుదానిచేఁ బరుషసరళేతరపరకతయందు బిందు వుండ రాదు గాన లోపించి తీవ అని అవుచున్నది. 'అన్యవర్ణే' అనుచోఁ బరుష సరళేతర మగునావర్ణము స్వరము గూడఁ గావచ్చును గదా. రామున్ +అరిభీమున్ అనుచో ద్రుతమున కట్లు బిందువు వచ్చిన తీవ అను చోటవలెనే యిట బిందువు లోపించును గావున రాముఁ అరిభీము రాముం అరిభీము అనురీతిరూపములు వారింపఁబడుట వాస్తవమే. కాని

అట్లయిన ఖండపూర్ణబిందువులు 'నాన్యవర్ణే పరే షు' అనుదానిచే (తీవలో వలె) లోపించును గావున రాము అరిభీము అని కావలసియే యుండును. ఇట్టి రూపము లున్నవా? ద్రుతమునకు లోపము లేదనుటచేత నిట్టిరూపములు లే గదా నిషేధింపఁబడినవి. (పోనీ సంధి యవు రామభిరామున్ వంటివి) అట్టిరూపములనే బిందువిధానముచే సాధించుట వ్యర్థము గదా. ఈకారణము ననుసరించి రాము అరిభీమున్ అను రీతి బిందులోప మైనరూపంబులను లోపనిషేధసామర్థ్యమునుబట్టియే వారించుకొనవలయు నన్న నింతటికంటె లోపసంశ్లేషములతో పాటు బిందువును రా దని యటనే బిందువునుగూడ నిషేధించుట సూటియు స్పష్టము నగుమార్గము కదా!

కాఁగా నిట 'నాన్యవర్ణే' అనుదానిచే స్వరూపైకత్వమున బిందువు లోపింపఁజేయుటవలన సాధింపఁబడిన ప్రయోజన మేమియు లేమి స్పష్టము. అట్లగుటఁ దగిన రాము అరిభీమున్ రామరిభీమున్ అను రీతిరూపము లెట్లు వారింపఁబడినను వారింపఁబడకున్నను నెప్పటను గన రావు విననరావు గదా, దీని ననుసరించి 'వైకృతమధ్యే' యనుచో నొకశబ్దమునకు మధ్యమున నని యర్థము చేయ నవు. శబ్దద్వయమధ్యమనర్థము చేయఁ బ్రయోజనము లేదు. బిందుం ప్రసక్తి యను సూత్రముచే స్థిరపంక్తిలోఁ గలదో యన్న (నట బిందువు చేసి లోపింపఁజేసిన ద్రుతలోపమువలననే యట్టిరూప మవు) మాంసం మతి యనురీతి మకారపంక్తిలో బిందువు సాధింపఁబడుచుండుట స్పష్టమే. కాఁగా 'వైకృతమధ్యే' అనఁగా వైకృత మైనశబ్దముయొక్క (శబ్దద్వయముయొక్క యని కాదు). నడుమ ననురీతియర్థమె సూరిసమ్మతముగా గ్రాహ్యమగుట యుక్తము. (శబ్దద్వయ మధ్యమున నని వివరించినవారు గాన రాకుంట యిందువలననే)

అటియెడల రాము అరిభీమున్ రాముం అరిభీమున్ అను రూపముల ప్రసక్తి తప్పదు. కాఁగా 'లుక్సంశ్లేషౌ నాచి' యని

స్వరపరకత్వమున లోపసంశ్లేషములు మాత్రమే నిషేధించి యుంటచే బిందువు సాధింపబడుట యనర్థమైనది.

ఇంక నా తరువాత మిగిలినది స్వత్వము. ఇది నిషిద్ధము కాలేదు గావున రాఁదగినది. ఇపుడు గూడఁ గుదురనిచో నీసూత్రము మిక్కిలి యనర్థక మగును. అహోబలుఁడు 'కొల్లు నచ్యుతుఁ' అని యుదాహరించెను. 'పరవర్ణేన' అను నాతని వర్ణయముచే నీయది సంశ్లేషమే యగును. కానీ సంశ్లేషము రాఁ దనెం గదా. స్వత్వ మగు నందమా? స్వత్వ మిట్టిది గాదు 'క్రృజము నను' ఇత్యాదిగా నీతఁడు స్వత్వమును 'సు'స్వరూపముతోఁ జూపెను. అచ్చరకతలో ద్రుత మట్లు నిల్చి యుండునా? వచ్చెను ఎవఁడు అనుకృతిరూపములు నుండవే కదా. అనఁగా నిట స్వరపరకత్వమున స్వత్వమును తే దన్నమాట లోప సంశ్లేషములను నిషేధించి సాధించిన ప్రయోజన మేమి? ద్రుతము పొల్లనకారమే యనియు స్వత్వము మాత్రము స్వరసహిత మనియు నహోబలుఁ డెంచెను. పొల్లనకారము మీఁదియచ్చుతోఁ గూడుట సంశ్లేష మవునా?

'ఆహా+ఆహా' అని యుండఁగా 'అవ్యయస్యామ్రేడితే స్యలోపశ్చ' యని యంత్యలోపమైన నాహా+ఆహా. ఆహాహా అని యైనది. ఇట హాకార మచ్చుతో సంశ్లిష్ట మైన దందుమా? కిన్ను ఇత్యాది స్థలములలో హల్లులు సంశ్లిష్టము లనఁదగు. హల్సంయోగమె సంశ్లేష మని వ్యవహరింపఁబడుచున్నది. కాని మీఁదిహల్లుతోఁ గూడికొనుట యనుట (వచ్చెన్ ఋషి?) యిట్టిదే యనఁదగి యున్నది. ఇట్లు ద్రుతము మీఁద నున్న హల్లుతోఁ గూడుటయె సంశ్లేష మని సూరిసమ్మత మగునర్థమును గ్రహించుచో కొల్లు నచ్యుతు ననురీతిగా ద్రుతము మీఁదియచ్చుతోఁ గూడుట సంశ్లేషము గా దనియె యహోబలుని యభిప్రాయము నెన్నఁదగి యుండును. లుక్సంశ్లేషా నస్య న స్తోఽచి!

యని సంశ్లేషము నిషేధింపఁబడుట వివరించి కొల్తు నచ్యుతు వను రీతిగా నుదాహరించి మఱి యేమియు మాటాడకుంటనుబట్టి ద్రుత మచ్చుతోఁ గూడుకొనుట సంశ్లేష మనఁ దగ దనియే యాతఁ డెంచి యున్నట్లు స్పష్టము. కాఁగా స్వరపరత్వమున ద్రుతమునకు బిందు లోపసంశ్లేషస్వాత్వము లేవియు లే వన్నమాట. సూత్ర మిది ప్రయోజనవంతము గా దని యూహింపఁబడు పేర్కొనుట యిట్టియర్థములు గల్గకుంట నుద్దేశించియే యుండు నేమో? అయినను ప్రాప్తి లేనియీ నిషేధము చరితార్థము గాదని యన్న నితరములగుబిందుస్వాత్వములకు సాధక మనవలయును. కాని యిటబిందుస్వాత్వములును లేవు గావున నింకీవిధి యేల?

ఇట్టియెడ వజ్ఝలవారు దీనింబట్టి నన్నయమతమునను 'శ్లిష్టతా నస్య కథ్యతే' యనుదానిబట్టి యథర్వణమతమును సంశ్లేష మనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట గాదని స్పష్టము చేయుచు దీనికిఁ బ్రయోజనము కల్పింపఁ బ్రయత్నించిరి. 'సంశ్లేష మనఁగా వ్యంజన నకారము పూర్వాచ్చునఁ జేరియుండుట' యని నన్నయాథర్వణసిద్ధాంతము (వ్యా. సం. ... ౧౨౩) అనియు నయ్యది పరస్వరాంగముగా నుండ స్వాత్వము (౨౮౦) అనియు వివరించిరి. దీనివలన వచ్చెన్ అతఁ డనురీతిసంశ్లేషము నిషేధించుట ప్రయోజన మన్నమాట. ద్రుతము మీఁదిస్వరముతోఁ గలిసిన 'వచ్చెనతఁ' డన్నది స్వాత్వ మగునా? స్వాత్వమే యని వీ రిట స్పష్టముగాఁ జెప్పలేదు. ఇట్లు చెప్పకుంటకుఁ గారణ ముండ వచ్చు. దీనిం గూర్చి వివరించునప్పుడు "సంయోగాది భూతో వర్ణః స్వరాత్ స్వరే వర్తమానః పూర్వస్య వా స్వరస్యాంగం భవతి. పరస్య వా" (బా.వి.వ. ౨౦౮) అనువివరణమునుబట్టి చూడఁగా నిచ్చట ద్రుతము స్వరాంతరమున నున్నను సంయోగాదిభూతము కాలేదు. అట్లగుట హల్పరకస్థితియందుమాత్రమె సంభవించును. స్వరపరకతలో నది ప్రసంగము చేతనే వజ్ఝలవా రిట దీనిని (వచ్చె

వలెఁడు) ద్రుతస్వత్వముగా వ్యవహరింప లేదేమో. అవ్వుఁ గాక, యి ట్లిచట ద్రుతమునకు స్వత్వమును లేదు గదా. 'లుక్సంశ్లేషౌ న' అన్న పుడు సంశ్లేషపదవిశేషార్థము చేఁ దన్నిషేధమును లోపనిషేధమును బొసఁగును గాక. స్వత్వమును నిషేధింపలే దేఁ? ప్రాప్తరకత లేదు గావునఁ బైవివరణమున కనుగుణముగా స్వత్వప్రసక్తి ('పరస్య వా' యని పరస్వరమున కంగమగు ప్రసక్తి) లే దన్న పూర్వస్వరాంగప్ర సక్తి మాత్ర మేల? ఈపక్షమునను సంయోగాదిభూతము కావలెను గదా. స్వరపరద్రుత మట్టి దైనదా? అట్లైన సంశ్లేషనిషేధ మేల చేసెఁ? స్వత్వనిషేధ మేల చేయలేదు? దీనిఁబట్టి సంయోగాది భూతము కాకున్నను రెం డచ్చుల నడుమ నున్న యీద్రుతము పూర్వ స్వరమున కంగమైన సంశ్లేష మనియుఁ బరస్వరమున కంగమైన స్వత్వ మనియుఁ జెప్పఁజొచ్చె నతఁ డనవలెను స్వత్వము కాఁగలదు. దానిని స్వత్వమని వారిట వ్యవహరింపకున్నను వచ్చెన్ అతఁ డన్నది సంశ్లేష మనుటంబట్టి యిది స్వత్వము చెప్పి చూతము. లోపసంశ్లే షనిషేధముచే స్వత్వము సాధింపఁబడిన దనవచ్చు. కాని ద్రుతము నకు బిందువును రావచ్చును గదా. దానికి నిషేధ మేది? రాముఁ అరిభీముఁ డని యుండవచ్చునా?

అనలీరీతిస్వత్వమును మాత్రము చెప్పవలెనా? ఇట స్వత్వ మగు నని చెప్పలేదు. కాని లోపసంశ్లేషనిషేధమునకు స్వత్వ మగుట ప్రయోజన మన్నచో (అంతకన్న వేఱే మున్నది?) నాప్రయోజ నము సాధింపవలసి యున్నదా? ద్రుతము పొల్లునకార మవుట ననుస రించి యిట ద్రుతము హల్మాత్రము. ఈహల్లు పయియచ్చుతోఁ గూడి కొనుట విశేషముగా విధింపవలసిన యవసర మేమి? 'అద్యస్యాత్రమే డితేఽన్త్యలోపశ్చ' అను చిం. లక్షణము ఆమ్రా + ఆమ్రో అనురీతిగా మొదటదానియందుఁ దుదివర్ణమునకు నగఁగా స్వరమునకు లోపము చెప్పినది. ఇంక నటఁ బొల్లే మిగిలినది. ఆపొల్లు మీఁదియచ్చుతోఁ

కూడుటను బ్రత్యేకముగాఁ జేర్కొననా? అక్కడ లేనియవసరము ద్రుతమున కిటమాత్ర మేమి?

ఇట్లే వి.వి.సైతము 'క్వచిత్సంస్కృతీ యోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవేత్' 'ప్రథమే చోత్తమే చైవ ప్రయోగో వా భవేచ్యుతి' యనురీతిగా సంధిసందర్భములందుఁ బూర్వస్వరలోపమును జెప్పినది. (అప్పకవియు నిట్లే పూర్వస్వరలోపము పేర్కొనుట గమనార్హము). అట్టియెడల స్వరలోపముచేఁ బొల్లుగా మిగిలినవర్ణము మీఁది యచ్చుతోఁ గూడుట వి.వి మాత్రము ప్రత్యేకముగాఁ జేర్కొన్నదా? పొల్లైనహల్లు మీఁదియచ్చుతోఁ గూడికొనుటలో విశేషము లేదు.

కాఁగాఁ దదనుగుణముగా ద్రుతము అనఁగా పొల్లనకారము మీఁది యచ్చుతోఁ గలియుట యనుదానిని విశేషముగా (స్వాత్వము) సాధింప వలసినయవసరము లేదు. వజ్ఝలవారియర్థనిర్ణయము సరిగా లే దని గుర్తింపవచ్చును.

అప్పకవి 'అచ్చు పర మైననాంతపదాంతమునకు, సంయుతంబును లోపంబును జగతి లే' వని చెప్పి 'చూచె నింతి యనెడుచోట చూచె న్నింతి యనిన సంధిదోష మయ్యె' ననువిధముగ నీసూత్రము నందలిసంశ్లేషపదమునకు ద్రుతద్విత్వ మనురీతియర్థము చేసియున్నాఁడు. అలుకి చ సంశ్లేషస్స్యాత్తను సూత్రమునొద్ద సంశ్లేష మనఁగా ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడియుండుటనుగా యతిస్థానమునందు నిబంధించినాఁ డప్పకవి. దీనింబట్టి యతఁడు సంశ్లేష మనఁగా (ద్రుతము) మీఁదిహల్లుతోఁ గూడికొనుట యనియే భావించె. సూరి యీయభిప్రాయమునే వ్యక్తము చేయుట స్పష్టము. ప్రస్తుతస్థలమునఁ బైన చ్చుండఁగా 'మీఁదిహల్లుతోఁ గలియుట' యనుసంశ్లేష మెట్లు? దానిని నిషేధింప నవసర మేమి? కాఁగా (నచ్చ ధకత యుండు) మీఁదిహల్లుతోఁ గూడికొనుట యనుసంశ్లేషము కుదురు

పడవలయు నన్న మీఁద హల్లుండవలెను గావున ద్రుతముపై మఱల నదియే యనఁగా నింకొక ద్రుతము చేరు ననియు—స్వరపరకతలో ద్రుతసంశ్లేష మనఁగా ద్రుతము మఱల నట్టి ద్రుతముతో వచ్చెన్నింతి ననురీతి నుండు ద్రుతద్విత్వమె యని యప్పకవి యభిప్రాయమగు నని తద్వివరణమునుబట్టి గ్రహింపవచ్చును. "నన్నయభట్టారకుఁ డన్నిష్ట సఖి నాఁది యున్నదాని నని ప్రయోగించి 'లుక్సంశ్లేషా నాచి ద్రుతస్య' అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్యసూచనార్థం బని యెఱుంగునది" యని పేర్కొనుటలోఁ బ్రౌఢవ్యాకర్తయు నప్పకవియీయభిప్రాయము నామోదించుట గమనింపఁదగును. అనఁగా స్వరపరకతలో ద్రుతసంశ్లేష మనఁగా ద్రుతద్విత్వ మని తాత్పర్యము.

హల్లు అచ్చుతోఁ గలిసినను లేక హల్లుతోఁ గలిసినను సయ్యాది కలయికయే. అయినను హల్లచ్చుతోఁ గూడిన 'వచ్చె నతఁడు' అను రీతిసందర్భములకంటె 'వచ్చెన్గోవులు' అనురీతిగా హల్లు హల్లుతోఁ గలిసినపుడే 'సంశ్లిష్టత' యన్నది యుచ్చారణములో స్పష్ట మయి యుండుట గమనార్హము. 'వచ్చెనతఁడు'-ద్రుతము మీఁదియచ్చుతోఁ గలయిక నందినది. అయ్యు సయ్యాది సంయుక్తాక్షర మగునా? హల్లచ్చుతోఁ గూడినప్పుడు కాక హల్లు హల్లుతోఁ గలిసినపుడే సంయుక్త మను వ్యవహారము కన్పించు. (వచ్చెనతఁ డనుచో 'యుక్తపరశ్చ' యని 'చె' వర్ణము గురువు గాదు గదా) అట్టిసంయోగము సంశ్లేషముగా గుర్తించుట సముచితమె కదా. హల్సంయోగ మచ్చరకత్వమున నసాధ్యమగుటంజేసి ద్రుతమునే యింకొకదానిం జేర్చి దానితో సంశ్లేషమును జూపుట యుచితమే యనఁదగి యున్నది.

అవుఁ గాక కాని యిట్టి ద్రుతద్విత్వరూపసంశ్లేషము నయినను నిషేధింప నేల? సంశ్లేషమునకుఁ బ్రాప్తియే లేదు గదా. అల్లే

లోపమును నిషేధించుట యేలకో యప్పకవి వివరించి యుండ లేదు. ఇంకఁ గవిజనాశ్రయాదులు ద్రుతద్విత్వమును దుస్సంధి యని తిరస్కరించినట్లుగనే చింతామణికర్తయు ద్రుతద్విత్వమును నిషేధించె నన వలె. ఇట్లైె ద్రుతపూర్వస్వరమునకు సంధిని వారించుట లోపనిషేధమునకుఁ బ్రయోజన మనవచ్చును. ఆయాయిస్థలములందు యకారముపై నత్వ ముండ దని యుచ్చారణమునందలిదోషమును సంస్కరించుటకయి 'యద్యః క్రియాసు' అనురీతిగా లక్షణము చేసినట్లే యిటఁ గూడ లోపసంశ్లేషముల నిషేధము చేయఁబడెన నని తలంప నగు. అయిన లోపసంశ్లేషముల నిషేధసామర్థ్యముచే నిట బిందుస్వత్వములు ప్రాప్తించునేమో యనిపింపక తప్పదు. అప్పకవి 'మహీజాతను గొనివచ్చె' ననురీతిగా ద్రుతములను నుండనియే చూపెను. అట్టియెడల నాతనిమతమున బిందుస్వత్వము లయిన రాముఁడరిభీమున్, రాముని అరిభీమున్ అని కావలెను. 'వినా నత్వః యః అత్'-అనుచో లోపి చేయు మున్నగురీతి నితరస్వరముల కయ్యది వారకమగునా? అట్లైె యిటఁ గూడ బిందుస్వత్వము లుండవలయు నని యూహింపరా దనఁదగునా? అప్పకవియభిప్రాయ మిట స్పష్టముగా నిర్ణయింపరాదు. లోపద్విత్వములనిషేధముతో నాతఁడు ద్రుతము పై యచ్చుతోఁ గూడుటనే ప్రదర్శించి యదియే సూత్రసిద్ధ మన్నట్లు పేర్కొనెను.

ఏది ఏమైనను నప్పకవిమతము కొంతవఱకే నుచిత మని యంగీకరింపఁదగియున్నది.

ప్రథమవ్యాఖ్యాత యగుబాలసరస్వతి 'లుక్సంశ్లేషౌ నాచి' యనునీసూత్రమును బూర్వసూత్రమునకు సంబంధించినదిగా వివరించి యున్నాఁడు. ఆపూర్వసూత్రము 'సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః' అన్నది. దీని ననుసరించియున్న 'లుక్సం

శ్లేషౌ నాచి' యన్నది దీనికి సంబంధించినదే యని తెలియుట వక్రిమమే. మొదటిసూత్రము పదాదియకారమునకు నద్విత్వకార్యము చెప్పుచున్నది. యకారము స్థిరము పదాదియకారరూప మైనయా స్థిరము పరమగుచుండఁగా 'ఉణ్వా ద్రుతప్రకృతికా' త్తనుసూత్రముచే లోపమును 'అలుకి చ సంశ్లేషః' అనుసూత్రముచే సంశ్లేషమును ప్రాప్తించుచున్నవి. కావున నద్విత్వకార్యమువలన నీపదాదియకారపరకతలో ద్రుతమునకు రావలసిన యున్న లోపసంశ్లేషములు వారించుచుఁ బ్రస్తుతనిషేధము ప్రాప్తిపూర్వక మగుట సంభవించుచున్నది. 'బిందుం ప్రవదన్తి తం క్వచిత్క్వచిత్' అను సూత్రము సరళస్థిరపరకత్వమున బిందువును గూడఁ జెప్పుచున్నది. కాన నిట బిందువును గూడ నిషేధింపవలసియే యున్న దనిపింపవచ్చును. దీనిం గూర్చి కాన. ఇది కేచిత్స్మృతమగుటచేఁ బ్రయోగమూల మన్నాఁడు. అప్పకవి ప్రభృతులు ప్రయోగములను బరిశీలించి తుదకు వర్గయుక్స రళముకారపరకతయం దని తేల్చిరి. కేచిన్మత మగుటయే గాక క్వాచిత్క మగుటంబట్టియు బిందువును బ్రత్యేకముగా నిషేధింప వలసిన యవసరము లేదని చింతకర్త భావించి యుండవచ్చును. ఇంక పైరీతిన్యాయవ్యాప్తిఁ బట్టి పూర్వాదినను యకారపరకత్వమున ద్రుతమునకు బిందుప్రాప్తించుటయే లేదు. లేదు గాఁబట్టి నిషేధము నవసరము లేదు. కాఁగా యకారపరకత్వమున లోపసంశ్లేషములను మాత్రమే నిషేధించుట యుచితమై యున్నది.

కాని "యులుకి చ సంశ్లేషస్స్యాత్' త్తయచోఁ జశబ్దముచే స్వత్వమును గలదని దానిని మా (-) స్వరూపముతోఁ జూపియున్నాఁ డప్పకవి. ప్రస్తుతసూత్రము లోపసంశ్లేషములనుమాత్రమే నిషేధింపంగా బిందువునకుఁ బ్రాప్తియే లేదు నిషేధావసరమును లేకపోఁగా మిగిలిన ప్రాప్త మగుస్వత్వమునకు నిషేధము లేమి నవహోబలపతియు తానుసార

ముగా 'కలిగెనుయెమ్మ' అనురీతిగూడ నుండవలసియే యున్నది. అయ్యది విరుద్ధము గదా. బాలసరస్వతియు నిట స్వత్వస్థితినిగూర్చి ప్రస్తావించియుండలేదు. కాని అంబను గొలిచెద ననుచో 'ను' స్వత్వముగాఁ జూపుట గానవచ్చును. అహోబలపతి యాతనికుముందు దీనిం గూర్చి 'తత్సూత్రం నిర్గళితార్థానువాదక మేవ' యని చెప్పకొని యుంటచేఁ గాఁబోలు నీసూత్రమునొద్ద ముక్కకు ముక్కగా నర్థము చేసెనే కాని వివరణమునకుఁ బూనుకొనలేదు. పూనుకొన్నఁ బూర్వపుఁదన స్వత్వవివరణమున కిట వైరుధ్యము గల్గుట గుర్తించెడువాఁడేమో. ప్రౌఢవ్యాకర్త యది గ్రహించియే యహోబలుని యభిప్రాయమును స్వీకరింపక ప్రస్తుతస్థలమున నప్పకవి సిద్ధాంతము నుద్ధరించె నని తోఁచుచున్నది.

ఇంకను 'సర్వత్రాజ్వత్కార్య' మ్మనుసూత్రము పదాదియకారమునెడల నద్వత్కార్యము విధింపఁగా నచ్కార్య మేది? యను ప్రశ్నము గల్గ 'లుక్సంశ్లేషౌ నాచి' యని చెప్పిన ట్లున్నవచ్చును. అద్వత్కార్యవిధానమువలననే (పదాది) యకారరూపస్థిరపరకకార్యములప్రాప్తి వారింపఁబడుచున్నది గదా యచ్చునకువలె. దీనివలన 'లుగ్వా' యని లోపమును 'అలుకి చ' యని సంశ్లేషమును బ్రాప్తించుటయే లేదు. స్పష్టతకయియే 'లుక్సంశ్లేషౌ న' యని నిషేధించె నన్నను 'అచి' యను సామాన్యనిర్దేశముచేఁ 'బర్జన్యవ ల్లక్షణప్రవృత్తి' యనున్యాయము ననుసరించి యిట్టిపదాదియకారస్థలమునందే కాక యచ్చు పరమయినయెల్లచోటులను నీలోపసంశ్లేషలనిషేధము వర్తింపవలసియే యుండును. కవిజనాశ్రయాదులు ద్రుతద్విత్వమును దిరస్కరించినట్లుగను, 'అద్వ్యః క్రియాసు' అని చింతామణియుఁ జెప్పినట్లుగను సంశ్లేష మన నిట ద్రుతద్విత్వము నిషేధింపఁబడిన దనఁదగును. అనఁగా నేతన్నిషేధమువలన నితరకార్యములప్రసక్తి యూహింపరా దనఁదగును. ద్రుతలోపనిషేధమునకు రామున్ + అరి

భీమున్, అనుకీర్తి స్వరపరకస్థలములందు సంధ్యభావము సాధించుట ప్రయోజనముగా గుర్తింపఁదగును. (చూ. అను.)

పయియర్థము ననుసరించి 'లంకస్సంశ్లేషో నాచి' యనుసూత్రము నందలిసంశ్లేషపద మున్నకవీయ ప్రౌఢవ్యాకరణాభిప్రాయముల కను గుణముగా ద్రుతద్విత్వమును జెప్పునదిగా గ్రహింపఁగా లాక్షణికులు పేర్కొన్నట్లుగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట యనుసంశ్లేషస్వరూపమున కీసూత్రము బాధకము గాఁ జాలదని గుర్తింపవచ్చును. కావున నీనిర్ణయమునకుఁ జింతామణిలో బాధ లేదు. వి.వి.లో నున్నదేమో చూడవలె.

'పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్య కథ్యతే' యను వి.వి. లక్షణము గుర్వవసాయి యగుపద్యములందును (హ్రస్వపూర్వకమగు) ద్రుతమునకు సంశ్లేషమును విధించుచున్నది. అవసానమునం దనుట చేతనే పై నేవర్ణములు లేకుంట స్పష్టమే. అట్టియెడలఁ బైవర్ణమనఁగాఁ దరువాతిపద్యము మొదటిహల్లుతోఁ గూడికొనుట యను సంశ్లేష మెచ్చటను లేదు. సంశ్లేషముచే యీకారిక విధించుచున్నది. కావున సంశ్లేష మన మీఁదివర్ణము (హల్లు)తోఁ గూడికొనుట యను లక్షణ మిట నరిపడదు. 'అలుకి చ సంశ్లేష స్స్యా' త్తనుసూత్రము నొద్ద 'పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ స్యా' త్తని మీఁదివర్ణముతోఁ గలియుటయే సంశ్లేష మని భావించినయహోబలపతిసయితము.'–ఖ్యాతానునాసికవిధికిఁగిరుణాంబుధికిన్' అని (సూరిచూపిన...బుధసేవన్ అనుదాహరణ) లక్ష్యమును జూపెను. ఇటఁ బరవర్ణముతోఁ గలయిక యేది? ఇటఁ గన్పట్టునట్టి సంధ్యమునుగూర్చి యాతఁ డేమియు జెప్పలేదు. అయిన సహోబలునిమత మేది? యనఁ బైని స్పష్టమగు.

పైరీతియుదాహరణముల ననుసరించియుఁ గావచ్చును. వజ్ఝల వారు ద్రుత మైననకారము పూర్వాచ్చ నత్తియుండుట సంశ్లేష

ముగాఁ జేర్కొనిరి. దీనిచేఁ బద్యభేదావసానమునందలి ద్రుతము తత్పూర్వస్వరమునే యాశ్రయించి యుండు నని సంశ్లేషమును విధించు టలోఁ గొంత యసత్యము తగ్గినది. 'లఘువే తుది నుండవలసినగీతా దులతుదిని సంశ్లేష మందునే (298) నని వజ్ఝలవా రొక విశేష ప్రయోజనమును గూడ సాధించిరి.

కానీ యీయత్నము విధింపవలసియున్నదా యని సందేహము. వీరి మతమున ద్రుతము పొల్లునకారమే. అవసానమునందలి దగుటచే దీనికిఁ బైని వర్ణములు నుండవు. అట్టియపుడు చివరిపొల్లుహల్లు (నకారమే యేమి?) పూర్వస్వరము నాశ్రయింపక యేమైపోవును? వర్ణమే దేని బలమునఁ గదా లోపాదివికారములు ప్రాప్తించుట. మఱి పూర్వస్వరాశ్రయత్వమును విధింప నేల? 'వాక్యాన్తగతపదనాశ్చ' యను సూత్రముచే నవసానమునందలి ద్రుతము లోపింపవలసియున్నది కావున నాలోపమును సాధించుటకే యీకారిక చెప్పఁబడిన దనఁదగునా? అదియు సందేహమే. 'వాక్యాన్త' సూత్రము లోపము వికల్పముగాఁ జెప్పుట స్పష్టమే. ద్రుతమైనయాపొల్లునకార మట్లు నిలిచి యుండునవకాశము చింతామణియే కల్పించినది గదా. అయిన గుర్వవసాయి యగుపద్యములందు (నొక్కొకచో) నసలు లోపింపక పోవచ్చుఁ గాక. దానిఁ బ్రత్యేకముగ విధింప నక్కఱలేదు. ప్రయోగానుగుణముగ, శబ్దశాస్త్రము ననేకవిధము లైనరూపములను సాధించు నపుడు లక్షణబద్ధము లగు వానిలో నేదే నొకటి గణానుసారముగఁ బ్రయుక్తము గావచ్చును. అట్టియెడల నిషేధానము మాత్ర మేల? గుర్వవసాయియగుపద్యములయెడల ద్రుత మెల్లయెడల లోపింప దని నిర్ణయింపరాదు. అవసానమందలియాద్రుతము హ్రస్వపూర్వక మగుచో మాత్రమె యొప్పటను లోపింపను గాని దీర్ఘపూర్వక మగుచో లోపింపను వచ్చును గదా. "వచ్చి రమురులు పూజింప

వాసుదేవు" ననుచో సంధి వైకల్పికము గావున 'వచ్చిరి యమరు' లనురీతిగాఁ గూడ నుండును గదా యని యభ్యూహించిన గణభంగము గాదా? సంధి రావచ్చును. రాకపోవచ్చును. గణానుసారముగ నది యట్లు ప్రయుక్త మగును. ప్రయోగింపఁబడిన యారూపము శాస్త్రసిద్ధ మగుచున్నదా? లేదా? యన్నంశ మిఁకఁ బరిశీలింపవలసియున్నది. ద్రుతకార్యములసందర్భమునను సిద్ధి ఆదేశసరళవికల్పతలో ఖండ స్వత్వములును సరళస్థిరవికల్పతలో లోపస్వత్వములును బూర్వప్రాస్వము గురువు గావలసినపుడు ద్రుతము (న,ను) ఎట్లు రా వని నిర్ణయించుటకు లక్షణము ప్రత్యేకముగఁ జెప్పఁబడినదా?

కాఁగా '...కరుణాంబుధికిన్' ఇత్యాదులం దున్నది ద్రుతలోపాభావమె. అయ్యది 'వాక్యాన్త' సూత్రమునందే సిద్ధమె. ఒకవేళఁ జింతామణి లోపము నిత్య మన్నను ద్రుతము లోపింపకుండుటనె చెప్పవలసియుండును గాని సంశ్లేషమును విధింప నేల? కావున వజ్ఝలవారు చేసినయర్థముప్రకార మైనను గూడ సంశ్లేషమువిధానము సరిపడవచ్చును గాని యది విధింపవలసిన యావశ్యకము లేమి మాత్రము స్పష్టము.

అహోబలపతిమత మేతద్భిన్నము. ఆతఁడు నకారవుఁబొల్లయే ద్రుతముగా భావించినవాఁ డయ్యెను. ద్రుతము నట్లు పొల్లనకారముగాఁ జూపుట కేవలము బింద్వాదికార్యముల సందర్భముననె. స్వత్వమగునపుడు ద్రుతము పొల్లుగా నుండక (ని) వర్ణముగా నిల్చును. అహోబలపతి ద్రుతము 'ను'స్వరూపముతో నిల్చుట స్వత్వ మని తలంచినవాఁ డగుట (298) వజ్ఝలవారును స్పష్టము చేసిరి. అందులకే యాతఁడు శ్లిష్టతను విధించికొనె ననిపించుచున్నది.

'వాక్యాన్తగతపదనాఞ్చ' యనుసూత్రమునొద్ద ద్రుతలోపము గణానుసారముగా నుండుటను వివరించినయహోబలుఁడు 'క్వచిత్పద్య

భేదే నైవ లుక్, పదస్య భేదావసానేషు--ఇతి తేనైవోక్తత్వా'త్తనెను. అనఁగా ద్రుతము లోపింప దని చెప్పుటయే యీ కారికలోని తాత్పర్య మనవలె. అయిన 'శ్లిష్టతా' యని యేల చెప్పెను? అహోబలుఁడు 'వాక్యాన్త'సూత్రముచే ద్రుతము లోపింపనప్పు డయ్యది స్వత్వ ముతో నుండు నని భావించెను. (సూరియు నిట స్వత్వ మని వ్యవహ రించుట స్పష్టమే.) అయ్యది 'ను' స్వరూపము గాదు. అనఁగా 'వాక్యా న్త'సూత్రముచే ద్రుతము లోపింపనప్పు డది 'ను' (న) అనునాకార ముతో నిలువవలయునే కాని పొల్లుగా నుండ వీలు లేదు. అందు చేతనే 'నవాంశుకవ్యాజమునను' అనుచో 'వాక్యాన్త' సూత్రముచే ద్రుతలోపము లేనపుడు స్వత్వ మయి నుస్వరూప మున్న దని తలంపరా దని వి.వి.వచనముచేఁ బేర్కొనెను. కావున 'కరుణాంబుధి కిన్' అనుచోటను నవసానమందలి ద్రుతము లోపింపకున్నచో స్వత్వ ముతో 'కరుణాంబుధికిని' అని యుండవలె. అది యహోబలమతము.

ఇట్టి ద్రుతలోపాభావస్థితిలో గణభంగ మగుట స్పష్టము. అనఁగా నిట్టి (గుర్వవసాయియు హ్రస్వపూర్వకద్రుతాంతము నైన) స్థితి ద్రుతము లోపించినను లోపింపక (స్వత్వముతో) యున్నను దప్పు కేర్పడు చున్నది. అందుకే శ్లిష్టత పూర్వాచ్చు నత్తియుండు నదియే కాని మీఁదివర్ణముతోఁ గలియునది కాకపోవచ్చును. కాని యిట్టిస్థితి సాధింపఁబడుటకు శ్లిష్టత విధింపఁబడిన దనఁగా (ద్రుతకార్యముల సందర్భమున) ద్రుతమునకు సంశ్లేష మనుచో ద్రుతము పొల్లుగా నిల్చుటయే యని చెప్పఁదగు. ద్రుతము స్వరసహితమై యుంట స్వత్వము కాఁగా నది స్వరవిరహితమై పొల్లుగా నుంట సంశ్లేషము. ఈ పొల్లనకారమును మీఁది హల్లుతోఁ గూర్చి వ్రాసినను లేదా విడిగా వ్రాసినను నది సంశ్లేషమే యగును. మీఁది హల్లుతోఁ గూడికొనుట సంశ్లేష మని చెప్పినసూరియుతము 'వచ్చెన్ ఋషి' యనుచో రేఫతుల్యమైన ఋకారపరకతలో సంశ్లేషస్థితిలో

మీఁది వర్ణముతోఁ గలిపి వ్రాయుటంత గమనింపవచ్చును. కాఁగా వచ్చె న్గోడుకు లేదా వచ్చెన్ గోడు అనునది శ్లిష్టత కాఁగా వచ్చెను గోడు అనునది స్వత్వస్థితి యని యహోబలుని యభిప్రాయముగా నాతని వివరణములను, లక్ష్యములను సమన్వయించి గ్రహింపవచ్చును. సూరియభిప్రాయము నట్టిద. సూరి ద్రుతమును న(ని) వర్ణముగఁ జూపి నవాఁ డగుటంజేసి ద్రుతస్వరలోపమె యుట సంశ్లేషమువిధానము నందలి ప్రయోజనముగా గుర్తింపఁదగును.

'కరుణాంబుధికిన్' అనుకృతిగా యహోబలుఁ డుదాహరించిన సందర్భమువంటి దనఁదగినచోట నప్పకవి యిట్లు పేర్కొనుచున్నాడు. 'నాంతపదాంతద్రుతమున కెంతయుఁ బ్రథమాబహూక్తి కే తెంచు తృతీయాంతస్థంబునకుం బద్యాంతమున స్వరలోప మగుఁ గొన్నింటన్' (5.138) ఇందలి 'పద్యాంతమునఁ గొన్నింట' ననునదే 'పద్యభేదావసానేషు' అని కాఁగా 'స్వరలోప మగు' ఎన్నదే 'శ్లిష్టతా' యని యైన దనవచ్చును అప్పకవీయ మాధారముగా నీకారిక యేర్పడిన దను నూహ కవకాశము గలదు. అప్ప. 5.139. పద్యస్థలమును నీయంశము నిరూపించుచున్నది. ఈకారిక యహోబలకృతము గా దన్నను వి. వి. కర్త యభిప్రాయ మప్పకవి పేర్కొన్నట్టి దని గుర్తింపనగును.

కాఁగా ద్రుతము పొల్లుమాత్ర మై యుండుట (స్వరలోపము?) అనునది సంశ్లేషముగా నీకారిక లక్ష్యములం దన్వితమగు చుంట నీ సంశ్లేషవిధానము సార్థక మగుటకై సంశ్లేష మనఁగాఁ బూర్వాచ్చు న త్తియుండుట యనుకృతిగా నిర్ణయము చేయ నక్కర లేదు. కాన వజ్ఝలవారిసంశ్లేషపదార్థనిర్ణయమునకు నీకారిక యాధారమై గాఁ జాలదు.

ఆతరువాతిది 'పదాన్తేవసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతా' మ్మనునది. ఇట స్వత్వ మనఁగా బాలసరస్వత్యాదులు భావించినట్లుగా నుస్వరూపమనియే యర్థము చేయుచో నహోబలుఁడు పేర్కొన్నట్లుగా 'వైజ...వ్యాజమునను' అనురీతి ప్రయోగము లసాధువులే యనవలసియుండును. ఇట్టివి నన్నయ ప్రయోగములే యుండుట విశేషముగాఁ జూపనవసరము లేదు. కానఁ బైరీతిస్వత్వస్వరూప మీకారికయందు సరిగా నన్వయించుట లేదనవచ్చు. అందుకయి వజ్ఝలవారు ద్రుతము పరాన్వితమై యుండుట స్వత్వమనియు నట్టియెడల ద్రుతము పైవర్ణముతోఁ గూడియుండు ననియుఁ బేర్కొనిరి. వచ్చె న్గోవు లనురీతి వ్రాఁత స్వత్వ మనియు వచ్చెన్ గోవు లనురీతి వ్రాఁత సంశ్లేష మనియు వారి నిశ్చయము. దీనిచే స్వత్వ మనఁగా ద్రుతము మీఁదివర్ణముతోఁ గూడియుండుట గావునను 'స్వత్వం నాప్నోతి సాధుతా' మ్మనులక్షణ మన్వయించు చున్నట్లుగనే యున్నది.

కాని యీయర్థమును విధింపవలసియున్నదా? ఇట వారు 'పద్యద్వయాద్యంతవర్ణసంధి సంప్రదాయవిరుద్ధ మవుటంజేసి పూర్వపదాంతిమనకారపుపొల్లు పరపద్యాదిమహల్లుతో సంయోగించుట యసంభవమని (అచ్చుతో సంయోగము నందినయెడల వచ్చె నతఁ డనురీతిస్థలముల నయ్యది ద్రుతస్వత్వము గాదని వజ్ఝలవారియభిప్రాయము నెన్నఁదగును) తాత్పర్య (298) మనిరి. ఇట సంధి సంప్రదాయవిరుద్ధ మనఁగా స్వరసంధియు లేదు కదా. అట్టియెడల ద్రుతము నెడ మాత్రమె యిట్లు చెప్ప నేల?

పరపద్యాదిమహల్లుతో సంయోగించుట యసంభవ మనిరి. ఒకవేళఁ బరపద్యము స్వరముతోఁ బ్రారంభమైన ద్రుత మాయచ్చుతోఁ గూడవచ్చునా? ద్రుత మచ్చుతోఁ గూడిన నయ్యది స్వ స్వ

మనిపించుకొన దనియు సంసవలన బూర్వపదాంతిమద్రుతము తరువాతిపదమ్ము మొదటియచ్చుతోఁ గూడిన నది స్వత్వము గాదు దానినీకారికి నిషేధింప లేదు గావున నట్లు గావచ్చునని చెప్పక తప్పునా? ద్రుత మచ్చుతోఁ గూడినను నయ్యది స్వత్వమే యైనయెడల స్వత్వసామాన్యనిషేధసందర్భమునం దిట వజ్ఝలవారు పరపదాదిమహల్లుతో నని హల్లును మాత్రమే యేల పేర్కొనిరి? ఇఁక నచ్చుతోఁ గూడిన నయ్యది స్వత్వము గాదు గాని పదద్వయాద్యంతవర్ణసంధిసంప్రదాయవిరుద్ధ మగుటచేఁ బూర్వపదాంతిమద్రుతము పరమపదాదిమస్వరముతోఁ గూడ దందమా? అట్టిసమన్వయము (పరపదాదిమ) హల్పరకత యందు మాత్ర మేల సరిపడదు? అన లిట్టిది ద్రుతప్రకృతికములయెడనే యేల? కళలయెడను బరపదాదిమస్వరపరకత్వమునఁ బరస్వరైకాదేశమో లేక పరస్వరమునకు యడాగమమో చేయఁదగునా? అవి యెల్ల నెట్లు నివారితము లగుచున్నవో (439) యిదియు నట్లు గాదా? మొత్తముమీఁదఁ బరపదము హలాది యగుచోఁ బూర్వపదాంతిమద్రుత మాహల్లుతో సంయోగింప దనునీస్వత్వనిషేధము వ్యర్థ మైనది.

ఈవిధానమువలన నింకొకయనర్థము ని ట్లూహింపవచ్చును. పూర్వపదాంతిమద్రుతమునకుఁ బరపదాదిమహల్లు పరమయినపుడు స్వత్వము లేనచోఁ బరపదాదిని సరళమో స్థిరమో యున్న నేమగును? 'వాక్యాన్త్రగతపదనాఙ్ఖ్వ' యని (లేక 'లఁగ్వా' యను సూత్రముచేతనో) లోపము రావచ్చునా? పరపదాదిమహల్లుతో సంబంధము పెట్టుటవలన 'వాక్యాన్త్ర' సూత్రముచేఁ గాక 'లఁగ్వా' యనుసూత్రముచేతను లోపము ప్రాప్తించును. గుర్వనసాయి పద్యములయెడ నట్లు ద్రుతము లోపించునా? 'పద్యభేదావసానేషు శ్లిష్టతా' యన్నాఁడు గనుక లోపింపదు. ఇఘ్వనసాయిపద్యము లందును లోపింపవచ్చునా? వజ్ఝలవారిమతమున ద్రుతము పొల్లనకారమే కావు

వను లఘ్వవసాయి యగుపద్యములతుదను బొల్లునకార మెంతమాత్ర మును నుండదు గావునను నట లోపము రాక తప్పదు. 'వైజ... వ్యాజమునను' - అనురీతిస్థలముల నయితేను వజ్ఝలవారు ద్రుతమునకు లోపము చేసికొనక తప్పదు. అయినను (బహువ్యాదిసరళస్థిరపరకత యందు) నిట్టిసందర్భమునందల్లి ద్రుత మెట్లుండవలయునో 'పద్యభేదావసానేషు' అనుదానిచేతనే స్పష్ట మగుచుంట నీకారికకుఁ బ్రయోజనము లేదు.

తరువాతిపద్యము పరుషముతో నారంభమైన నెట్లు? 'చెచ్చెరన్' అని పూర్వపద్యము ముగియఁగా 'కొని వచ్చుదు' నని తరువాతిపద్యము పరుషముతో నారంభమైనది. పరుషపరకతలో ద్రుతమునకు బిందుసత్త్వము లేదని తాము చెప్పినట్లు వజ్ఝలవారు స్పష్టము చేసిరి. ప్రస్తుతికారకత్వము లేదనుచున్నది. కాని బిందువు రావలసియున్నది. (లఘ్వవసాయి యగుపూర్వపద్యముతుదను ఖండబిందు వుండఁదగునే కదా.) సంశ్లేషవిధానమువలనఁ 'జెచ్చెరన్' అనుచో ద్రుతమునకుఁ బూర్ణబిందువు లేదందము. (చెచ్చెరం,- గొని వచ్చుదు నని) సంశ్లేషవిధానమునుబట్టి 'చెచ్చెరన్' అని ద్రుతమట్లు యున్న దనుకొందము. ఇది వారు పేర్కొన్నట్లు సంశ్లేషమే కావచ్చును గాని పైపద్యము మొదటిపరుషము సరళము గా నక్కర లేదా? చింతామణి 'అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ స్త్రితే పరత' యనుటచే ద్రుత మెట్టివికారమును బొందకున్నను మీఁది పరుషము సరళము కాక తప్పదు. 'గొని వచ్చుదు' నని పద్య మారంభింపఁబడవలె. సరళాదేశము వికల్పమును గాదు. (అయిన నొకపక్షముఁ దప్పదు.) పరుషపరకత్వమున నన్నయాథర్వణుల మతమున సంశ్లేషము లే దని (ఇట విశేషవిహితము కదా) వీరు పేర్కొనిరి. అయినను 'శ్లిష్టత్వం చ క్వచి' త్తని యట నట (జడిగొనన్ కోర్కులు) సంశ్లేషమును సాధింతురు. ఇట్టిసంశ్లేషమువలనఁ

బైపరుషములు సరళములు గా వని వారిసిద్ధాంతము. కాని 'అవికార గతేఒపి' యనులక్షణ మూయవకాశ మెంతమాత్రము నిచ్చుట లేదు. ద్రుతము వికృతమైన నవికృతమైనను మీఁది పరుషములు సరళ ములు గావలసియే యుంటచే సంశ్లేష మయినపుడు పరుషములు సరళములు గా నేర వని చెప్పుటకు వీలు లేదు. కావున నిట్టియెడల స్వత్వమాత్రనిషేధమువలనఁ బ్రయోజనము లేదు.

మొత్తము మీఁదఁ దరువాతిపద్యముమొదటఁ బరుషములు గాని యచ్చులు గాని యున్నయెడలమాత్రము దీనివలన నిబ్బందులు దప్పవు. పద్యావసానమునం దెల్లవిధము లైనసంధికార్యములును బరపద్యాదివర్ణములతో సంభవింపకుండుటఁ జేసి యిట్లు స్వత్వమును నిషేధింప నేల?

కాఁగా వీరిమతము ననుసరించియు నీకారిక సముచితముగాఁ బ్రయోజనవంతము గా నేరదు. 'వ్యాజమునను' అనురీతిస్థలములందలి నుస్థితిని వీరు వ్యాజమునన్ అనుదానిపై విశేషార్థక మగు 'ఉన్' శబ్దము చేసి యందలితుదిద్రుతమునకు 'వాక్యాన్తగతపదానాఞ్చ' యనిలోపము రాఁగా నవు నని సాధింతురు. అసలు విశేషార్థక వర్ణకము యువర్ణము గాని 'ఉ'వర్ణము గాదు. వ్యాఖ్యలవారీరీతిని ద్రుతి నుస్వరూపమును సాధించుట సరికా దని స్పష్టము. ఇట్టిప్రక్రియ నరిపడమింజేసి 'వ్యాజమునను' అనురీతిరూపములు వ్యాఖ్యలవారిమతము నను సముచితముగా సిద్ధింపనేర వని స్పష్టము. 'పద్యావసానే' సర్వో పా' మ్మనుదానికి బదులుగాఁ లఘ్వవసాయి యగుపద్యములతుది నున్నద్రుతము నిలిచియుండవలసివచ్చినపుడు గణానుసారముగ వర్ణ విశేషమున (లేకున్నను) 'ఉన్' అనునది వచ్చి చేరుననియు నప్పటి ద్రుతమునకు లోపము నిత్యమనియు నర్థము నిచ్చు లక్షణ మొకటి చెప్పుకొన్న నెంతయు బాగుండెడిది.

ఇట నహోబలునిమతము ననుసరించిన 'వ్యాజమునను' అనురీతి రూపము లసాధువులు గావలసివచ్చుట స్పష్టము. ఈ కారికయర్థ మేమి? అప్పకవివచనములమూలమున నహోబలుఁ డిటఁ బొరవడె నని గుర్తింప నవకాశముఁ గలదు. అప్పకవి 'వాక్యాన్తగతపదానాఞ్చ' యనుసూత్రమువివరణముననే యిట్లు చెప్పెను. 'నలినాక్ష తెలుఁగుపద్యంబులకడపలనుండునలలపొల్లులకుమహీస్థలి గుడుసులును శృంగములును నిలుపరు చదువునెడ లాక్షణికు లెచ్చోటన్ (5.139)' ఇందలి 'పద్యంబులకడపల' ననునదే 'పద్యావసానే' యనియు 'గుడుసులును శృంగములును నిలుపరు లాక్షణికు' లనునది 'స్వత్వం నాప్నోతి సాధుతా' మ్మనియు నైన దనుట తప్పు గా దనవచ్చు.

5–138 పద్యమునం దప్పకవి పద్యాంతమున స్వరలోపము కొన్నింట నగుటను జెప్పెను. దానికే యీయది వివరణప్రాయము. వ్రాఁతప్రతులందుఁ బద్యావసానమున 'ఁ_ని' అనియే వ్రాయఁబడుచుండఁగా నట్లుండరా దనియు దానిని బొల్లుగనే చదువవలయు ననియు నప్పకవివివరణము. ఈలక్షణము పై నెచ్చట స్వరలోపము చెప్పఁబడినదో యచ్చటనే చెల్లును. సూరియు గుర్వవసాయి యగు పద్యములతుదను స్వత్వము లే దనునొక్కమాటతో నీ రెంటి సంగ్రహించెను. ఇంక నప్పకవి స్వరలోపము చెప్పినచోటఁ 'గొన్నింట' ననుటయు 'ఁ_ను' లట్లు చదువరా దనుచో 'నెచ్చోట' ననుటయు ననుసరించి యహోబలుఁడు రెండుకారికలుగా భిన్నము లన్నట్లు వ్రాసియుంచెను.

ద్రుతము నకారపుఁబొల్లే యని యెంచియున్న నహోబలుఁడు ద్రుతస్వత్వముమాత్రమును (ని) అనుస్వరూపము గలదగా స్పష్టము నేసియున్నవాఁ డగుటంజేసి 'ని,ను'లను బద్యాంతమున నప్పకవి తిరస్కరించుట ననుసరించి యవి ద్రుతముయొక్క స్వత్వరూపములు

గావున (అప్పకవిమతమునను సహోబలునిమతమునను) స్వత్వము నిషేధింపబడినట్లుగా నహోబలపతి భావించుటయుఁ దదనుగుణముగా 'పద్యావసానే సర్వేషా' మ్మని కారికను జెప్పుటయు వింతలు గా నేరవు

అప్పకవియభిప్రాయము నీకారికతో ననువదించుటలో నహోబలుఁడే ప్రమాదపడియుండవలె. లేదా యప్పకవియుఁ బ్రమాదపడి నన వలె. 138. పద్యమునకు వివరణమువంటిదే 139 పద్యము. అనఁగా గుర్వవసాయి యగుపద్యముతుదను ద్రుతమునకు (స్వత్వము లేదు) సంశ్లేషము వచ్చు ననుదానియర్థమునే స్వత్వము లే దను నదియుఁ జెప్పవలె. ఇతర కార్యముల ప్రసక్తి లేకుండ స్వత్వనిషేధ విధానముకంటె సంశ్లేషవిధానమె యుచితమయి యున్నది.

నిజమునకు వజ్ఝలవారిఁమన్వయము ననుసరించినను 'పద్యావసానే' యనునది పద్యభేదావసానేషు అనుదానికి వివరణప్రాయమే కాని ప్రత్యేకముగాఁ బ్రయోజనవంతము గా దనకతప్పదు. పద్యభేదావసానేషుఅన్నది కందము మున్నగుకొన్ని పద్యములతుదిద్రుతము నకు సంశ్లేషమును జెప్పుచున్నది. అనఁగా గుర్వవసాయి యగు పద్యములతుదద్రుతమునకు సంశ్లేషవిధానమువలన నిట నితరకార్యప్రసక్తియే లేదు. 'తోరంబుగా' అనురీతిగా నొకవేళ ద్రుతము లోపించిన గణభంగము గా కున్నను నయ్యది విశేషమే యగును. ఇంక లఘ్వవసాయిపద్యములతుదిని ద్రుతమునకును స్వత్వనిషేధము చేయఁబడిన దనవలెను. 'న్యాయమునకే' అనుచో నయ్యది లఘ్వవసాయి యగు పద్యము కాన నచ్చటిద్రుతమునకు స్వత్వము లేదు. కావున నది మీఁదివర్ణముతోఁ గలయకట్లె యుండవలె. అది యట్లే యున్నపుడు పూర్వస్వరము నత్తియున్నట్లయి సంశ్లేష మగును. 'పద్యభేదావసానేషు' అనులక్షణము ననుసరించి లఘ్వవసాయు లగుపద్యములతుది

ద్రుతమునకు సంశ్లేషము రా వీలు లేదే. మఱి యిపు డీ ద్రుత మేమి కావలె? పరపద్యాదిని బరువ మున్న ఖండబిందువో పూర్ణబిందువో కావలె. పూర్ణబిందు వైన గణభంగము గావున ఖండబిందువు గావలె (ఖండబిందు వైన గణభంగమే యవుచో నిఁక నవుడర్థవిశేషము తప్పదు 'ఉన్' శబ్దము రాకయుఁ దప్పదు. సరళస్థిరపరకతలో లోపము రావలె. అచ్చు పర మయినపు డేమి కావలె? మీఁదిపరుషములు సరళములు గాక తప్ప దెట్లు?

కాఁగా లఘ్వవసాయిపద్యములందున నైనను ద్రుతమునకు సామాన్యముగా స్వత్వము లే దని మాత్రము చెప్పఁ జాలదు. ఇం తేల? వజ్ఝలవారే పద్యద్వయాన్యంతవర్ణసంధి సంప్రదాయ విరుద్ధ మగుటం జేసి పూర్వపద్యాంతిమనకారపుఁ బొల్లు పరపద్యాదిమ హల్లుతో సంయోగించుట యసంభవ మని తాత్పర్య (298, పుట వివరించుటలోనే యీకారిక నిరర్థక మనియు నిఁకను ననర్థక మనియు స్పష్ట మగుచున్నది. సంధి సంప్రదాయవిరుద్ధ మైనపు డట్టిదానిని (పరసవర్ణాదేశసంధి కాదిట సామాన్యసంధి) ద్రుతమునకు మాత్రమే నిషేధించిన స్థలాంతరములం దిబ్బంది గల్గదా?

పద్యాంతిమవర్ణమునకుఁ దనువాతిపద్యము మొదటివర్ణము పరముగా నుండు ననుటయే సహజము గా దని గుర్తింప వలసియున్నది.

ఏది యే మైనను వజ్ఝలవారిసిద్ధాంతపక్షమునను నీకారిక యెట్లును వ్యర్థమే యనక తీరదు అట్టినిర్ణయమునఁ న కారిక యన్వయించు నేమో కాని దానికిఁ బ్రయోజనము లేకపోఁగా ననర్థమకల్గు. పక్షాంతరమున నీకారిక యన్వయింపదా యన్న యూహాబలముఁ డీ కారికను వ్రాయుటకు మూల మైనయప్పకవివివరణము ననుసరించి తదనుగుణముగా గుర్తింపఁదగు. అయ్యది పద్యభేదావసానేషు అను స్థలమునకుఁ జెందనదే. అందుకే సూరియు రెండుకారికలను సంగ్రహించి "గుర్వవసాయియగు—"అని యొకే యంశముగాఁ జెప్పె.

ఇట్టి శారీరకస్వరూపము నెఱుంగఁగా స్వత్వము 'ను'స్వరూపమని నిర్ణయించుట కిది బాధకము గాని మీఁదిహల్లుతోఁ గలియుట యనుటకు సాధకము గానీ కానేర దనుట స్పష్టము.

ఇంక మిగిలినయాన్యైవిధులు సంశ్లేషస్వత్వములను సూరిపద్ధతిలో గ్రహించుటకు ననుకూలమే యైయుండుట గమనింపవచ్చును.

వజ్ఝలవారు తాము చెప్పిన సంశ్లేషస్వత్వములవలనఁ బ్రయోజనవిశేషమును వివరించిరి. స్వత్వ మనఁగా మీఁదివర్ణముతోఁ గూడియుండుట యనుటలో విశేషమేమి యనఁగా ద్రుతమును బరస్వరాంగముగాఁ బల్కినపుడే ('వచ్చెనొక్కఁడుకు') సరళాదేశ మగునని వారి యభిప్రాయము. నాదము లగుద్రుతానుస్వారములతోఁ గూడుటవలన శ్వాసము లగుపరుషములు నాదము లగుసరళములుగా మారుననియు నక్కారణమున ద్రుతము పూర్వాచ్చు నత్తునట్లు పల్కినచో (వచ్చెన్ కొడుకు) నద్దానితాఁకుడు చాలక పరస్థపరుషములకు నిత్యముగా రావలసినసారళ్యము ...సిద్ధింపకపోవలసివచ్చు' (281) ననియుఁ బేర్కొనిరి. దీనింబట్టి సరళాదేశము రావలయు నన్న ద్రుతము పైవర్ణముతోఁ గూడియే యుండవలెను గావున నదియే స్వత్వమనుట యుక్తమనవలె నని భావము. 'వచ్చెన్ కొడుకు' అని యున్న నిట సరళాదేశము రా వీలు లే దఁట. ఈ నిర్ణయమును వీరు చారిత్రకమైన దృష్టితోఁ జేసి రేమో. శబ్దశాస్త్రమునం దిది యొకహేతువు కానేరదు. కాని వీ రీసిద్ధాంతమునకు విరుద్ధముగాఁ దమగ్రంథమునం దట నటఁ గవిప్రయోగములను జూపుట గమనింపవచ్చును.

ద్రుతము పూర్వాచ్చు నత్తియున్న (అనఁగా సంశ్లేషము) పైపరుషములు సరళములు కా వనిరి. కానీ వీరే పుట 486 లో

వశ్యక' (297) మనిరి. అనఁగా సరళాదేశము రాఁ దగనిచోటు లందు సంశ్లేషనిషేధ మనావశ్యక మన్నమాట. అసలు సరళాదేశము రాఁ దగనిచోట్లున్నవా? సారళ్యము నిత్య మని గదా వీ రింతకు ముందు (281) పేర్కొనిరి.

ద్రుతము పైని పరుషములకు సరళాదేశమును ప్రత్యేకముగా నిషేధించిన తావు లున్నవా? అటనైన సరళాదేశమును వారించుట కంటె సంశ్లేషమును విధించిన సరళాదేశము వారింపఁబడుటతో పాటు సంశ్లేషమును సాధింపఁబడును. కేవలము సరళాదేశనిషేధము వలన సంశ్లేష మగు టెట్లు? వది యే మైన నిట్టి ప్రత్యేకవిధానము కానరాదు. ప్రస్తుత మగు 'గిరివ్రజ వన్ పురం' బనురీతివానిని 'క్వచి ద్భవేత్సమాసేఽపి ప్రాణిమాత్రస్య సంశ్రుతి' యనుకారిక సాధించు చున్న దనిరి. అట వీరు 'ప్రాణిమాత్రస్య' యనుమాత్రశబ్దస్వారస్య మున నట్టి ప్రాణి యనఁగా ద్రుతము పూర్వాచ్ఛ నత్రియుండు సంశ్లేషము నందునే కాని సరళాదే శాద్ద్రుతసంధికార్యము లెవ్వియుఁ గలుగ వనుకర్థము లభించుచున్నది (296) అనిరి. అట్టియెడల 'శ్లిష్టత్వం చ క్వచి' త్తనుదానిచేఁ గాక యీకారికచే సంశ్లేష మయి నట్లు చెప్పుకొన్నఁ గొంతయుచితముగా నుండెడిది. ఇది సరియైనది కాదు. మాత్రశబ్దమునకు స్వారస్యమును జెప్పుచో నా ప్రాణి యెట్టి వికారము నందక యట్లె నిలుచు నని చెప్పుట యేని యుక్తముగాని మీఁదిపరుషములకు సరళాదేశము రా దని ప్రాణిమాత్రశబ్దము సాధించు నను టెట్లు? సరళాదేశము రాక తప్పదు. పైఁగాఁ జింతామణి 'అవికారగతే తస్మి న్నపి సరళా భవన్తి తే పరత' యని ద్రుతమెట్టి వికారమును బొంద కున్నను మీఁదిపరుషములు సరళములే యగు నని చెప్పెను. అట్టియెడఁ బూర్వశబ్దాంతము మగునకారము దుత మైనఁ జాలును. మీఁదిపరుషములు సరళములు గాక తప్పదు.

‘అవికారగతేఽపి’ అనుపింతాణాలక్షణమును బాధించి సరళాదేశము వారించుటకిట ‘ప్రాణిమాత్రస్య’ యనుచోటిమాత్రశబ్ద ముపయుక్త మవునా? ఇంకను నిట సరళాదేశాభావము సాధింపవలసియున్నది. కావున దానిని నిషేధించువిధానము చేయుట యుక్తము. సరళాదేశ నిషేధము ననుసరించియే యట సామాసికద్రుతలోపాభావమును సిద్ధింపఁగలదు. ప్రాణిమాత్రవిధానసామర్థ్యముచే నెట్లును స్వరలోప మగునని వారు నెంచిరి’ అట్లు ఖిలినసకారపుఁబొల్లు ద్రుత మైనది. ద్రుత మయిన దానిస్వత్వస్థితి మీఁదివర్ణముతోఁ గూడియుండుట యని గదా చెప్పుచున్నారు. స్వరలోప మయినవెంటనే ద్రుతము స్వరూపావస్థకుఁ జేరి యనఁగా మీఁదిహల్లుతోఁ గూడి ‘అన్స్వరం’ బని కావలె. ఇట స్వత్వమును జూపిన మీఁదిపరుషముల కీద్రుతము తాఁకుడు సరిపడునంతగాఁ దగుఁగా నయ్యవి సరళములు గావల యును. అందుకై వీరు స్వత్వమును బ్రవర్తింపక సంశ్లేష మగు నని చెప్పియుందురు. సంశ్లేషమో స్వత్వమో యే మైన నగుఁ గాక యయ్యది ద్రుతమే యైనయెడల మీఁదిపరుషములు సరళములు గాక తప్పదు. ఈకారిక ద్రుతమునకు సంశ్లేషమునే విధించుచున్న దనుటకు నాధారము లేదు. (అన్నాది యగుచో అన్నగరము కాఁగూడదా?) అయినను మీఁదిపరుషములు సరళములు గావనుట కాధారము లేదు. అనలీకారిక ద్రుతసంబంధియే కాదని గుర్తింపఁదగును. (చూ. అను)

మొత్తముమీఁద ద్రుతముపైని పరుషములకు సరళములు రాఁదగనిచోటులే లేవు. కావున రాఁదగినచోటులందు సంశ్లేషనిషేధ మావశ్యక మనుట సరికాదు. పైఁగా నన లట్లు నిర్ణయించుటకు వారివ్యాఖ్యానమే మూలము గాని చిం. వి వి.లు కా వనియు గుర్తింపఁదగియున్నది. చింతామణి సంశ్లేషమును విధింపకపోవచ్చు. కాని సంశ్లేష మవుచో సరళాదేశము రా దని దానిచే నిర్ణయించుటయు విశ్వసనీయము కాదు.

కాన నన్నయాథర్వణులు పరుషపరకత్వమున సంశ్లేషము చెప్పలే దని (గిరిప్రవజ మన్ పురం బను చో సంశ్లేషము గల దనుట సరి కాదు.) చెప్పి దానికి మూలము వారు సుదవువలెనె ద్రుతమువిూఁది పరుషముతోఁ గూడియుండుటయె స్వత్వమని యెంచి రనుటకు వీలు లే దనియు దీనివలన గుర్తింపఁబడియున్నది.

కానీ పూర్వస్వరాంగము గాఁబల్కుట సంశ్లేషమును బరస్వరాంగము గాఁ బల్కుట స్వత్వమును అని చెప్పినవ్యాఖ్యానము. లోనివజ్ఝలవారిమత మునసంశ్లేషస్వత్వములను విూఁదిహల్లుతోఁ గూడికొనుటకూడకవిడిగా నుండుట యని యర్థము చేయుట సరి కా దేమో. చిం. వి. వ. అభిప్రాయ మిట మారిన దేమో? ప్రాఁతయుం దాఁకారమును విూఁది హల్లుతోఁ గలిపినఁ గలుపవచ్చును. వచ్చె న్గోవు లని వ్రాసిన లేక వచ్చేన్ గోవు లని వ్రాసినను బూర్వస్వరమున కంగముగా నుచ్చరించిన సంశ్లేషమును బరస్వరమున కంగముగా నుచ్చరించిన స్వత్వము నని చెప్పరాదా యనవచ్చు. అపుడు వచ్చేన్ గోడును గిరిప్రవజ మన్పురం బనురీతిగా వజ్ఝలవారు దాహరించుటలో వైరుధ్యముండదు. నిజమునకు వజ్ఝలవారి 'నన్నయాథర్వణులమతమున సంశ్లేషస్వత్వముల కుచ్చారణమునందియొకను ద్భేదమే కాని రూపభేదము లే'- (297) దని పేర్కొనిరి. అందుచేతనే వచ్చెన్ గోడును, తొన్పడి నె ననియుండఁగా నని ప్రారంభింపక వచ్చెన్ + గోడును తొన్ + పడినె నని యుండఁగా నని వారు ప్రక్రియను జేర్కొనుట యుచిత మగుచున్నది. కానీ వీరు 'సంశ్లేషము=వచ్చెనె వాఁడు స్వత్వము వచ్చెన్వాఁడు' (280) అందురు. ద్రుతమును బూర్వస్వరాంగముగా ననఁగా బూర్వస్వరము నత్తికొనుండునట్లు పల్కినపుడు (వచ్చేన్ వాఁడు) ద్రుతసంశ్లేష మనియు వచ్చె న్వాఁ డనురీతిని ద్రుతములను బరస్వరాంగముగా ననఁగాఁ బరస్వరమున త్తియుండునట్లు పల్కినపుడు ద్రుతస్వత్వ మనియు భట్టారకుఁడు వ్యవహరించెను. (281) అనురీతిగా

లక్ష్యములందుఁ బ్రదర్శించునప్పుడు మాత్రము పైని పేర్కొన్నట్లుగానే ప్రాంతలో భేదమును జూపిరి. ఆ ప్రాంతలో భేదము లేకున్నయెడల ననఁగా సంశ్లేషస్వత్వములు రెండింటికి లక్ష్యమును వచ్చె న్వాఁడు వచ్చెన్ వాఁ డనురీతిగాఁ జూపుట కొన్నప్పుడు ఏ రట్టియభేదమును స్పష్టము చేయవలసియున్నదే. కాఁగా లక్ష్యములందు స్పష్టము చేసినతీరు ననుసరించి ద్రుతస్వత్వము సత్త్రియుండుట స్వత్వస్థితిలో ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడియు బూర్ణాచ్చు సత్త్రియుండుట యను సంశ్లేషములో ద్రుతము విడిగా నుండు ననియుఁ జెప్పవలసియున్నది. అట నటఁ దద్విరుద్ధముగాఁ జూపిరి.

'లుక్సంశ్లేషౌ నాచి' యను సూత్రము 'పద్యభేదావసానేషు' 'పద్యావసానే' అను వి. వి. లక్షణములను సమన్వయింపవలయు ననునొకేలక్ష్యములో ఏ విట్టియర్థనిర్ణయము చేసినట్లు తోఁచుచున్నది ఇట్టివజ్ఝలవారిస్వత్వసంశ్లేషములు స్వరూపములవివరణముచే నేర్పడిన యిబ్బందులకట్లు గుర్తింపఁదగును.

వీనికి ప్రాంతియుందుఁ జూపుటయే తప్ప నుచ్చారణమునందు భేదము లేదు. వచ్చెన్ గొడుకు వచ్చె న్గొడుకనువాని యుచ్చారణము (ననిఁబూని వ్యవహితము చేసినఁ దప్ప) సమానమే. అజ్విరహిత మైనహల్లు స్వపూర్వస్వరమునే యాశ్రయించుట స్పష్టము. అందుకే తత్పూర్వాక్షరము తెలుఁగున గురు వగుచున్నది. సంయుక్తాక్షరము సైతము అట్టిదే. సంయుక్తపూర్వవర్ణము గురు వవుచున్న దనఁగాఁ దరువాతిహల్సంయోగమువలనియూనిక పూర్వవర్ణముపై నిల్చు నన్నమాటయే కదా. కావుననె వచ్చెన్ గొడు కని యున్నను వచ్చె న్గొడు కని యున్నను ద్రుతపూర్వవర్ణము సమానముగా గురువే యవుచున్నది. ఉచ్చారణమందును లేనియీభేదమును గల్పించుట వలనఁ బ్రయోజన మేమి?

స్వాత్వసంశ్లేషములకు నడుమ భేదము చూపవలయును గాఁబట్టి పూర్వస్వరాంగ మగుట సంశ్లేషము కాఁగా (ఉక్సంశ్లేషా నాచి యను మొ॥ వాని సమన్వయమునకై) నింక స్వాత్వమున భేదము చూపవలె నన్న దానిని బరసర్వాంగముగాఁ జూపుట తప్ప మార్గాంతరము లేదు. బాలసరస్వత్యాదు లన్న ద్రుతము నెట్లు చూపినను ద్రుత స్వాత్వము 'న-(ని)' అనురీతిగాఁ జూపుటచే నట భేదము స్పష్టమే. పొల్లునకారమె ద్రుతమని దానిస్వాత్వస్థితియందును బొల్లునకారమునే చూపవలసియుండుటచే వజ్ఝలవారు పరసర్వాంగముగాఁ బల్కుచు స్వాత్వ మనిరి. కాని స్వాత్వ మనుశబ్దము ననుసరించి యిది యట్లగుట కుదురు టెట్లో తెలియకున్నది. ద్రుతము తనసహజ మైనస్థితితో నుండుటయే స్వాత్వ మనవలయును అందుచే నవశే దీనిని చింతామణి ప్రత్యేకముగా విధించియుండ లేదు. భయము పడి మొదలగుస్థలము లందువలె నిట సంయుత మాయాకార్యములు ప్రవర్తింపనపుడు ద్రుత మట్లై యుండును. కాఁగాఁ దదనుగుణముగాఁ జూచినఁ బొల్లైనపొల్లు పూర్వస్వరము నాశ్రయించియుండుటయే సహజము. కావున వజ్ఝల వారు సంశ్లేషమునకుఁ జెప్పిన యర్థము స్వాత్వమునకు సరిపడుచున్నది. ఇం తేల? వారే వచ్చెన్+కొడుకను రీతిగాఁ జూపిరే. అనఁగా నారంభమున నీరూపము వచ్చెన్ అనియే యున్నది. అదియే సహజము. ఆపై నింకొకపదము చేరఁగా మీఁదివర్ణముతోఁ గూడుట యది కొంతయని విశేషము. కాఁగా నట్లు చూచిన వచ్చెన్ గొడు కనునది స్వాత్వముగను వచ్చె న్గొడు కనునది సంశ్లేషముగను జూపుట కొంత యుక్తము. వజ్ఝలవారు నిట్లు చూపియుందురే కాని వారిమతమునం దిట్టిచో 'ఉక్సంశ్లేషా నాచి' యను రీతిలక్షణములు సమన్వయింపక పోవుటచే నీమార్గమును విడిచిపుచ్చి రని తెలియవచ్చును. వచ్చెన్+కొడు కనియుండఁగా 'అవికారగతి'సూత్రమునచే నకార మేమియు లేనపుడు 'వచ్చెన్గొడు కని' యవు ననుట సహజముగాఁ గానరాకున్నది,

ఇంక జి. పి. పి. లక్షణమును సమన్వయించుటకయియే వజ్ఝుల వారిట్టివిస్తృత మార్గము త్రొక్కిరనుట స్పష్టము. కాని యీ లక్షణములే యున్నను వీనిచే సమన్వయింపఁబడ వనియు గుర్తింప వలసియున్నది.

పరళీస్థిరముం బరము లైనపుడు 'లుగ్వా' యనుసూత్రముచే ద్రుతమునకు లోపము వికల్పము గావున లోపము లేనపుడు 'అలుకి చ సంశ్లేష స్స్యాత్' తత్సూత్రముచే సంశ్లేషము విధింపఁబడినది. ఈవిధాన మేల? ఆరంభమున వచ్చెన్+గోవు లని యుండఁగా నపుడు ద్రుతము పూర్వస్వరము నాశ్రయించి యుండ లేదా? లోపము వైకల్పిక మవుటచే నది యట్లే యుండుట యెట్లును దప్పదు గదా. మఱల విశేష కార్య మున్నట్లుగా సంశ్లేషమును విధింప నేల? 'వచ్చెన్ గోవు'లని యున్నను లేక వచ్చెన్గోవు లని యున్నను ద్రుతమును బరస్వరమున కంగము చేసిన స్వాత్వ మనియుఁ బూర్వస్వరమున కంగము చేసిన సంశ్లేష మనియు నుచ్చారణమందలి యీభేదమునకయియే యీసంశ్లేషము విశేషముగా విధింపఁబడినదా? అట్లును స్వాత్వము విధించుటయేని విశేషము గాఁగలదు గాని సంశ్లేషము కాదు. వచ్చెన్ అనుపదముపై గోవు లనునది చేరఁగా నంతమునం దున్న ద్రుతము సహజముగాఁ బూర్వస్వరమునకే యంగముగా నుండక తప్పదు. అదియే దాని సహజస్థితి. ఇది సంశ్లేష మనిరి. ఇంక దీనిపై హల్లు చేరినపు డది పరస్వరమున కంగముగా నుచ్చరింపఁబడుటయే విశేషము. దీనిని స్వాత్వ మనిరి. కాఁగా స్వాత్వమునే విధింపవలసి యున్నది గాని సంశ్లేషమును విధించుట యనవసరము. పూర్వస్వరమున కంగముగా (వచ్చెన్ వాఁ డని) నుండుటయే విశేషము కావలయు నన్న మొదట నది పరస్వరమున కంగ మయి వచ్చె న్వాఁ

దనురీతిగా నుండవలయును. 'వచ్చె నాఁ' డనుచో 'లుగ్వా' యని లోపింప వచ్చె వాఁ డనియు 'అలుకి చ' యని సంశ్లేషము రాఁగా ద్రుతము పూర్వస్వరాంగ మయి వచ్చెన్ వాఁ డని యగుటయు 'చ' శబ్దముచే వచ్చె నాఁ డనురీతిస్వత్వమును గల దనియు నెన్నవలయు నన్నమాట. కానీ యిది యసహజ మనక తప్పదు. ఇట్టె వచ్చె న్నాఁడుకు వచ్చెఁ గొడుకు మొ॥ చోట్లను.) మీఁదిహల్లుతో సంశ్లిష్ట మైయున్న నకారము విడిపోయి వేఱుగా నుండుట సంశ్లేష మనుట యొప్పునా? అసలు వచ్చె నాఁ డనునది మొదటిరూప మనఁగా ద్రుతముయొక్క సహజస్థితి యనుటయు నొప్పునా? అట్లు కాక రూపముతో సంబంధము లేక వచ్చెన్ వాఁ డనియే యారంభమునం దున్నను నయ్యది యుచ్చారణమునందుఁ బరస్వరమున కంగ మైయున్న దనియు సంశ్లేషవిధానముచేఁ బూర్వస్వరమున కంగముగా మారిన దనియుఁ జెప్పుటయు నొప్పదు. పైని పదము చేరక మున్న వచ్చెన్ అనురీతిగా నున్నపుడు పరస్వరాంగ మగుట యసంభవము గదా. కావున నిటనయ్యది పూర్వస్వరమున కంగముగానే యుచ్చరింపఁబడక తప్పదు. అనఁగా ద్రుతము పూర్వస్వరమున కంగముగా నుచ్చరింపఁబడుట సహజస్థితి కావున నదియే స్వత్వమగును. ఒకవేళఁ బైని హలాదిపదము చేరుచో నా ద్రుతము పరస్వరమున కంగముగా నుచ్చరింపఁబడుఁగాక. సహజముగాఁ బూర్వస్వరమున కంగముగా నుచ్చరింపఁబడు ద్రుతము హలాదిశబ్దపరకత్వమున బరస్వరమున కంగముగా నుచ్చరించుటయే విశేషము. దానినే విధించుట యుక్తము. అనఁగాఁ బరస్వరమున కంగముగా నుచ్చరించుటయే సంశ్లేష మనియుఁ బూర్వస్వరమున కంగముగా నుచ్చరించుటయే స్వత్వ మనియుఁ జెప్పవలసియున్నది. కాఁగా వద్ఝలనారిస్వత్వసంశ్లేషములయర్థద్వయము సహజముగా లేమి 'అలుకి చ సంశ్లేషః' అని సంశ్లేషమును విధించుట యనవసరమైనది. పరుషపరకత్వము నవలెనే పరిస్థిరపరకతలోను జెప్పకున్ననే కావుండెడి దనిపింపఁజేసిరి.

నిజమునకు వజ్ఝలవారివివరణము ననుసరించి చూడఁగా సరళ స్థిరపరకత్వమున సంశ్లేషవిధానముకంటెఁ బరుషపరకత్వమున స్వత్వవిధానమే యవసర మని నిర్ణయింపఁబడియున్నది.

'సంయోగాదిర్వా' యను దానిచే సంయుక్తాక్షరములందలి మొదటి హల్లు పూర్వస్వరమునకేని బరస్వరమునకే సంగమగు ననరి గదా. పరుషపరకత్వమున నన్న నిత్యసారళ్యసిద్ధి కనుకూలముగా ద్రుతము పరస్వరాంగముగా మాత్రమె యుండును. కావున నట (సంశ్లేష ముండదు) స్వత్వము మాత్రమే యుండవలె. సరళపరకత్వమున నిట్టి బాధ తటస్థింపదు. (281) కాన నది దేనికే సంగము గావచ్చు. అట్టి యెడఁ బూర్వస్వరమునకంగ మగుట విధింపనేల? అట్టియబ్బంది పరుషపరకత్వమునఁ గాదు గాన నట సంశ్లేషము లేదనవలె. సరళ స్థిరపరకతయందు సంశ్లేషమును విధించుట ద్వారాఁ బరుషపరకత్వమున సంశ్లేషము లేమి సిద్ధించుఁగాలు న్యాయమే కాని దీనికంటె ననవసరి ముప్పుబంజేసి సూటిగాఁ బరుషపరకత్వమున సంశ్లేషము లేదని చెప్పుటయే యుచిత మనుకొనుచున్నాను.

నిజమునకు శబ్దశాస్త్రమునకేఁ జగ్రత్తతో సంబంధము లేమిఁ బరస్వరాంగముగా నుచ్చరించునపుడే మాండలికోచ్చారణాలు సరళములగు నటియుఁ దమ్మాకమున సంశ్లేషము చెప్పలేదనియుఁ జెప్ప నక్కరయే లేదు. అట బిందుసరళములు శాస్త్రము విధించుచుండఁగా నాసారళ్యము సిద్ధించుటకయి ద్రుతమును బరస్వరాంగముగనే యుచ్చరింపవలయు నని చెప్పుకొనవలసిన యవసర మేమి? అందుకయి సంశ్లేషము చెప్పఁబడలేదనుటయు నొకయాధారము గాదు.

'అవిరామగతే' యను సూత్రమును వివరించుచు వజ్ఝలవారట 'వచ్చెన్ గోడు' కని యుదాహరించిరి. వా రింతకుముం దిట్లు వ్రా

యుట సంశ్లేషస్వరూపముగాఁ జెప్పిరి. కాని ద్రుతప్రకృతికత్వమున సంశ్లేషమునకే యవకాశము లేకుండఁగా నిట సంశ్లేషము నెట్లు చూపిరి? వచ్చెన్+కొడుకని యుండఁగా నని యారంభించుటంజేసి 'అవికారగతే' యనుదానికి వచ్చెన్ గొడుకనియే యుదాహరింప వలసి యున్నది. వచ్చెన్ గొడుకన్నను వచ్చెఁ గ్రొడుకన్నను ద్రుత మిటఁ బరస్వరమునకె యంగ మైన దని యెంచి రేమో.

ఇది దేని కెప్పు డంగ మగు నన్నది యట్లుంచి బాలసరస్వత్యాదులమతమునకు విరుద్ధముగా ద్రుతమున్నత్వమును 'ను'(ని) స్వరూపముగా నంగీకరింపకుంటఁ జేసి 'వాత్మాస్మదోర్ద్రుతస్య స్యాల్లు' క్కను చిం. లక్షణమును, 'వినా ద్వితీయం స్యా దస్మదాత్మనో స్స్వన్తయోరపి' యను వి.వి. లక్షణమును వ్యర్థములే యప్పుచున్నవి. 'లుగ్వా' యనుసూత్రముచేతనె వైకల్పికలోపము సిద్ధించుచుండఁగా 'వాత్మాస్మదోః' అను నీపునర్విధానముననే ద్రుతమునకు సంశ్లేషము రాదని యహోబలుఁడు చెప్పెను. 'వినా ద్వితీయ' మ్మనుకారికయు నదే చెప్పుచున్నది. దీనివలన (బిందులోపాలుకానప్పుడు) ద్రుతత్వము మాత్ర నను వారిమతమునఁ దాను జెప్పఁ దాను ఘనుఁ డనురీతి నవును. వజ్ఝలవారు నీసంశ్లేషవిధానమును బునర్విధానమునకుఁ బ్రయోజనముగా నెంచియు నయ్యది నాతెలియు ననుసరించి ప్రయోజనహీన మని గుర్తించి 'వినా ద్వితీయ'మ్మను చెప్ప నక్కర లే దని నిశ్చయించిరి. అనఁగా తాన్ఘనుఁ డనున్నత్వము సాధువే కాని తాన్ ఘనుఁ డనురీతి సంశ్లేష మసాధు వనుటలో యుక్తి యే మున్నది ? కాఁగా సంశ్లేషనిషేధావసరము లేమిఁ జింతామణి యందు 'వాత్మాదోః' యనుసూత్రముసైతము 'వినా ద్వితీయ' మ్మనుకారికయు వలెనే వ్యర్థ మగుచున్నది. ఇయ్యది వ్యర్థము కాకుండవలయు నన్న సంశ్లేషమునిషేధము సార్థకము గావలయు నన్న వి.వి. సైతము 'తాను

ఘనుఁ' డని ద్రుతస్వత్వము 'ను'స్వరూపముగనే భావించె నని నిర్ణయింపవలసియుండును గదా.

ద్రుతస్వత్వసంశ్లేషములయర్థము నన్నయాథర్వణసమ్మత మని నిరూపించుటకు వజ్ఝలవారు 'లుక్సంశ్లేషౌ నాచి' 'పద్యభేదావసానే షు శ్లిష్టతా' 'పద్యావసానే సర్వేషా' మ్మనులక్షణముల నట నటఁ జూపిరి. అందలియౌచిత్య మెంతవఱకో స్పష్టము. ఇంకను-

'లుక్సంశ్లేషౌ నాచి' యనునది సంశ్లేషమును నిషేధించు చున్నది. పూర్వాచ్చు నత్తియుండుటనే యది నిషేధించుచున్నదా? (124) వీరు సంశ్లేషము నెట్లు నిర్వచించిరి. 'సంయోగాదిర్వా-సంయోగాదిభూతో వర్ణః స్వరాత్పరే పరస్వరూపస్య పూర్వస్య వా స్వరస్యాఙ్గం భవతి పరస్య వా, (280) అనుసూత్రమే యాధారముగాఁ జెప్పిరి. 'వచ్చెన్+అతఁడు' అనుచో సంశ్లేషము లేదనఁ బూర్వాచ్చు నత్తియుండ దని యర్థమా! 'సంయోగాదిభూతము' కాఁ దక్కర లేదా? (ద్రుతమున కచ్చుపరము గాఁగాఁ ద్రుతము పూర్వాచ్చుతోఁ గూడికొనఁగా) నయ్యది సంయోగము కాకున్నా? ద్విత్వమొందక పై నచ్చున్నను పోల్లున్నను దానితోఁ గూడిన స్వత్వమును, గూడక విడిగా నున్న సంశ్లేషము నవునా? అనఁగా నచ్చుతోఁ గూడుట స్వత్వ మగునా? ఏ రిద్దానిని స్వత్వ మని వ్యవహరింపలేరు. అంతమాత్రమున నట్టియెడల స్వరకరకత్వమున ద్రుత మెట్టులును పైయచ్చుతోఁ గూడియే యుండును గావున స్వత్వమును నిషేధించుట నరిగాదు గాని లోపసంశ్లేషములను నిషేధించుటయు విశేషమే యనుకొనుఁడు. రూపమునందు భేదము లేక యుచ్చారణమునందే యాపద్భేదము గల దనువారిపల్కుల ననుసరించి చూచిన 'వచ్చె నతఁ డని యున్నను లేదా 'వచ్చెన్ అతఁ డని యున్నను ద్రుతము పూర్వస్వరాంగముగాఁ బ్రసంగించిన నయ్యది

సంశ్లేష మనవలె. మీఁదియచ్చుతోఁ గలుపకయే ద్రుతమును బరస్వరాంగముగా నుచ్చరించుట సంభవముగాఁ దోఁచుట లేదు.

మొత్తముమీఁద స్వరపరకత్వమున ద్రుతము పూర్వస్వరము నత్తును యనుసంశ్లేషము ప్రస్తావనము సముచితముగా వారివివరణము ననుసరించియే కానరాదు. అచ్చటిసంశ్లేషమునకు ద్రుతద్విత్వముగా నప్పకవి చేసినయర్థము సముచితముగా నున్నది.

అప్పకవియిట్రాంతకు బాలసరస్వతీయమును నొకవేళ నాధారమగు నేమో యనిపించు. 'భజింతు అంబను, భజింతు న్నంబను అని లేదు. బాలుర్ అజ్ఞులు, పిరుల్ ఉత్తములు అని లేదు. లుక్సంశ్లేషాలు వాల్లుల కెల్లా తెలుసుకోనేది'' అని బాలసరస్వతి చెప్పుట గానవచ్చు. (P, L. 1238 O. R. I, తిరుపతి) ముద్రిత ప్రతులందు 'లుక్సంశ్లేషా నాచి' యనుసూత్రము నొద్ద వివరణ మింకొకతీరుగాఁ గాన్పించును

ఏమైన 'లుక్సంశ్లేషా నాచి' యనుసూత్రము సంశ్లేషమును మీఁదివాల్లుతోఁ గూడుకొనుటగాఁ జెప్పుటకు బాధకము గానేరదు.

రూపమునందు భేదము లేకున్నను నుచ్చారణమునందు వైస నీషద్భేదమైనను నట్టి యుద్దేశించియే విధికర్త 'పద్యావసానే స్వత్వం నాప్నోతి సాధుతాన్, పద్యభేదావసానేషు శ్లిష్టతా' యని చెప్ప నవకాశము వీలు లేదు. అవసాన మగుటఁ బైనేవర్ణములు లేమి నచ్చటి ద్రుతము పూర్వస్వరము నాశ్రయించియే యుచ్చరింపఁ బడక తప్పదు. ఇంకను 'నామఁ దంతట' అని పద్యము పూర్తి చేసి 'స్వచ్ఛ' నని తరువాతిపద్య మారంభించి రూపమును వ్రాసినను నా ద్రుతమును బూర్వస్వరాంగముగనే యుచ్చరింపవలె నని చెప్పవమా? అట్లనుట కవకాశము లేకపోలే దని మాత్రము గుర్తింపఁ

నగు. స్వత్వనిషేధమువలనను నిక్కే ద్రుతమును బైవర్ణముతోఁగూర్చి వ్రాసినను బరస్వరాంగముగా నుచ్చరించుటకు మాత్రము వీలులే దని చెప్పవల నగుచున్నది.

ద్రుతమును మీఁదివర్ణముతోఁ గూర్చుటయు సంధికార్యమే యగు ననియుఁ బద్యద్వయాద్యంతవర్ణసంధి సంప్రదాయవిరుద్ధము గావునఁ బైన ట్లుండ దనియుఁ జెప్పుచో నంతకు ముందు చెప్పఁకొన్న ట్లుగా నీకారికలు రెండును వ్యర్థములే యగును. పూర్వపద్యాంతిమ ద్రుతము నటనే యుంచినను బరస్వరాంగముగా నుచ్చరించుట కవకాశ మున్నదా ? అది నిషేధింప నేల?

ఇంకను సంయోగాదిభూత మైనవర్ణము పూర్వస్వరమున కేని బరస్వరమున కే నంగముగా నుచ్చరింపఁదగు నంచో నందుఁ బరస్వరాంగముగా నుచ్చరింపఁబడుటయే స్వత్వ మని నిర్ణయించుట యేల ? పూర్వస్వరాంగముగా నుచ్చరింపఁబడుట స్వత్వము గాక శ్లిష్టత యగుట కందలివిశేష మేమి? రెంటికి స్వత్వము ననఁదగదా? ఎట్లు నీయది సంయోగమే కావున రెంట శ్లిష్టతయే యనియు నేల చెప్పరాదు ? అట్లుచెప్పిన నీకారిక లన్వయింపవని కారికలు సమన్వయింపఁబడుట కై నిరాధారముగా నైనను బైరీతి భేదమును గల్పింప వలయునా?

అన లుచ్చారణమునందలియీషద్భేదము నంగీతము పయి పరుషములు సరళములగుటకు నజ్ఝలవారి 'తాఁకుడు' సమన్వయమునకు దప్ప నింకెందుకు నెచ్చటను జెల్లునది గాదని చెప్పవచ్చు. అదియైనను జెం. వి.వి.లు పరుషపరకత్వమున శ్లిష్టతను స్పష్టము చేయమింజేసి కల్గిన దనిపించు (అట్లయినను సరళస్థిరపరకతలలో సంశ్లేషమును విధించుటకంటెఁ బరుషపరకతలో ద్రుతముపరస్వరాంగముగ నుచ్చరింపఁబడదని, ఇది స్వత్వ మనుకొన్న స్వత్వ మిది యని నిర్ణయించి స్వత్వము లే దని యేని చెప్పుట విస్పష్టముగా నుండెడిది.

వజ్ఝలవారియభిప్రాయమే చిం. కర్తయు నున్న నాఁతఁ డిట్లు చెప్పెడివాఁడే యని యూహింపుటయుఁ దప్పు గాదు గదా. కాఁగా నీలక్షణములసమన్వయమునకై యుల్లంఘనము చేయుటవలన నివియేకాక స్థలాంతరములందును జిం.వి.వి. లక్షణములు వ్యర్థములగుట మాత్రము తప్పకున్నది. అట సమర్థనమునకు మార్గాంతరము లేకయే వీరు 'వినాద్వితీయ' మనునది ప్రయోజనవంతము గాదని చెప్పుకొనవలసి వచ్చినది.

స్వత్వసంశ్లేషములకు వీ రిట్టియర్థము సేయుట కెల్లయెడల 'సంయోగాదిర్వా' (280) అనువచనము నాధారముగాఁ జూపుచుండిరి, కాని దానికి వీనితో సంబంధము లేదనియే గుర్తింపఁదగును. సంయోగాదిభూతమైనవర్ణమునకు కటఁ జెప్పిన యుచ్చారణ మిటఁ గుదురనేరదు. కిన్క, మిన్న్వను ఇత్యాది సంయుక్తస్థలములందు దేటను లేక యిట విశేషముగాఁ జెప్పఁబని యేమి సంశ్లేషమునకు? స్వత్వము సట్టిద యనఁదగి యుండ దానిని చిం. వి. ప్రస్తావింపత్తేను. 'అలుకి చ సంశ్లేషః' అనుచో 'సరళే స్థిరే చ పరతః' అనుపూర్వసూత్రము ననుసరించి సరళస్థిరములు పరము లగుచుండఁగా లోపింపని ద్రుతము సంశ్లేషము నందును. 'చ' శబ్దముచే సరళస్థిరములు పరము లగుచుండగా ద్రుతము పరస్వరాంగముగా నుచ్చరింపఁబడుట యనుస్వత్వము నందు నని చెప్పవలయు. ఇది సక్రమముగాఁ గుదురుపడకున్నది.

ఏది యేమైన శాస్త్రప్రయోజనము ననుసరించి చూడఁగా వజ్ఝలవారు చెప్పినస్వత్వసంశ్లేషములస్వరూపము చిం.వి.వి.లకు సరిపడునది యని నిర్ణయింపరాకున్నది.

ఇట్టియెడల సహోబలునభిప్రాయమే కొంతవఱకు గ్రాహ్యమై యున్నది. ఆతఁడు ద్రుతము పొల్లనకారమే యని భావించియు ద్రుత

స్వత్వమును మాత్రము సువర్ణముగా నెంచినాఁడు కావున వాత్మా స్మదోః, వినా ద్వితీయ స్సమలక్షణములు సార్థకములె యైనవి.

'పద్యావసానే సర్వేషా' మ్మనుచో వ్యాజమును అనురీతి 'ను'రూపస్వత్వమునే యనాఘు వన్నాఁడు. కానీ యిట్టిది ప్రామాదిక ముగాఁ జెప్పుట కిష్టకవియమునఁ గొంత యాధార మున్నది. దాని ననుసరించి ప్రామాదికముగా నహోబలుఁడే యానిర్ణయము చేయుటను గుర్తించుచో నీకారిక సార్థక మగు టెట్లు అన్న ప్రశ్న లేదు సూరి వివరణము ననుసరించియు నప్పకవివివరణము ననుసరించియు నియ్యది 'పద్యభేదావసానే' యనుదానికే వివరణముగా నెంచఁదగినది.

'పద్యభేదావసానే' అనుచో 'కరుణాంబుధికిన్' అన్నది సంశ్లేషముగఁ జూపుటఁబట్టి యట ద్రుతము నున్నరూపము సంధిలందు టయ్యె, నకారముగా నిల్చుటయే యుద్దిష్ట మని స్పష్టము.

కాఁగా నహోబలపతి 'పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ' యని చెప్పియున్నప్పటికి నది స్పష్టతకే యనియు నాతనిస్థలాంతరలక్ష్య ప్రదర్శనవిధానము ననుసరించి ద్రుతము పొల్లునకారముగా నిల్చుట సంశ్లేష మనియు ను(ని)స్వరూపముతో నుండుట స్వత్వ మనియు స్థూలముగా నిర్ణయింపవచ్చును.

కానీ యీయహోబలుఁడు 'అవికారగతే' మన్నగుసూత్రము నొద్ద సీతన్ గొలిచెదన్' – అనురీతి నుదాహరించెను. అట 'అవికార గతే' అనుటచే ద్రుత మొట్టివికారమును బొందలేదు కావున స్వత్వ స్థితి యనియే తలంచినవాఁడట నీతఁడు నకారవుంబొల్ల నే స్వత్వముగాఁ జెప్పిన ట్లునది. ఇది యెట్లు? కానీ యితఁడు దీనిని స్వత్వముగా భావించెనా? సీతన్ గొలిచెదన్ – రామున్ దలఁచెదన్ అని యుదా

హారి చి అత్ర నకారస్య స్వత్వసంశ్లేషా వభా వపి సంభవతి ఏవ యద్యపి వక్ష్యమాణకిత్యాధర్వణమతే పరుషే పరతః శ్లిష్టత్వం నసం భవత్యేవ'-అని మొదలుగా వివరించె. సీతన్, గొలిచెదన్ అనునదే యాతఁడు స్వత్వ మని భావించియున్న యెడల స్వత్వము'నవికారగతే'- యనుసూత్రము సాధించుచునే యున్నది గావునను దానిని దా నుదా హరించియే యున్నాఁడు గావునను స్వత్వముసిద్ధ మగుట స్పష్ట మయి నదే గద. ఇంక విశేషముగాఁ జెప్పవ సినది సంశ్లేషమునుగుఱించియే. స్వత్వమును సాధించెఁ గావున సంశ్లేషము సైతముగలదనవలె. స్వత్వ సంశ్లేషలుగూడఁ గల వనుటచేతఁ దాను జూపినది స్వత్వరూప మని యాతఁడు తలఁచలేదేమో. స్వత్వమును వివరించుచో"వర్ణాంతరత్వేన సంవర్భ వేళాయాం ప్లుతక్వరిగణన తస్య ఫలమ్ అత ఏవ' - ఎన్నను సర్య - (309) అని మొదలుగాఁ జూపెను. ద్రుతము నకారపుఁబొల్లు కాఁగా ద్రుతస్వత్వము 'ను' అను నాకారము గలదగుచున్నది. ఇది యవికృత మనుటకు వీలులేదు గదా. కావున 'అవికారగతే' - అను దానిచే నీస్వత్వము సాధింపఁబడలే దని యహోబలపతి యెంచియుండ వచ్చును.

కావన స్వత్వసంశ్లేషలు రెండును బరుష పరకత్వమునఁ జింతా మణి చెప్పకుండఁగా వి. వి. సంశ్లేషమును జెప్పుచున్నది. అనఁగా స్వత్వము వి. వి. చెప్పిన ట్లగుననే. 'ఆద్యే తృతీయే చ కపాః' అని వి. వి. బిందుస్వత్వములనే యంగీకరించినది. (అహోబలపతికి సంశ్లే షము నిష్టమే. కాఁగా వికృతివివేక గ్రంథమునంతటి నహోబలపతియే వ్రాసియున్న నిట్టివైరుధ్య మేర్పడవలసిన యవసరము లేదు. ఇట్టియాధారమునుబట్టి వికృతివివేకమున కహోబలుఁడే కర్త యగుట పొరపాటని స్పష్ట మగుచున్నది.)ఇఁక మిగిలినది సంశ్లేషము అది యగుట యెట్లు? అనఁగా "తథాపి శ్రుతికాలే స్వత్వసంశ్లేష యోః సరళస్థిరవర్ణయోః పరతః శబ్దానుశాసనేన విహితత్వాత్,

పరుషేష్వపి సరళస్థానిషు - వివర్ణుం ద్రిపత్... విజయుంబోలితి... ఇత్యాదావాచార్యాదిప్రయోగే బిందుసంశ్లేష యో రుభయో రపి శ్రుత్యంగీకారే బాధకాభావా దన్యకవిప్రయోగాచ్చ తదపి తస్యైవ మే వేతి ప్రతిభాతి - (?0) యని పేర్కొనెను. కవి ప్రయోగము లందు నీత న్గొలిచెద ననురీతిసంశ్లేష మున్నమాట వాస్తవమె. కాని యిది కారణముగా సంశ్లేష మగు టెట్లు? సంశ్లేష మంగీకరించు టకు విజయుం బోలితి, విజయు న్బోలితి అని బిందుసంశ్లేషయుచ్చా రణమున వైరుధ్యము లేమిఁ జెప్పఁబడుటయు యుక్తమే. కాని యిది యొకహేతువు గాదు. అట్లైన యయిన విజయుం బోలితి ననుఖండ బిందుఘటితరూపమునకు విజయుఁబోలితి ననురీతి ద్రుతమునకు లోపము చేసినరూపమునకును విరోధము గానరామింజేసి పరుషపరకత్వమున ద్రుతమునకు లోపము నిష్టమే యనవలసివచ్చు నేమో కదా. కావున బిందువునకు సంశ్లేషమునకు సామ్యము చూపరాదు.

ఇం కొకటి సరళస్థిరపర్ణములు పర మగుచుండఁగాఁ జింతామ ణియే స్వత్వసంశ్లేషములను విధించిన దనుట. ఇదియు బలమైనది గాదు. పరుషపరకత్వమున నిష్టమగునెడల నటఁ గూడ వచ్చు నట్లు సామాన్యముగాఁ జెప్పవలెను గాని సరళస్థిరపరకతయుండఁ దే చెప్ప నేల? సరళపరకత్వమునఁ జెప్పినసంశ్లేష మాదేశసరళపరకత్వ మున నగు నని తలంపరాదు. అట్లయిన సరళపరకత్వమున 'లుగ్వా' యని లోపమును ద్రుతమునకుఁ జెప్పఁబడియున్నది. కావున నాదేశ సరళపరకత్వమునను ద్రుతమునకు లోపము వచ్చిన విజయుబోలితి నని ఖండబిందురహితరూపము ముందవలసియుండును. అయ్యది యనిష్టము కదా.

కాఁగా సహాబలుఁ డాదేశసరళపరకతయందు ద్రుతమునకు సంశ్లేషసిద్ధికయి చూపిన యీకారణములలో నేయొక్కటియు బలీయమై శాస్త్రమున సాధించుటకనువుగా లేదనక తప్పదు

ఇంకను నహోబలపతి 'యవికారగతే' యను సూత్రమునకు లక్ష్యముగాఁ జూపిన 'సీతన్ గొలిచెద' – అనుదానికిని 'సీతన్గొలిచెద' ననుదానికిని నుచ్చారణమునందు భేదము లేదు. దానిసాదృశ్యముచే సంశ్లేష మంగీకార్య మనఁదగును. పైఁగా నీతఁడు 'కరుణాంబుధికిన్' అనుచోటి ద్రుతమును శ్లిష్టతకే యుదాహరించియుండెను గదా. కావున 'సీత న్గొలిచెద' ననుదానివలెనే సీతన్ గొలిచెద ననునది నయిత నహోబలపతిమతమున సంశ్లేషమే యనఁదగియున్నది. – నాతి యాతఁడు సంశ్లేషసాధనమునకై యేల శ్రమించెనో? అప్పకవి మార్గములో సీతను గొలిచెద రాముని దలఁచెద నని నుబివర్ణములనే యిటుఁ జూపియుండెనా? రెండులక్ష్యము లీఁగా నవి క్రమముగా ను, నివర్ణములస్థితి గల్గిన వవుట విశేషము – అప్పకవి ద్రుతస్వత్వము నుబివర్ణములుగనే గదా చూపెను. కానీ సీతను, రాముని అనియె చూపినపిదప సంశ్లేషముతోపాటు స్వత్వమునుగూడ విశేషముగాఁ జేర్కొనుట కుదురదు. – ఇంక 'వర్ణాంతరత్వేన – మున్నగా 'అలుకి చ' సూత్రమునొద్ద చేసినవివరణము మొట్టమొదటఁ బ్రసక్తమవుటచే నిటనే చెప్పవలసియుండు. ఈ కారణములచే సీతను గొలిచెద, రాముని దలఁచెద ననురీతిగా నుని స్వత్వముల నహోబలుఁ డిట నుదాహరించియుండఁ డన వీలున్నది. – కాఁగా సీతన్ గొలిచెద నని 'అవికారగతే' – యనుసూత్రముచేతను సీతను గొలిచెద ననునది 'అద్వేత్యృతీ యే చ' యను వి.వి. వచనముచేతను సిద్ధించునని యహోబలుని మతమా? అయిన సీతఁగొలిచెద ననురూపము సిద్ధించుచునే యుండఁగా సీత న్గొలిచెద ననుదానికై యత్న మేల? పరుష సరళత్వమున స్వత్వము వి.వి. అంగీకరించిన ట్లతఁడే చెప్పెను గదా.

అహోబలుఁ డీసందర్భమున నచ్చటను నాదేశసరళములకు ముందు ద్రుతమును 'ను, ని' అనుస్వరూపముతోఁ జూపలేదు. కాని యట్లుండ దని యతనిసిద్ధాంత మనలేము. ఏలన తాను నేనులయొడ

దీరీతిఁ గానరాదు. సీతను గొల్చెదన్, సీతన్గొల్చెదన్ అనునవి యహోబలుని స్వత్వసంశ్లేష నిరూపణమున కనుగుణముగా నున్నవి. (రామున్ దలఁచెద ననుచో రాముని దలఁచెద నని యుండఁదగుఁ గాని వజ్ఝలవారది యున్నట్లు చూపలేదు.) స్వత్వసంశ్లేషలను రెంటినిజూపి యవి రెండును ప్రాప్తించు ననివివరణమునకుఁ బూనుకొనుట యవిరుద్ధము గావచ్చును. 'అవికారగతే' యనుసూత్ర మెట్టివికారమును జెప్పనది గాని పరుషపరకత్వమునఁ జెం. స్వత్వసంశ్లేషములు రెండును జెప్పుచుండఁగా వి.వి స్వత్వ మొక్కటే చెప్పఁగా సంశ్లేషమును సాధించుట యహోబలునభిప్రాయము. నిజమునకు 'స్వత్వ సంశ్లేషా వుభా వపి సంభవత ఏవ' యని చెప్పుచున్నవాఁడు గావున సీతను గొల్చెద సీతన్గొల్చెద నను రెంటిని జూపుట సక్రమము. రామున్ దలఁచెద - నని వజ్ఝలవారు చూపినదాని ననుసరించి (కరుణాంబుధికిన్ - అనుచోటువలెనె) ద్రుతముపొల్లుగనె నిల్చియుంట సంశ్లేష మను నభిప్రాయమునకు సూచకమైయున్నది

మీఁది వాల్లుకోఁ గూడినను గూడకున్నను ద్రుతము పొల్లు నకారముగా నిల్చుట సంశ్లేష మనియు నయ్యది న, ని అనునాకారముతోఁ బ్రత్యేకాక్షరముగఁ బరిగణింపఁబడు రూపమున నుంట స్వత్వ మనియు నహోబలుఁడు సంశ్లేషస్వత్వములను నిరూపించుట యుచితమే. కాని యీ సందర్భమున ద్రుతమును బొల్లుగాఁ జూపుచు స్వత్వమును మాత్రము న, ని అని చూపుట యీతని మతమున నొకవిరోధమే యనక తప్పదు. ద్రుతము పొల్లు గాఁగా స్వత్వస్థితిలో స్వరము చేరు టెట్లు? వజ్ఝలవా రందుకే ద్రుతము నటు నిటు జరుపుచుఁ బొల్లు నకారముతోనే స్వత్వమునుగూడ సాధించుకొనిరి.

ఇట లఘువ్యాకరణకర్త 'ఆ ద్రుతమునకు బిందుస్వత్వప్రకృతి భావంబులు విభాష నగు' (సంధి-17) నని సూత్రించి "స్వత్వంబనఁగా

నకారేకారంబులు. ప్రకృతిభావం బన ద్రుతరూపం" బని వివరించి తండ్రిని బోషించెను, తండ్రిన్ బోషించె నని యుదాహరించినది. ఇందు స్వత్వమును, బ్రకృతిభావమును వేఱుగాఁ జెప్పుట వింత. (అందుకే కాఁబోలు సూరి 'స్వత్వంబనఁగా ద్రుతమునకుఁ బ్రకృతి భావ మని స్పష్టము చేసెను.) అయ్యుఁ బ్రకృతిభావమును దండ్రిన్, అని యిచ్చుట యొప్పుచు వజ్ఝలవారిది సంశ్లేషమనుట యొప్పు దని గ్రహింప వీలు గల్గించు. ఏమైనను ల. వ్యా. స్వత్వప్రకృతిభావము లను వేఱుగాఁ జెప్పుట యంగీకారయోగ్యముగాఁ గానరాదు.

అప్పకవి ద్రుత మనంగ నకార మని సామాన్యముగాఁ జెప్పిన వాఁడయ్యును మహీజాతను గొనివచ్చె మున్నగు సందర్భములందే కాక పెక్కెడల ద్రుతమును ను, ని వర్ణములుగా భావించుట యింతకు ముందు స్పష్టము. కావున నప్పకవిమతమున ద్రుతప్రకృతికముల తుది నున్న ను (ని) వర్ణమే ద్రుతము. అదియే ద్రుతస్వత్వము. అప్పకవి మతమున సంశ్లేష మేది ? 'అలుకి చ సంశ్లేష స్స్యాత్' అను సూత్రమును వివరించుచు నాతఁడు 'లలి నరళస్థిరములఁదావలినాంత పదంబు లూఁది పలికెడుచో సంధులు గాంచును దలవర్గంబులు నాఁటిటి చెంతఁ దక్కఁ బొల్లు లయి హరి' (5-145) అనెను. సంశ్లేష మనఁగా నాంతపదము నూఁదిపలుకుట. అప్పుడు ద్రుతము పొల్లగును. కాఁగా సారాంశముగా ద్రుతమునందలిస్వరము లోపించుటయే సంశ్లేష మని తేలినది. (కరుణాంబుధికిన్ అనుచోఁ గూడ నాంతపద మూఁది పలుకఁబడుచున్నది. ద్రుతము పొల్లుగా నిల్చుటవలన ననఁగా ద్రుతము పొల్లుగా నిల్చి తత్పూర్వవర్ణ మూఁది పలుకఁబడుటచే నీయది సంశ్లేషమె యగును పద్యభేదావసానేషు శ్లిష్టతా యనుట యట్టిది యై యుండవచ్చు. ఊఁది పలుకుట చేతనే గదా యా తుదియక్షరము గురు వగుచున్నది.

సూత్రము మీఁద ద్రుతమునందలి స్వరము లోపించుట (యునయ్యాది మీఁది హల్లుతోఁ గూడుటయు?) అప్పకవి మతము. ఇదియే యుక్తము. ఇట్టిసందర్భమునకే 'అలుకి చ సంశ్లేషః స్యా'త్తను సంశ్లేషవిధానము సార్థకము కాఁగలదు.

అహోబలుఁ డిట్టియెడల ద్రుతమును పొల్లనకారముగాఁ జూపినవాఁడు కావున వచ్చెన్+గోవు అనునెడ లోపము లేకున్న వచ్చెన్ గోవు అనియే యుండును. ఈపొల్లయిన హల్లు మీఁది హల్లుతోఁ గలిపి వ్రాయుటయే సంశ్లేషమైన దానిని ప్రత్యేకముగాఁ జెప్పవలయునా? కాఁడా డే రక్త రుతశ్చ యనుదానిచే స్వరలోపమైన ఏన్గు, చిల్క, నుడ్గు అనియే వ్రాయవలెనా? ఏన్గు చిల్క నుడ్గు అని పై హల్లులతోఁ గలిపి వ్రాయుటకుఁ బ్రత్యేకముగాఁ సంశ్లేషము విధింపఁబడినదా? అట్లే యీ ద్రుతము పొల్లునకారము మాత్రము మీఁది హల్లుతోఁ గూడికొనుటలో విశేష మేమి? 'అవికారగతే' యను సూత్రముచే బిందువికారము పొందు ద్రుత మట్లుండఁగా సీతన్ గొలిచెద ననియవు. కినుక కిన్క వలె సీతన్గొలిచెదనని వ్రాసికొనవచ్చునే అట్లే 'లుగ్వా' యనుటచేతనే లోపము రానపుడు వచ్చెన్గోవు (వచ్చెన్ గోవు) అనురీతి రూపసిద్ధి సహజముగనే యగుచుండఁగా నిది యేదో విశేష మయినట్లు సంశ్లేషమనుపేర విధింప నేల? (వచ్చె న్గోవులు సంశ్లేషము. వచ్చెన్ గోవులు స్వత్వము. పేర్లలో భేదమే గాని రూపమునఁ గాని యుచ్చారణములోఁగాని కనరాదు. వినరాదు.) ఇంతకంటెను అహోబలపతి స్వత్వముగాఁ జూపిన ఎన్నను అనురీతిగాఁ బొల్లనకార ముత్వముతోఁ గూడికొనుట యనువిశేషము స్వత్వమునందే యింక నున్నది. వచ్చెన్గోవు లనురీతివానినే స్వత్వముగాఁ జెప్పి యీానువర్ణసిద్ధిని విశేషముగా నిం కే దైనపేరుతోఁ జెప్పుకొనుట యొప్పును. కాఁగా

మనియుఁ జెప్పఁదగియున్నది. కాఁగా సంశ్లేష విధానము ననుసరించియు ద్రుతమును బొల్లుగా మాత్రము చూపుట యుచితముగా దని చెప్ప వచ్చును. వజ్ఝలవారి స్వత్వసంశ్లేషలకంటె నివి ప్రయోజనవంతములు. వేర్వేరు పేర్లు పెట్టఁదగిన భేదము గలిగినవి తనుమతమునందును భేదము గల దనుచు వారు 'సహజసరళపరకత్వమున ద్రుతమును బూర్వాచ్చు నత్తించి కల్పించెడియుచ్చారణముకన్నఁ బరహల్లుతో సంయోగింపఁజేసి పలికెడిఁ (పైన త్తించుటకంటె నీసంయోగించుటలో భేదమేమో? రెండు నొకటే స్వత్వము లేదా సంశ్లేషము.) యుచ్చారణమె సత్యములం దింపుగ నుండును. (చిం. వి. వ. 210) అనిరి. 'శ్లిష్టత్వం చ క్వచి' త్తను వి. వి. వాక్యమును సమర్థించుటకు వీ రిట్లు సరి గాని ఇట్లు పల్కక తప్పనిసరియైన గాని ప్రాణము లొగ్గఁబట్టి వత్తు-న్గొప్పులను రీతిగా నుచ్చరించుట సంభవము గాదు. అది యింపుగా నుండుట యింకను విశేషము. చిం. 'అలుకి చ సంశ్లేష' యని సంశ్లేషమును విధించినది. విధించిన సంశ్లేషముకంటె స్వత్వమే యింపైన యెడల నదియే ప్రయోగప్రసిద్ధమై యున్న యెడల నీసంశ్లేష విధానమునకుఁ బ్రయోజనమేమో తెలియదు. స్వత్వ మనుపదమును వి. వి కర్తయే గాని చిం. కర్త యుచ్చరింపనే లేదు.

కాన నీయుభయవిమత మహోబలునిమతముకంటె నింకను ప్రయోజనవంత మయి యున్నది. దీనివలన 'వినా ద్వితీయ' మిత్యాదులు సార్థకములగుటతో పాటు 'అలుకి చ సంశ్లేష' యని సంశ్లేషమును విధించుటయు నెంతయు ప్రయోజనవంతమవుచున్నది. తాను జెప్పి సీతను గొలిచెద ననురీతిరూపములును 'అవికారగతే' యను దానిచేతనే సిద్ధించుచున్నవి.

ఈయుభయవిమతమునందు నొక యిబ్బంది యున్నది. అవికారగతే యను సూత్రము ద్రుతస్వత్వమునే సాధించుచున్న దనుట

యుక్తము. అది యప్పకవి 'మహీజాతను గొనివచ్చె' ననురీతిగాఁ జూపినదాని ననుసరించి నని అనియె యుండును. కాఁగాఁ 'బరుషాః ద్రుతప్రకృతికాః' తని ద్రుతమునకు బిందువు రానియెడల నీతను గొల్చెదనను రీతిస్వత్వము మాత్రమే యవుటచే నీతన్గొల్చెద నను సంశ్లేషమునకు నవకాశము లేకుండఁబోవుచున్నది. సరళస్థిరపరకతలో మాత్రము సంశ్లేషము నంగీకరించి యీయాదేశసరళపరకత్వమున నంగీకరింపకపోవుటలో యుక్తియేమి?

'అలుకి చ సంశ్లేషస్స్యాత్' తను సూత్రము చేతనే యీయాదియు గ్రహింపఁదగు నేమో యనిపించుచున్నది. అలుకి చ అను చోటి చశబ్దము చే సరళస్థిరపరకతయందు లోపము రానపుడు గూడ నను నర్థము సిద్ధింప నవకాశము లేకపోలేదు గదా. కాన 'అలుకి' యనుదానిచేత సరళస్థిరపరకతయందు లోపము లేనపుడును చ శబ్దముచే బరుషపరకతలో బిందువు రానపుడును ద్రుతమునకు సంశ్లేష మవు నని వ్యాఖ్యానింప నవకాశము గలదు. ఇపుడును బొల్లగా నిల్చిన ద్రుతము పైని బరుషములు సరళము లగు నని చెప్పుటకు నవకాశ మున్నదే గదా. 'అవికారకతేఽపి' అనుచో వికారశబ్దము బిందు సంశ్లేషములను రెంటిని గ్రహింపఁగలదు. కేవలము బిందువుగా మారవు డనురీతిఁ జేర్చుటకై 'వికార' మని సామాన్యముగాఁ జెప్పుటచే సంశ్లేషరూపమయినయింకొకవికారమును సాధింప మనఁదగు నేమో. అట్లుగాక అంతకుముందు ద్రుతమునకు బిందు వొక్కటిమాత్రమే చెప్పఁబడియున్నది గావున బిందువు రానప్పటికే నని స్పష్టముగా నే చెప్పఁదగియున్నను 'అవికారకతేఽపి' యని చెప్పుట ననుసరించియు బిందువొక్కటి గాక యితరమగువికారము గల దనియు నయ్యది సంశ్లేషరూపమనియు నిటనే గ్రహించుటకు నవకాశము లేకపోలేదు.

'అలుకి చ' యనుచోటిచశబ్దముచేతనే పరుషపరకల్పమున సంశ్లేషమును సిద్ధించు ననుటలో నొకయిబ్బంది లేక పోలేదు. బాల సరస్వతి మొదలుగా వ్యాఖ్యాతలు ప్రస్తుతసూత్రమునందలి చశబ్దముచే స్వత్వమును సాధించిరి. అప్పకవి(లుగ్వా)చా శబ్దముచే సాధించినట్లు తోఁచు. చశబ్దమున కిట్టి ప్రయోజనము గుర్తింపక యింకొకటి చెప్పుచో నవశిష్టసరళపరకతయందు స్వత్వస్థితి యెట్లు ?

స్వత్వము ప్రత్యేకముగాఁ జెప్ప నక్కఱ లే దనుట స్పష్టమే కాని స్వత్వమున కవకాశము కల్పింపవలయును గదా. కాని 'పరుషా ద్రుతప్రకృతికా త్సంశా స్య స్సద్ధ్రుతశ్చ బిన్దు స్స్యా' త్తనదిసు ద్రుతమునకు బిందు వగుట చెప్పుచున్నది. తరువాతిసూత్రము 'అవికారగతేఽపి' యనుచున్నది. అయ్యది సకృతము గాకుండు టెట్లు? బిందు వను నది చెప్పఁబడినదే కాని వికల్ప మనలేదు. బిన్దుః చ స్యా త్తనీతిగా చశబ్దముచే బిందువు రాఁగలదని వ్యాఖ్యానింప నవకాశము లేకపోలేదు. కాని బాలసరస్వత్యాదులతోపాటు నజ్ఝలవారు నట్లు వ్యాఖ్యానింపలేదు. ఇంకఁ బరుషములకు సరళము లగుట ద్రుతమునకు బిందు వగుట యను రెండుకార్యములు విధింపఁబడుచున్నవి గావున సముచ్చయార్థముననే చశబ్ద మటఁ బ్రయుక్త మైన దనుట యుక్తముగానే యున్నది. కాఁగా బిందువును వికల్పముగా జెప్పుట చశబ్దముచే నుద్దేశింపఁబడలే దనుట స్పష్టము అట్టియెడ బిందువు నిత్యముగా రావలసినదే యుండఁగా అవికారగతే యను టెట్లు? అట్లనుటచేతనే ద్రుతము వికారము సంపకపోవుట గలదని యెంచవచ్చును. ఇట్లే సరళస్థిరపరకతయందు సయితము లుగ్వా యని లోపమును లోపాభావమున అలుకి చ – యని సంశ్లేషమును విధింపఁబడినవి. అట్టిసకారములు లేకుంటయుఁ గల దనఁదగు. పరుషపరకల్పమున ద్రుతము వికృతము గా కున్నను బై పరుషములు సరళములే యగుటయనువిశేషాంశమునకయి యవికారగతేఽపి

చెప్పియున్నప్పటికి నాదేశసరళపరకసంశ్లేష మనునది విరుద్ధ మనకుండుటయే యుక్తము. లేనిచో స్థిరపరకస్వత్వము సైతము విరుద్ధమే యనవలసియుండును గూడ.

ఏది యేమైనను బరుష (ఆదేశసరళ) పరకత్వమున సంశ్లేషము నంగీకరింపవలసియున్న పనుట మాత్ర మహోబలాదు లగులాక్షణికులకు సమ్మతమైనయంశము. ఆయా వ్యాఖ్యలవలనఁ గాని మఱి యే దేని గారణముచేఁ గాని సరళస్థిరపరకతయుండలిసంశ్లేషమువలె నాదేశసరళపరకతయుండలిసంశ్లేషము మాత్రము సూటిగను స్పష్టముగను లేదేమో యనిపించుమాట వాస్తవము.

కర్త యెవరో స్పష్టము గాని ఆంధ్రశబ్దచింతామణియను వావిళ్లవారుముద్రించినటీకాగ్రంథములో 'ఇతఃపిభ్యః పరం స్వత్వం నిస్సాన్య దన్యత్ర సర్వతః' (29 పుట) తనుకారిక యొకటి ప్రదర్శింపఁబడినది. ఇది ప్రయోజనవంతమగు నర్థము కలదియో యనఁదగియున్నది కాని యెచ్చటిదో దీనిచరిత్రమాత్ర మస్పష్టము.

ఇంకను పద్యాఖ్యానమున విశేషము గలదు. 'పరుషా ద్రుతప్రకృతికా' త్తనఁచో బిన్దుశ్చ స్యా త్తని యన్వయములో 'చ'శబ్దముచే నాతఁడు స్వత్వమును సాధించినాఁడు - కాఁగా బిందు వైన వచ్చెం గమలాక్షుఁడు. పై కారిక కనుగుణముగా స్వత్వ మయిన వచ్చెను గమలాక్షుఁ డని యగు. వచ్చెన్ గమలాక్షుఁ డనురీతిదాని నితఁ 'డవికారగతే' యనుసూత్రముచేత సాధించెను. ఇట్టియెడల సరళస్థిరపరకతలో ద్రుతమునకు సంశ్లేషవిధానము నవసరము స్పష్టము గాదు. అహోబలుఁడు సైతము ద్రుతము నుపర్ణముగా నుండుటయే స్వత్వమనియు నకారపుఁబొల్లుగా నుండుట వికృతియే యనియు భావించెనేమో యని 'పద్యభేదావసానేషు క్లిష్టతా' యనుదానిచే ననుమానింపవలసియున్నది.

నకారవుఁబోలె ద్రుత మని భావించువారు బిందులోపములను చెప్పుటతో సంశ్లేషమును జెప్పనక్కరలేదు. వచ్చెన్ గమలాప్తుఁ డన్నను వచ్చె న్గమలాప్తుఁ డన్నను నొక్కటియే గనుక. ఇంక నయ్యది 'న-ని' అనునాకారముల నందుటయే విశేషము. పొల్లయిన హల్లు మీఁదివర్ణముతోఁ గూర్చి వ్రాయుటలోను సంశ్లిష్టముగా నుచ్చరించుటలోను విశేషము లేమి దానిని విధించుటకంటె ఇఈఐలకుఁ బరమైన ద్రుతము నివర్ణ మగును. ఇతరత్ర నువర్ణ మగు ననురీతిగా నింతకు ముం దజ్ఞాతకర్తృకముగాఁ జూపఁబడిన కారికార్థముతో నాదానిని ప్రత్యేకముగా విధించికొనుటయే మేలు, అవసరము ననఁదగియున్న దని స్పష్టము.

ద్రుతము 'ను'(ని)వర్ణ మని భావించినపుడు రాముని దలఁచెద సీతను గొలిచెద నని యుండుట విశేషము గా దది సహజము, కావున దానిని స్వత్వ మనుటయుఁ బ్రత్యేకముగా విధింపవలసినయవసరము లేకుండుటయు స్పష్టము. ఇంక విశేషము ద్రుతమున స్వరము లోపించి పొల్లుగా మిగులుట. పొల్లయిన నది మీఁదివర్ణముతో నెట్లును గలియును. కావున సంశ్లేషమె యపుడు విశేష మగును గాన దానిని విధింపవలయును. అందుకే సూరి స్వత్వము ను విధింపక దాని కవకాశ ముండునట్లుగా "బిందుసంశ్లేషలు విభాష నగు, "లోపసంశ్లేషలు విభాష నగు" ననురీతిగాఁ జెప్పుట జరిగిన దని గుర్తింపఁదగును.

అదేవిధముగాఁ జింతామణియందు సైతము 'సంశ్లేషము' విధింపఁబడుట (స్వత్వము విధింపఁబడ కుండుటయు) ననుసరించి ద్రుతము పొల్లునకారము గా దనియు ను (ని) అనురూపము గల దనియు నెఱుంగ నవకాశ మేర్పడుచున్నది. పొల్లునకారమే యైన సంశ్లేషమును విధింపనే యక్కరలేదు. ఇంకను ఇఈఐలమీఁది ద్రుత మునకుఁ బైనిత్వ మితరస్వరములపై ని ద్రుతమున నుత్వము ననురీతిగా

విశేషము గలస్వత్వ మని పిలువఁబడుదానినే విధించుట సమంజసము. నకారవుఁబోల్లె ద్రుత మయినపుడు దానికే యాయాద్రుతకార్యములు చేయుచుండఁగా స్వత్వము ను, ని అని యుండుననుటయే సముచితముగఁ గానరాదు. కాఁగాఁ దత్స్వరూపమును సాధించుచు దానికింకొకపేరు వెట్టి విధించుటయు సంశ్లేష మని పిలువఁబడుదానినే స్వత్వముగా సంగ్రహించుకొనుటయుఁ బోల్లునకారపక్షముఁ గుదురు. చింతామణియందట్లు గాక విధానము బాలవ్యాకరణము నందు వలెనె (సంశ్లేషము విధింపఁబడి) యుండుటంజేసి బాలవ్యాకరణమునందువలెఁ జింతామణియందును ద్రుతము ను(ని)వర్ణ మె యనఁదగియున్నట్లు స్పష్టము.

ఇట్లు ద్రుతము స్వరసహిత మని భావించినవు డది మీఁది హల్లుతోఁ గూడుకొనుట లేదా యందలిస్వరము లోపించుట యను నది సంశ్లేషముగాఁ జెప్పుట యెప్పును. ఈయప్పకవియభిప్రాయమునే చిన్నయసూరి సైతము సమ్మతించె ననుట విస్పష్టమే కద.

ఈ యభిప్రాయమె బాలసరస్వతికి సైతము గల దేమో యని యనుమానింప నవకాశ మున్నది. ఆం. సా. ప. ప్రతి ననుసరించి 'సంశ్లేషము అనఁగా పై యక్షరముతో సంయోగము చెందుట యని చెప్పినయాతఁడు విడుతున్ దురిత'మని చూపెను. ఇటఁ బై యక్షరముతో సంయోగము వ్రాఁతయందుఁ జూపలేదు. ఇంక 'చకార ప్రయోగమువలన స్వభావమున నున్నను నుండు ననుట యని స్వత్వమును నిర్వచించి 'విడుతును దురితము' అని చూపియున్నాఁడు. దీనిం బట్టి ద్రుతము స్వభావముతో నుండుట 'ను'రూపమున నుండుట యనఁగా విడుతున్ దురిత మనుచో నువర్ణమునందలిస్వరము లోపించుటయే యని స్పష్ట మగుచున్నది.

ఇంకను బాలసరస్వతి 'అవికారగతే' యనుచున్నసూత్రమును వివరించుచు 'ఆ నకారము బిందాద్యాదిరూపము గాకపోయినను

స్వభావమున నున్నను గాని (16 పుట) అని చెప్పి అంబను గొలిచెద శుభమును బడసెద (17పుట)నని నుస్వరూపమునె ద్రుతస్వత్వముగాఁ జూపినాఁడు. అనగా నింతకు ముందు బిందువు పొందిన 'నకారము' సైతము నువర్ణనమే యనుకొనఁదగునా? లుగ్వేత్యాదిసూత్రములను వివరించునపుడు కొలుతున్ గదాధరు, కొలుతు గదాధరు'నని నకారపుఁబొల్లే చూపించి లోపించిన దన్నాఁడు. కానీ 'అలుకి చ' యనుసూత్రములోనిచశబ్దముచేత స్వభావముతో నుండుటను వివరించునపుడు ఉఅల 'విడుతున్ దురితము విడుతును దురిత' మని చూపె. ఈవిడుతున్ దురిత మనునది సంశ్లేష మయినందుల కుదాహరించెనా? లేక స్వత్వము రాకముందటిసంధిని విడఁదీసి చూపినాఁడా? 'పై యక్షరముతో సంయోగమును జెందుట' యని వివరించినయతఁడు తరువాతి సూత్రమునొద్ద 'కలిగె న్యమ్మ్య' యనుదానినే సంశ్లిష్టరూపముగాఁ జూపియున్నాఁడు దానినిబట్టి చూచిన నీతఁ డిట విడుతు న్దురిత మనియే చూపె నేమో? లేనిచోఁ గొలుతున్ గదాధరు అనునిటః పూర్వపు విభక్తిస్థలమునకు నీవిడుతున్ దురిత మను సంశ్లిష్టస్థలమునకు భేదమేమి? ఇంక విడుతున్ దురితమనునదే సంశ్లేషమున కుదాహరింపఁబడిన దనవలయు నన్న నంతకుఁ బూర్వపువిభక్తిరూపము కొలుతును గదాధరు అనురీతిగా నుస్వరూపముతో నుండవలెను.

బాలసరస్వతియే 'వాత్మా'-మున్నగుసూత్రమునొద్ద "ఆత్మాస్మచ్ఛబ్దములయొక్క నకారమునకు లోపము వికల్పమున వచ్చును. తా ఘనుఁడు తాను ఘనుఁడు (20 పుట) అని చూపెను. అహోబలునివలె బాలసరస్వతి (యప్పకవికాని) తానునేనులయం దుత్వలోపమునకై యత్నించినవాఁడు గాదు. దీనినిబట్టి నకారము (ద్రుతము) అను చున్నను నువర్ణమును గ్రహించుట బాలసరస్వతికి సమ్మతమే యనవలసియుండును. లేనిచో లోపము లేనపుడు తాను ఘనుఁ డని యుండు నెట్లు?

మొత్తముమీఁద ద్రుతము నకారమా నువర్ణమా యన్నది నిశ్చయించి చెప్పుటకుఁ బ్రబలమైన యాధారము లభింపలేదు. కాని ద్రుతస్వత్వముమాత్రము ను(ని)స్వరూపమే యని భావించుట మాత్రము స్పష్టము. దీనినుండియే యప్పకవ్యహోబలులమతము లేర్పడియున్నట్లు గ్రహింపవచ్చును. అప్పకవి కొలుతును గదాధరు ననుకరీతిస్థలముల ననుసరించి (సంశ్లేషమును) స్వరలోపమైన ద్రుతము మీఁది వర్ణముతోఁ గలియుటగాఁ జెప్పెను. తానునేనులయందు దుత్వలోపప్రసంగము చేయకపోయినను వైకల్పికద్రుతలోపమువలన నే మనుదు నని యగుటను నిరూపించెను. బాలసరస్వతియు నింతే కదా.

ఇంక నహోబలపతి విసుతు స్ఫురిత మనునది సంశ్లిష్టరూపముగా నెన్ని కొలుతున్ గదాధరు ననుకరీతివిభాగమునే యెంచి ద్రుతము నకారపుంబోల్లే యనియు ద్రుతస్వత్వము మాత్రము ను అనియుఁ జేర్కొనెను. ద్రుతము పొల్లుఁ గారమే యని భావించుటచేత దానునేనులలో నుత్వలోపమునకవకాశముంచెను. లోపవికల్పతచేతనే (తాఘనుఁడు) తాను ఘనుఁడు ఈ రీతిరూపమును జూపఁగా నహోబలుఁడు తద్రూపసిద్ధికయి సంశ్లేషము లేదని సంశ్లేషముగాఁ జెప్పెను.

ఇట్లు రెండభిప్రాయములు లేర్పడినవి. ఇందు బాలసరస్వతి యభిప్రాయ మిదియని నిశ్చయించి చెప్పుటకుఁ బ్రబలమైన యాధారము లేదు. రెండువిధములైన న్యాయములకు నవకాశము గలదు.

ఇది యిట్లుండఁగా బాలసరస్వతి వింధులకుఁ బూర్తిగా భిన్నముగా నింకొకచోటఁ గానవచ్చును. వావిళ్లవారు ముద్రించిన వఝ్జలవారిపీఠికతోనున్న బాలసరస్వతీయమునందు లక్ష్యవివరణములు వఝ్జలవారిసిద్ధాంతముల కనుగుణముగాఁ గన్పించుచున్నవి.

అవికారగతే యనుసూత్రమునొద్ద అంబును గొలిచెద, శుభమును బడసెద నని ఆం. సా. ప. ప్రతిలో నుండఁగా వావిళ్లముద్రణమున నంబన్ గొలిచెద, శుభమున్ బడసెద నని యున్నది. ఇయ్యది పాఠాంతరముగ నయినను ఆం. సా. ప. చూపలేదు. అలుకి చ యను సూత్రమునొద్ద సంశ్లేష మనుచు ద్వ్యక్షరముతో సంయోగ మని ఆం. సా. ప. ప్రతిలో (17) నుండఁగా వావిళ్లముద్రణమున 'పూర్వవర్ణముతో సంయోగ' (17అ) మని యున్నది. ఆం. సా. ప. ప్రతిలో నున్నస్వత్వప్రసక్తి యనది లేదు. కాంచెన్ బావ, రక్షించెన్ మాధవుఁ డని యుదాహృతము.

ఇందలి వైరుధ్యము నిట్లు గుర్తింపవచ్చును. అవికారగతే యను మున్నగుసూత్రస్థలముల లక్ష్యమూపలెనె యుటఁ గూడ ద్రుతము పూర్వస్వరమునే యాశ్రయించియున్నది. 'అవికారగతే' యను సూత్రము స్వత్వమునే చెప్పుచున్నదనక తప్పదు. ఆదేశసరళపరకత్వమునందలిస్వత్వమే (సహజ) సరళస్థిరకములందు సంశ్లేష మగుట యేమి? స్వత్వసంశ్లేషము లభిన్నములా? ఇక సిద్ధులే? వజ్ఝలవారవికారగతే యను సూత్రమునొద్ద నంబన్గొలిచెద, శుభము న్బడసెద నని చూపకుండుట కొంత నయము. చిం. సి. వ. లో పేరు 'అంబన్గొలిచెద శుభమున్బడసెద' అని సకారవ్యంజనమే బాలసరస్వతీయప్రతులు మూఁడింట నుండఁగా అంబును గొలిచెద నని సువర్ణమొక్కప్రతి యందే యున్న దనిరి (20అ) ఇట సకారవ్యంజనము నుండుటయే కాదు. అది మీఁదిహల్లుతో సంయోగించి (పిరిమితము ననుసరించి) స్వత్వరూపమున నున్నది. కాని వావిళ్లప్రతిలో అంబన్ గొలిచెద నని యున్నది. ఇది యేప్రతియం దున్నదో? ఇది వజ్ఝలవారు చెప్పిన దానింబట్టి సంశ్లేష మగును. (వావిళ్లప్రతికిఁ బరిష్కర్తలు వజ్ఝలవారే యైనట్లు తోఁచు. (బా.స. 2అ) ఇట్టి వైరుధ్య మేల కల్గినదో? ఇక్కడ నవికార మని చెప్పినదానినె యిక్కడ సంశ్లేష మనుపేర వికారముగాఁ

జెప్పె ననుట సక్రమముగా లేదు. రూపమున భేదము లేనపుడు అలుకి చ యనుసూత్రము చెప్పకున్న నే యగును? అంతకు ముందు 'లుగ్వా' యన్నాఁడు. దానికి నీ రెండురూపము లెట్లును సిద్ధించు నే గద. కాఁగా నీ పాఠము ననుసరించి యలుకి చ యనువిధానము వ్యర్థము గాక తప్పదు.

అలుకి చ యనుసూత్రమునందలి చశబ్దముచే స్వత్వమును వీరును దమవ్యాఖ్యానమునఁ జేర్చినదే యున్నారు. కానీ పూర్వవర్ణము నాశ్రయించియుండుట యనుసంశ్లేషమువిధానమువలన నేర్పడిన దను చున్న కాంచెన్ కాన యనుదానివంటిదే అంబన్ గొలిచెద ననునది నైతము స్వత్వసంశ్లేషము లేకను అవుటచే 'చ' శబ్దముచేఁ బ్రత్యేక ముగా సంశ్లేషముతో పాటు స్వత్వ మిం కొకటి సాధింపవలసినయవ సరము లేకపోయిన దేమో? ఇట్లు చ శబ్దము వ్యర్థమైనది. అసలు సూత్రము వ్యర్థమైనది గాన 'చ' శబ్దమునకు గూర్చిన బాధ యనవ సరము. పరుషసరళేత్వము ప్రసక్తము బిందువికారము నందకున్నను బైపరుషములు సరళముతో కానిసంశ్లేషమును జెప్పుటకై 'యవికారగతే' యను సూత్రము ప్రసక్తి తప్పదు. (ఇందును తద్ధితం చ బిన్దుస్సత్ యని బిందువు విధింపఁబడుట తదభావమున కవకాశము కల్పించినది కాదు. కావున 'అవికారగతే' యనుదానిచేత బిందువు రాకుండుననకాశమును దెల్పుటయు నవాంతర ప్రయోజనముగా గుర్తింపఁదగును) అట్టియవసరము సరళస్థిరపరకతయుందు లేదు. 'లుగ్వా' యని లోపము వికల్పముగానే చెప్పఁబడినది గదా. కావున 'అలుకి చ' యనుదానిని జెప్పకున్నను విరోధము లేదు. తరువాతి సూత్రమునొద్దను వ్యాఖ్యాతలు గలిగెన్ యొమ్మె యనునదే సంశ్లేషముగాఁ జూపఁబడినది.

అసలు పై యక్షరముతో సంయోగ మనుదానికిని బూర్వ వర్ణముతో సంయోగ మనుదానికి బోలిక యెంతటిది? ఇంతటి భేదము

వకుఁ గారణ మేమి? వ్యాఖ్యాతలవారిసంశ్లేషసిద్ధాంతమే దై యుండ వచ్చును. వాల్లు సంయుక్తాక్షరముగ నున్నఁ బై వాల్లుతోవలెఁ బూర్వవర్ణములతోఁ గల్గుట విశేషము

పై యుక్షరములతోఁ గూడుట సంశ్లేష మని చెప్పుచున్న ఆం. సా. వ. ప్రతియందు సయితము విడుతున్ దురిత మనియే చూపఁ బడియున్నది. వివరణము ననుసరించి విడుతు న్దురిత మనియే యుండ వలె. ఏది యే మైనను చ శబ్దముచే నుచ్చ్యటము అపికారగతే యను సూత్రమునొద్దను 'విడుతును దురితము శుభమును బడసెన' ననురీతిగా ద్రుతమును సుస్వరూపముతోఁ జూపియుండెను గావున సంశ్లేషశబ్దముచే విడుతున్ దురిత మని సాధింపఁబడినను లేదా విడుతు న్దురిత మనియే సాధింపఁబడినను నయ్యది విశేషమే యగును గావున విధింపఁ దగినదే. ఆం. సా. వ. ప్రతి ననుసరించి ద్రుతమును సువర్ణముగాఁ దలఁచుట కవకాశము గల దనుట స్పష్టము.

అయిన వాచిక్ప్రతియందును వాత్మాస్మతూ్సత్రమునొద్ద 'ఆత్మ(న్) శబ్దాస్మచ్ఛబ్దములయొక్క అకారమునకు లోపము వికల్పముగా వచ్చును. తా ఘనుఁడు, తాను ఘనుఁడు' (179) అనియే యుండుట గమనార్హము నకారమునకు లోప మని చెప్పి తా ఘనుఁడు తాను ఘనుఁ డని యుదాహరించుటచే నట లోపించిన 'నకారము' తాను లోపినువర్ణమే యనుట స్పష్టము. ఇట సుత్వలోప ప్రసంగము మొ॥ లేవు. పైఁగా నహోబలుఁ డట ద్రుతము నకారపుఁ బొల్లే యైనను ద్రుతస్వత్వమునకు సూత్రము సవర్ణ మని భావించియున్న వాఁ డగుటంజేసి సంశ్లేషమును నాశ్రయించుకొని స్వత్వమును సాధించుటం జేసి తాను ఘనుఁ డని యైనది ఇట శబ్దప్రసంగము లేదు. కావున ద్రుతము లోపించిన తా ఘనుఁ డనియు లోపింపకున్న దాను ఘనుఁ డనియు నయిన దనవలె. నవఁగా లోపించినది సువర్ణమే కదా. ఇంకె 'వాత్మాస్మదోర్ద్రుతస్య' యని సూత్రమునం దున్న ద్రుతశబ్దముచే

గ్రహింపఁబడునది సైతము సువర్ణమే యైనది. ఇట్లు సువర్ణము ద్రుతమని యిట సంగీకరించుట తప్పలేదు.

ఇంకను ద్రుతస్వత్వమును సువర్ణముగా సంగీకరించునపుడే వాత్మాస్మద్విధానము చరితార్థము కాఁగలదు. లేనిచో సంశ్లేషమును వారించుకొనుట యనువుపసర్విధానమువలని ప్రయోజనము ప్రయోజనహీనమె యగును. అపుడు పజ్ఝలవారివలె వినాద్వితీయ మ్మనుకారికవలెనె వాత్మాస్మదోః అనువిధానము సైతము వ్యర్థమే యనవలసి యుండును. నన్నయాథర్వణసమ్మతము లనుచుఁ జెప్పుచున్న యభిప్రాయములవలనను నన్నయాథర్వణులిద్దరవచనములును వ్యర్థములు చేయుట విశేషము.

ఏమైనను నీ సూత్రసందర్భము ననుసరించి బా. స. తానునేనులలో సువర్ణమునే ద్రుతముగాఁ జెప్ప నవక తప్పదు గదా. దీని ననుసరించియే యవికారగతే యనుసూత్రమునొద్ద అంబను గొలిచెద నను రీతిగనే స్వత్వము నుదాహరించియుండు ననుట దోసఁగు గానేరదు. (అహోబలపతి ద్రుతస్వత్వమును సువర్ణముగా భావించుటను బట్టియు బా. స. మత మిట్లూహించుట దోసఁగు గా దనవచ్చు). కాఁగా విడుతున్ దురితము లేదా విడుతు స్దురిత మన్నది సంశ్లేష మగును.

సంశ్లేషం బనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట యని చెప్పిన సూరి తత్సందర్భమునఁ జూచె న్గలువలు వచ్చె న్గోవు లనురీతిగా మీఁదిహల్లుతోఁ గూర్చియే చూపెను. కాని పదాద్యంబులు ఋౠవర్ణంబులు రలతుల్యంబు లనుసూత్రమునొద్ద రేఫతుల్యతచే నా ఋకారపరకతయుండు ద్రుతమునకు వచ్చునసంశ్లేషమును వచ్చెన్ ఋషి యనియే చూపెను. ఇట మీఁద హల్లు లే దనరాదు. ఋకారము రేఫతుల్య మవుటంజేసియే గదా ద్రుతమునకు సంశ్లేష మయినది.

కావున రేఫతుల్య మగునాయుకారముతో ద్రుతి మేల గూడుకొన లేదు. అయిన నది సంశ్లేషము కా దన నగునా ?

అట్లే యిటఁ బైయక్షరముతోఁ గూడికొనుట యని చెప్పినను 'విడుతున్ దురత' మనునది సంశ్లేషము కా దన వీలులే దనుట పొసంగునే కద. ద్రుతము నవర్ణమే యనియు నందలి స్వరము లోపించుటచేఁ బ్రత్యేకోచ్చారణము గలిగియుండక మీఁదిహల్లుతో సంయుక్తముగా నుచ్చరింపఁబడునది సంశ్లేష మనియు స్పష్టము. లవిత్రము పుత్రుఁడు ఇత్యాదులందలి సంయుక్తాక్షరములవంటియుచ్చారణమే యిటఁగలదు. ఇందు హల్లులు సంయుక్తములై యుచ్చరింపఁబడుచుండ దానియూనిక ద్రుతము పూర్వస్వరమున నిల్చి యది గురు వవుట సంభవించుచున్నది. ఇట నుచ్చారణమున భేదము లేదు. లేఖనము నందుమాత్రము పుత్రుఁ డనుచో పుత్ ఋఁ డనురీతిగా సంశ్లిష్టములై యున్నహల్లులను వేఱుచేసి వ్రాయుట జరుగదు. కాని వచ్చెన్గోవు లిత్యాదిస్థలములందుమాత్రము వచ్చెన్ గోవు లనురీతిగాఁ గ్వాచిత్కముగాఁ బాదాంతాదిస్థితులయందు వ్రాయుట గానిపించుచున్నది. కాని యుచ్చారణమునందు భేదము లేమి గుర్తింపవచ్చును. హల్లనకారమును మీఁదిహల్లు నెటనే నిరవ్యవధానముతో నుచ్చరించుట స్ఫురించినను ద్విత్వసంశ్లేషములకుఁ గేవల మట్టియుపేక్ష్య మైనభేదమును జూపుట యనవసరము. అవికారగతే యని వికారము లేమిని జెప్పిన చిం. 'అలుకి చ సంశ్లేష' యని సంశ్లేష మనున దొక ప్రత్యేక వికారముగా విశేషకార్యముగా విధించుట ననుసరించియు పజ్ఝలవారి ద్విత్వసంశ్లేషలస్వరూపము సరిగా ననియు స్పష్ట మగుచుండఁగా నట్టి యభిప్రాయము బాలసరస్వతికిఁ గల దనుటయందును ననర్థములు సృజించుట సరిగాదు.

కాఁగా అం. సా. ప. ననుసరించియే బా. స. అభిప్రాయమును గుర్తించుట యుక్త మని తెలియనగును. అట్లుగా దన్నఁ బరిష్కర్తల

సిద్ధాంతముల కనుగుణముగా మూలగ్రంథమే మార్పులు పొందుచున్నచో మూలగ్రంథకర్త యభిప్రాయ మెదియో నిర్ణయించుట యింకను కష్టతర మైపోవును.

అయిన నంబను గొలిచెద ననురీతి ఆం. సా. ప. ప్రతియందుంటయుఁ దత్పరిష్కర్తయభిప్రాయమున కనుగుణ మనియు నయ్యది ప్రమాణీకరించుట యె ట్లనియు సందేహము గలుగక తప్పదు.

వివాదము గల్గునిట్టిస్థలములయందు రెండుపక్షములకుఁ దగునట్లు ద్వివిధము లైన రూపములుఁ గన్పించుచో దేనినిగాని ప్రమాణీకరింపకుండుటయు నొకమార్గమే. అయినను పైని చెప్పినప్రత్యేక కారణముల ననుసరించియు వ్రాఁతలవారిపరిష్కరణమునందలిపాఠము వలన నేర్పడినయిబ్బందుల ననుసరించియు వానిల్లో పాఠమును గైకొనక ఆం. సా. ప. పాఠములను గ్రహించుట దోసఁగు గానేరదు. ఇతర స్థలములం దలిగ్రంథకర్తయభిప్రాయముల ననుసరించి వివాదస్థలమున నిర్ణయించుట యుచితమే యగును. మొత్తముమీఁద బాలసరస్వత్యప్పకవ్యహోబలులు ద్రుతస్వత్వమును న(ని) వర్ణముగనే యెంచుట స్పష్టము. 'వాక్యాన్తగతపదానాఞ్చ' యనుసూత్రము ద్రుతము లోపించుట వికల్ప మనఁగా లోపాభావపక్షమున స్వత్వముతో న(ని) స్వరూపముతో నుండు నని యహోబలుఁ డెంచెను. కావున నట్లే 'యవికారగతే' యనుసూత్రస్థలమున సైతము బిందువికారము లేక స్వత్వముతో న(ని) స్వరూపముతో నుండు నని యెంచె ననుటకు నవకాశము గలదు. పయి నుత్వేత్వములచేరికనుగూర్చి విచారింపలేదనునదే విచార్యాంశము. చిం. స్వత్వశబ్దము నుచ్చరింపలేదు. దానిని చెప్పిన వి వి. కూడ నీయుత్వేత్వములచేరికను గూర్చి చెప్పలేదే. అయ్యది ప్రత్యేకముగాఁ జెప్ప నక్కర లేని విస్పష్ట మగునంశమా?

తెలుఁగు వ్యాకరణకర్త ద్రుత మనఁగా నకార ('3) మని చెప్పి వారిన్+కొలుతు (63) నని నకారపుఁబొల్లునే చూపె లక్ష్యస్థానములందుఁ గూడ. పిదప ద్రుతమునకు స్వత్వము గాని బిందువు గాని వచ్చు (63)నని సూత్రించి వారిన్+కొలుతు, వారిని గొలుతును, వారిం గొలుతును అని స్వత్వబిందువులకుఁ గ్రమముగా నుదాహరణములు చూపియున్నాఁడు. దీనిఁబట్టి యీతఁడును ద్రుతము నకారపుఁబొల్లయే గాని స్వత్వమమాత్రము ను(ని) స్వరూప ము౦ చెప్పినట్లయిన దహోబలుపివలె. కాని యిది సహజ మైనసమన్వయముగాఁ గానరాదు. కొలుతును అనుచోట తె. వ్యా. నువర్ణమునే చూపినది గదా. ఒకవేళ గొలుతును వారి౦ అనురీతిస్థలములను జూపవలయునన్న (వారిన్+కొలుతును, అనువదే) కొలుతున్+వారిని అని యుండవలెనా? (అరిన్+గెలిచె. తె. వ్యా. 5, ఇందలియునవాజత్వమును గమనించిరో సూరి పూచెను+కలువ లనురీతిగాఁ జూపె నన వచ్చును. (సూరి స్వరపరకతలోఁ బొల్లుగాఁ జూపుట ప్రత్యేకాంశము )

అహోబలపతివచనములయెడ నైనను సీతన్గొల్చెద నను దానిని సీతను+కొల్చెద నని విభాగింపవలెనా? లేక సీతన్+కొల్చెదన్ అని విభాగింపవలెనా? 'నరమో మహాత్మాం లుక్చ స్యాత్' త్రనుసూత్రమునొద్ద రామునిన్ అనుచూపుటనుబట్టి యట ద్వితీయావిభక్తిపై ద్రుతము చేర్చుట యహోబలున కిష్టమె యని చెప్పవచ్చును. సీతను అనుచో నువర్ణకస్థలములం దావర్ణకము ప్రాయికము గా లోపించు నని భావించినవాఁ డగుటచే రామునిన్ అనుచో నంతమునందలి ద్రుత మెట్టిదో 'సీతను' అనుచోటి ద్రుతము నట్టిద యనవలె. వఝలవారు పేర్కొన్నట్లుగా నయ్యది 'యన్య ద్రుత ప్రకృతయ' యనుసూత్రముచే నయ్యెడునదే యైన ద్రుతము నకారపుఁబొల్లని భావించువీరిపక్షమున నకారపుఁబొల్లే రావలెను. (కానీ యహోబలుఁ డక్కడ

నువర్ణమునే చూపెను.) కావున సీతన్+గొలిచెను అనియే విభాగింప వలె ననవచ్చును. వారిం జూచెను, వారిని జూచెను అనురీతిస్థలము లందు నివర్ణకమా,నివర్ణకము లోపింపఁగా మిగిలిన ద్రుతమా? చూతును (దీనిని) అనురీతిస్థలములందు నువర్ణమె చింతామణి విధించినది. అహో బలుఁ డద్దానిపై (రాముని౯ అనుచోవలె) నింకొక ద్రుతమును జేసి చూపలేదు గాన నదియే ద్రుత మనవలెనా? లేక పొల్లనకారమే ద్రుతము గావున స్వరలోపము చేసి చూతున్+దీనిని అని యుంచి ద్రుతకార్యములు చేయవలయునా? కొలిచితిన్+కమలాక్షుని అను రీతిగా నుత్వేత్వాలు లోపింపఁజేసి ద్రుతకార్యములు చేయుచు నాపిదప స్వత్వమునకై యుత్వేత్వములు చేర్పవలెనా? ముందు లోపింపఁజేయుటయుఁ బిదపఁ జేర్చుటయు నిది యెల్లఁ బ్రక్రియా గౌరవమె కాని ప్రయోజన మున్నదా? ఇంకను లోపింపఁజేయుట కెట్లో నవకాశము దొరుకవచ్చును గాని స్వత్వసందర్భమున నుత్వేత్వ ములను జేర్చుటకు నవకాశ మేది?

వజ్ఝలవారు చూతును, కొలిచితిని, అనుచో మొదట నున్నవి నునివర్ణములే గావున స్వత్వస్థితియం దదియే నిల్చు ననవలయును. అట్టి యెడల సీతను గొలిచెదను సీతను గజరాజగమన ననుచోటనువర్ణ మెచ్చటిది? అన్య ద్రుతప్రకృతము యని ద్రుతప్రకృతులచివర నున్నది 'ను'వర్ణమే యవునా? అందులకే 'వనమును' ఇత్యాదిగా నువర్ణమునే యహోబలుఁ డట నుదాహరించెనా! అచ్చోట ద్రుత 'మన్య' యను సూత్రముచే నైనను లేక యెట్లయినను సహజముగా నుండునది ను(ని)వర్ణమే యనవలయు నన్న నదియే ద్రుత మని దానికే ద్రుతకార్యములు చేయనవునే. స్వరలోప మేల? ద్రుతము నకారపుఁ బొల్లు, దానిస్వత్వరూప మగు'ను'(ని)వర్ణము మాత్రము ద్రుతము గా దనవచ్చునా? ఈ పక్షమున నుత్వేత్వములు చేరుట నిరాధారము. కాఁగా వజ్ఝలవారి స్వత్వనిరూపణము నిష్ప్రయోజనము గూడ నవు

చున్నది. వారు చిం. వి. వ. లో 'ప్రాతిశాఖ్యసూత్రమునుబట్టి పొల్లు హల్లునకుఁ గలద్వివిధస్థితులలో ద్రుతము పూర్వాచ్ఛ నత్రియుండెడి స్థితి పైకితిని సంశ్లేష మనిపించుకొన్నపు డింక రెండవ దగు పర హల్లుతో సంయోగించి పరస్వరాంగమగుచు నుండెడిస్థితియే గదా వయి యథర్వణకారికలోని 'స్వతా' అనుదానిచే గ్రహింపవలసి యుండును (210) అని పేర్కొనిరి. దీనింబట్టి పరస్వరాంగముగా నుచ్చరింపఁబడునపుడు ద్రుతము పరహల్లుతో సంయోగించి యుండు నని వారియభిప్రాయము స్పష్టము. వచ్చెన్ వాఁడు సంశ్లేష మనియు వచ్చె న్వాఁడు స్వత్వ మనియు వ్యా. సం. స. లోఁ జూపుటలో నిదే యభిప్రాయము గల దని తెలియవచ్చును. నతి వచ్చెన్ గొడు కని చూపినచోటు వారివివరణము ననుసరించి సంశ్లేషమునకే లక్ష్య మగును గాని స్వత్వమునకుఁ గాదే.

ఒకటి సంశ్లేష మవుచుండఁగా నింకొకటి స్వత్వ మనక తప్ప దనియే పరస్వరాంగముగాఁ బల్కుటను వీరు స్వత్వముగాఁ జెప్పి రని స్పష్టము. స్వత్వ సంశ్లేషములు నిట సమన్వయించుటయే వారి ప్రధాన లక్ష్యము కాని యా శబ్దములయర్థము ననుసరించితత్స్వరూపమును వివరించుట గా దని స్పష్ట మగుచున్నది. అట్టియవసరమును లేక పోవచ్చును. కాని స్వత్వసంశ్లేషము లేకము లయి ప్రత్యేకవిధానము ప్రయోజనహీనమగుచున్నది.

పై చిం. వి. వ. వ్రాఁత ననుసరించి 'వచ్చె న్గొడు' కనురీతిగాఁ బరహల్లుతో సంయోగించియుండుటను స్వత్వ మని యంగీకరింతము గాక. ఇవు డిది సంయుక్తాక్షరమ యైనది. ఇంవలియాదిహల్లు పూర్వ స్వరాంగముగఁ గాని లేదా పరస్వరాంగముగాఁ గాని యుచ్చరింపఁబడ వచ్చు. సంయుక్తమును లైనహల్లులలో మొదటిదాని కట్టియుచ్చారణము ద్రుతమునకే విశేషము గాదు గదా. తదనుగుణముగాఁ

జూచినఁ బూర్వస్వరాంగముగా నుచ్చరించినను లేదా పరస్వరాంగముగా నుచ్చరించినను నయ్యది స్వత్వమే యనఁదగియుండును గాని సంశ్లేషమన వీలు లేకుండుటే కాక యిట్టియుచ్చారణమును వ్రాత ముఖమున విధించుట యనవసర మనఁదగియున్నది.

కాఁగా నీవఝ్ఝలవారుచూపినదాని ననుసరించినభేదములో నివి రెండును నైన సంశ్లేషములే కాని లేదా స్వత్వములే కాని కావలయును గాని యొక్కటి సంశ్లేషమును వేఱొకటి స్వత్వము నవుటలో యుక్తి లేదనియే చెప్పఁదగు.

వచ్చెన్ వాఁడు, వచ్చె న్వాఁడనురీతి భేదకల్పనము నయితము నాధారము గా దనక తప్పదు. ద్రుతమును మీఁదిహల్లుతోఁ గలిపి వ్రాసినను లేదా వేఱుగా వ్రాసినను దానికి మీఁదిహల్లుతో సంయోగమును ముందుగా నంగీకరింపవలసినదే గదా. సంయోగాదివర్ణమే గదా పూర్వస్వరాంగముగనో పరస్వరాంగముగనో యుచ్చరింపఁబడు నది. వచ్చెన్ వాఁ డనురీతి వ్రాసినను నయ్యది సంయోగము కాదా? పూర్వవర్ణము గురువు కాదా? వ్రాఁతలో నప లాభేదము చూప నేల? వచ్చె న్గొము కనుచో నకారగకారములసంయుక్తాక్షరములో నే మొదటిహల్లగు నకారమును బూర్వస్వరాంగముగ నైనఁ బరస్వరాంగముగ నైనఁ బలుకవచ్చు నన్న విరోధ మున్నదా? వఝ్ఝలవారు చూపినయీప్రమాణవచనమునం దిట్టి వ్రాఁతలోనిభేదము చెప్పఁబడినదా? (అందుకే వీరు పిదప రూపమున భేదము లేదని యుందురు.) దీనింబట్టియు నివి రెండు నొక్కటే యనియు స్వత్వము లేదా సంశ్లేషమును గావలసియుండు ననియుఁ దెల్లము.

వ్రాఁతయందుఁ గలైన యుచ్చారణమునందలిభేదమునుబట్టియు నివి విభిన్నము లని చెప్పుట కాధారము లేదు. సంయోగాదివర్ణము

పరస్వరాంగముగా నుచ్చరింపఁబడుటయే సహజ మనియు నయ్యది పూర్వస్వరాంగముగ సైత ముండవచ్చు ననియు నయ్యది విశేష మనియుఁ జెప్పినప్పుడు సంశ్లేషమును బ్రత్యేకముగా విధించుటయు సముచితముగా సరిపడఁగలదు. కాని వీరు చూపినయా ప్రమాణ వాక్యములం దీశ్లేషవర్ణనమున కాధార మేమియుఁ జూపలేదు వీరు. అన లందువలననే యొకటి సంశ్లేషము గాన నింకొకటి స్వత్వము గాక తప్పదని చెప్పకొనవలసివచ్చిన దనుట స్పష్టము. కాఁగాఁ 'బర హల్లుతో సంయోగించి పరస్వరాంగ మగుట లక్షణముగాఁ గల స్వత్వావస్థ' (వ్యా. సం. స. 211) వజ్ఝలవారికల్పనమే కాని నన్నయాథర్వణోద్దిష్టము కా దని నిర్ణయింపవచ్చును. (ఇంకను జింతామణియందైన స్వత్వము నుచ్చరింపకపోవుటం జేసి వయిఁ జెప్పిన రెండువిధము లైనస్థితులు సంశ్లేషములే యనియు స్వత్వ మనునది వేఱయొకటి లే దనియుఁ జెప్ప వీలు గలదు.

కాని యేకపదమునందుమాత్రము (స్వరలోపానంతరము) పొల్లు హల్లును వేరుగా వ్రాయుట కానరాదు గాని పదాంతమున నిట్టిస్థితి ద్రుతమునకే కాక యితరము లగుహల్లులకును గల దని గ్రహింపవచ్చును. హేతులు భిషగ్ద్రిహాడ్బుధబృందకవిప్రవరో హేతుల్, హేతులు - ఇత్యాదిగాఁ బదాంతమునందలిలకారములకును నిట్టిస్థితి గలదు. అందును బాదాంతమున నీవశ్యావధానము సైతముచ్చారణమునఁ గానవచ్చును. కావున నిట్టిస్థితి ద్రుతమునకుమాత్రమే కాదు గావునను బదాంతతలో నితరస్థలములందు నుండఁగా నట్టిస్థితికై యిచ్చటఁ బ్రత్యేకమగువిధులు చేయఁబడె ననఁదగునా? కవి భల్లుకైః' అని యుత్వలోపమే విహితము గాని యట సంశ్లేషము చెప్పఁబడలేదే.

అన లట్టిస్థితి ద్రుతమునకే యేల చెప్పవలసివచ్చినది? చూర్జను లిత్యాదిస్థలములందు మాత్రము సంయుక్తాక్షరములు లేవా?

అట సంయోగాదివర్ణము పూర్వస్వరాంగముగా నుచ్చరింపఁబడుట పరస్వరాంగముగా నుచ్చరింపఁబడుట యున్నది యుండునా? ఉండదా? చిల్క - మున్నగు నేకపదస్థలములందలిసంయోగాదివర్ణమున కాస్థితి లేదా? లే దనుట కేది యాధారము ద్రుతమున కున్న దన్నపుడు. ఉన్న దన్న సంశ్లేషము ద్రుతమునకే యేల చెప్పఁబడెను?

నిజమునకు నుచ్చారణమునందును భేదము లేకపోవుటనుబట్టియే యిట నున్నది యని కాని యట లే దని కాని నిర్ణయింప నవకాశము లేకపోయిన దనుట దోసఁగు గాదు.

ద్రుతమును బొల్లనకారముగనే చెప్పునపు డహోబలునివలె ద్రుతస్వత్వము న, ని. రూప మనుట యుచితము గాదు గావున వ్యాఖ్యలవారు నకారపుఁ బొల్లుతోనే స్వత్వమును గూడ నిరూపింపఁ జూచుట యుచితమే కాని సంశ్లేషస్వత్వములకు స్పష్టమైనభేదము ప్రయోజనమును గానరావు. చిం. వి. వ. లో 'స్వరాంతరే వ్యంజనాన్యుత్తరస్య యానివ్యంజనాని స్వరయో ర్మధ్యగతానితాని ఉత్తరస్యైవ స్వరాంగం భవన్తి న పూర్వస్య' - (213) యనునది చూపి వివరించిరి. కేవలము స్వరములనడుమ నున్నహల్లు పరస్వరమునకె యంగ మగును. గాని పూర్వస్వరమునకుఁ గా దనుట స్పష్టము. సంయోగాది భూత మనుటవలన నింతకు ముందఱియభిప్రాయము ననుసరించి స్వరపరక మగుచో సంయోగాది కాదు కావునఁ బూర్వస్వరాంగ మగుట కాని పరస్వరాంగమగుట కాని నిర్ణయింపరాదు. ప్రస్తుతవివరణముచేఁ బూర్వస్వరాంగము గా దని చెప్పఁబడినది. 'లుక్సంశ్లేషా నాచి' యనుటలో సంశ్లేషమును నిషేధించుటచేతఁ బూర్వస్వరమున కంగమవుటనే సూత్రకర్త యుద్దేశించెనా? ఈ సూత్రమునుబట్టియు సంశ్లేషపదమున కిట్టియర్థము చేయవలయు ననుచో నదియే యుద్దేశ్య మనక తప్పదు

అదే యభిప్రాయ మైన సంయోగాదియా? కాదా? యను వివక్ష లేక ద్రుతము పూర్వస్వరాంగ మైన సంశ్లేషమును బరస్వరాంగ మైన స్వత్వమును నగు నని సామాన్యముగా నియమింపవలెను. కాని వఝ్ఝలవారు పరశబ్దాదిని హల్లుండుటనే యేల ప్రస్తావించిరో యట నట అయిన మీఁదివర్ణ మచ్చే యైనను దానితో ద్రుతము సంయోగించి పరస్వరాంగముగా నుచ్చరింపఁబడిన నది స్వత్వమే యగును గదా. అట్టియెడలఁ బూర్వస్వరాంగము గాదు. లోపింపదును. అని చెప్పుటకంటెఁ బరస్వరముతో సంయోగించి పరస్వరాంగ మగు నని చెప్పుటకై స్వత్వమునే విధించుట లాఘవము సముచితము నగును గదా. స్వత్వవిధానమువలన లోపాభావమును బూర్వస్వరాంగము గాకుండుట (సంశ్లేషనిషేధమును) సిద్ధించెడివే కదా. అట్లు చెప్పలేదు గావున స్వత్వ మనఁగాఁ బరస్వరముతోఁ గూడి పరస్వరాంగ మగుట యని చింతామణి తలఁపలే దనవలెనా? పరముగా హల్లున్నపుడే స్వత్వసంశ్లేషముల స్వరూప మట్లు గుర్తింపవలెనా? అయిన స్వరపరకత్వమున సంశ్లేషమును మాత్ర మేల నిషేధించెను? వచ్చె నతఁ డనుదానిని వఝ్ఝలవారును స్వత్వముగా వ్యవహరింపలే దిందులకే యగునా?

మొత్తముమీఁద చిం., వి వి.లమతిమునను ద్రుతస్వత్వసంశ్లేషములవిషయమున సారాంశము నిట్లు గ్రహింపవచ్చును.

ఈ విషయమున వఝ్ఝలవారు చేసిన-పరస్వరాంగముగా నుచ్చరించుట (ద్రుతమును మీఁదిహల్లుతోఁ గలిపి వ్రాయుట) స్వత్వము పూర్వస్వరాంగముగా నుచ్చరించుట (ద్రుతమును మీఁదిహల్లుతోఁ గలుపక విడిగా వ్రాయుట) సంశ్లేషము అను నిర్ణయములు గ్రాహ్యములు కావు. ఇట్టియభిప్రాయము నితఁడు ము న్నెవ్వరును జెప్పలేదను నభిప్రాయముతోఁ గాక యీ నిర్ణయమునందలి యనౌచిత్యములను

బట్టి గ్రహింపఁదగ దని తోఁచును. కన్నయాథర్వణాసమ్మతి గల దనుట కయి వారు చూపినయాధారములు సరి గాని లక్ష్యలక్షణములం దవి సముచితముగా సమన్వయింపమి స్పష్టము. 'నాశాస్త్ర'..., వినా ద్వితీయమిత్యాదులగునాలక్షణములు వ్యర్థములు గాకుండుట కేవి వజ్ఝలవారిస్వత్వసంశ్లేషలనిర్ణయ మంగీకరింపరాదు. వానిని మార్గాంతరమున సార్థకములుగా గుర్తించునవకాశము వజ్ఝలవారి వ్యాఖ్యానపద్ధతి ననుసంచి లేదు.

బాలసరస్వత్యాదులు ద్రుతస్వత్వమును న(స) స్వరూపము గానే గుర్తించిరి. అది లక్ష్యలక్షణముల కనుగుణమై గ్రాహ్యమై యున్నది.

సంశ్లేష మనఁగా మీఁదియక్షరముతోఁ గూడుట యను బాలసరస్వతియభిప్రాయమునే యహోబలుఁడు వివరించెను. వానిప్రతి (బా. స.) యం దున్నట్లుగాఁ "పూర్వవర్ణముతో సంయోగ"మన్నదే యహోబలుఁ డెత్తికొనఁ 'పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ' యనుచో బా. స. అభిప్రాయమునకుఁ గేవలము విరుద్ధముగాఁ జెప్పినపుడు తన మతమందలియనౌచిత్యమును బా. స. మతమందలియనౌచిత్యమును వర్ణనహోబలుఁడు ప్రస్తావించి యుండెడి వాఁడే యనిపించును. ఆయయి సరకతలలో సంశ్లేషమనఁగాఁ బరముగా నున్నయావర్ణములతో సంయోగమనునర్థము సహజముగను సక్రమముగను దోఁచుచున్నది. కాఁగా మీఁదిహల్లుతో సంయోగమె సంశ్లేష మనునభిప్రాయమును పూర్వవ్యాఖ్యాతృమతానుసారముగనే గ్రహించుట దోసఁగు గాదు.

కాని (బాలసరస్వతి?) అహోబలునభిప్రాయమునే యైనను యదాతథముగా గ్రహించుటకు వలనుపడ కున్నది. ద్రుతము పొల్లు నకార మనుసిద్ధాంతమువలన మీఁదిహల్లుతోఁ గూడుట యను సంశ్లేష

మును విశేషముగాఁ జెప్పనక్కర లేకుండ సంశ్లేషవిధానము ప్రయోజనవంతము కాకుండఁబోవుట, అయినను స్పష్టత్వమునకు, నిస్స్వరూపముగాఁ జెప్పుచో నుత్వేత్వములచేరిక నిరాధార మగుట మొదలగున వీపక్షమున నిబ్బందులు.

అప్పకవి ద్రుతమున స్వరము లోపించి మీఁదివర్ణముతోఁ గూడుట సంశ్లేష మని భావించెను. సంశ్లేషమును వివరించుస్థలమున 'లలి నరిశస్థిరములడా, పలినాంతపదంబు లూఁదిపలికెడుచో సంధులు గాంచును దతవర్గం, బులు నాఱిటిచెంతఁ దక్కఁ బొల్లు లయి హరి' (5-145) యనెను. ఇట (నూఁదిపలికెడుచో ననుటతోపాటు) 'పొల్లు లయి' యని విశేషముగాఁ జెప్పుటనుబట్టి ద్రుతమునందలి స్వరము లోపించుట గుర్తింపఁదగియున్నది. అంతే కాక సంధులు గాంచు ననుటయు గమనార్హము. సంధిస్వరూపమును వివరించు చప్పకవి యంతకు ముందు 'ఎచట సంధి గలుగు నచటఁ బూర్వపదాంత, హల్లుతోడఁ గూడినట్టిస్వరము, లోపముగ నొనర్చి యాపొల్లుతో మీఁదియక్షరంబు గూర్ప నయ్యె సంధి (5-37) యనెను. దాని నిట నమన్వయింపఁగాఁ బూర్వశబ్దాంతమునందలి ద్రుతమునందలిస్వరమునకు లోపము చేసి దానిని మీఁదియక్షరముతోఁ గూర్చుటయే సంశ్లేష మని స్పష్ట మగును 'టతవర్గంబులు రెంటను, సతలెము సర శాక్షరములు నమలిపులును ని, శ్రితముర నాంతపదాంతద్రుతములనుం గూడుకొనవు తుదిఁ గదిసినచోన్' (5-146) అనుటయు, 'నలువ గనిన వేల్పు ద్గంధవాహాదతల్పు' (47) యనియుదాహరించుటయుఁ బై యంశమును నిరూపించుచున్నవి.

అహోబలుని సమన్వయమునందుఁ గాన్పించునిబ్బందులు నీయప్పకవిమతము ననుసరించిన నుండవు. కాఁగా సంశ్లేష మనఁగా ద్రుతము నందలిస్వరమునకు లోప మయి మీఁదివర్ణముతోఁ గూడుట యను

నప్పకవిమతము గ్రాహ్యమే యైయున్నది. చిన్నయసూరియు నప్పకవి యభిప్రాయమునే యనుసరించె ననుట గుర్తింపఁదగు. 'ను (ని) ద్రుతమునకు మీఁదిహల్లుతోఁ గూడుకొనుట యనుసంశ్లేషవిధానము నందలిసామర్థ్యముచేతనే స్వరలోప మవుచున్నది కదా. ఈ పక్షము ననే చిం.వి.వి. ల యందును సంశ్లేషవిధానము ప్రయోజనవంతమగుట, మున్నగుప్రయోజనములు సిద్ధించును.

ద్రుతమందలిస్వరము లోపించుట, మీఁదిహల్లుతోఁ గూడికొనుట యను (సంశ్లేషమునందలి) రెండుధర్మములలో స్వరలోపమే ప్రధాన మని యింతకు ముందు గుర్తించితిమి 'పద్యభేదావసానేషు శ్లిష్టతా' యనుచో నహోబలునిమతమున నది సంశ్లేష మగుట యట్టిదే. ద్రుతము వ్యంజనమాత్రమై నిల్చుట సంశ్లేషవిధానమునకుఁ బ్రయోజనముగాఁ దేలుచున్నది.

ఇట్లు సంశ్లేషమువలన స్వరలోప మగు ననఁగా నంతకుముం దనఁగా సహజముగా ద్రుతము స్వరసహితమని గుర్తింపవలసియున్నది పొల్లునకార మనుటవలననే యహోబలునిమతమున నిబ్బంది యేర్పడినది. ను, ని అనువానిని ద్రుతములుగా నప్పకవి చూపినను నవియే (న్) ద్రుతము లని యప్పకవిమతమును నిర్ణయించి చెప్పుట కష్టము.

ఏది యేమైనను చిం. వి. వి. ల (నన్నయాథర్వణుల) మతము నను ద్రుతము ను (ని న్) అగు నని "ద్రుతస్వరూపాన్వేషణము"లో గుర్తింపఁబడినది.

*ద్రుతము* :- కాఁగాఁ జిం., వి. వి. ల మతమున ద్రుతము ను, ని, న్. అనుస్వరూపము గలది. (చూ. ద్రుతస్వరూపాన్వేషణము.)

*ద్రుతస్వత్వము* :- ద్రుతస్వరూపము ననుసరించి దాని స్వత్వస్థితియు ను, ని, (న్) అనురూపము నం దుంట యే యగుచున్నది.

సమాసమునందు నమాగమము విధింపఁబడిన తావులలో నకారపుఁ బొల్లునే యాగమము చేయఁగా నట స్వత్వసంశ్లేషము లభిన్నములు గనే యుండును చిగురున్గైదువు. చిగురున్నైదువు. (చిం., వి. వి.) సమాసమున స్వత్వము నిషేధింపమింజేసి యట నుమాగమము లో నుకార మచ్చారణార్థము చేరిన దని గుర్తింపఁదగును.

ద్రుత సంశ్లేషము :- స్వరసహిత మైన ద్రుతమునందలి స్వరము లోపించి మీఁదిహల్లుతోఁ గూడుట సంశ్లేషము. ద్రుతము స్వరసహిత మైయున్నపుడు ప్రత్యేకాక్షరముగా స్వతంత్రోచ్చారణము గల్గియున్నది, స్వరలోపముచే మీఁదిహల్లుతో (ఉన్నపుడు) సంశ్లిష్టముగా నుచ్చరింపఁబడును గదా. అయినను దీనియాని పూర్వ స్వరముపై నుండుటచే నది గురు వవుచున్నది. కావున సమాసము నందును బైనేసర్గములు లేకున్నను స్వరలోపముతో సంశ్లిష్టత గల్గు ననుట యఁరద్ధమై 'పద్యభేదావసానే' యన్నది యహోబలకర్తృక మని యుపేక్ష్య మనవచ్చును. అయ్యు నహోబలపతిమతమునఁ బైరీతి సమన్వయమునే గుర్తింపవలె. ద్రుతము పొల్లునకారము కాఁగా సంశ్లిష్టతచే నాతనిమతమున స్వరలోప మను టెట్లన నది యాతని విలక్షణాభిప్రాయ మనఁదగును. 'వాక్యాన్త' సూత్రముచే ద్రుత లోపము చెప్పఁబడఁగా లోపింపద్రుతము పొల్లనకారము గాఁగాఁ బక్షమున లోపింపనప్పుడు ద్రుతము (ను ని) స్వరూపముతో నుండు నను నహోబలాభిప్రాయము విలక్షణము గనే యున్నది గదా. పయి కారిక నుపేక్షించినఁ ద్రుతము మీఁదిహల్లుతోఁ గలిపియే వ్రాయవలె నని నిర్ణయింపవచ్చునా? వచ్చెన్గోవు లనురీతిగా మీఁదిహల్లుతోఁ గలిపియే వ్రాయవలెను గాని వచ్చెన్ గోవు లనురీతిగా ద్రుతమును వేఱుగా వ్రాయరా దనుట యుచితముగాఁ గానరాదు. కాఁగా వ్రాఁతలో మీఁదిహల్లుతోఁ గలుపుటయా మానుటయా యన్న విచారణ మనవసరము. వచ్చెన్గోవు లన్నను నకారగకారముల

సంయుక్తవర్ణముగా నది గుర్తింపవలసియే యున్నది. కావున నిట్టి సంయోగము లేక సంశ్లేష ముచ్చారణమునసరించియే కాని వ్రాతలోఁ జూపుట ప్రధానము గా దని చెప్పఁదగును. అట్టియెడల ద్రుతమున స్వరము లోపించి మీఁదిహల్లుతోఁగూడుట (ఉచ్చారణ మిటఁ బ్రధానము) సంశ్లేషముగాఁ జెప్పఁదగు. ఇంకఁ బయికారిక యహోబలకర్తృకమనియు నాతఁడు పద్యభేదావసానమున స్వర లోపముచెప్పుట యుచిత మైనను దానిని సంశ్లేష మని వ్యవహరించుట యుచితము గా దనియుఁ జెప్పఁదగును. ఇది యుచితము. కాని యదియు నన్వయించుకొన నెంచిన మీఁదిహల్లుతోఁ గూడుటను బ్రస్తావింపక స్వరలోప మయి వ్యంజనమాత్రముగ మిగులుటే సంశ్లేష మనవలెను కాని యహోబలుఁడు పరవర్ణముతోఁ గూడుటనే సంశ్లేష ముగాఁ జెప్పె నిది యెట్లు సమన్వయించు? (పూర్వస్వరాంగముగ నుచ్చరింపఁబడుటయే సంశ్లేష మనువ్యుత్పత్తి ననుసరించి యైనను ద్రుతముస్వరసహితముగ గుర్తించినపుడే యట్టిసంశ్లేషవిధానము ప్రయోజనవంతము కాఁగల దని గుర్తింపఁదగును)

కాఁగా ద్రుతస్వత్వసంశ్లేషము లన్న యంశమున నప్పకవియభి ప్రాయమే యెంతయు సముచితమును సూరిసమ్మతము నై చిం., వి. వి. ల మతమునను గ్రహింపవలసియున్న దని నిశ్చయింపవచ్చును.

# ద్రుతము - బిందువు



ద్రుతమునకుఁ బరుషపరకత్వమునఁ 'బరుషాః ద్రుతప్రకృతికాః' త్రను సూత్రము ఖండపూర్ణబిందువులను జెప్పినది. 'బిన్దుం ప్రపద్యన్తే' యనునది సరళాదిపరకత్వమునఁ బూర్ణబిందువును జెప్పినది. ఇది యిట్లుండఁగా వి. వి. విశేషముగా 'అపరాన్తే సమాసే చ శబ్దే నో బిన్దురిష్యతే' యని చేర్కొన్నది. దీనికి వజ్ఝలవారు "అపరాంతే=నాల్గవచరణము తక్కఁ దక్కినచరణములతుదిని సమాసేచ - సమాసమునందును శబ్దే-శబ్దము పర మగుచుండఁగా నః=ద్రుతమునకు బిన్దుః=ఖండపూర్ణాన్యతరము ధూర్వహామతమునఁ గల దని వివరించిరి. శృంగారభూషణాదులను జేర్కొన్నచోట్ల శృంగారభూషణాదులమతముననే యాగసడదవాదేశాదకార్యపద్ధతి యనియు నయ్యది యథర్వణునకిష్టము గా దనియుఁ జేర్కొనవజ్ఝలవారిట నీబిందువు నథర్వణునకిష్టము లే దనక తత్సమ్మతముగాఁ జేర్కొనుట బాగే.

కానీ కారికార్థవివరణ ముచితముగాఁ గానరాదు. అపరాంతమునందును సమాసమునందును శబ్దము పర మగుచుండఁగా బిందు వగు నందు రేమి? అపరాంతమనఁగా మొదటిమూఁడుచరణము లని గదా. అట్టియెడల సద్దానికి శబ్దము గాక మఱి యేమి పరముగానుండును? ఇట్లె సమాసమునందును శబ్దము పర మగుచుండఁగా నని చెప్పవలసినయవసరము లేదు.

అపరాంతమున బిందువును జెప్పవలసినయవసర మేమి? దీనివలనఁ జతుర్థచరణాంతమున బిందు వుండ దని చెప్పుట ప్రయోజనముగా ననవచ్చును. ఏల యన గుర్వవసాయి యగుపద్యములతుద నెట్లును 'పద్యభేదావసానేషు క్లిష్టతా' యని సంశ్లేషము చెప్పఁబడినది గదా. కావున బిందువు రాదు. ఇంక గుర్వవసాయి యగుపద్యముతుదను సైతము దీర్ఘపూర్వక మగుచో నాద్రుతము లోపించినను గణభంగ

ముండదు గాని 'శ్లిష్టతా' యనుటచే సంశ్లేషమే రావలసియున్నది. ఇంక నిట్లు గాక యటఁ బద్యభేదశబ్దముచే గుర్వవసాయి యగుపద్యములతుది ద్రుతమే హ్రస్వపూర్వక మగునపుడే శ్లిష్టత చెప్పఁబడిన దనవచ్చును. అట్టియెడల దీర్ఘపూర్వక మగు ద్రుతమున కట శ్లిష్టత సాధింపఁబడమి బిందువు రావచ్చునా? 'పద్యావసానే సర్వేషా' మ్మను కారికచే మీఁదిపద్యము మొదటి హల్లుతో సంయోగము నందుట యను వజ్ఝలవారి స్వత్వము నిషిద్ధమయినది గావున బిందువు ప్రాప్తించును. అన్న నట్లే లఘ్వవసాయి యగు పద్యములతుద నున్న ద్రుతమునకును నిట్లు స్వత్వమాత్రనిషేధముచే ఖండబిందు వేని రావచ్చును. కానీ యట్టియెడల మీఁది పద్యము మొదటిపదము సరళము గావలె ననుట కుఁ అపరాదు. అది యున్నదా? ఇం తేల? వీరే పద్యద్వయాద్యంతవర్ణసంధి సంప్రదాయవిరుద్ధ మగుటచే పూర్వపద్యాంతిమనకారవుపొల్లు పరపద్యాదిమహల్లుతో సంయోగించుట యసంభవ మని పద్యావసానే యను కారిక చెప్పుచున్న దని చెప్పిరి గదా. వీరు 'వచ్చెనొక్కఁడు' కనుకీతిని మన్నపుడే (స్వత్వమిది) బిందాదు లగు ననిరి. ఇట న ట్లుండుట నిషిద్ధ మగుటచే బిందువునకుఁ ప్రాప్తియే లేదు గదా. కావునఁ జతుర్థచరణాంతమున (పద్యాంతమున) ద్రుతమునకు బిందువు రా దని చెప్పుటకయి యీవిధాన మక్కఱ లేదు.

ఇంక మొదటి మూఁడు పాదముల చివర నున్న ద్రుతమునకు బిందువు రావచ్చు నని చెప్పుటయే యభిప్రాయమా? దానికిఁ దరువాతిపాదము మొదటి వర్గయుక్మ్మకారభిన్నము లగుస్థిరములు పర మైన బిందువు రావచ్చునా? అచ్చోటి ద్రుతమునకు సంశ్లేషము వజ్ఝలవారి మతము ననుసరించిన స్వత్వ ముండవచ్చునా? కూడదా? తరువాతి పాదము మొదటివాల్లు పర మవుటచేతనే యీయయి ద్రుతకార్యములవుచున్నవి. కాని కేవల మీకారికచే విశేషముగా నవునది కాదు.

ఇంతకు ముందే హల్లు పరమైనపుడు దేబిందువు విధింపఁబడినదో యాహల్లు పరమైనపుడు డాబిందువు వచ్చుటనుబట్టియే యట్లు గుర్తింపఁదగియున్నది.

అహోబలుఁడు 'వాక్యాస్తగతపదానాఞ్చ' యనుసూత్రము ననుసరించి పాదావసానమున లోపమును వివరించెను. వృత్తాదులలోఁ బూర్వార్థము త్తరార్థము నొక్క వాక్య మనియె. కాఁగా నట్లు చూడ నాయాపాదములయంతమందలి ద్రుతమునకు 'వాక్యాస్తసూత్రముచే లోపము రానేసి యుండ నట్లు లోపించునని యహోబలుఁడే చెప్పెనేమో యనుటకు వీలు లేదు. ఆతఁడిట 'ఉపరాస్తః పద్య సమాప్తిః తస్య న ప్రయోగప్రసిద్ధి' యని చెప్పెను. అహోబలుఁడే కర్తయైన పజ్ఝలవారు చెప్పిన పైయర్థము చెప్పకుండుటయుఁ దాను జెప్పినయర్థము ననుసరించి యప్రయోగప్రసిద్ధ మవుటను దెలిసియే యుండి యాయంశమును విధించుటయుఁ గుదురు టెట్లు? కాఁగా నిట్టి కారికలె వికృతివివేకగ్రంథమున కంతటికిని కర్త యహోబలుఁడే యని నిశ్చయించుటకు వీలు లేదని నిరూపించు ప్రబలములైనయాధారములు. పైఁగా నొకచో మొదటిమూఁడుపాదములు చివరను స్వత్వస్థితి నంగీకరించుచో ద్వితీయాదిచరణాదివర్ణములు పరమగుచుండగా నవుటను జేర్కొనెను. అట్లే బింద్వాదులు నవును గదా. కాఁగా పజ్ఝలవారి కారికయుఁ జెప్పినయర్థము నహోబలుఁడు కారికతో సంబంధము లేకయె సామాన్యముగా సాధించుటను సూచనగా గ్రహింపవచ్చును

కాఁగా నెట్లు చూచినను మొదటిపాదములచివరిద్రుతమునకు బిందు వగు నని చెప్పవలసినయావశ్యకము లేదనియే నిశ్చయింపఁదగును.

ఇంక సమాసమునందలి బిందువును గూర్చి యంతగా వివాదము లేదు ఇట నహోబలుని వివరణమును గూర్చి వ్రాయుచు "కొందఱిప్పా

త్యాదులకు...” క్వచిద్భవేత్సమాసేఽపీత్యాదిచే సామాసిక ద్రుతస్థితి వచ్చుచుండగా నిటుఁ బునరుక్తముగా నద్దానినే వచింప నేల?” యనిరి. ఇది యొప్పునా? నూతనత్వాదిబోధకము లైనశబ్దము లేకద్వివర్ణ శేషము లైయుండఁగా వానికిఁ బునసరళ పరకత్వమున ‘వికారాచ్చాపి కేచన’ యని నుమాగమ మగును గదా. ఇట్లు ప్రత్యేకముగా విధింపబడినను మ్మైతము ‘ద్రుతస్య సర్వత్ర’ యని లోపించునెడల నిక నుమాగమవిధాన మేల? అది యప్పనదే సమాసములందు. సమాస మైన ద్రుతలోపము తప్పదు. కాఁగా సమాసమున ద్రుతము లోపింపవలసియున్నప్పటికి నుమాగము గూడ ద్రుతమును విధించుటచే విధానసామర్థ్యము ననుసరించి ద్రుత మిది లోపింప దనుట సూరి సమ్మత మగుమార్గమే. మఱి యీనుమాగమద్రుతలోపాభావమును సాధించుటకు “క్వచిద్భవేత్సమాసేఽపి” యనుదానిచేతనే యిట ద్రుతము లోపింపక నిల్చియున్న దని చెప్పవలసిన యక్కఱ లేదు గదా. వజ్ఝలవారే ప్రాఁగెంపు, కెందామర మున్నగురూపములలోని ద్రుతస్థితియు సరళాదేశాదికము ను నీసూత్రమునకు (క్వచిద్భవేదిత్యాదికి) విషయములు కావు. సుమ్మోతః...ఇత్యాది...విధానసామర్థ్యమున ...సంభవించు’ (296) నని స్పష్టము చేసిరి. ఇట నహోబలుని విమర్శించుటకై తమసిద్ధాంతమును స్పష్టముగాఁ బల్కుట సక్రమము కాదు గదా.

అహోబలుఁడును తల్ప్రబాలిత్యాదుల నుదాహరింపలేదు. కావున నీ వజ్ఝలవారివిమర్శనము తల్ప్రబాల్యాదులకు సంబంధించినది గా దనుట స్పష్టము. [తల్ప్రబాల్యాదులలోని ద్రుతము సమాసమునం బ్రత్యేకముగాఁ గెందమ్మిత్యాదులలోవలె విధింపఁబడినది గాదు గావున విధానసామర్థ్యము నాశ్రయించి లోపాభావమును సాధింప వీలు లేదు గదా.]

“సమాసమున ద్రుతలోపము సామాన్యముగా నగుచుండుట సమ్మతమె యైనను వెనుకఁ జెప్పినరీతిని ప్రాణిమాత్రము క్వాచిత్కముగ నిల్చినట్లె క్వాచిత్కముగాఁ దలఁప్రాలు, నేఁప్రాలు... మున్నగుచోట్ల సమాసమందును ద్రుతము లోపింపక బిందురూపమున నిల్చు నని తాత్పర్య' (వ్యా. సం, స. 293) మనుటలోఁ దలఁప్రాల్వాదులలో ద్రుతలోపాభావమును బిందువును 'సమాసే చ' యనుదానివలననె సంభవించు ననియె గదా వీరును జెప్పుట. కాని మఱల "క్వచిద్భవే త్తనుటచే ...తలఁప్రాలు, తలంప్రాలు మున్నగు నలుక్సమాసములలోన ద్రుతము లోపింపక నిల్చుటయు సంభవించును. ...అపరాస్తే సమాసే చ అనుచోటప్పను తలఁప్రాలుప్రభృతులలో లోపింపని ద్రుతము ఖండపూర్ణాన్యతరబిందువుగా మారును. ఆకారికలోని బిందుశబ్దము సరళాదేశాదికమునకు నుపలక్షణ' (వ్యా. సం. స. 329) మనుట పైని జేసినతమ వివరణమునకు ననుగుణము గాదు గదా. ఇంకను వీ రిచట 'ప్రాణిమాత్రస్య' యనుమాత్రశబ్దస్వారస్యమున నట్టి ప్రాణి యనఁగా ద్రుతాంతపూర్వాచ్చు న త్తియుండు సంశ్లేషము నందునే గాని సరళాదేశాది ద్రుతసంధికార్యము లెవ్వియును గలుగ వనునర్థము లభించుచున్న' (296) దని చేసిన నియమమును గూడ మఱచి 'క్వచిద్భవే' త్తను కారికచే లోపింపని ద్రుతమునకు బిందువును మీఁద సరళాదేశమును జేయుట విరుద్ధము గాదా?

కాన 'సమాసే చ బిన్దు రిష్యతే' యనుటంబట్టియే తలఁప్రాల్వాదులలో బిందువిధానసామర్థ్యమునుబట్టి ద్రుత మీవాక్యము చేతనే లోపింప దనుటయే సమంజసము. సమాసమున నీద్రుతము లోపించుచో బిందువిధానము వ్యర్థము కాఁగలదు. ద్రుతలోపాభావమును జెప్పక బిందువుఁ జెప్పుటేల యనవచ్చును. తల్ప్రాబ్లలనురీతి సంశ్లిష్టరూపము గానరాకుంటయు నుద్దేశించి బిందు మాత్రమే

యుండు ననునభిప్రాయముతో నిట్లు చెప్పఁబడిన దని తలఁచుటయు సమంజసమే యని తోఁచుచున్నది.

అంతేగాక ద్రుతలోపాభావమును జేర్చకను బిందువును మాత్రము విధించుట ననుసరించి యీ కార్యము ద్రుత మగునకారము నందే కాక ద్రుతము కానినకారమునందుఁ జెల్లుటయు నుద్దేశింపఁబడిన దనవచ్చు.

కనుదోయి కన్దోయి కందోయి యనుచో శబ్దగతమైనయీ నకారము నన్నయాధర్వణులపక్షమునను ద్రుతము గానేరదు కావున సామాసికమైనలోపము నందదు. బిందువు వచ్చిన నీకారిక ననుసరించియే కందోయి యని కాఁగలదు. ఇట్లే చందోయి.

'శబ్దే' యనుదానిని 'అపరాన్తే శబ్దే, సమాసే చ శబ్దే' యని వివరించుట యనవసర మని గుర్తించియున్నాము. కావున అపరాన్తమునందును సమాసమునందును నెట్లు నకారమునకు బిందు వని వ్యాఖ్యానించుచున్నారో యదే విధముగా శబ్దమునందును నకారము నకు బిందువు గల దని చెప్పఁదగు. కినుక – కిన్క – కింక. వెనుఁబడు, వెన్బడు, వెంబడు అనురీతిగా ద్రుతము కానినకారమునకు శబ్దమధ్యమునఁ గానవచ్చు బిందువు 'శబ్దే' యనుదానిచే సాధింపఁదగును. శబ్దమధ్యమందలినకారము ద్రుతము గానేరదుగదా. కావున నిట ద్రుతము కానినకారమునకు బిందువు చెప్పఁబడిన దనక తప్పదు. అట్లే 'సమాసే చ' యనుచోటఁ గన్దోయి-కందోయి-చన్దోయి-చందోయి యని ద్రుతము కానినకారమునకు బిందువును జేయుట యవిరుద్ధము. నుడికాలియచ్చుమీఁద నుంట పేనియుండు ఖండబిందుప్రసక్తి లేకుంటను గ్రహింపవచ్చును. అహోబలుఁడు చూపిన 'అంచు, వించు' నను నవి సరియైన మీట సంగ్రహించిన దోషము లేదు.) కాఁగా నహోబలుఁడు 'శబ్దే'-యనుదానిని ప్రత్యేకముగా స్వీకరించి శబ్దమునందే

నకారమునకు బిందు వగుటను వివరించుట యుక్తముగా నున్న దని గ్రహింపఁదగును.

ఇంక 'అపరాన్తే' యున్నది మిగిలినది. మొదటిమూఁడు పాదముల చివర ద్రుతమునకు బిందు వుండవచ్చు ననుచున్న దీకారిక. అట్టియెడల బిందువే యేమి? తరువాతి పాదము మొదటివర్ణము ననుసరించి (గణానుసారముగ) స్వత్వసంశ్లేషములు నుండ నవునే గదా. మొదటిపాదములచివర ద్రుతమునకు ద్వితీయాదిచరణాదివర్ణ పరకత్వమున స్వత్వ ముండనవుట నహోబలుఁడు స్పష్టము చేసియే యున్నాఁడు. మీఁది హల్లులోఁ గూడిన సంశ్లేషమునకు మాత్రము విరోధ మేమి? ఇట్లు స్వత్వసంశ్లేషములును నుండునపుడు బిందువును బ్రత్యేకముగాఁ జెప్పవలసినయవసర మేమి?

అపరాంత నను దానికిఁ బద్యసమాప్తి యని యహోబలుని వలెనే యర్థము చేసినచో బిందువిధానము విశేష మేమియుఁ జెప్పలేదు.

దీనికిఁ దొలిచరణములందు ననుకృతిగనే యర్థము చేయవలసి యున్నయెడల నిట్టిపు మిగిలిన ద్రుతకార్యముల కెల్ల నుపలక్షక మని భావింపవలసియుండును. అపుడే స్వత్వసంశ్లేషములకు గతి గల్గును. అహోబలుఁడు దీనివ్యాఖ్యానమున నిది వ్యర్థ మన్నట్లుగాఁ దలఁచుటచే నిది యహోబలకృతి యనుటకు వీలు లేదు గావున నుపేక్షించుటకును వీలు లేదు. అట్లుగాఁ బొరబడినయహోబలుఁడు చెప్పుటచే నది విశేషముగాఁ బరిగణింప నక్కఱలేదని తలఁప నవకాశము లేదు. అట్లయిన నీద్రుతకార్యానుజ్ఞమాత్ర మేల?

ఇట్టియెడల 'నస్యాద్వాక్యవిరామే తు సంధ్యభావోఽపి దోషకృత్' తను దానిలోని వాక్యశబ్దముచేఁ బాదము మాత్రము గ్రహింపఁబడఁగా (అట్లు గ్రహింపఁబడు నని యహోబలుఁడును జెప్పె నట్టిది ప్రయోగములం దుంటయు స్పష్టమే.) పద్యపాదాంతములం

వల్ల ద్రుతమునకును దరువాతిపాదమునాదివర్ణమునకును బరకత్వమున ద్రుత కార్యములు లేకుంట దోషము గాదని యర్థ మగుచుండఁగా దాని నిట్లు వారించెనా యని యనుమానము. అనఁగాఁ బాదాంతమున స్వరసంధివలెనె యీ ద్రుతసంధికార్యములును జరుగకుంట దోషము గాదని యెంచరాదనియుఁ బాదాంతమందు ద్రుత మున్నయెడల ద్రుతసంధికార్యములు చేయక తప్పదనియుఁ జెప్పుటయే యిందుద్దేశింపఁబడినదా? అయిన సమానేచ-శబ్దే యనుచోట్ల బిందువు సార్వత్రికము గాదు కాని తొలిచరణముల కడ ద్రుతమునకు బిందుశబ్దముచే నుపలక్షితములగుచున్న ద్రుతకార్యములు మాత్రము నియతములే యనఁదగియున్నవి. ఈభేద మెట్లు? అనఁగా 'న దోషకృ'-త్తనుటచే సంధికార్యము లవుట యెట్లును దోషము గాదని స్పష్టము. ద్రుతకార్యానుజ్ఞ యనియే యొసఁగుచున్నది. అట్టియెడఁ బ్రత్యేకముగా ద్రుతకార్యములు జెప్పుటచే ద్రుతసంధికార్యాభావముండరాదని నియమించుటకు గీనివలన సవకాశ మేర్పడుచున్నదని గ్రహింపవచ్చును.

కాఁగా నిచ్చట నున్న విశేష మొకటి. 'సమానే శబ్దే' యను స్థలములందు ద్రుతేతర మగునకారమునకు బిందుకార్యము చెప్పఁబడినది. కాని 'యుపరాన్తే' యనుచో ద్రుతము మాత్రమే గ్రహింపవలసియున్నది. అట బిందువిధానము ననుసరించి (ద్రుతేతర మగు నకారమునెడల నితరకార్యప్రసక్తి యెట్లును లేదు) ద్రుతమునకుఁ దలఁబ్రాలు - తలంబ్రా లనురీతిగా బిందు వొక్కటే యవు నని గ్రహింపఁబడుచుండగా నీ'యుపరాన్తే' యనుస్థలమున బిందు వితర కార్యములకు నుపలక్షకమై ద్రుతమున కగుకార్యము లాయువి యెల్లఁ బరపాదాదివర్ణము ననుసరించి గ్రహింపఁబడవలసియున్నది.

తరువాతిపాదము మొదట నచ్చున్నయెడలఁ గూడ నిట్లే యా ద్రుతము పై యచ్చుతోఁ గూడియే యుండవలసియున్నది.

'నస్యాద్వాక్యవిరామే తు' అను దాని ప్రసక్తి పాదాంతిమద్రుతము నెడల లేదనుకొన్నపుడు తరువాతిపాదము మొదట నచ్చున్నపుడు పూర్వపాదాంతిమద్రుతము నట్లే నిలిచియుండు టెట్లు? కొన్నియెడల నిట్టిస్థితి యంగీకరింపఁబడియున్నది గదా. అట్టియెడల 'వాక్యాన్త' సూత్రమునందలి వాశబ్దము నాశ్రయించి గాని మఱియే దయిన మార్గాంతరము నాశ్రయించి గాని యట్టివానిని సంగ్రహించుకొనవలసి యుండు నని మాత్రము చెప్పవలె.

ఇట వజ్ఝలవారు లఘువు తుది నుండవలసిన గీతాదులనాదిని సంశ్లేష ముండనేర దని 'పద్యే ఛేదావసానేషు' అను కారికచే వివరించిరి. ఇది విశేషార్థమే యగునా? ఈ నియమముచేఁ బొల్లనకారమయిన ద్రుతము లఘ్వవసాయి యగుపద్యముతుది నున్నది పూర్వాచ్ఛ న త్తియుండుటకు వీలు లేదు. 'పద్యావసానే సర్వేషా' మ్మను దాని ప్రకారము (పద్యద్వయాద్యంతవర్ణసంధి లే దనుచు) స్వత్వము అనఁగా ద్రుతము మీఁదివర్ణముతోఁ గలియుట లేదా పరస్వరాంగముగా నుచ్చరింపఁబడుట లే దన్నారు. పూర్వపరవర్ణముల నాశ్రయింపక యీపద్యావసానమునందలి ద్రుత మే మైపోవ యును? ద్రుతము నకారపుఁబొల్లు యగుటచే దీనిని గురులఘువులలో నొకటిగాఁ బ్రత్యేకముగాఁ బరిగణించుటకు వీలు లేదు. అట్టియెడల 'వాక్యాన్తగతపదానాఞ్చ' యనుసూత్రముచే నాలఘ్వవసాయి యగుపద్యములతుది ద్రుతము నిత్యముగా లోపించియే పోవలయునా? అహోబలుఁడు చూపిన 'వైజయంతీనవాంశుకవ్యాజమునను' - అను దానిస్థితి యెట్లు? 'వ్యాజమునను' అనుచో నా ద్రుతము నిత్యముగా లోపించియే పోవలసియున్న పై వివరణము ననుసరించి 'వ్యాజమున'- అనియే యుండవలె. ఇట గణభంగము గదా. ద్రుతలోపము చేయుట మానినచో గణభంగముతోఁ పాటు వజ్ఝలవారిసమన్వయము ననుసరించి లక్షణవైరుధ్యమును వచ్చు గదా మఱి? 'వ్యాజమునన్' అను

చోటినకారముపై నుత్వ మెట్లు వచ్చును? అర్థవిశేషమునందు 'ఉన్' చేయవలయు నేమో! అట్టియెడల ఏ లోకనియమము చేయవలసి యుండును. లఘ్వవసాయి యగుపద్యము తుది నున్న నకారవుం బొల్లు (గణభంగము గానున్న) లోపించియే పోవు ననియు (నట్లు లోపించుచో నొకలఘువు తగ్గుట ద్వారాన గణభంగమే యగుచో లేదా యా నకారముపైఁ దప్పక 'ఉన్' చేరి యందలి ద్రుతమును వాక్యాన్తగతపదానాఞ్చ' యనుసూత్రముచే లోపము నిత్యముగా నగు ననియుఁ జెప్పవలె. ఏ దేనైన గణములు సరిపడుచో సహజమైనయా ద్రుతమే లోపించు. లేదా ఉన్ శబ్దమునందలి ద్రుతము లోపించు. లఘ్వవసాయి యగుపద్యముతుదిని ద్రుత మెట్లైని లోపించుట మాత్రము తప్ప దనవచ్చును. అయిన విశేషమే మనఁగా (మొదటి) ద్రుతము లోపించినను గణములు సరిపడుచో నిబ్బంది లేదు గాని గణభంగ మగుచో మాత్రము (ఉన్ శబ్దసంబంధి ద్రుతము లోపించినను) అర్థవిశేష ముండక తప్పదు. ఉ, ను - లను ఐధర్వాణుఁడు సంస్కృతభాషావాసనాతిశయమునమాత్రమె 'అన్యత్రాపి' (అని యర్థవిశేషము లేకున్నను భావపూరణమునను వచ్చు) అని చెప్పెను గాని మహాకవు లట్లు నిరర్థకముగఁ బ్రయోగింపరు (311. వ్యా. సం. స) గదా మఱి. ఇంతయైనను జిన్నయసూరి స్వత్వమునకు 'కల్గెను దాని, లంఘించెను మఱవు, మొదలగుతిక్కనప్రయోగము లుదాహరించుటచే 'ను' (ని) ద్రుతస్వత్వముగా నంగీకరించియే యుండుటంజేసి చిన్నయసూరిమతానుగుణముగను దిక్కనాదిమహాకవిప్రయోగానుగుణముగను నీ 'వ్యాజమునను' అనుచోటఁ గూడ నర్థవిశేషము లే దనియే చెప్పఁదగియున్నది. కాఁగా నన్నయాథర్వణులమతమునందుమాత్రమె ద్రుతము పొల్లునకార మను వఝ్ఝలవారిసిద్ధాంతము ననుసరించి తిక్కనాదుల ప్రయోగములకు విరుద్ధముగా సైతము వ్యాజమునను అనుచో నర్థ

విశేషము గల దనియు నితరపక్షమున నాయిబ్బంది లే దనియు స్పష్టమగుచున్నది. అప్పకవీయవివరణానుగుణముగా నిట్టియెడఁ జింతామణిపక్షమును (ప. వి. చింతామణికి విరుద్ధముగాఁ జెప్పదు గావునఁ దన్మతమునను) ద్రుతము ను (ని) వర్ణముగనే గ్రహించునెడల నయ్యది తిక్కనాది (నన్నయయు) మహాకవిప్రయోగానుగుణముగా నర్థవిశేష కల్పనము లేకయె సిద్ధించు ననియు దీనివలననే గుర్తింపఁదగియున్నది.

ఇట నింకొకయంశ మిట్లు గుర్తింపఁదగియున్నది. పద్యావసానే యనుకారికను వివరించుచు వీరు 'పద్యద్వయాద్యంతవర్ణసంధి సంప్రదాయవిరుద్ధము గావున స్వాత్వము లే దనిరి. పద్యద్వయాద్యంతవర్ణసంధి సంప్రదాయవిరుద్ధ మనుటంజేసి పద్యమునందుఁ దొలిపాదము నంత్యాక్షరములకుఁ దరువాతిపాదముతొలివర్ణముతో సంధి సంప్రదాయబద్ధమె కదా. అట్టిదానివలననె పద్యమునందు మొదటమూఁడు చరణములతుది నున్న ద్రుతము 2 3, 4 పాదముల తొలివర్ణముల ననుసరించి యాయాద్రుతికార్యముల నందు ననియు నపుడు యథార్థముగా బిందువునయినఁ బొందు ననియుఁ దెలియుచునే యున్నది. 'అపరాన్తే బిన్దు' యన్నమాత్రమున యథేష్టముగా బిందువును జేయవచ్చునా? వర్గయుక్స్వరళ (మకార) భిన్నస్థిరము పరమయినపుడు బిందువు దీనిచేఁ జేయవచ్చునా? ఆదేశసరళేతరములు పరము లయినపుడు బిందువే గద యని ఖండమును జేయనగునా? కాఁగా 'అపరాన్తే' యనుటవలన నపూర్వముగా నెచ్చట నేని బిందు వగు నన వీలు లేదు. ద్రుతవిధుల ననుసరించి పర మైనతరువాతిచరణాదివర్ణము ననుసరించియే యగును. 'పద్యావసానే' యనుచోఁ బద్యద్వయాద్యంతవర్ణసంధి సంప్రదాయవిరుద్ధ మని గుర్తింపఁబడినది గావున దాని ననుసరించి పద్యావసానేతరస్థలములం దాయాప్రథమాదిపాదాంతములం దంత్యాక్షరమునకు ద్వితీయాదిచరణాద్యక్షరపరకత్వమున సంధికార్యములు సంప్రదాయానుగుణము లని యొకసారి స్పష్టము చేసినట్లు నగుచున్నది.

ఇంకఁ 'బద్యావసానే' యనుటచే ప్లుత్వముమాత్రము నిషేధింపఁబడఁగా 'అపరాస్తె చ' యని మొదటిమూఁడుపాదములతుదిని బిందువును జెప్పుట ననుసరించి పద్యావసానమున బిందు వుండ దని చెప్పిన ట్లగునది. కావున నిట్లు బిందువును నిషిద్ధ మైన దనియుఁ జెప్ప నగునా ? వఝలవా రట్లు స్పష్టముగాఁ జెప్పియుండలేదు. బిందు వొకసారియు సంశ్లేషము నొకసారియు నిషేధింపవలసినయవసర మేమి ? పద్యద్వయాద్యంతవర్ణసంధి సంప్రదాయవిరుద్ధ మనుటవలన ప్లుత్వ నిషేధమే యనవసర మయియుండఁగా బిందునిషేధమును నేల? ఇంక మిగిలినకళ లైనశబ్దములు 'పద్యాంతమునం' దున్నఁ దరువాతిపద్యాది వర్ణముతో సంధి యవు ననుటకా ?

ఇట్లు తొలిమూఁడుపాదాంతములయందు ప్రుతమునకు బిందు వుండు నని చెప్పుటయు నట్లె పద్యాంతమునందు బిందు వుండ దనుటయు ననవసరముగాఁ జెప్పఁబడినవే యనవలసియున్నది.

కాఁగా వాక్యశబ్దమునకుఁ గేవలము పాద మని యర్థము చేసి (వఝలవారు పాదములో పాటు వాక్యము నవసానము గావలె ననిరి.) పాదాంతము సందల్ప్రుతమునకు ప్రుతకార్యములను జెప్పుటలోఁ బై చెరొన్నయభిప్రాయము లత్కర్త కున్న దేమో యనిపించు నట్టి మొదటి నిపిధి (కొంతవఱకే నని) సార్థకము గాఁగలదు.

# పరుషపరకద్రుతలోపము



చింతామణికి వ్యాఖ్య వ్రాయుచున్న సరసరాజు కవిజనాంజనములో 'వికల్పేన ద్రుతే లోపే పరుషా స్సరళాః పరే' యను కారికను జూపెను. దీని నహోబలుఁడు వి. వి. లోఁ జేర్చియుండమింజేసి వికృతివివేకములో నీకారిక లేదని స్పష్టమవుచున్నది. ఎద్దియే నాధారముగా నీలక్షణము సరసరాజకృత మనవచ్చును.

దీని కర్థము వ్రాయుచో నాతఁడు "వికల్పముచేత నకారము లోపించినచో పరము లున్న కచటతపలు గజడదబ లగుచున్న' (46 పుట) నని వ్రాసెను. అయినను రాముఁ దలఁచెద, శంభుఁ బూజించెద నని లక్ష్యములయందు ద్రుతస్థానమున ఖండానుస్వారముండుట ముద్రణము పొరపా టనవచ్చును. 'రాముఁదలఁచెద' నని యీయవలసియున్నది. నన్నయ ప్రయోగములందు ద్రుతానుస్వరూపమును సమర్థించుచో వజ్ఝలవా రిట్లు ద్రుతమును లక్ష్యములందుఁ బ్రదర్శింప లేదు గాని లోపింప దనియుఁ జెప్పలేదు. లోపింప దని వారినిశ్చయము. కవిజనాంజనకర్త పేర్కొన్న యీయర్థము వజ్ఝలవా రటఁ జూపినలక్ష్యములసమన్వయమున కవసర మయి యున్న దన వచ్చు.

ఈ యర్థమువలన ద్రుతము లోపించును గాని పై పరుషములు మాత్రము సరళము లవు నని స్పష్ట మగుచున్నది. ఇయ్యది యవికార గతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరత యను చిం. లక్షణమున కనుగుణ మైయున్న దనవచ్చును.

కాని యాపిదపనే కవిజనాంజనకర్త ఈ స్థలమునందుఁ గొందఱు నకారములోపించిన పై నున్న కచటతపలు వికల్పముచేత గజడదబ లగు నని యుండఁగా వికల్పశబ్దము సరళాలకే అన్వయించి ప్రయో

గించు చున్నా' (46 పుట) రని తిక్కన ప్రయోగమును బ్రస్తావించెను. దీనివలన ద్రుతలోపము సామాన్యము కాఁగా మీఁద పరుషములు సరళము లవుటయుఁ గాకుండుటయు సిద్ధించుచున్నది. అనఁగా నీ పక్షమున (ద్రుతే లోపే పరే పరుషాః వికల్పేన సరళాః అనుచొప్పున ద్రుతలోపమును,) ద్రుతముమీఁదిపరుషము లట్లే యుండుట విశేష మవుచున్నది. నిజమునకు మీఁదిపరుషములు సరళము లవుచో నట ద్రుతము లోపించు నని చెప్పవలసినయవసరము లేదు. అట్టి దనఁ దగిన 'రాముడలఁ జెద' ననురీతిస్థలములయందు 'రాముఁడఁ జెద' నను రీతిగా ద్రుతస్థలమున ఖండానుస్వారమును జూపిన నిబ్బంది యుండదు. కవిజనాంజనమున ముద్రణ మిట్లే యున్నది కాఁగాఁ బరుష పరకత్వమున ద్రుతము లోపించు నని చెప్పవలసినయవసర మాపరుషములు సరళములు గాకుండునపుడే కలుగు నని చెప్పవచ్చును. కానఁ బరుషపర కత్వమున ద్రుతము లోపించుటయు నాపరుషములు సరళములు గాకుండుటయుఁ గల వనుటయే విశేషముగా గుర్తింపఁదగును.

అట్టి ప్రయోగముల నిట్లు గుర్తింపఁదగియున్నది. సీ చెప్పిన పెద్దలు ద్రోణాచార్యులు మొదలు గాఁగ నని కొల్లనివారైచేరని వారిం గొని, యే చక్కంబెట్టువాఁడ నే పాండవులన్'. అను తిక్కన (ఉద్యో. 2 250) ప్రయోగమున నేశబ్దముపైఁ బరుషమున్నట్లే యుండి ద్రుతములోపించిన దని తిమ్మకవి పేర్కొనెను. ఉటఁ బేటికావ్యాఖ్య 'కాని తరువాతి యేశబ్దము ప్రశ్నార్థకముగఁ బేర్కొని వికల్పవిధి యగుటచే గ. డవవాదేశము లే దని సమన్వయించెను. నేను(న్) శబ్దముగుచో సరళాదేశాభావము సమ్మతము కాదు. కావున న ఘ్ఞలవారు నిచట "వారిం గొనియే, నను శాంతవులను జక్కంబెట్టు వాఁడ" (నేనుకళపై నీరు సరళాదేశము చేయుట వీరివ్యాఖ్యననుసరించి నన్న యాథర్వణసమ్మతికి విరుద్ధమైనను బాలవ్యాకరణప్రభావమునకు లోఁబడుటవలన నని గ్రహింపఁదగును.) నని సమన్వయించి చతుర్థపాదాది

నున్న 'ఏ' అనునది యవధారణార్థక కాక్వాదిస్వర మగుటచేత గసడదవాదేశము లేదని (వ్యా. సం. స. 271) పేర్కొనిరి. అనఁగా గసడదవాదేశ ప్రస్తావనను వలెఁ జేటిక ఏకారము ప్రశ్నార్థక మనుటను సయితము వజ్ఝలవారు తిరస్కరించి యది యవధారణార్థక మని నిర్ణయించినట్లు స్పష్ట మగుచున్నది. అది యవధారణార్థక మయిన యెడల నప్పద్యమున కర్థ మేమి? ద్రోణాచార్యులు మున్నగువారు అనినొల్లక, అనిని జేరకయుండఁగా - వారినే కొంపోయి పాండవులను సాధింతు ననియా? అవధారణార్థమువలన యుద్ధమునొల్లని, యుద్ధరంగమునకు రాని ద్రోణుఁడు మొద లగువారిచేతనే పాండవులను జక్కఁ జేయుదును గాని యుద్ధమునకు సిద్ధమైనకర్ణదుశ్శాసనాదులను బనిగొన ననియే దుర్యోధనునభిప్రాయముగాఁ జెప్పవలసియున్నది. అట్లర్థము చేయుట యటఁ ప్రకరణమునకు నన్నివిధముల విరుద్ధమైయున్నది. అంతకుముందు దుర్యోధనునితో సంధిచేయు మనుచు ధృతరాష్ట్రుఁ డిట్లు పేర్కొనెను. చం॥ పెనఁకువ నాక యేల మనపెద్దల కెవ్వరి కియ్యకోలు గా, దనుచితవృత్తి గాన గురుఁ డాదిగ నాప్తులు బంధుమిత్రులున్, గొనకొని పోరికిం జొర రకుంఠితతేజుఁడు ధర్మపుత్రుఁడు, తనిఁ దగఁ గూడి మన్కి ప్రమదం బగు గౌరవజాతి కెంతయున్. (ఉద్యో. 2-246) అనెను. పెనఁకువ మనపెద్దల కెవ్వరి కియ్యకోలు గాదు, గురుఁ డాదిగ నాప్తులు బంధుమిత్రులుం బోరికిం జొర రన్న ధృతరాష్ట్రువచనములను స్వీకరించి దుర్యోధనుఁడు నీచెప్పినపెద్దలు ద్రోణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లనివారు - (అనిన్) చేరనివారుఁ అని పేర్కొనుట గమనార్హము 'అని కొల్లనివా రైచన్నవా రని తిక్కనపాఠమునే వజ్ఝలవారుం జూపిరి. ముద్రితగ్రంథములందుఁ జేరనివా రని యున్నది. చన్నవా రన్నదానికి నెట్లో చేరనివా రనియే యర్థము గ్రహింపఁదగును. అదియే సందర్భానుగుణము. భారతసంశోధితముద్రణము 'చేరనివారి' నని మాత్రము చూపినది. ద్రోణాదులు

యుద్ధమున కిష్టపడరు (గట్టిగాఁ గోరినను) యుద్ధరంగమునకు రారు. కావున నీవు ధర్మపుత్రునియకుంఠిత తేజము తాళలేవు గావున సంధి చేసికొమ్మని ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు'. అప్పుడు దుర్యోధనుఁడా ద్రోణాదులతో నే పాండవులను జయింతు ననుట యొప్పునా? విజయ మసంభవ మని స్పష్టము కదా. కాఁగా ద్రోణాదులు యుద్ధమునకు రాకున్న నేమి? అసలు వారిసహాయమునఁ బాండవులను జయింపవలె నని నే ననుకొన్నఁ గదా. వారు రాకున్న జయము గల్గదని సంధి చేసికొనుట' యన్నయభిప్రాయముతో 'వారలంగొనియే? అని ప్రశ్నార్థకముగా 'నే' శబ్దమును గుర్తించుట యుచితము. నేఁబాండవులం జక్కంబెట్టుట వారలం గొనియే యనుచో వారలం గొని గాదు' అని వ్యతిరేకార్థము వ్యక్తమై వారికి యుద్ధ మన్న నిష్టము లేకున్నను యుద్ధమునకు రాకున్నను దన కిబ్బంది లే దని స్పష్టము చేయుట గమనింపవచ్చును. యుద్ధమున ద్రోణాదులసహాయ మవసరము లే దనుటనే తరువాతి పద్యమును స్పష్టము చేయుచున్నది. ద్రోణాదులు యుద్ధమునకుఁ జేరకున్న 'ధర్మజునియకుంఠిత తేజము' నాపుట యెట్లనుసంశయమున ధృతరాష్ట్రునకు దుర్యోధనుఁడు సమాధాన మీవలసియున్నది. అందుకయి 'రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవక్రోధజ్వాలల నార్చ నోం డొకఁడు నాకుం దోడై' (251) యనెను. ఈమాటలో నాత్మప్రాఁడగురాధేయుఁడును నాత్మబంధు వయిన దుస్ససేనుఁడు నుండఁగా నితరబంధుమిత్రులును పెద్దలును నేల యనుటేకాక 'ఒం డొకఁడు నాకుఁ దోడై' యనుటలో ద్రోణాదులతోడు నపేక్షింపకుండుటయే విస్పష్టము చేయఁబడినది. రాధేయుఁడు దుస్ససేనుఁడు నుండఁగా పాండవులతేజ మెల్ల నార్పఁబడుఁ గావున ధర్మజుని దకుంఠితతేజ మని వారితో సంధిచేసికొన వలసినయవసరము లే దని సిద్ధాంతమును "నీ వింక నన్ బాధం బెట్టకు వాఁడిసూదిమొన మోపంజాలునం తైన

నే నీధాత్రీతల మీఁను వారలకు నా కే లింత సేగింబడన్". అని సారాంశమును జెప్పి మిన్నకుండెను. కాఁగా నిట్టిసందర్భము ననుసరించి 'వారలంగొనియే' యనుచో నేశబ్దము వజ్ఝలవారు పేర్కొన్నట్లుగా నవధారణార్థకము గానేర దనియు నింకఁ బేటకావ్యాఖ్య పేర్కొన్నట్లుగా (వ్యతిరేకవ్యంజక) ప్రశ్నార్థకమే యనియు నిశ్చయింపవలయును గదా.

తిమ్మకవియభిప్రాయము ననుసరించి వారలం గొని యేఁ జక్కం బెట్టువాఁడనే యని యన్వయము. దీనికంటె కొనియే? చక్కంబెట్టు వాఁడ నేన్ అను పైయన్వయమె యర్థవంత మనవచ్చును. వారలం గొని నేను జక్కంబెట్టువాఁడనా? అనుచో (జక్కంబెట్టలే ననియు నర్థ మగు నవకాశము స్పష్టము. కొనియే? నేను జక్కంబెట్టువాఁడ నను టలోఁ బాండవులఁ జక్కఁబెట్టుట యన్నది నిశ్చయ మయి 'వారలం గొనియే' యన్నప్రశ్నము వారలఁగొని కా దని ధృతరాష్ట్రు నభిప్రాయమును తిరస్కరింపఁ గల్గుచున్నది. కాఁగా 'వాఁడనే' యను చోటియేకారముకంటె 'వారలం గొనియే' యన్నప్పటియేకారమె (వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థక మయినదగా) అర్థవిశేషమునదిగా గుర్తించుట యుచితము.

కాఁగా కొనియే? చక్కఁబెట్టువాఁడ నే ననురీతియన్వయము యుక్తము గావునఁ దదనుగుణముగా నిట ద్రుతప్రకృతికముపైఁ బరుష మట్లే యుండి ద్రుతము లోపించుప్రసక్తిలే దనవచ్చును. ఈ పాఠమునం దున్నరెం డేకారములందు నొకటి యస్మచ్ఛబ్దప్రథమైక వచనాంతరూపమును వేఱొకటి యర్థవిశేషమునం దయినదియు నని చెప్పవలె. అట్టియెడలఁ బాదాదియందలియేకారమే యర్థవిశేషమునం దయిన దనుట సందర్భానుగుణము గావునఁ బైరీతిని గ్రహింపఁగా నిది ప్రస్తుతస్థలమునకు లక్ష్యము కాదు.

గు. ప్ర. వ్యాఖ్యాత 'కొనియే చక్కం బెట్టువాఁడ నే పాండవులన్' అను పాఠమునందు వాఁడను ఏ అనుచోట నున్నది యస్మదర్థకము కా దనియు నవ్యాది కాకుస్వరమే యనియుఁ జెప్పె. అట్లే యుటఁ బాదాది నున్న ఏకారము సైతమస్మదర్థకము కాని కాకుస్వరము గాని కా దనియు నవ్యాది యేవార్థక మగు నవ్యయ మనియు భావించెను. (59)

చతుర్థపాదమున మొదటియేకార మవధారణార్థక మనియుఁ దరువాతిది కాకు స్వరమనియుఁ జెప్పుటవలన వివక్షితార్థము సిద్ధించుట యనుమానాస్పద మై యున్నది. గు. ప్ర. 'చన్న వారులం గొనియే చక్కం బెట్టువాఁడ నా' అను వాక్యంబులోనియభిప్రాయము నిశ్చయముగా ద్రోణాదులను గొని సంహరించువాఁడను గా నని యభిప్రాయము. (59) అని యభిప్రాయమును జేర్కొన్నది. కానీ యీ యభిప్రాయము మూలవాక్యముచే సంభవించుట లే దనిపించుచున్నది. 'వారలం గొనియే - చక్కంబెట్టువాఁడనా' అనఁగా వారల సహాయమున మాత్రమే జయింపననియు వారుమాత్రమే కాక ఇతురులును గలరు గావునఁ బాండవులను జక్కఁబెట్టఁగల ననియు నర్థమగుచున్నది. వారలసహాయము లేకయే జయింపఁగల నన్న యంశమే స్పష్టపడవలయు నన్న వారలంగొని యేను బాండవులను జక్కంబెట్టు వాఁడనే -అని చతుర్థపాదాది నున్న 'యే'శబ్దమస్మదర్థక మయి యుండవలయును. అట్టియెడఁ బరుషపరకద్రుతలోపము నంగీకరింపక తప్పదు. వారలంగొని - ఏను పాండవులను జక్కంబెట్టు వాఁడనే యను యన్వయించుటలో సౌలభ్య మధిక మయినమాట యథార్థము. అందుకే తిమ్మకవి దాని నస్మదర్థకముగానే యెంచియుండె నని గ్రహింపవచ్చు.

ఇంక గు. ప్ర అభిప్రాయము ననుసరించిన నాపాఠమునందుఁ బిదప నున్న యేశబ్దము కాకుస్వర మవును గావున చక్కఁబెట్టువాఁడనే పాండవులన్ అని యుండవలసియుండుట స్పష్టము. గు.ప్ర. అట్లు చూపియున్నది. కవిజనసంజీవిన్యాదులీపాఠమునే చూపియు నున్నవి. కాని ముద్రితభారతములందుఁ జక్కంబెట్టువాఁడనేఁ బాండవుఁన్ అని ముద్రితకావ్యములు గాన నగుచున్నవి. భారతసంశోధితముద్రణము నీ పాఠముమాత్రమే యిచ్చినది. వఝలవారు నీపాఠమునే స్వీకరించి యుండుటవలననే కొనియే యేను బాండవులను జక్కంబెట్టువాఁడ నను రీతిగా నన్వయార్థమును సమన్వయించి చూపిరి.

రామన "కాకుసంబోధనాన్వయంబుల మీఁద గనఁదగు నాదేశము వికల్పమనుచు నందుఁ గాకుస్వరముమీఁద వికల్ప మయినందులకీపద్యము నిట్లు చూపియున్నాఁడు. నీ చెప్పిన పెద్దలు ద్రోణాచార్యులు మొదలు గాఁగ నని కొల్లనివారే చనువారలఁ గొని వేయే చక్కంబెట్టువాఁడనే పాండవులన్ ఇందు లక్ష్యస్థాన మేది? అని కొల్లనివారే -అనువారలను చూపినపాఠమునందుఁ దృతీయచరణాది నున్న యేకారము కాకుస్వరము కాదు. అయ్యది యవధారణార్థకమైన యవ్యయము. ద్రోణాదు లని నొల్లనివారనుటలో సందేహాదులు లేవు గదా. మూఁడవపాదము లక్ష్యస్థల మగుచో నవ్యయము మీఁద నాదేశము వికల్ప మగుటచే రాదందులకు లక్ష్యము కాఁగలదు. రామన యంతకుమున్ను చూపిన స్వీయలక్ష్యములోఁ "గూడునె తెలంప" నన్నది కాకుస్వరమునకును, 'కృష్ణ! చరచాగాది' యున్నది సంబోధనమునకు 'నేఁ బరాశ్రితుఁడ' ననుచో నవ్యయమునకును లక్షణమున కనుగుణమైనక్రమములో నుదాహృతులు చూపెను. ప్రాచీనుల లక్ష్యములను జూపుతరువాతి స్థలమునందు నీ క్రమము ననుసరించియే యుండెను. కాఁగా నేను+పరాశ్రితుఁడ నన్నది యెట్లవ్యయముపై నాదేశాభావమునకు లక్ష్యమైనదో యట్లే "ఒల్లనివారే

చనువారల" నన్న ప్రస్తుతస్థలమును నన్వయమునపై నాదేశము లేనం దుల కుదాహరించుచున్నాఁడు. (మొదటిపాదములందలి ప్రాసమును లక్ష్యస్థలము గాకుండుటం జేసియు నాల్గవపాదమునఁ బ్రాసస్థలమే లక్ష్యస్థానము నని గుర్తింపఁదగియున్నది. అనఁగా ఏ చక్కం బెట్టు వాఁడ ననుచో నున్న యేకారము కాకుస్వరమే కాని యవధారణార్థకము గా దనవలె. అయ్యది యవధారణార్థక మగుచో నన్వయమె యయి యుండుటఁ గాకు స్వరమునకు లక్ష్యమే లేకుండఁబోవును గదా. స్వీయపద్యములోఁ గూడు నె తలంప ననునది కాకుస్వరమునకు లక్ష్య మయినతీరుగా నిట 'వేయే' అనుచో నేకారము కాకు స్వరమనవలయు. కాని యట్టియెడల నిష్పద్యమున కన్వయ మెట్లు? వాఁడనే పాండవులన్ అనుచో ద్రుతకార్యములు లేమి నదియుఁ గాకు స్వరమె యనవలె. పాదాదియందలి యేశబ్ద మవధారకమనియు 'వాఁడనే' అనుచోటియే శబ్దమే కాకుస్వరమనియుఁ జెప్పుచో నిది కొంత వఱకే నన్వయింపఁగలదు. చనువారలం గొని వే యేను జక్కంబెట్టు వాఁడనే? యనురీతిగాఁ గుదురును. కాన మిగిలినలక్ష్యములుఁ బ్రాసస్థలమునందుఁ జూపి ననుట విశ్వసింపనచ్చునా?

రెండుచోట్లఁ గాకుస్వరమే యున్న వేయేచక్కంబెట్టువాఁడనే అనుచో మొదటియే శబ్దము కాకుస్వరముగా నన్వయించుట లే దనక తప్పదు. అనినోల్లని వారే చనువారలం గొని, వే యే అనుచో నే యను కాకుస్వరమున కర్థమేమి? చతుర్థపాదము లక్ష్య స్థలము గా దన్నపుడు పై రీతిగా మొదటియేశబ్ద మవధారక మనియుఁ దరువాతిది కాకుస్వర మనియుఁ జెప్పవచ్చును. అపుడు పరుష పరద్రుతలోపమున కీయది లక్ష్యమై 'తిమ్మన' లక్షణమున కనుగుణమై యుండఁగలదు. కాని మఱి లక్ష్య మేది? మూఁడవపాదస్థలమ ననది కొల్లనివారే' యనుచోటి యేకారమును గాకువుగాఁ జెప్పుటకు వీలులేదు. ఇఁకఁ జతుర్థపాదాదియందలి యేకారము కాకు వయి లక్ష్య మగుచుఁ బద్యము

సరిగా నన్వయింపవలె నన్న 'నని కొల్లనివారై చేరనివారలం గొనియే యను ముద్రితగ్రంథములందలిపాఠము ప్రమాణీకరింపవలసియున్న దనక తప్పదు. ముద్రితభారతములకు భిన్నముగా నున్న, రామన చూపిన పాఠముతో నీపద్యము సరిగా నన్వయింప దని నిర్ణయింపక తప్పదు.

తిమ్మకవి 'అని కొల్లనివారై చన్నవారలం గొనయే చక్కం బెట్టువాఁడనే పాండవులన్' అని చూపెను. ఇతఁడు చతుర్థపాదాది నున్నయేశబ్ద మస్మదర్థకమనియుఁ బ్రథమాంత మవుటచే సరళాదేశము కల్గలే దనియుఁ జెప్పియుండుటనుబట్టి 'ఏను జక్కంబెట్టువాఁడనే' యనుచోఁ జివరియేకారము కాకుస్వర మయి (పాండవులన్ అనుచో సరళాదేశము లేకుండుటయు) పద్య మట నుచితముగనే యన్వయింపఁ గలదు. 'అని కొల్లనివారై చన్నవారలం గొని' యనుచోఁ జన్న వార లనుదాని కర్థ మేమి? 'చన్నవారలన్ వెళ్ళినవారిని' అని గు. ప్ర. అర్థము చేసియున్న దనవచ్చును, వెళ్ళినవా రన నెటకు వెళ్లిన వారు? అని 'కొల్లనివారై పోయినవారు' ఒల్లనివారైనవారు ఒల్లని వారు. అని యర్థమా? దీనికంటెను ఒల్లనివారై, చేరనివారిం గొనియే?' యనుముద్రితభారతములందలి పాఠమే సముచితముగా నన్వ యించుచున్న దనుట స్పష్టము. ఇంకను నియ్యది ఉద్యో. 2-246 పద్యమునందలిధృతరాష్ట్రవచనములను విమర్శించునది. ద్రోణాగు లని నొల్ల రనియుఁ బోరికిం జొర రనియుఁ జెప్పినధృతరాష్ట్రునభి ప్రాయమును బరామర్శించుచు 'చేరనివారు' అనికి ఒల్లనివారై, అనికిఁ జేరవార లు యనురీతిగా సక్రమముగా నయితము పేర్కొనఁ బడి సముచిత మవును. కావున ముద్రితప్రతులందలిపాఠమే సమంజస మయి గ్రాహ్య మయి యున్న దనియు రామనచూపినపద్యము లల్లక్షణానుగుణముగా సరిగా నను న్వయింపకుండఁగాఁ దిమ్మనచూపి నదియు నంతగా సక్రమముగా లే దనియు నిశ్చయింపవచ్చును.

ముద్రితభారతప్రతిలో (సంశోధితముద్రణమునను) దీనికిఁ బాఠాంతరము చూపఁబడకుంటయు గమనార్హ మయియున్నది. ఇప్పాఠము ననుసరించి రామనలక్షణమునకు నిది లక్ష్యమే యవుచున్నది. కొనియే? చక్కఁబెట్టువాఁడ నేన్ అని గాకుస్వరముపై సాదేశము లేకుండుటకు రామనలక్షణమునకు లక్ష్య మవును. కొనియే చ(జ)క్కఁబెట్టువాఁడనే యని తిమ్మకవిలక్షణమునకును లక్ష్యము కాఁగలదు గాని 'వాఁడనే పాండవులన్' అని తరువాతియేకారము తిమ్మనపక్షమునఁ గాకుస్వరము గావలసియున్నది.

మొత్తముమీఁద కొనియే? చక్కఁబెట్టువాఁడ నేఁ బాండవుల ననుపాఠ మొసముచిత మని నిర్ణయింపఁగా నందుఁ జతుర్థపాదాది నున్న యేకారము కాకుస్వరమే యవుచున్నది. ఇట్టిది కాకుస్వర మగుటకు గు. ప్ర. యొక్క యభ్యంతరముగా జేర్కొన్నది.

"అకారంబునకుంబోలె ఏకారంబునకుఁ గాకుస్వరార్థ మున్నను వాక్యాంతమందలియేకారంబునకే కాకుస్వరార్థము ప్రయోగంబుఁ గానంబడుచున్నది. కాని వాక్యమధ్యంబున నట్టి యర్థంబు రానేరదు. వాక్యమధ్యంబున నేవకారార్థ మైనయవధారణంబే తోఁచుచుండును. (59) అని పేర్కొనుటలో నావ్యాఖ్యలోకవ్యవహారమునే యాశ్రయించె నేమో యనిపించుచున్నది. (తరువాతివివరణమువలనను.)

ఏ మైనను పై వివరణము ననుసరించి యేకారమునకువలె నాకారమునకును గాకుస్వరముసర్థము గలదు. అది కాకుస్వర మన్నమాట. అయిన ఏకారము వాక్యాంతమునందే కాకువుగా నున్న దనుటచే నాకారము వాక్యమధ్యమున నైనను గాకువుగాఁ బ్రయోగింపఁబడుట గలదనుట స్పష్టము ఏకారమున కట్టిప్రయోగము లే దని యభిప్రాయము. 'వాఁడనే' అనుచోటిది యస్మదర్థక మని చెప్పిన వ్యాఖ్యల

వారు పాదాది నున్న యేశబ్ద మవధారణార్థక మని చెప్పుటలోఁ గు. ప్ర. ప్రభావము కొంతేని గల దేమో యనిపించుచున్నది.

అయ్యుఁ 'గొనియే' యనుచోటియేకారము ప్రశ్నార్థక మగుట లోనే యర్థసంపత్తి యధిక మయియుండుటచే న ట్లంగీకరించుటయే యుచితము. అయ్యది యవధారణార్థకమే యగుచో వివక్షితార్థము సిద్ధింపమింజేసి యుష్మదర్థకమే యనుతిమ్మనమార్గము నే సంగీకరింపవలసి యున్నది.

పేటికావ్యాఖ్య 'కొనియే చక్కంబెట్టువాఁడనే పాండవుల ననుచోఁ గొనియే యనుచోటియేకారమును బ్రశ్నార్థకముగా ననఁగాఁ గాకుస్వరముగనే పేర్కొనెను. కాని 'వాఁడనే' యనుచోటియేకారము నయితము ప్రశ్నార్థకమే యనియు రెండుప్రశ్నార్థకములచేత ద్రోణాదుల సహాయము లేకయె గెల్తు ననునర్థము దృఢముగాఁ జెప్పుచున్నట్లు పేర్కొనుట (69) విశేషము. రెండుచోట్లను గాకుస్వరమె యనియుఁ (నది ప్రశ్నార్థక మనియు) జెప్పుట యుచితముగాఁ గానరాకున్నది. 'చక్కంబెట్టువాఁడనే' యనుచోటియేకారము ప్రశ్నార్థకమైనచో నయ్యది పాండవులను జక్కంబెట్టువాఁడను గా ననియు నింకఁ జక్కఁబెట్ట లే ననియు నర్థము నిచ్చుచున్న దనవలసియున్నది. 'వారలం గొనియే' యనుచోట నేకారము ప్రశ్నార్థక మవుటవలన నిట నీ రెండవప్రశ్నార్థక మిట్టియభిప్రాయము నీయఁజాల దనలేము. నిజమున కేయొక్కచోట నేని గాకుస్వర మున్నను వివక్షిత మగునర్థము సిద్ధించును. రెండుచోట్లఁ గాకుస్వర మున్న నయ్యర్థము స్పష్టముగా సిద్ధింపఁజాల దనియేఁ జెప్పఁదగియున్నది.

తిమ్మకవి 'వాఁడనే పాండవులన్' అనుచో సరళాదేశమును జూపకుండుట ననుసరించి పేటిక యదియుఁ గాకుస్వరమె యని సమన్వయించె ననుట స్పష్టమె. రామున చూపిన యిప్పద్యములోను నిట

సరళాదేశము లేదు గదా. తిమ్మకవిలక్షణము ననుసరించిన నిట సరళాదేశ ముండుటకు వీలు లేదు గూడ. 'ఏ చక్కం బెట్టువాఁడనే పాండవులన్' అనుచోఁ దిమ్మన మొదటియేకార మస్మదర్థకముగా సమన్వయించుచుండెను గావున 'వాఁడనే' యనుచోట నేకారము నస్మదర్థకమనుటకు వీలు లేదు. కాఁగా నది కాకుస్వర మనక తీరదు. అయిన దానిపై సరళాదేశ మసంభవము గదా. ఇంకను దిమ్మకవి చూచిన భారతప్రతిలోఁ బద్యపాఠ మారీతిగా నుండుటచేతనే చతుర్థపాదాది నున్నయేశబ్దము నస్మదర్థకముగా భావించె నట్లు గాక నేటిముద్రిత భారతగ్రంథములందువలె కొని, 'యే చక్కం బెట్టువాఁడనేఁ బాండవులన్' అని సరళాదేశమునే చూచియున్న నప్పటిదే యస్మదర్థకముగా గుర్తించి మొదటియేకారమును గాకుస్వరముగా సమన్వయించిన (నేదో యొకటి కాకుస్వరముగాక యెట్లును దప్పదు). నాలక్షణమునకిటఁ బ్రసక్తియే యుండదు. అస్మదాత్మార్థకములపై సరళాదేశమును జెప్పి యూరకొనెడివాఁడె. కాఁగాఁ దిమ్మకవ్యాదులపాఠము ననుసరించియే పేటిక 'వాఁడనే పాండవులన్' అనుపాఠమును జూపె ననఁదగు.

అట్టియెడల వజ్ఝలవారు 'పేటికాపంక్తులనుద్ధరించునపుడు 'వాఁడనేఁ బాండవులన్' అని సరళాదేశముతోఁ జూపుట (వ్యా.సం.స. 274) రెండుచోట్లను గాకుస్వరమె యన్న పేటికాసమన్వయమునకు విరుద్ధ మని గుర్తింపవలసియున్నది. తిమ్మకవిపాఠము నుద్ధరించునపుడు వజ్ఝలవారును 'వాఁడనే పాండవులన్' అని పరుషముతోనే చూపిరి. కాని వారీపాఠమును జూపియు నిచట వారలంగొనియే యేను బాండవులను జక్కంబెట్టువాఁడ (271) నను రీతిగా నస్మదర్థమును జెప్పుచు వాఁడనే' అనుచోటిది యస్మదర్థకముగా సమన్వయించుట సరి గాదనక తప్పదు. గు. ప్ర. ప్రస్తావించినప్పటికీ నీ సరళాదేశాభావమును వజ్ఝలవారు పట్టించుకొనకుండఁగనే 'వాఁడనే పాండవులను' ననుపాఠ

మును జూపుచు వివరణము చేయుటలో 'వాఁడనేఁ బాండవుల' నను పాదమును స్ఫురింపఁజేయుట యెట్లు సమన్వయించును?

వారలం గొని యేఁ బాండవులను జక్కఁ బెట్టువాఁడనే యన్న యన్వయమును దిమ్మకవి యుద్దేశించె ననుట స్పష్టము. ద్రోణాదులను గొని నేను బాండవులను జక్కంబెట్టువాఁడనా? అనుటలో వారిం గొని నచోఁ బాండవులను జక్కఁబెట్టలే ననియు నర్థ మగుచున్నది. పాండవులచేత జయింపఁబడుటకు ద్రోణాదులు కారణము గాఁగల రనియు నర్థము లభించుచున్నది. నిజమున కట్లే పిదప జరుగవచ్చును. దానిం దృష్టియం దిడుకొనియే యిట్లు సూచనాప్రాయముగాఁ జెప్పఁబడుటయు నొప్పునన్న పక్షమునఁ దిమ్మన చూపినపాఠము స్వీకరించి యన్వదర్థకమునయి సరళాదేశము లే దని చెప్పవచ్చు. కానీ యాపిదప రాధేయుండును దుస్ససేనుఁడును ప్రాప్తైయున్నఁ జాలుననుటయే కాక యొండొక్కఁడు నాకుఁదో డక్కర లే ననుటం బట్టి ద్రోణాదులం గొనుట యనభీప్సిత మనియు వారిసహాయము లేకయే యేను పాండవులను జక్కఁ బెట్టుదు ననియు దుర్యోధనునభిప్రాయ మెన్నఁదగును. పాండవులను జక్కఁబెట్టెద ననుటతోఁ పాటు ద్రోణాదుల సాయము నక్కర లే దనుటయు నిశ్చయముగాఁ జెప్పుట యుద్దిష్ట మైయుండుట స్పష్టము. అట్టియెడ వారలం గొని, నేను బాండవులను జక్కఁ బెట్టువాఁడనే యను తిమ్మకవి చూపినపాఠము భావమునకుం జెడు. వారిం గొనియే? యేను బాండవులను జక్కంబెట్టువాఁడ? ననునర్థముతో వాఁడ నేఁ బాండవులన్ అనుపాఠమె సముచితముగా నున్నట్లు గుర్తింపవచ్చును.

అయినఁ దిమ్మకవి చూచినభారతముప్రతియందు 'వాఁడనే పాండవులన్' అనుపాఠమే గల దని యంగీకరించినను బాధ లేదు. వాడనే పాండవులన్ వాఁడ నేఁ బాండవులన్ అనువానికి సామ్య మెక్కువ గదా. పైఁగా ద్రుతప్రకృతముపై సరళాదేశము లేకుంటయు

నింకను గసడదవాదేశమే యుండుటయు ప్రాఁతప్రతులలోఁ గాన వచ్చుట స్పష్టమే. కాన వావిల నేఁ బాండవులన్ అనుముద్రిత భారతములయందలి పాఠమును ప్రమాణీకరించుట యొప్పును. ఇదియే ప్రకరణోచితము నయియుండుట యిందులకుఁ బ్రత్యేకాధార మనఁ దగును. పాఠాంతరము వ్రాఁతప్రతులందుఁ జూపఁబడకుండుటయు గమనార్హము.

'వాఁడను' అను సన్నద్విశేషణస్థలము ననుసరించి యస్మదర్థకము ప్రయోగింపకున్నను బాధ లేదను. సు. ప్ర. అభిప్రాయ ముచితమే. అచ్చటియేకారము కాకుస్వర మని యెంచు సు.ప్ర. అట్లు భావించుట యవసరము నచ్చును. అయ్యును నిట్టియెడల నస్మదర్థక ప్రయోగ మనవసర మైన నగు నేమో కాని దుష్టము గాదు గావున బాధ లేదు. ఉత్తమపురుషక్రియాపదప్రయోగాదిసందర్భములం దును నస్మదర్థకశబ్దప్రయోగ ముండుట ప్రసిద్ధమే కదా. కాఁగా వాఁడను వను అనురీతిగా నస్మదర్థము ప్రయుక్త మవుటలో నష్టము లేదని గుర్తింపఁదగును. అర్థగౌరవము ననుసరించి 'కొనిపోయె' యనుచోట వాక్యమధ్యమునను నేకారము కాకు వవుట యంగీకరింపఁదగు. అయ్యది లక్షణవిరుద్ధ మగుట కెట్టిప్రమాణమును లేదు గదా. ఇట్లు వాక్యమధ్యమునఁ గాకుస్వరప్రయోగ మెచ్చటను లేనిమాట యథార్థమే యగుచో (కవిప్రయోగము లెల్లఁ బరిశీలించియే సు.ప్ర. నిర్ణయించె ననలేము గదా.) నిటఁ దిక్కన వాక్య నిర్మాణమునం దిదియు నొకప్రత్యేకత యని గుర్తింపఁదగు.

కాఁగాఁ దిమ్మకవిపాఠము నంగీకరించి పరుషపరకత్వమున నస్మదర్థకమునందలిద్రుతము లోపించిన దనుటకంటెఁ గూడ ముద్రిత భారతము ననుసరించి యిటఁ బాదాదినున్న యేకారము కాకు స్వర

మనియు 'వాఁడ నేఁ బొందవుల' ననునదే సరియైనపాఠ మనియు నిశ్చయింపఁ దగు నని సారాంశము. కాని పరుషపరక ద్రుతలోపమునకు కిది లక్ష్యము గానేరదు.

'కాన తగం బొందుట' యన్నది యింకొకలక్ష్యము. ధృతరాష్ట్రిం డను బుత్రులఁ జనము గుంతిసుదనుల్ సింహముల్, మఱి నూహింప నసింహ మైనవనమున్ మర్దింతు రెందున్ వనావృతవృత్తంబులు గానిసింహములకున్ వేగంబ చేటొందుఁ గా, నతగం బొందుట కార్య మీయుభయము న్నంతుష్టిమై నుర్వికిన్ (ఉద్యో 1. 358) ఇందలి కానశబ్ద మవ్యయ మగుటచే నాదేశము (గసడదవాదేశము) పాక్షికము గాన రాలే దని తిమ్మకవి యుదాహరించెను. (వ్యా. సం. స. 270) కాని కాన శబ్దముపై గసడదవాదేశ ముండుట కన లదికళయా? ద్రుతప్రకృతిక మై యున్నది. ద్రుతప్రకృతిక మన్నపక్షమునఁ బైపరుషమునకు సరళాదేశము రాకుండుటయు నా ద్రుతము లోపించుటయు జరిగినట్లు గుర్తింపవలసియుండును.

దీనిఁగూర్చి గుఱ్ఱం చేసిన సుదీర్ఘప్రసంగ మునుబంజన మని సముచితముగా నిర్ణయించుచు (వ్యా. సం. స. 270 వ్యాఖ్యాతలు దీని నిట్లు సమర్థించిరి. కాన్ = కాన = కాఁగానే అనుచ్ఛేదము చొప్పున కాన శబ్దము కళ యనఁదగును కావునన్ అను హానిసంక్షేపరూపము 'కానన్' అని కావచ్చు ననుతలంపున నర్వాచీనకవులు ద్రుతప్రకృతికముగా సైతము ప్రయోగించిరి భారతాది ప్రాచీనగ్రంథములలో కాన అనునది కళగానే ప్రయుక్తమైయున్నది. (వ్యా. సం. స. 90) అని వివరించి యీప్రయోగమును ఇచ్చిరి. అర్వాచీనకవులు ద్రుతప్రకృతికముగా సైతము ప్రయోగించి రనఁగా వారును గళగాఁ బ్రయోగించిరనియు నింకఁ దరువాతివాక్యముఁబట్టి భారతాది ప్రాచీన గ్రంథములలో నిది ద్రుతప్రకృతికముగాఁ బ్రయుక్తము గాలే దనియు

వర్థ మగుచున్నది. కానశబ్దమును ద్రుతాంతముగనే పేర్కొనుచు సూ.ని. 'కాని భారతమునందలియొకానొక నిర్ధారక ప్రయోగములో కళగాఁ గాన్పించుచున్న దని చెప్పి 'కానలిగన్' అను ప్రస్తుతస్థలమునే చూపినది. ఇది ద్రుతాంత మనుటకుఁ బ్రాచీన ప్రయోగము లేవియు సూ. ని చూపకుంటయు గమనార్హమె. కాఁగాఁ బై సూ.ని. వివరణము ననుసరించి యాధునిక ప్రయోగములం దీశబ్దము కళగాఁ బ్రయుక్తము గాలే దనియుఁ గేవలము ద్రుతప్రకృతికముగానే యున్న దనియు స్పష్ట మగుచున్నది. ప్రాచీనులు కళగానే ప్రయోగింపఁ దరువాతి వారు ద్రుతప్రకృతికముగాఁ జేసిరనియుఁ బైకల్పిక ద్రుతప్రకృతిక మనవలయునా ?

కాని వజ్ఝలవారివివరణము ననుసరించి యట్లు నిర్ణయింప నవకాశము లేదు. కానన్ అను ద్రుతప్రకృతికరూపము 'కావునన్' అను నవ్యయమునకు సంక్షిప్తరూపము (అనఁగా నీకావునన్ అనుచోటి వువర్ణము లోపించియుండును) 'కాన' అనుకళ యెట్లన అగుధాతువు నుత్యంతరూప మగుకాన్- అనుదానిపై 'అ' అనునవ్యయము చేరి 'కాన' అని యైన దని వారివివరణమునభిప్రాయము. అందులకే కాన్ అ=కాన=కాఁగానే అనురీతిగా వివరము చేసియుండి రనియు గుర్తింపవచ్చును. కాఁగా ద్రుతప్రకృతిక మగు 'కానన్' అనునది యఖండశబ్దము కాఁగాఁ గళయైన కాన - యనునది రెండు శబ్దములకలయికచే నేర్పడిన దని స్పష్టము. వజ్ఝలవారును స్పష్టముగా కాన్ అ- అనుచ్ఛేదము గలశబ్దద్వయము జంటపదని (వ్యా.సం.స. 270) పేర్కొని యున్నారు. వానియుత్పత్తి ననుసరించి కానన్ కాన- అనుశబ్దములు పరస్పరము సంబంధము లేనివి. రెండును వేర్వేరుశబ్దములు. కావునఁ బ్రాచీనులు కళగాఁ బ్రయోగించినదానినే యాధునికులు ద్రుతప్రకృతికముగాఁ బ్రయోగించి రనుట సంగతము గాఁజాలదు. (అట్లే చెప్పవలసిన నవ్యయ మగునకారము ద్రుతాంతము కావలసియుండును)

కాన్ శబ్దముపై 'అ'అనునవ్యయమును జేర్చియే యాధునికులును ప్రయోగించునెడల నయ్యది కళ కాక తప్పదు గదా. రెండును భిన్నములైనపు డొకశబ్దము కళయు ద్రుతప్రకృతికము నగుట యుపపత్తియే లేదు.

కాఁగా వజ్ఝలవారు "ఒక్కశబ్దమె కళయు ద్రుతప్రకృతికము నగుట యసంభవము కాదు" (వ్యా. సం. స. 304) అని పేర్కొని యీకానశబ్ద మట్టిదిగాఁ జెప్పుట సరిగా దనియు, కానన్-కాన శబ్దములు విభిన్నము లవుటచే నొకశబ్దము కళయే కాక ద్రుతప్రకృతికము నవుట యసంభవమే యనియుఁ జెప్పఁబడియున్నది. (అదిగో అనుదానిస్థలమునను నిట్లే పాక్షికద్రుతప్రకృతికత్వప్రసంగము సరిగా దని స్పష్ట మగును.)

ఇట్లు వీరి వివరణము ననుసరించి కాన - కానన్ అనుశబ్దములు రెండును విభిన్నము లనవలసియున్నది. కాని యవి యట్టివే యగునా యన్నదియుఁ బరిశీలనార్హము - ఇవి యెట్లేర్పడిన వన్నను కానన్ - కాన అనుశబ్దములు రెండును సమానార్థకములై యున్న యంశము స్పష్టము. కానన్ అనునది కావునన్ అనుదానిసంక్షేప రూపముగాఁ జెప్పఁబడుచుండుటచేత 'కానన్' - అనుదానికి 'కావునన్' అనునర్థ ముండుట సక్రమమే యవుచున్నది. 'కాన' - అనుశబ్దము 'కాన్+అ' అనునవ్యయశబ్దముకూడికచే నేర్పడినదైనపు డది 'కావున' అని యర్థ మిచ్చుట యెట్లు? కాన్+అ=కాన=కాఁగానే-కావుననే (270) అని వీరు చూపిరి. 'కాన్+అ=కాన=కాఁగానే' అనురీతిగాఁ జెప్పఁబడుట కర్థము సక్రమ మయియున్నది. కాని కాఁగానే యనుదానికి 'కావుననే' యని యెట్టర్థము సిద్ధించినది? 'కావుననే' యనునర్థమునఁ గాఁగానే యనునది యెచ్చట నేని గలదా? ఇట మాత్ర మట్టియర్థ మెట్లు లభించినది?

కాన్+అ - అనుదానికిఁ జివరకుఁ గావునన్+ఏ- అనియర్థము సిద్ధమైనది. కాన అనుచో నకారమువలెనె కావుననే యనుచో నేకార మవధారణార్థకము. కావున విశేషార్థకము లగునాయవ్యయముల నావలఁ బెట్టిన. కాన్ - అను దానికిఁ 'గావున' అను నర్థము గల దనవలె. కాను-కాన్ అనువానికిఁ గావున యని యర్థము మున్నట్లిచ్చుటను గానరాదు.

కాన-అనుదానినిష్పత్తిని బైకీతిగానే నిరూపించి వీరింతకుముం దర్వాచీనులు కావునన్ అనుదాని సంక్షేపరూపముగా నెంచి కానన్ అని ద్రుతాంతముగా సైతము ప్రయోగించి రని (90) చెప్పిరి. వీరింతవఱకు ననుసరించినప్రణాళిక ననుసరించి కాన-కానన్ - అను శబ్దములు రెండును సమానార్థకములు గావలసియున్నవి. కాని వీ రిట కాన-కా(వు)ననే యని కా(వు)న శబ్దముపైఁ గూడ నవధారణార్థకమును బ్రయోగించుట విశేషము

నఞ్యంత మగు నగుధాతువురూప మగు కాను శబ్దముపై 'అ' అనునవ్యయము (వీరుచేసినయర్థము 'ఏ'-అనుదాని ననుసరించి యది యవధారణార్థకమై యయి యున్నది.) చేరుటచే నేర్పడిన 'కాన' శబ్దము కా(వు)నన్ లేదా కా(వు)ననే యని యర్థ మిచ్చుట కవకాశము లే దని స్పష్టము. కాను, కాఁగా, కాఁగానే అనురీతివానికి కావునన్ లేదా కావుననే యనురీతియర్థము లేకుండుటయు నిట గుర్తింపఁ దగియున్నది.

అంతే గాక ప్రాచీనకవు లెల్లరు కావున (కావుననే?) అను రీతియర్థమునకయి కాన్+అ=కాన - అనుశబ్దద్వయమును గూర్చి (నియతముగ ?) ప్రయోగింపఁగా నాధునికు లాశబ్దమునే విడచి 'కావునన్' అనుదాని సంక్షేపరూప మగునింకొకశబ్దమును మాత్రమే

ప్రయోగించి రనుటయు సముచితముగా సమన్వయింపఁబడునది కాదనియుఁ జెప్పక తప్పదు.

ప్రస్తుతము తిక్కన ప్రయోగమునందు 'కాన్+అ' అనురీతి శబ్దములు రెండు ప్రయోగింపఁబడిన వనుటయు సముచితముగాఁ గానరాదు. కాన అనుదానికి కాఁగానే కావుననే యని యర్థములు చూపిరి కాని యివి రెండును సమానార్థకములుగా వనుట స్పష్టము. కావుననే యనునర్థ మసంభవ మగుటచే నుచిత మగు 'కాఁగానే' యనునర్థము పద్యమున స్వీకరింప సమన్వయింపఁబడకుండుటం జేసియు వజ్ఝలవారు వెంటనే 'కావుననే' యనురీతిగాఁ గూడ నర్థమును జూపిరని తెలియవచ్చును.

నిజము నంతియు. సింహములు లేని వనమును, వనమున సంచరింపని సింహములును జేటుగాను గావున వనమును, (కౌరవులు) సింహములను (కుంతీనందనులు) కలిసియుండవలయు నని స్థూలముగా నభిప్రాయము. కాన తెగం బొందుట యనఁగా 'కాఁగానే' అనురీతిగా నుద్యంత మగునగు ధాతువునవధారణార్థకముతోఁ గూడి ప్రయోగింపఁబడిన దనుటసరికాదు. వజ్ఝలవారికను 'కావుననే' యనుస్థలమునను నవధారణార్థక మగు నేకారమును జేర్చిరి. కావునను తెగం బొందుట యున్కి యని యిట నవధారణార్థమును సందిష్టముగా నిర్ణయింప నవకాశము చాలదు. అనఁగా కాన అనునది కా(వు)నన్ అనునర్థముననే ప్రయుక్తమయిన దనవలసియున్నది.

నిజమునకుఁ గా(వు)నన్ అనునది నయితము అగుధాతుసంబంధియే. చిన్నయసూరి 'లాఁతిచో నహీతము కాదేశాదులు కానంబడియెడి' ననుసూత్రస్థలమున (క్రియా. 102) కానను-కావునను అను రెండింటిని జూపెను. అనఁగా అగుధాతువుపై క్రియా. 41 సూ. చే వృత్తంబగు భావలక్షణార్థమున (చేసర్థ మిట సమన్వయింపదు గదా.) ప్రమతాంత

మగునవర్ణకము కాఁగా అన్+నన్ అని యుండ నీసూత్రముచే 'వగు'నకు కా, కావు ననునాదేశము లగుట నన్నమాట. ఇట్టిప్రక్రియనుబట్టి కానను (కానన్) అనఁగా కావునన్ అనుదానిసంక్షిప్తరూపమనరాదనియు కాదేశమువలనఁ బ్రత్యేకముగా (కావునన్ అనుదానివలెనే) నేర్పడినదనియు గుర్తింపవలసియున్నది. అట్లు వ్యాకరణసిద్ధ మగుటచే నిది ప్రతిపదోక్తి యని కాక లాక్షణికావ్యయముగా గుర్తింపవలసియున్నది. ఈసూత్రమువలనఁ గానను(న్) కావునను(న్) అనునవ్యయములకు వృత్తిఁ బహుభాషాక్షరార్థముగా గ్రహింపవలెనని స్పష్ట మగుచున్నది.

అచ్ఛికపదములందుఁ బదములనడిమియక్షరము లటనట లోపించి రూపాంతము లేర్పడుట గానవచ్చుచునే యున్నది. దీనిని జింతామణి వి. వి. స్పష్టముగాఁ జెప్పియున్నది. కావున 'కావునన్' అనుదానిలో వువర్ణము లోపించి 'కానన్' అని యగుట నట గుర్తింపఁదగు. వ్యవహారవేద్యము లగుటచే దశ్యమునందు కావునన్ కాన ననునవి వేర్వేరు శబ్దములే కాని కావున ననుదానినుండియే కాన ననున దేర్పడిన దని చెప్పనక్కఱయు లేదు.

కాఁగా నిచ్చటనే యొక ప్రాచీనకవిప్రయోగములం దెచ్చట నేని 'కాన' శబ్దము కళఁగాఁ బ్రయుక్త మెనను (అట్టిది గానరాదు.) వజ్ఝలవారు చెప్పినట్లుగా కాన్+అ=కాన శబ్దద్వయము కూడికచే నట్లయిన దని చెప్పరా దని నిర్ణయింపవచ్చును.

కాఁగా నర్వాచీనులు 'కాన' ననురీతిగా ప్రత్యప్రకృతికముగా నేశబ్దమును బ్రయోగించిరో అదియే 'కానతగన్' అనుచోఁ బ్రయుక్త మైన దని గుర్తింపవలసియున్నది. అనఁగా నర్వాచీనకవుల 'కానన్' శబ్దమును 'కాన తగ' ననునిచ్చటి 'కాన' శబ్దమును విభిన్నములు గా వనియు నొక్కటే యనియు గుర్తింపఁదగియున్నది. అ

ట్లయిన నది ద్రుతప్రకృతికము కాఁగా మీఁదిపదరూపము సరళము గావలసియుండఁగా నది యట్లే యుండి ద్రుతము లోపించు టెట్లు?- అంచులకే సూ. ని. కాన శబ్ద మిటఁ గళగాఁ బ్రయుక్త మైనట్లు చెప్పినది. వజ్ఝలవారు నోకేశబ్దము కళయను ద్రుతప్రకృతికమును నవుట యసంభవ మనుట కీపక్షమునందు కాన శబ్దమొక్కటే రెండు తీరులుగా నున్నది కావున నోకేశబ్దము పాక్షికముగా ద్రుతప్రకృతిక మవుట యన్నది గల దన్నమాట.

‘కాన తగన్’ అనుచో గు. ప్ర. వ్యాఖ్య ‘కాన’ అనుశబ్దమును వన మనునర్థముతో సమన్వయించి తనసిద్ధాంతముగాఁ జేర్కొన్నది. కాని యావ్యాఖ్య యిప్పద్యమునకు మూలమును జూపి నిర్ణయింప దొరకొనియుఁ దద్భిన్నముగ సమన్వయించుట సమర్థింపఁదగినది గాదు. తస్మాద్వ్యాఘ్రో వనం రక్షేత్ వనం వ్యాఘ్రం చ పాలయే త్తను మూలము ననుసరించిన కాన తగం బొందుట కార్య మీయుభయము న్సంతుష్టిమై నున్కికిన్’ అనుపద్యభాగమున తస్మా త్తను దాని కనువాదమే ‘కాన’ శబ్ద మనుట స్పష్టము. అట్టియెడల దానికి వన మని యర్థము చేయు టెట్లు? ‘ఈ వనసింహములు రెండును సంతోషముతో నుండుటకై కాన=వనము తగన్ యుక్తముగా పొందుట మేలు అని చెప్పి “ఉభయశబ్దముచేతనే సింహంబుకూడ వనంబుతోఁ గలిసి యుండుట మంచి దన్న యర్థము కరతలామలకముగా స్ఫురించుచున్నది. ...కావున సింహంబులు అధ్యాహార్యంబు లని (44) గు.ప్ర. వివరించినది. కరతలామలకముగా నర్థము స్ఫురించుచుండగా నింక సింహము లనునది యధ్యాహారము చేయు టేల? ఉభయమున్ సంతుష్టిమై నున్కికిన్ తగం బొందుట మేలు’ అని మాత్రమే చెప్పిన కానయును సింహములును బరస్పరము పొందియుండుట యుక్తముగా నర్థము కరతలామలకమే యయి యుండఁగా ‘కాన’నే యేల పేర్కొనవలసివచ్చినది?

ఇంక నొకతీరుగా సింహములు వనము నాశ్రయించియుండు నవి కాని వనమే సింహము నాశ్రయించి యుండుట సహజమా? అట్టి యెడల సింహములే వనముతోఁ బొందుటను వేరొకటయే యుచిత మనఁదగును గదా.

వనసింహములు రెండును సంతుష్టిమై నన్నికయి వనము తగం బొందుట మేలు అని యర్థము చేయుచో సింహములును వనముతోఁ బొందు కలిగి యుండవలె నని యర్థము రానేరదు. ఇంక వనసింహములు రెండును సంతోషముతో నుండుటకయి వనమే సింహములతో బొందియుండవలె ననునర్థము సైత మేర్పడఁగలదు.

ఇట వనము ధృతరాష్ట్రనందను దత్పుత్రులును. సింహములు కుంతీనందనులు. కాఁగాఁ బాండవపక్షపాతముతో శ్రీకృష్ణుఁడు కౌరవులనే పాండవులతో సంధి చేసికొమ్మనుచుండె ననియు, సంధి లేకున్నఁ బాండవులకు నష్టము లేదు గావునఁ గౌరవులకు సంధి యవసరము గలిమి సూచించుటకయి 'కాన తగం బొందుట మేలు' అని (కాన=వనము) చెప్పె ననియు భావించుటకు నవకాశము లేదు. అంతకు ముందు కౌరవపాండవపక్షములను వర్ణించుచో 'ఈరెంటి యందు నరసి యసారం బిది గాఢసారసహితం బిది' యని (357-2 ఉద్యో.) వేరొకచోటలోఁ గ్రమము నరసినఁ (355-కౌరవుల పక్షమును 356-పాండవపక్షమును వర్ణించుటచే మొదటి దగుకౌరవపక్ష మసార మనియుఁ దరువాతి దగుపాండవపక్షము గాఢసారసహిత మనియు) పాండవులపై మొగ్గు వ్యక్త మగును. కాని పిదప 'నీరూపం బయ్యె నేని నీ సేయుటికిన్' అనుచు నిష్పద్యమున నింకను వనమును వర్ణించు రెండున్ అనుటతోపాటు 'వనావృతివృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందు' ననుటనుబట్టి చూడఁగా నిష్ఠలముగఁ బాండ

వులపైఁ బ్రత్యేకముగా నేదో యభిమానమును జూపుట యాతని తలఁపుగా నిర్ణయింపరాదు. కాఁగా నిట కానసే ప్రస్తావించి పొందుటను బేర్కొనుట సముచితముగా సమర్థింపఁబడదు.

నిజమునకు 'కానన్' అనుశబ్దముతోడి యన్వయమె విక్కలిసులు వైన దనుటయు మూలానుసారియు ననుటయు స్పష్టము. వనము వ్యాఘ్రమును, వ్యాఘ్రము వనమును (రక్షింపవలెను.) బొందియుండవలె నని ప్రత్యేకముగాఁ జెప్పఁబడిన యంశమే యిం దుభయమును సంతుష్టిపెం నున్కకిన్' అని సంగ్రహింపఁబడినది. కావున 'కాన' - అను దానికి వన మనురీతి యర్థము సముచితము గాదు. కానన్ అను దానితో వాక్యము సముచితముగ నన్వయించుచునే యుండ నధ్యాహారపు టవసరమును లేదు. లక్షణముతో వైరుధ్యము గల దన్న నయ్యది యటఁ బ్రత్యేకముగాఁ బరిశీలింపఁదగినది. కాని లక్షణవైరుధ్యము గల్గు నని స్వోత్కల్పనము చేసి (యన్వయబాధచే?) అధ్యాహార ప్రసంగము చేయుట సక్రమము కాదు గదా.

'కాన తెగన్' అనుపాఠాంతర మెచ్చటను గానరాదు. అయ్యు వ్యాఖ్యలవ్వానిని బ్రస్తావించినవి అంగీకరింపకుంట యుచితముగా నున్నది. 'కాన తెగన్ వనావృతవృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందు' నని యన్వయించు. వనము నశించినకారణమున వనమునుండి బయల్పడినసింహములకుఁ జేటు గల్గు ననురీతియర్థము చూపిరి. మూలానుగుణము గా దనుకారణముచే నీపక్షమును గు.ప్ర. తిరస్కరించినట్లు తోఁచుచున్నది. నిజమున కెచ్చటను నాధారము లేనియీపాఠమును పూర్వపక్షముగాఁ గల్పించుటయే యనవసరమనుట మొదటియంశము. పైఁగా నిది యర్థవంతమును గాదు. సింహము లాశ్రయింపనివనము నశించు నని చెప్పినప్పుడు వనము నాశ్రయింపని సింహములను నశించు నని చెప్పుట సక్రమ మైయుం

దును. కాన నశించినచో సింహములు గానయుం దుండనవు దని నశించు నను టేల? మొదలే సింహములు వనమునం దున్నవా! ఆవనము రక్షిత మగుం గావున నశించు ప్రశ్నయే లేదు. వనము నశించునట్టి కూరుకొన్న సింహములు వననాశానంతరము వనము నాశ్రయింపఁగోరుటకు ముందు వనావృతవృత్తములు గాకుంట నవి చేటొందవలసియున్నది కాదా? ప్రస్తుతసందర్భమునను ధృతరాష్ట్రాదులు కుంతీనందనులను, పాండవులు కౌరవులను బొందియుండవలె ననుటయే వక్తవ్యాంశము. అంతే కాని వనము తెగఁగా నసఁగా కౌరవులు నశింపఁగా వనావృతవృత్తంబులు గానిసింహములకు నసఁగాఁ గౌరవులకు దూర మైనపాండవులకు కేగంబ చే టొందు ననియా చెప్పవలసిన యంశము. అయ్యది మిక్కిలియుసందర్భమును ననమంజసము నైయున్న దనుట నిర్వివాదము. 'కాన తెగ' అను దానియర్థముతో పాటు గానిస్వారూకమునయితేను నమాజములు గా వని స్పష్టము.

పేటికా వ్యాఖ్య దీనియెడఁ దననిశ్చయ మేమియుఁ జేర్కొన్నట్లు గానరాదు. పక్షాంతరముఁ ప్రస్తావించి విడచెను. అం దొకటి "కొందఱు కాను లేక 'కాన్' అను ప్రకృతి కవధారణార్థక మగు అకారము చేర్పఁగ 'కాన' అనురూపము కల్గు ననియు నది (ఇటఁ 'గాఁబట్టి' యనుశబ్దము ముద్రణమున లోపించియున్న దనవచ్చును). యనునర్థ మిచ్చెడిఁ గాన కాఁబట్టియే యనునర్థము పొసఁగెడి ననియు నందురు" - (70. బా.పా.పే) అనునది.

'కాను లేక కాన్' అని పేర్కొనుటం బట్టి యిది యగుధాతువునకు న్యంతరూప మని యావ్యాఖ్య తలంచిన దేమో యని యనుమానింపవచ్చును. దానికిఁ 'గాఁబట్టి' యనునర్థము లే దనుట విస్పష్టమే. 'అవధారణార్థక' మగు 'అ'కారము చేరఁగా 'కాన' అనునది 'కాఁబట్టియే' అనునర్థము నిచ్చుచున్న దనఁగా కాను లేక కాన్ అనుశబ్ద

ములు కాఁబట్టి యనునర్థ మీయఁక తప్పదు. అందుకయియే బా.సా.పే. పైరీతిఁ జేర్కొనియుండును. కాని ‘కాన్’ (కాను) శబ్దము ‘కాఁబట్టి’ యనునర్థమున లేనేలే దనుట స్పష్టము.

ఇయ్యది యగుధాతువుయొక్క నుబ్యంతరూపము కాకుండ గనే ప్రత్యేక మగునింకొకశబ్ద మని గాని యొకవేళ బా.సా.పే. తలఁచిన నదియును బొసఁగదు. ఇట వ్యాఖ్య స్పష్టముగా నిర్ణయించి చెప్పలేదు. అట్టిశబ్ద మొక టున్నట్లు గానరాదు. పైఁగా ‘కాఁబట్టి’ యనునర్థమునఁ గాన్, కాను అనుశబ్దములు లేనే లేకుండుట స్పష్టమే కావున నీసమర్థనమును సరిగా దని గుర్తింపఁదగు. సూరి దీనిని జేదా ద్యర్థనాంతము గాఁ జూపె ననియు నిట వృత్తం బగుభావలక్షణార్థము గ్రాలవ్య మనియు స్పష్టము.

పైఁగాఁ గాఁబట్టియే యౌదుట యుక్తము అనురీతిగా నిట సవధారణార్థకము ప్రయోగింపవలసినయవసరమును లేదు. అనఁగా నిట్టి యర్థమునకు నవకాశము లేదు గావునను నీసమన్వయ మన్నివిధము లను సరిగా దని స్పష్టము.

పేటికఁ బేర్కొన్నయింకొకయంశము ‘కొంచఱు కావున ననునర్థ మిచ్చుకానయే యైనను ప్రమత్తప్రకృతిక మని సమర్థింప సమర్థము లగుప్రాచీనప్రయోగములు లేమి కళ యనఁదగు ననియుఁ గాన నిట గసడదవాదేశము రామి మాత్రమె విశేష మనియు నం, ద్రు’ (70) అనఁగాఁ బ్రాచీనులు దీనిని గళగాఁ బ్రయోగింపఁగాఁ బిదప నిది ప్రమత్తప్రకృతిక మైన దన్నమాట. వజ్ఝలవా రిట్టియభిప్రాయము నంగీకరింపలేరు. ఇంక వారు భారతమున గసడదవాదేశము నియత మని భావించియుండుట ననుసరించి యిట గసడదవాదేశాభావము విశేషము గాక లక్షణవిరుద్ధ మవుటం జేసియు దీనిని సాధించుటకు మార్గాంతరము నవలంబించి రనవచ్చును. ఏది యే మైనను నొకశబ్దము

కళయు ద్రుత ప్రకృతికము నగుట యసంభవ మనియే వజ్ఝలవారి యిట సిద్ధాంతము. అది యుచితమే.

కావునను ప్రాచీనులు దీనిని కళగాఁ బ్రయోగించిరి గావున సరళాదేశప్రసక్తి లేక (గసడదవాదేశసంబంధిగకారమే కావలె నైన) పోయిన దని సమర్థించుటకు నవకాశము లేకపోయిన దన్నమాట. బహుశః అందుకే వేటికి పక్షాంతరములు ప్రస్తావించి తనయభిప్రాయము చెప్పలే దేమో.

పరుషపరకద్రుతలోపము నంగీకరింపక తప్పనిస్థల మింక నొకటి కలదు అట్టియెడలను వజ్ఝలవారు పాక్షికద్రుతప్రకృతికత్వమును జేర్కొందురు. అది గో కానంబడియె (వరాహ. 6-84) అనుస్థలమున అదిగో అనుశబ్దము కళగాఁ బ్రయుక్త మైనది. ఇది గోఁ బురుషావ్యయము (కళా. 1-35) అనుచో నట్టిదే ద్రుతాంత మయినది. ఇటనే వజ్ఝలవారిట్లు వివరించిరి. 'ఒక్కశబ్దమె కళయు ద్రుతప్రకృతికము నగుట యసంభవము గాదు. శ. ర. ఉదాహరించినట్లు ఇది+కొమ్ము-ఇదిగో అనువ్యుత్పత్తి నరసి కళగా గ్రహించుటయు 'కోను' అను ద్రుతాంతావ్యయము నంగీకరించి 'అదికోన్' అనురీతిని కొనుధాతును క్త్యంతరూపములో వ్యుత్పత్తి నరసి ద్రుతప్రకృతికముగా గ్రహించుటయు విరుద్ధములు కాదనఁదగును. (305-వ్యా.సం.స.) దీనికి నింతకు ముందటికొనశబ్దమును దృష్టాంతముగాఁ జూపిరి. వారివివరణములో నివిరెండును నొకతీరువే యైనవి. కాఁగా అదిగో - అదిగోన్ అను రీతిగా నొకేశబ్దము కళయు ద్రుతప్రకృతికము నగుట లేదు. ద్రుత ప్రకృతికశబ్దము వేఱు. కళాపదము వేఱు. అట్టియుత్పత్తిభేదమును జూపకున్న నొకేశబ్దము కళాద్రుతప్రకృతికములు రెండు నయిన ట్లూహింప నవకాశ ముండును.

వీనిని రెండుతీరులుగఁ జేర్కొన్న సూ. వి. వజ్ఝలవారివలె భిన్నప్రకారములుగ నేర్పడినట్లు చెప్పకుండుట గమనార్హము. ఇం

తేలిన వజ్ఝలవారే యాపిదప 'అన్యే ద్రుతప్రకృతయః' యనుచింతామణి చెప్పునఁ గళాభిన్నత్వము ద్రుతప్రకృతికతాలక్షణ మైయుండఁగా నొక్క-శబ్దమునందే కళాత్వద్రుతప్రకృతికత్వములు తేజస్తిమిరములవలె నెలకొనియుండు ననుట వైయాకరణసిద్ధాంతవిరుద్ధ మనకతీరదు కాన 'ఇదిగోఁ బురుషాహ్వాయము' అనుకవిప్రయోగమునకును బై వైయాకరణసిద్ధాంతమునకును విరోధము లేకుండ ఇది గోన్ అనునవి శబ్దాంతరసంఘటనముచే సిద్ధించిన దని గ్రహింపవలయును. ఇది+కోను-ఇదిగోన్-కాన్-అ-కాన' (870-871 వ్యా. సం. స.) అని వివరించిరి. ఈ మాటలనుబట్టి చూడఁగా నొకేశబ్దము కళయును ద్రుతప్రకృతికము నవు ననుట తేజస్తిమిరములకలయికవలె నసంభవ మనియుఁ గళాశబ్దము వేఱుగాను ద్రుతప్రకృతికశబ్దము వేఱుగను నేర్పడిన వనియు నివిరెండు నొకేశబ్దరూపములు గా వనియుఁ జెప్పిన ట్లయినది. కాఁగా నొకేశబ్దము కళయు ద్రుతప్రకృతికము నగుట యసంభవము కా దని యింతకుముందు పేర్కొన్నతమయభిప్రాయమునే వజ్ఝలవా రిట సముచితముగా ఖండించికొని యున్నా రని గ్రహింపవచ్చును. అట్టి స్థితి ననుసరించుచు నింతకు ముందు పేర్కొన్న అదిగో, ఇదిగో, కాన అనుశబ్దములనే యిటఁ బ్రస్తావించి యా యభిప్రాయమును దిరస్కరించుచు 'ఘుణాక్షరన్యాయమున నిట నేకాకారమునందినను భిన్నశబ్దములే'(871 వ్యా. సం. స.)యని వజ్ఝలవారిచరమసిద్ధాంతము స్వీకరింపఁగా నింక నెచ్చట నేని నొకేశబ్దము కళయు ద్రుతప్రకృతికము రెండు నవుట యసంభవమే యని మనము గ్రహింపవచ్చును.

అట్టియెడఁ 'గానంగన్' అను ప్రయోగ మెట్లన్న ప్రశ్నము నిలిచియున్నది. అట్టిదే యనఁదగిన ఇదిగోఁ బురుషాహ్వాయ మనురీతి ప్రస్తుతస్థలములను గూర్చి బరికింతము. అది+కొమ్ము-అదిగో అని యేర్పడు నని శ. ర. భావించినది. ఇట్లు ఇదిగో-కాని యివి ద్రుతాంతము లైనయవ్యయములుగా శ.ర. స్పష్టము చేసినది. కాని శబ్దరత్నా

కరమే గో అనున దవ్యయముగాఁ జెప్పి అదిగో ఇదిగో అని చూపుటతో వజ్ఝలవారు పేర్కొన్నట్లు పూర్వోత్తరసందర్భ రాహిత్యము విశద మగుచునేయున్నది. (870 వ్యా. సం. స.) అయిన నిట నిర్ణయ మెట్లు? అనఁగా వజ్ఝలవారు "కొమ్ము శబ్దమును దాని రూపాంతర మగు కోశబ్దమును గళ లగుటంజేసి అదిగో - ఇదిగో (ఇట ప్రాస్వాంతములని చూపుట విశేష మనవచ్చును.) మున్నగునవి కళ లనక తీరదు. ఈపదచ్ఛేదము మహాకవిసమ్మతమె యైయున్న దని (వ్యా. సం. స. 870) శ. ర. చేసినవిభాగము సంగీకరించిరి. కాని యిది కళ యనిరి. అట్లీవిభాగము నంగీకరించుచోఁ గళ యని యే నిశ్చయింపఁ దగియున్నది. కాని యావిభాగమున కాధారమేమి? అనఁగా వారు 'మనసు ప్రముచ్చిలి చొచ్చినను త్రిక్రాఁడు వీఁడుగొ మ్మని చేసాఁచి వెలఁది యవుడు' (ఉ హరి. 4-148) ఇందు స్వరపరకత్వమున కొమ్ము అను రూపము నందినను వీఁడుగో అనియే కవ్యభిప్రేతరూప మనియు నది కళయే యనియు నిశ్చయింపవచ్చును వీఁడుగో+అని వీఁడు గొ మ్మని' అని సంధివిధులచే నవును' (870 వ్యా. సం. స) అనిరి. 'న ప్రాణేశః కదాచన' అనుటచే వీఁడుగో+అని వీఁడు గొ మ్మని యని యవు నని యభిప్రాయము. సంధివిధులచే నట్లవు ననుట పరిశీలనార్హ మయ్యె నిట న. పస్తుతము - కాఁగా అచ్చుపరమైనది కాఁబట్టి కొమ్మని అని యున్నదే గాన యట వీఁడుగో - అనియే రూప మనియు దీనింబట్టి అదిగో అనుచోఁ గూడ అది+కొమ్ము అనుకీతివిభాగమే యుచిత మనియు స్పష్టము. వీఁడుగో గుఱ్ఱపుదొంగ (జై. భా. 3.114) వీఁడుగో మరుఁడు (శృం. శా. 2.92) అని యట్టివానిని సూ. ని చూపి నది. వాఁడుగో అనురూప మిూలేదు-కాని యిట్టి'కొమ్మ'ను వజ్ఝలవారదియిదిశబ్దములపైఁ జూపలేదు. అచ్పరకత్వమున నదిగో ననుస్థమున నదిగొ మ్మనురూపమున్నదా? వచ్చిరదిగో నని పౌరులు దల్లడిల్లఁగన్ (ఉ. హ. 3-18) అనుచో సూ. ని. అదిగోన్ అఁ యే స్వరపరకత్వ

మున నుండుటను ప్రదర్శించినది. నిజమునకు వీఁడుగో మ్మనుపట్టిది ఇదిగో అనురీతిదియు ననవచ్చును. కాని వీఁడుగో అనుదానికి వీఁడు గో అనురీతిరూపము లేకుండుటయు(అదిగో నీ-గో ననుచో హ్రస్వాంతములును గలవు గదా.) అదిగో-అనురీతిస్థలములం దది గో మ్మనురీతి గానరాకుండుటయు ననుసరించి వీఁడు గొమ్ము వీఁడుగో-అనునవి ప్రత్యేకములుగానే యెంచఁ దగును. (వీఁడు శబ్దముపై సూచనార్థమునందుఁ గొమ్ము ననుప్రయుక్తము చేసినఁ జేయఁదగు.) - అదిగో ఇదిగో నను రీతివి మాత్రము శ. ర. కర్త పేర్కొన్నట్లు ద్రుతప్రకృతికము లనియే గ్రహింపఁదగును. అది+కొమ్ము - అనురీతి విభాగమును గాక (హ్రస్వము నగు నని) అది, ఇది యనునవి ప్రథమైకవచనాంత రూపములవయి ద్రుతాంతమయి కో శబ్దము చేరు నని శబ్దశాస్త్రము చెప్పుకొనుట యసంగతము గా దనవచ్చును. సూ. ని. కన్నడమున ఇదుగో అదుగో-అనుశబ్దము లుండుటను స్పష్టము చేయుచున్నది. ఇది కొమ్ముశబ్దముతో నేర్పడినది గాక ప్రత్యేకావ్యయము యనవచ్చు.

ఇవి సాధారణముగాఁ గళ లని నిర్ణయించి అదిగో కానంబడియెడి ననురీతి నగు దగురూపములకుఁ ప్రాముఖ్యము నిచ్చుటకంటె ప్రచురప్రయోగములను దృష్టియం దుంచుకొని ద్రుతప్రకృతికములె యనవచ్చును. వజలవారు పేర్కొన్నట్లు సూ. ని. అదిగో ఇదిగో శబ్దములు రెండును గళలుగను ద్రు. ప్ర. లుగను చేర్కొనియున్నది. కాని ఇదిగో శబ్దము నొద్ద ఇదిగోఁ దడవులకు, ఇదిగోఁ బురుషావ్యయము నని ద్రుతప్రకృతికమును చూపినది. ఇదిగోఁ గొమ్మంచు (ఇదిగో వచ్చె దనుచో స్థిరకరద్రుతలోప మనఁదగు.) నని యుదియు ద్రుతాంతముగనే చూపినది. కాఁగా ఇదిగో - ఇదిగో శబ్దములు కళ లనుటకుఁ దగినప్రయోగప్రమాణము లభింపకే దని నిశ్చయింపవచ్చును. అదిగో నిలిపి, అవిగో నిజవుత్రనిసర్గమోహములే, అనురీతి స్థలములు ద్రుతప్రకృతికము లన్నను గళ లన్నను విరోధింపనివి గదా. అదిగో కానఁగఁబడియె అదిగో చూచితి ననురీతి యరుదైన ప్రయోగముల ననుసరించి కళలుగా నిర్ణయింప నేల?

కళలే యని చెప్పినవజ్ఝలవారు ఇదిగోఁ బురుషాహ్వాయ మను రీతివాని సాధనమునకయి ద్రుతప్రకృతిక మగునీశబ్దమును మార్గాంతరమున నిట్లు సాధించిరి. 'ఇది+కొను=ఇది గోన్. ఇది కొన నగును లేక ఇది కొనఁగాక అనునర్థము (నీ చెత్తి బంగారు గాను - బంగారగుఁగాక.) కల్గుపట్టెడు నుఞ్యంత మగు ద్రుతప్రకృతికకొనుధాతు రూపము_త్తరపదముగా నున్న దని యంగీకరింపఁదగును (871. వ్యా సం.స.)

'ఇది గోన్' - అనుచో నుఞ్యంతరూపము కల దనవచ్చును. కాని యట కో యనునాదేశము (మజ్జు పరమగునపుడు బహుళముగా నగు నన్నది.) నిత్యము కాదు గదా కొనన్ - అనియు నుండవు. కోన్ అనుదానిచే వైకృతిక వజ్ఝలవారు పేర్కొన్న యర్థవిశేషము కొనుధాతువు యొక్క ప్రసిద్ధ ఞ్యంతరూపముతో సిద్ధింపకుండుట విశేషమే యనఁదగును. 'ఇదిగోన్' అనునర్థమున ఇదిగొనన్ అట్లే అదిగొనన్ (అదిగోన్) అను రీతిరూపములు లేవు గదా మఱి.

అదిగోన్ - ఇదిగోన్ - అనుచో 'కొను'నకు కో రాఁగా దానికి హ్రస్వము నయి (లేక కొనన్‌లో నవర్ణము లోపించిన దనవలెనా?) అదిగొన్ ఇదిగొన్ అని యవుటయు విశేషమే యనవచ్చును. వల యన నిట్టిస్థితి యీ రెండుస్థలములనే కాని ఞ్యంతమగు కొను ధాతురూపమున కితరస్థలములం దెక్కడను లేదు గదా. (ఒకవేళ వీఁడుగో అనుచోట నయితే మ ట్లంగీకరింపవలసివచ్చినను వీఁడుగో - అనురీతి రూపము కానరాకున్న దారో) కావున హ్రస్వ మిచ్చుటనే యవుట యిం కొకవిశేషమే యనక తప్పదు.

ఇంతయు నిట్లుండఁగా వజ్ఝలవారు చేసినయర్థము సమన్వయించు టెట్లో చూడవలె. సూచనార్థమున నుఞ్యంత మగుకొను ధాతురూపము చేరు నని చెప్పిన నింతబాధ యుండెడిది కాదు

కాని వారు కొనఁ ధాతువునర్థమును గూడ సమన్వయింపఁజూచిన ట్లున్నారు. ఇదిగోన్ అనఁగా ఇది కొన-నవ్వు ఇది కొనుఁగాక - అని యర్థము చేసిరి. కొనుఁ గాక యని యర్థ మెట్లయినది కొనన్ అనుదానికి? అనఁగా నీవెత్తి బంగారు గాను అనుచో ఁగుధాతువున కట్లు గల దని దృష్టాంతము చూపిరి. కాని దీనికిని సామ్యము గానరాకున్నది. (నుఙ్యంత మగు నగుధాతువు ప్రయోగము విశిష్ట మైయుంట యట్లుంచుదము) బంగారు గాను అనఁగా బంగారు అగుఁ గాక అని నుఙ్యంత మగు నగు ధాతురూపము అగు నని ప్రథమపురుషార్థముతో బంగారు అను యుష్మదస్మద్భిన్నకర్తృక మైయుండుటచే నన్వయింపఁ గలదు కాని యిట నెట్లు? మధురానగరం బిదిగోఁ దడవులకుఁ గంటిమి' అనుచో ఇదిగో - అనఁగా 'ఇది కొనుఁ గాక' యని యర్థ మగునపుడు కొనున దేని? - కాఁగా నిట్టియర్థ మిట నన్వయింప దనక తప్పదు. 'బంగారు గాను' అనుచోటిస్థలములందలి నుఙ్యంత మగు నగుధాతు వన్వయించునట్లుగా అదిగో ఇదిగో అనుస్థలములందు కొనన్ కోన్ అనునవి వన్వయింప దని గుర్తింపవచ్చును. దానితో దీనికిఁ బోలిక లేదు. అట్లు గాక నుఙ్యంత మగుధాతురూపము విశేషార్థమునం దుండుట గల దనుటకు వెత్తిబంగారు గానను నది దృష్టాంతముగాఁ జూపఁబడిన దనియు అదిగో ననుచో నుఙ్యంత మగు కొనుధాతువునకును విశిష్ట మైనవేఱొకయర్థ మున్నదనియే కాని బంగారు గాను అను స్థలమునందువంటియర్థమే యున్న దని వ్యజ్ఞులవారితాత్పర్యము కాదఁటయుఁ జెప్ప వీలు లేదు. ఇదిగో అనుదానికి, ఇది గొనుఁ గాక యని యర్థము చూపి బంగారు గాను అనుచో బంగా రగును గాక యని చూపుచుండి రనఁగా నట్టియర్థమే అదిగో నిదిగో ననుస్థలములందును గల దని చెప్పుటయే వారియుద్దేశ మైనట్లు స్పష్టమే కాని యది పొసఁగున ది కా దనుటయు స్పష్టము.

ఇదిగోన్ - అనుచో వారు ముందుగాఁ జూపిన 'ఇది కొన నగును' అనురీతియర్థము సుకుమారముగ నన్వయింపఁగల దనవచ్చును. ఇది కొన నగును ఇది (యని) గ్రహింపనగును. ఇదే అనురీతిగా నెట్లే నాయర్థము సాధించుకొనుటకు వీలుఁ గల దని యూహింప వచ్చును. కాని కొన్ అనుదానికి కొన నగు ననురీతి యర్థము సిద్ధించుట యెట్లన్నది ప్రశ్నము. దీని కాధారము కానరాదు. - 'ఇంతేల' వీఁడు గొమ్మని చేసాచె వెలఁది యను దనుస్థలమున నయితము 'కొమ్ము' అనునది గ్రహింపు మిత్యాదిగా నర్థము నిచ్చునా? వీఁడు గొమ్మనుచో వీఁడె యని యాతని సూచించుటయే యుద్దిష్టము. 'కొమ్ము' అనునది సూచనార్థమువం దనప్రయుక్తమైనది.

ఈకుధరేంద్రము . . . అదిగో కానఁగబడియె - 'అది కొమ్ము' అనియే విభాగించి యన్వయింతెము. బహువచనస్థలము లెం దెట్లుండును? అదిగో ఇదిగో అను స్థలములం దది యిది శబ్దములు నిర్దేశింపఁబడు వస్తువులను సూచించునవి కాఁగా 'కో' (కొమ్ము) అనునది ఆ వస్తువులను నిర్దేశించి యెవరికిఁ జూపుచున్నామో వారి నుద్దేశించినది. నిర్దేశింపఁబడునవమహ ద్వస్తువులు బహుత్వమునం దున్నచో అదిగో ఇదిగో అని తదేకచ్ఛబ్దరూపములు బహువచనాంతములయి యుండును. అవిగో నిజపుత్రినిసర్గమోహాముల్ మహత్తయినయెడల వచ్చెడు గుల్-వచ్చి రదిగో నని అని అదిశబ్దమే ప్రయుక్తమవుట గన్పించును. ఇంక వీఁడుగో వీరుగో - అనురీతి వానితో పాటు మహాదర్థమున నేక బహువచనస్థలములు రెంట నదిశబ్దము ప్రయుక్తమవుట విశేషము.

ఇంక నిర్దేశించినవస్తు వొకఁడైన ననేకమైనను నది చూపు వారి ననుసరించి (అది బహుత్వమునం దున్న) కుధరేంద్ర మదిగో కనుఁగొంటిరె యనుచో నెట్లు విభాగింపవలెను? 'కనుఁగొంటిరి' యను చోటబహువచనము ననుసరించి 'కొను' ధాతువు నీయర్థమున సాధ్యము

పురుషబహువచనమునం దుండఁగా 'అదిగొండు' అని కావలెను గదా. అది కొమ్ము - అదిగో అని కావచ్చును గాని అది గొండు అనునది యదిగో అని కానేరదు. ఆమ్రేడితేతరపరకత్వమున మధ్యమపుఁజ్ఞులకు లోపము రావీలు లేదు గదా. అదిగో కనుఁగొంటిరె. యని యవుట సాధువు కాదనవలయునా?

'మహారాజనగరం బిదిగోఁ దనవులకుఁ గంటిమి' - యనురీతిగా నాయెడల నయ్యాది యెప్పుడును ద్రుతప్రకృతికమై యుండు ననియు ననఁగా నవ్యయాంత నుగుకొను ధాతువుగా అది+కోన్ - అనియే విభాగింపవలె ననియుఁ జెప్పవలెనా?

'కొమ్ము' అనునదే యేకత్వబహుత్వస్థలములు రెంట నవు నవ వలెనా? ఇది-ఇదిగో ఇదె గోవర్గము చేరవచ్చితిమి! అనుచో ఇదిగో గోవర్గము చేరవచ్చితి మనుట పొరపాటు గాదు గదా. కాఁగా 'కొమ్ము' అనునది సూచనార్థమునం దాంబ్రాశబ్దము ప్రథమాంత రూపములపై (బహుళముగా) జేరుట గల దనవచ్చును. కాని యట్టి యెడల వజ్ఝలవారు పేర్కొన్నట్లు ద్రుతప్రకృతిక మవుట సముచితము గాదనితప్పదు. 'కొమ్ము' అనునదే యనుప్రయుక్తము చేసి ననుమువర్ణలోపము నిత్యమే యనఁదగియున్నది. కేవల గొమ్ముని యనురీతి నొకటి రెండు చోట్ల మువర్ణ మగుచవచ్చును గాని యింకె నెక్కడను లేదు. హల్పకరతయుం దేని నవసానమునం దేని మువర్ణలోపము నిత్యము గాదు గదా. నప్రాణేతు కదాచన యున్నవి వి సముచితము 'విభాషాతు వద స్త్రికే' యని విభాష యనుట గమనార్హము ఇది గొమ్ము పురుషాద్యయము అదిగొమ్ము కానఁబడియెడి ననురీతి రూపములు గానవచ్చుచున్నవా? విభాష కిది వ్యవస్థ చేయవీ లున్నది.

అదిగో, ఇదిగో. అనురీతి హ్రస్వాంతరూపములును గలవు గదా. ఇట హ్రస్వస్థితి సాధారణముగ నెట్లు సిద్ధించును? పీనింబట్టి చూడఁగాఁ

'గొమ్ము' అనునది చేర్చుటయుఁ బ్రయోజనవంతము గా దనియు నంతకంటె 'గో' అనునదానిఁ జేర్చుటయే యుచిత మనియుఁ జెప్పఁ దగును. ఎట్లును నిటఁ గొనుధాతువునకుఁ జెందినయాయర్థము గ్రహింపఁబడుట లేదు గావున సూచనమనువిశేషార్థమును జెప్పుచో కొమ్ము అని చాక్రికముగనో యింకొకతీరుగనో చెప్పుకొనుటకంటె శబ్దశాస్త్రోచితముగా లాఘవ మగుమార్గములో 'గో' యనునదే చేరు ననియు దానికి హ్రస్వము గల దనియుఁ జెప్పుకొనుట యొప్పునే కద. అది+కొమ్ము అగు+కో అనుచో నిత్యగాదేశము సూరి మతమున బాహుళక మగుటచే సాధించుకొనవచ్చును. 'గో' అను దానినే స్వీకరించుపక్షమున నట్టిప్రక్రియయుఁ దగ్గును.

సూ. ని. అదిగో ఇదిగో అనునవి చూపినది గాని శ. ర. వలె గో, గొ, శబ్దములను జూప లేదు. అది+గో అనురీతిగా విభాజ్యముగా సూ. ని. తలంచలే దనవచ్చు. అయ్యును నిట అది ఇది యనుప్రథమాంతరూపములు కన్పట్టుటచేతను నర్థమునందును భేదము స్పష్టమ యవుటచేతను విభాజ్యముగా శబ్దశాస్త్ర మెంచు టుచితమే.

అదిగో సూచిత బ్రహ్మచారివలె దైత్యారాతి యేతెంచె ననుచో నదిశబ్దము దైత్యారాతిని బరామర్శింపవలసియున్నది. అయిన నాశబ్ద మనుప్రయోగము లేక యున్నది. అచ్చెదుగుల్...వచ్చిరదిగో (సూ. ని.) అనుచో నట్లు యున్నది. ఏఁడుగో గుజ్జువుదాంగ ఏఁడుగో మరుఁడు (సూ. ని.) అనుచో మహాత్స్థలమున ఏఁడుశబ్దము గలదు. ఇట సూ. ని. ఏఁడు+కో అని విభాగించుట విశేషము. దీనిం బట్టి పై అదిగో దైత్యారాతి యనుచో వాఁడుగో ననియు అచ్చెదుగుల్ వచ్చిరదిగో అనుచో వారుగో ననియు నుండఁదగియున్నది. ఏఁడుగో అనుచో ఇగో అనునదే ఇదిగో శబ్దార్థక మని శ. ర. పేర్కొని 'ఏఁడిగో' అనురీతిఁ జూపుచున్నది. కన్నడమున నిట్టియెడ

(నిదిగో) ఇదుగో అనుదానితోపాటు ఇగో ఇకో అని యుండుటను సూ. ని. పేర్కొన్నది. అదిగో అనుదానికి అగో అనురూపము శ. ర. చూపలేదు. సూ. ని. అవిగో శబ్దసందర్భమున అదుగో అదో యని కన్నడమున నుండుటం జేర్కొన్నది. ఇగో అనురీతిగా నగో కన్నడమున లేదన్నమాట. వీఁడుగో య్మనురీతి ప్రయోగమును విశేషముగా గుర్తించి అదిగో నిత్యాదులలో 'గో' చెప్పకొనుట యుక్తమె. అది+కొమ్ము. అదిగో అనురీతిగా భావించిన శ. ర. కర్త 'గో' అనుదానిని ప్రత్యేకావ్యయముగాఁ జేర్కొనుట బాగే. కాని ద్రుతాంతముగాఁ జెప్పకుండుటయే కొంత యాలోచింపదగియున్నది.

గో అనుదానిని జెప్పుచో నద్దాని ద్రుతాంతముగాఁ జెప్పవలయునా కూడదా? ఇదిగో కానంబడియెడి ననుచో ద్రుతాంతము కాదు గదా యని ఇవిగో అవిగో శబ్దములు కళలుగా గుర్తింపవలెనా? సరళస్థిరపరకతలో ద్రుతమునకు లోప మైన దనవచ్చుఁ గాన నట నెట్లన్నను బాధ లేదు. లోపము నిత్య మనవలయు నాపక్షమున. సరళస్థిరపరకత్వమున నా ద్రుతము లోపింపక బిందుసంశ్లేషస్వత్వములతో నుండుట గానరాకున్నది గదా. కావున నటలోపము నిత్య మనియే చెప్పవలె. ఇంకఁ బరుషపరకతలోను స్వరపరకతలోను ద్రుతాంతత వలన భేదము గల్గును. ఇట్టియెడల సరళాదేశాదులయునికి వీని ద్రుతాంతతను జెప్పుచుండఁ గొన్నియెడల సరళాదేశము లేమి కళాత్వనిరూపక మైయున్నది. దీనింబట్టి యివి కళలుగా నిర్ణయించుచో సరళస్థిరపరకతలో ద్రుతలోపము నిత్యముగా నవు నని చెప్పవలసిన యక్కర యుండదు గాని ఇవిగోఁ బరుషావ్యయ మనురీతిరూపము లెట్లు? మద్వ్యభిచారులార కాన, దురాచారులార కాన, అనురీతిగా అదిగో కానంబడియెడి నను ప్రయోగమును విలక్షణముగా గుర్తించుటయే యొప్పు ననఁ దగుఁ గదా. ఇంక వజ్ఝలవారు రెండురీతుల చరిత్రతో కళగా నొక్కటియు ద్రు.ప్ర. గా నొక్కటియు సాధించిరి.

ఇట్లంగీకరించుటకు వారు చూపినయర్థము సముచితముగా సరిపడకుండుట స్పష్టమే. అట్టిచో సరళస్థిరపరకత్వమున నెప్పుడును గళోపదమే ప్రయుక్త మవుననియు ద్రుతాంత మట నుండ దనియు నిర్ణయింపవలెనా? అది సముచితముగాఁ గానరాదు. కాఁగా నీవానిని ద్రుతప్రకృతికములుగాఁ జెప్పుచో సరళస్థిరపరకత్వమున ద్రుతమసలు కానరాకుండుటయుఁ దన్మాత్రమున నట ద్రుతము నిత్యముగా లోపించు నని చెప్పవలసివచ్చుటయు బాధకాంశము గా దని నిశ్చయింపవచ్చును. ఇంక మిగిలినస్వరపరుషపరకస్థితిలో ద్రుతాంతమనుటకే యాధారము లధిక మైయుండుటచే వీనిని ద్రుతప్రకృతు లని చెప్పుటయే యొప్పును. అందును సూ ౯. ఇఁగో శబ్దము కళగాఁ గూడఁ గన్పించుచున్న దని చెప్పినదే కాని యట్టిప్రయోగము నీలేదు. ఇచ్చినప్రయోగములు ద్రుతాంతతను నిరూపించుచున్నవి. ఇంక మిగిలిన అదిగో యనునదియు ద్రుతాంత మవుటకుఁ బ్రయోగము లధికము. శ. ర. కర్త సయితము అదిగో ఇత్యాదులను ద్రుతాంతము లైన యవ్యయములుగాఁ జేర్కొనుటయు స్మరింపఁదగియున్నది. పాక్షికముగా ద్రుతప్రకృతికము లవుట యటుఁగా నొకేశబ్దము కళయును ద్రుతప్రకృతికము నవుట యసంభవ మని వ్యాఖ్యలవారే నిరూపించిరి. కాఁగాఁ బ్రయోజనాధిక్యము ననుసరించి యివి ద్రు. ప్ర. లనుటయే యుచితము. అదిగోయును ఇదిగోయును ననురీతిరూపములు నసలే లేకుండుట ననుసరించి యిట నిరర్థకముగ నేని నుశబ్దము ప్రయుక్త మైన దనుటకును వీలు గానరాకున్నది. మొత్తముమీఁద అదిగో మున్నగునీయవి ద్రుతప్రకృతు లైనయవ్యయములే యను శ. ర. అభిప్రాయమును బ్రమాణీకరింపవచ్చును.

ఇది ద్రుతప్రకృతికమె యైనయెడల అదిగో కానంబడియెడి నను ప్రయోగ మెట్లు? 'కానన్' అనునది ద్రుతప్రకృతికమె

యైయుండఁగా 'కాన తగన్' అనుతిక్కనప్రయోగ మెటులు? ఇదియు నట్టులే యనఁదగును. పైఁ దిక్కనప్రయోగమును వ్యాఖ్యల వారు కాన్+అ అని విభాగించిరి. కాని యది సరిగాదని స్పష్టము. కావున ననుసర్థమున కాన్ అనుశబ్దమే లేదు. దాని కున్నయర్థ మట సరిపడదు. పైఁగా 'కావుననే' అను నవధారణము సంగతి మిట నవసరము కాదు. శ్రీకృష్ణుఁడు సంజయునితో ననుమాట లివి. సంజయుఁడు సంధి కనిష్టుఁడు గాడు గదా. కావుననే సంధి చేయవలె నని యవధారణార్థకమును జేర్చి యెల్లఁ జెప్పనక్కర లేదు. పాండవులకు సంధి చేయవలసినయవసరము లేదు కాని 'వనము సింహములు' కలిసియుండవలసినది కావుననే సంధి తప్పదని చెప్పఁదలఁచెనా? కాని యింతకుముందునలె 'అధికసారవత్త్వమును గృష్ణుఁ డిటఁ బాండవులందుఁ జెప్పుట లేదు. "వనావృతవృత్తంబునఁ గానిసింహములకు వేగంబ చేటొందు" నని గదా కృష్ణునిపలుకు. కావున నిట నవధారణార్థకము నిరర్థకమై యనవలసి యున్నది 'కానన్' అను ద్రుతప్రకృతికమే కల దనుట యొప్పు.

కాన తగన్, అదిగో కానంబడియెడి – అనుచోట్లను మార్గాంతరమున సమన్వయించిన వ్యాఖ్యలవారి కింకొక ప్రయోగ మిట్లు సమర్థింప వీలులేకపోయినది.

అదే "శ్రీకరమత్స్యకూర్మ...ఎం తేకృప" అన్నది. దీనిం గూర్చి వారు తనిశబ్దము లుప్తాచ్ఛ మగునవు దంపలిప్రకృతముమీఁది పరుషములకు సరళాదేశాదికము రాకుండుటకుఁ బ్రాచీనప్రామాణిక కవిప్రయోగము గన్పట్టలేదు. ధరణిదేవుల నాగనామంత్రి ప్రయోగ మొక్కటి గల దని (వ్యా. సం. స. 297) చెప్పిరి. ఇంతకంటె నిట నేమియుఁ జెప్పలేదు గాని పిదప నిటనే విమృశిత మయ్యె (804)

ననిరి. 'నో రన్యస్యాపి' యనుదానిచే ద్రుతము లోపించిన (వ్యా.సం స. 304) దనిరి. కాఁగాఁ బరుషపరకత్వమున నాపరుషములు సరళములు గాకయె ద్రుతము లోపించుట గల దని యంగీకరించినట్లయినది. శబ్దగతనకార మున్నటచే నట్లు లోపింప వచ్చు నని వారు భావించిరి. 'నోరన్యస్యాపి' అనుదానివలన నీప్రయోజనము సిద్ధించినది. ఎంతే కృష అనుచో శబ్దగతనకారములోపింప 'కానతగ' అనుచోఁ బ్రత్యయ నకారము లోపించినది. శబ్దగతనకారమున కైనను ద్రుతత్వము నంగీకరించి యిట్టిలోపము నొప్పుచో ద్రుత మింకొకతీరునది యితరత్ర లోపించుటను గుర్తింపవచ్చునే కద. 'నోరన్యస్యాపి' యున్నాఁడు (గనుక నట లోపించిన దన్న బహుళ మున్నాఁడు గనుక నిట లోపము సంగ్రహించుకొనవచ్చు ననవచ్చుఁ గదా. ఈవి.వి. అంటేత్యాది రూపములను నిరసించినది. తిక్కనయే ప్రయోగించెనే? వాఙ్మయమునం దిట్టిపరుషపరకద్రుతలోప మరుదై యున్నది కావునఁ గ్వాచిత్కముగాఁ జెప్పవచ్చును.

ఇట్టిప్రయోగమె యింక నొకటి. 'నే చెల్ల నోయమ్మ యీ చక్కనన్న రాచతేజము గల రత్నాలపెట్టె' అనుచో నేశబ్దమున ద్రుతము లోపించిన దనియు శర వెంజెల్ల రాజతేజము అని దిద్దె ననియు గాణపతవివరణకర్త చెప్పెను. వజ్ఝలవారు దానిని విమర్శించిరి. సూ.ని. 'వెంజెల్ల' ననియే పాఠము చూపుచో నది శ.ర.ను బ్రమాణము చేసికొనియుండవచ్చును. ఇంక దాఁ జూపిన ప్రాఁతముద్రణములలోని పాఠములె కవిప్రయుక్తము లనియు శ.ర.,సూ.ని. చూపిన పాఠములు దిద్దంబడిన వనియుఁ జెప్పుట కాధారము వజ్ఝలవారు తెలియ దనిరి. (302) ముద్రణప్రతులం దాపాఠము గానవచ్చుచుండఁగా నది నిరాధార మను టెట్లు? ప్రాఁతప్రతులకు భిన్నముగా ముద్రింపఁబడినవా? అయిన శ.ర.కర్త మాత్రము దిద్దె ననుటెట్లు? అన నాతఁ

జే ప్రతియందే నట్టిపాఠము చూచియుండు. ప్రాచుర్యము ననుసరించి నా ముద్రణమునందు నేఁజెల్ల యనుపాఠము స్వీకరింపఁబడి యుండ నవు. ముద్రితగ్రంథపాఠమును, నట్లే తాళపత్రగ్రంథములందును నాధారము లేకయుఁ గవిప్రయుక్తపాఠము లూహింపఁగల వఝ్ఝలవారికి గాణపత వివరణకర్త ముద్రితప్రతి ననుసరించి కవిప్రయుక్తరూపమును బ్రస్తావించుట రుచింపకపోవచ్చును. శ.ర.కర్త 'నేఁజెల్ల' యనుదానికిఁ జూపిన 'అకట నేఁజెల్ల నేఁజెల్ల హాకుమార' (పూ. హరి 5 155) అనుచో ముద్రితగ్రంథములం దదియే పాఠము గానవచ్చుచున్నది గదా. ఇంక వఝ్ఝలవారు చేసినవింత నిట్లు గమనింపఁదగును. నేఁజెల్ల అన్నది దిద్దంబడినపాఠ మని యెట్లు నిర్ణయింతు రన్న వీరు 'నేఁజెల్ల' అనురూపమునే శ.ర. చూపియుండఁగా ఎత్తినపద్యమునందు నదియే యుండఁగా శ.ర. ననుసరించి సూ.ని.కూడ 'నేఁజెల్ల' అనుపాఠమునే చూపినది కాని 'వారినుపురును జూపిన ప్రయోగ మగు అకట నేఁజెల్ల నేఁజెల్ల హాకుమార' అనుపద్యభాగమును అకట యేచెల్ల యేచెల్ల హా కుమార అని పఠించుటలో క్షతి యేమియుఁ గానరాదు' (వ్యా.స .స. 302) అనిరి. గణములు సరిపడు నని యభిప్రాయము కావచ్చును. గణభంగము లేకుండ నేకావ్యము నైన నెట్లయిన మార్చుచో నట్లు మారుపడిన యొక్కొక్కలక్ష్యగ్రంథ మొక్కొక్క లక్షణగ్రంథమునకు మూలము కాఁగలదు. వీ రిట నేది యాధారముగా నట్టిపాఠము నూహించిరో తెలియకున్న దనక తప్పదు. సూ.ని ఓచెల్ల—ఓ+చెల్లెల అని విభాగించినది గావున నట్లే 'ఏమి+చెల్ల' —ఏచెల్ల అని విభాగింప నగు ననిరి. అవుఁ గాక యట్టిదాని నేడ్చిడిన్ —ఏచెల్ల —అను గౌరనప్రయోగమున సమన్వయించుకొనవచ్చునే. ఎత్తిన ప్రయోగమును దిద్ద నేల? అట నిట్టిసమన్వయమును జూప నేల? 'ఏచెల్ల'- అనుదాని కపుడు గౌరన్నయొక్కని దొక్క ప్రయోగమే యవు నని యనుమలకే యెత్తినప్రయోగమును నయితము క్షతిలేని

మార్గము గదా యని సవరించి రన్నమాట. 1951 నాటి వావిళ్ళ ముద్రణమునను గౌరన ప్రయోగము 'నేచెల్ల నోయమ్మ' అనియే (321 పుట) యున్నది. నెచెల్ల ననుచో నకారము ద్రుతముపై నైనద్రుతమని గ్రహించుచో 'ఏచెల్ల నోయమ్మ' యని యుండును. కాని ఏచెల్లన్+ఓయమ్మ అను విభాగము ననుసరించి చెల్లను సహింపలేను అనురీతిగాఁ జెల్లుధాతువుయొక్క లభ్యుత్తమైకవచనరూపమె ప్రయుక్తమయినట్లు గుర్తింపఁదగియున్నది. (ఓచెల్ల అనుచోఁగూడ ఓ+చెల్లన్ అనియే విభాగింపవచ్చు ననిపించు) ఓచెల్ల అనుదానివలె ఏచెల్ల అనునదియు లేదు. 'ఏఁజెల్ల యోయమ్మ' అనుపాఠ మెక్కడిదో. కాని నేఁ జెల్లెడల (శ. ర. ముద్రింపఁబడినపిదపసయితము) 'నేచెల్ల నోయమ్మ' అనియే ముద్రణములం దుండుట మాత్రము స్పష్టమే కదా. శ. ర. చూపిన పాఠము గా దని గాణపలేము చూపిన ముద్రితగ్రంథములందలిపాఠమునే సమన్వయించుటకయి వజ్ఝలవారు 'ఏమి+చెల్లెల' అనురీతివిభాగమును జూపి రనుట స్పష్టము. అట్లయ్యు ఎచెల్ల అనునది కళయవుటంజేసి 'ఏచెల్ల నోయమ్మ' యను ప్రయోగ మెట్లు? వజ్ఝలవారు కల్పించినయాశబ్దము శ. ర. కర్త చూపినపాఠము గాని లేక ముద్రితప్రతులందలిపాఠమునుగాని గాక క్రొంగ్రొత్తమూఁడవపాఠ మైయున్నది. మఱి దీని కాధార మెక్కడిదో. ప్రాసస్థానమునఁ బరుష మట్లే యుండుట యున్నది ముద్రితగ్రంథపాఠము ననుసరించియు ఏచెల్ల యోయమ్మ అని (పైని యుదాగమములో) కళ యవుటను శ. ర. ననుసరించియు సమన్వయమార్గములో స్వీకరించి రేమో.

ఏఁ జెల్ల నని శ. ర. కర్త చూపినదానికంటె నే చెల్ల అను పాఠము నంగీకరించుటకే యాధారము లధికము లై యున్న వని యంగీకరింపకతప్పదు. 'నేఁజెల్ల నేఁజెల్ల హోతుమూర' అనురీతియెత్తిన ప్రయోగము ననుసరించి చూడఁగా నేచెల్ల అనుగౌరనపద్యమునందు

మాత్రమె యస్మదర్థక మగు నేశబ్దమే యని నిర్ధారింపవచ్చును. నేను+చెల్లను నేచెల్లను అని పరుషపరకత్వమున ద్రుతము లోపించిన దనియే చెప్పవలసియున్నది. ఈ పాఠమె యంగీకరింపవలసినస్థితిని వజ్ఝలవారును గుర్తించుటచేతనే 'ఏమి+చెల్ల' ఏచెల్ల అనియునుత్పత్తి జేర్కొనుటయు నెట్టిన ప్రయోగమునందు సయితము ఏచెల్ల నను రీతిగానే క్షతి లేమి నిల్పఁదగు ననియు నెంచి రనవచ్చును. సరళాదేశాభావము ననుసరించి పూర్వశబ్ద మస్మదర్థకముగాఁ గాక యేమిశబ్దముగాఁ జెప్పి రన్నమాట.

అపరాధి నగుదు నైన పరాశ్రితుఁడ నని ముద్దరాజు రామన పద్యముగా గాణపతవివరణకర్త చూపిన నయ్యది సరియైనపాఠము గా దనియు 'అపరాధినగుదు నేన పరాశ్రితుఁడఁ గావునఁ బవిత్రుఁ జేయు మన్ భువననిసుత' (కవి సం. 1.13) అనుచో నేను+అ+పరాశ్రితుఁడ (శ్రేష్ఠాశ్రితుఁడ) అని యర్థముచేసి గసడదవాదేశము రాలే దని సమన్వయించుకొనఁ నగు' (వ్యా.సం.స. 303) అని వజ్ఝలవారు ముద్రితపాఠమును బ్రమాణీకరించుట యుచితముగా నున్నది. ఇందు సీసపాదమున నుత్తరార్థమున యతిమైత్రి గుదిరినట్లు గానరాదు. కాన అని వజ్ఝలవారు చూపఁగా కావున అని ముద్రితప్రతియందున్నది. ఏపాఠమునను 'భువన' శబ్దమున యతి (ప్రాసయతి) కుదిరినదిగాదు. అయిన నది యిట నంతగా ముఖ్యమైనయంశమును గాదు. కాఁగా వజ్ఝలవారు చూపినట్లు 'నేన పరాశ్రితుఁడ' అనుపాఠమె గ్రాహ్యము గావున నయ్యది పరుషపరకద్రుతలోపమునకు లక్ష్యస్థలము గానేరదు. కానీ వజ్ఝలవారు పరాశ్రితుఁడ ననుదానికి శ్రేష్ఠాశ్రితుఁడ నని యర్థము చేయుట విశేషము. పరాశ్రితుఁడ (స్వతంత్రుఁడను గాను గాఁబట్టి) గాన నేన యపరాధి నగుదు' ననియు నపరాధి యగుటకును నితరులే (దైవమే?) కారణము గావున దప్పంతయుఁ దనది గాదు నీవే పవిత్రుఁ జేయు మని తనుఁ జెప్పుట కవి

యభిప్రాయ మేమో యనిపించు. పరాశ్రితుండ ననునది పవిత్రుం జేయు నన్ అనుదానికి హేతువుగాం గాక అపరాధినగుదు నను దానికి హేతువుగాం జెప్పుట యుచిత మేమో యని యనుమానము. 'ఏన పరాశ్రితుండ' అను పాఠ మంతకంటె సూటిగ నుండుపాఠమై యైనను నద్దాని కాధారము లేమి గాణపతము చూపినయా పాఠమున కాధారము తెలియరాదు. ముద్రితప్రతుల ననుసరించి 'నేన పరాశ్రితుండ' అనునదే గ్రహింపఁబడుచున్నది. కాఁగా నిది ప్రస్తుతలక్షణమునకు లక్ష్యము గానేర దనుట మాత్రము ప్రధానము.

కవిజనసంజీవనియందే 'కృతిని సుమాగమములు దక్కఁ దకారాంతంబులుం దగన్' (2-23) అనుచోఁ బ్రాసస్థలమున ద్రుతము పరుష పరకత్వమున లోపించినట్లు గాణపతవివరణకర్త స్పష్టము చేసెను. కాని వావిళ్ళవారు ముద్రించిన కవిజనసంజీవని తప్పులతిప్ప యాటను చేర్చుకొనుచు వఝ్ఝలవారి పాఠమును సరిగా దనిరి. గాణపతము చూపిన పాఠమె యిట ముద్రితప్రతులందును నుండుటచే నిద్దాని స్వపక్షసాధకముగా గాణపతకర్త యుపన్యసించుకొన్నట్లు చెప్ప వీలు లేదు గదా. ఇంక ముద్రితప్రతులందలి పాఠ మస్పష్టమైయుండ దనుచు 'ఉమాగమముతోఁ గూడిన తకారము తేలఁగ' అనుట యుచిత వక్తవ్యము గాన నాపద్యమున 'తక్కన్' అనుదాని కుపన్యాసము ప్రసక్తియే లేదు. కావున నట 'కృతిని సుమాగమములు దక్కఁ దకారాంతంబులుం దగం దేలఁగ నని కవిప్రయుక్తపాఠము కావచ్చు ననిరి' (వ్యా. సం. సం. 303) వీ రూహించిన పాఠ మెట్టి యర్థము నిచ్చుచున్నదో? ఉమాగముల - యుక్తతకారాంతంబులు నన నేమి? ఉమాగమముతోఁ గూడిన తకారమా? లేక ఉమాగమములయొక్క ద్విత్వతకారమా? ఉమాగమముతోఁ గూడిన తకారము తేలంగ' అని చెప్పవలసియున్న దనిరి గావున నీ పాఠముచే వఝ్ఝలవారి యభిప్రాయమునే యూహించి రనవలె. కాని 'ఉమాగమములయుక్తతకారాంతంబు' లనునది వారు చెప్పినట్లు

ఉమాగమముతోఁ గూడినతకారాంత మనురీతిగా నర్థము నిచ్చునదిగాఁ గానవచ్చుట లేదు. కవిజనసంజీవనియందు ముద్రణమునఁ దప్పొలున్నమాట నిజమే. కాని దాని నెట్లు నిర్ణయించుట? ఇప్పద్యమునను 'హరి మనిచెఁ బరీక్షితు నన సౌమిత్రి యింద్రజిత్ గెలిచె ననన్' అది యుదాహరణభాగమున్నది. 'ఇంద్రజిత్' అని తకారాంతముగనే యుండుట ముద్రణమునఁ బ్రమాదమె యనవచ్చు. ఇంద్రజిత్ అను రీతిరూపములు కవిప్రయోగములందుఁ గానరాకుంటయే గాక కవిజనసంజీవనికర్తయు నట్టిదానిం జూపలేదు. పరీక్షితు నన సౌమిత్రి యింద్రజిత్ గెలిచె నన ననుచో నింద్రజితు గెలిచె నన నని యున్నను గణభంగ ముండదు. గణనిర్బంధము ననుసరించి యైన నచ్చోటిశబ్దస్వరూప మిదియే యని నిశ్చయముగాఁ జెప్పుటకు వీలు లేకున్నది. అనఁగా 'ఇంద్రజిత్' అనియు నుండు నని తత్కర్త యెంచె నేమో? పరీక్షితుశబ్దమునకుఁ బ్రయోగమును జూపెనే కాని యింద్రజిచ్ఛబ్దమున కసలు చూపలేదు. అట్లు చూపకుండుటనుబట్టి 'పరీక్షితు అను దానివలననే ఇంద్రజిచ్ఛబ్దరూపమును నూహ్య మనియు ననఁగా బరీక్షితు అనురీతిగా 'నింద్రజితు' అని యుమాగముతోనే యుండు ననియుఁ దత్కర్త భావించిన ట్లూహించుట కవకాశము గల దనవచ్చును.

ఇంతకు నిట ఉమాగమములు దక్కు తకారాంతంబులు అనుచోఁ బరుషసరళద్రుతలోపము నంగీకరించుటకు ముం దన లన్వయ మెట్లు? ఈపాఠమునం దన్వయబాధ గానరాదు. 'కృతిని నుమాగమములు దక్కన్, తకారాంతంబులు దేలఁగ విస్తృత మగు' ఇట (తక్కన్ అనునది గాక) దక్కుధాతువు నుక్త్యంతరూపముగా దీనిని గుర్తింపఁదగును. దక్కుధాతువునకు లభించు, నిలుచు అనునర్థములు సూ. ని. చూపుచున్నది. కాఁగా ఉమాగమములు దక్కన్ – ఉమాగమములు లభింపఁగా లేక ఉమాగమములు నిలువఁగా తకారాంత

ములు తేలుటయుఁ గల దని పద్యము సముచితముగనే యన్వయించు చున్నది గదా. కాన పక్త్ర్యాంశము సరిగా సిద్ధించుట లే దనుకారణముతో నిచ్చట నచ్చు తప్పుపడిన దని చెప్పి క్రొత్తపాఠమును జూపవలసినయవసరము లేదు.('దక్క' అనుముద్రితప్రతులం దున్న పాఠమునకును 'యుక్త' అని వజ్ఝలవారు చూపినపాఠమునకును సామ్యము తక్కువే యగుటయు గమనార్హమె) ఇట్లు దక్క ననుముద్రితపాఠము సముచితమే యని వ్యక్త మగుచుండఁగా దక్కన్+తకారాంతంబులు అనుచోటద్రుతము పరుషపరకతయందు లోపించిన దని చెప్పవలసియే యున్నది. కాఁగా నీయది యిట లక్ష్యమే యనఁదగు. కాని రామన సరళాదేశాభావమును గాని ద్రుతలోపమును గాని సూత్రించియున్న వాఁడు గాడు.

'కనకంబు వర్షించు ఘనులద్రిమోాల (విజయ-1-80) అనుచో గాణపతము కనన్+కంబు అని విభాగించుట సరిగా దనియు కనక+అంబు అనియే విభాగింపఁదగు ననియు వజ్ఝలవారు వివరించుట సముచితమైయున్నది. (వ్యాదయోల్లాస. 135 పుట) కాఁగా నిది ప్రస్తుత స్థలమునకు లక్ష్యము గాఁజాలదు.

ఇట్లే యెం - తేతిలకింది తరుణిం గరుణింపఁగదయ్య(భాను.పరి) మున్నగాఁ గ్వాచిత్కముగాఁ బరుషపరకద్రుతము లోపించిన తావులు కాన నవు.

మొత్తముమీఁద 'కా న త గ న్' - అదిగో కానంబడియెడి మున్నగు కొన్నిస్థలములయందుఁ బరుషపరకత్వమున ద్రుతము లోపించిన దనవలయును.

అన్యే ద్రుతప్రకృతయః యనురీతిలక్షణముల ననుసరించి కళాభిన్నమె ద్రుతప్రకృతిక మగుట లాక్షణికసిద్ధాంత మగుటచే నొకే శబ్దముకళయు ద్రుతప్రకృతికమును రెండును గారా దనునభిప్రాయము

ననుసరించి వజ్ఝలవారు కానన్-కానన్-కానీతివానిని భిన్నశబ్దములుగా వేర్వేరుమార్గములలో సాధించిరి. అమార్గము సమంజసము గా దని నిర్ణయింపక తప్పదు.

అట్టియెడల లాక్షణికసిద్ధాంతము కూడ సమంజసము గాకపోయి నను కవులు కొన్నిశబ్దములను గళాద్యంత ద్రుతప్రకృతికోభయములుగాఁ బ్రయోగించి రనియో సంగీకరింపవలెనా? యను నాలోచింపఁదగి యున్నది.

కాని పాక్షికద్రుతప్రకృతికత్వ మసంగతము సమంజసము గా దనియే నిర్ణయింపఁదగియున్నది. భక్తుఁడు భక్తుఁడును, రాముఁడు రాముఁడును అనురీతినాయుష్కరులవానికిని గళ లైనపదము లర్థ విశేషాదులచే ద్రుతాంతము లయి ద్రుతప్రకృతికము లవుచున్నవి. కాని ప్రస్తుతస్థలము లట్టివి కావు. కానన్ కానన్ కాన్పుత్రం బహుభావ లక్షణార్థమున ద్రుతాంత మగునవర్ణకిసంబంధిదే నైనది కక్కన్ అను నది సూక్ష్యాంతము. ఇవి ద్రుతాంతములు గా నుండుటకు శక్తిమున కవకాశ మేది? ఇట్లె ద్రుతప్రకృతు లితరములును.

'నే భక్తుఁ డైతి నీకు' ననురీతిగాఁ గళలైన ద్రుతము చేరుచో నవియు ద్రుతప్రకృతికము లవును. అట్టి ద్రుతము చేరినపు డది కళయే యవును. అస్మదర్థకవిశేషణము ద్రుతప్రకృతికమును గళయును రెండు నవుచున్నది. కాని దానితో సామ్యము ప్రస్తుతస్థలములకుఁ గుదురదు. అట నయ్యవి ప్రథమాంతము లయి కళలుగాఁ బరిగణింపఁబడుటంజేసి సహజముగానే కళలు. ప్రత్యేకదశలో ద్రుతాంతములు ద్రుతముం జేరి ద్రుత ప్రకృతిక మవుట విశేషము. ఇట 'కాన' ననునవ్యయము ద్రుత ప్రకృతికములలోఁ బఠింపఁబడి నది గదా. (శత్రాద్యనూనాంతర్యచేదాద్య ర్థకంబులు) ద్రుతప్రకృతికముగాఁ బరిగణింపఁబడినశబ్దము కళయవుట కవకాశము లేదు గావున నొకవేళ సరళాదిపరత్వమున నాద్రుతము

లోపించినను నద్దానిని గళ యని పేర్కొనుట కవకాశము లేదు. మొత్తము మీఁద శాస్త్రపద్ధతులు వికల్పముగాఁ గళ లవు నని చెప్పుట లాక్షణికసిద్ధాంతమునకు విరుద్ధము అయినను గవ్వు లట్లు ప్రయోగించి రనవచ్చుటంగూర్చి పరిశీలింతము.

అట్టియెడల కాన కానన్ అనుశబ్దములు రెండును గల వనవలె. ద్రుతము గానరానిచోట్ల నెల్ల నయ్యది కళగానే సమన్వయింపఁ దగు. సరళస్థిరావసానపరకతయందు ద్రుతప్రకృతికమే యయ్యు ద్రుతము లోపింపఁగలదు. అట నున్నది కళయా? ద్రుతప్రకృతికమా? కాఁగా భేదము స్వరపరుషపరకత్వమునందే యున్నది. స్వర పరుషపరకత్వమున ద్రుతలోపమునకు నవకాశము లేమింజేసి యే యట నైనను గళ లనవలసివచ్చిన దనుటయు స్పష్టమే. అట్టిస్థితి ప్రయోగములందెట్లున్న దని పరిశీలించిన దీనికి శాస్త్రమున గుర్తింప వలసినస్థలములు మిక్కిలియల్పము లనుట స్పష్టము – అనఁగాఁ గళా పద మరుదుగను ద్రుతప్రకృతికము తఱచుగను ప్రయోగింపఁబడు నన్నమాట. కాఁగా దీనికిఁ గళాత్వము చెప్పవలసినది పరుష(స్వర) పరకతలో సరళాదేశము రాక ద్రుతములోపించుస్థలములనుబట్టి. కాన నట్టివి వాఙ్మయమునందు ప్రేళ్ళపై లెక్కింపఁదగినన్ని మాత్రమే యున్నపుడు – వానిని బాహ్యద్రుతప్రకృతికములుగాఁ బేర్కొనుట యనవసర మనియు నసంగత మనియు నిశ్చయింపఁదగు.

ఇంక నట్టిలోపము గన్పించుస్థలములందు విశేషముగ ద్రుత లోపమును విధించుకొని వానిని సాధించుకొనుచు నట నయ్యవి ద్రుత ప్రకృతికములే యని గుర్తించుట ప్రయోజనవంత మని నిర్ణయింపఁ దగు.

కవిజనాంజనమునందలి 'వికల్పన ద్రుతే లోపే పరుషాః స్వరశ్చ పరే' యనువచన మీదృష్టితోఁ బ్రారంభ మైన దేమో యని యను

18]

మానింపవచ్చును. కవిజనాంజనకర్త వికల్పముగా ద్రుతము లోపించినను బరుషములు సరళములే యగు నని భావించినను బినప ద్రుతము లోపింపఁగాఁ బైపరుషములు వికల్పముగా సరళము లగు ననెను. కాని యీపక్షమున మీఁదిపరుషము సరళ మగుచో ద్రుతము లోపించు నను నక్కర లేదు. అయ్యది శ్రుతిగోచరము గాకున్న నట్టిస్థలములలో ద్రుతమునకు ఖండానుస్వార మనుచుందురు గదా. కాఁగా మీఁది పరుషములు సరళములు గాకుండఁగనే ద్రుతము లోపించుట యన్నది విధించినఁ జాలును. అదియును 'వికల్పన' - యని విధింపఁ దగినది. ప్రయోగములం దట్టిస్థితి మిక్కిలియరుదు గావున నాక్వా చిత్కతను స్పష్టము చేయఁదగియున్నది. కాఁగా 'వికల్పేన ద్రుతే లోపే' యన్నలక్షణము (ఎవరు చెప్పినను) ప్రమాణీకరింపవలసిన యవసరము లేదు.

ఇంకను నిట్టియరుదయినస్థితి కావ్యసమాహారము ననుసరించి గ్రహించుటయు సమంజసమే. (పిడఁగో వ్యాకరణేతర విశేషస్థలము) కాఁగా బరుషసంకేతమున (నాపరుషము సరళము గాకయె) ద్రుతము లోపించుట కవిప్రయోగములందు మిక్కిలియరుదై కాన వచ్చుచున్నదని మాత్ర మెన్నఁదగియున్నది.

కాన తగ నని తిక్కనయో పరుషసంకేతమున ద్రుతలోపము చేయుట యొకవిశేషము కాఁగా నిందులకయి యుద్ధరింపఁబడు ప్రయోగము లెల్లఁ బ్రాసఘటితములై యుంట యింకొక విశేషము. ప్రాసేతరస్థలమున సరళాదేశాదు లున్న పాటకు నవకాశము గలిమిఁ బ్రాసస్థలములే ప్రబలము లని ప్రస్తావింపఁబడియుండు ననుట స్పష్టమే. కాని (పినిబట్టి) ప్రాసేతరస్థలముల నిట్టివి గల వేమో. కొన్నియెడల వ్రాయసగాండ్రు కల్పించినవిగా నెన్నను గొన్నియెడలఁ గవు లట్లు ప్రయోగించినవే యేమో యను ననుమానింప నవకాశము గల్పించును. ఏమైనను బరుషపరద్రుతలోపము క్వాచిత్కమే యని గుర్తించు టొప్పును.

—o—

# వాక్యాంతద్రుతలోపము



‘వాక్యాన్తగతస్యోనాఽన్యాః’ యను చింతామణిలక్షణము వాక్యాంత (పదాంత) ద్రుతమునకు లోపమును జెప్పుచున్నది. ఇందున్నచశబ్దముచే ‘వాక్యాన్తస్య ద్రుతిగస్య స్యాల్లుక్’ కృతిపూర్వస్థలమునవలె నీకార్యము వికల్పమని స్పష్టము. వాక్యావసానమునందలి ద్రుతమునకు వికల్పముగా లోపమగు నని యర్థము.

ఇందలి ‘వాక్య’శబ్దమునర్థమున వివాద మేర్పడియున్నది. అహోబలుండు “వాక్యం చాత్ర పాదపంక్తిసీసాదిషు ప్రతిపాదం వాక్యం వృత్తాదిషు పూర్వార్ధ ముత్తరార్ధం చ వాక్యద్వయ” మ్మని వివరించెను. పినింగారి వజ్ఝలవారు “వాక్యం స్యా ద్యోగ్యతాకాంక్షాసత్తియుక్తః పదోచ్చయః” అను ప్రసిద్ధలక్షణము నపేక్షించి యాయర్థలక్షణమును వాక్యమునకుఁ గల్పించుట యుక్తముగా (వ్యా. సం. స. 406) దనిరి. అహోబలునివివరణము సమంజసముగాఁ దోఁపదు కాని దానిని నిరసించుటకు వలసిన మార్గము వజ్ఝలవారు చెప్పినదియు సమంజసము గాదు. ప్రసిద్ధవాక్యలక్షణము వజ్ఝలవారు పేర్కొనుట యుచితము. కాని దీని నే రెల్లయెడల నపేక్షింపక స్వీకరించిరా? ‘స్యాద్వాక్యవిరామే తు సంధ్యభావోఽపి దోషకృ’ త్తనుకారికక్రింద “ఇచట వాక్యశబ్దమునకుఁ బాద మనియు నర్థము చేయ నగు (వ్యా. సం. స. 488) నని వివరించిరి. అదే యర్థము నిట నహోబలుఁడు చెప్పెను. కారికయందు వాక్యశబ్దము ప్రసిద్ధమైన వాక్యలక్షణముతోఁ బ్రయోగింపఁబడలేదా ?

అహోబలుఁడు వాక్యశబ్దమునకుఁ బాద మని యర్థము చేసి యూరకుండెను. కాని వీరు వాక్యశబ్దమునకుఁ బాద మని యర్థము చేయుచునే యింకొక వాక్యశబ్దము లక్షణమందు లేకుండఁగనే పైని పేర్కొన్న ప్రసిద్ధవాక్యలక్షణము గూడ వివరించిరి. వాక్యము=పాదము. అంతే

గాక వాక్యం స్యాదిత్యాదిలక్షణలక్షితమును. రెండువిధము లైనయర్థములు వాక్యశబ్దముచే నేర్పడుట విశేషము. అహోబలుం డారీతిగా వివరింపలే దని వజ్ఝలవారితిరస్కారము.

పోనీ ప్రస్తుతస్థలమునఁ బాద మని యర్థము చేయుట తగ దని ప్రసిద్ధవాక్యలక్షణమును బ్రస్తావించిరి గదా. అది యెట్లన్వయించిరో చూతము "పద్యాంతమున వాక్యావసానము గాకున్నను ద్రుతము లోపింపవచ్చును. మహాముని ప్రణీత మైనదాని - చ॥ వినుత..." (305) అని చూపిరి. ఇది యెట్లు? ప్రసిద్ధవాక్యలక్షణము నపేక్షింపక యిది మాత్రమే యహోబలుఁడు పేర్కొని యట్టి వాక్యాంతముననే ద్రుతము లోపించు నని వ్యాఖ్యానించియున్నచో నదియే లక్ష్యము చూపి యిట వాక్యాంతము గాకున్నను లోప మైన దని విమర్శింపరా ?

ప్రసిద్ధ మైన యీలక్షణము గలిగినవాక్యము తుదిద్రుతము లోపించుట (యున్న) గద్యకావ్యములందు (బద్యకావ్యములం దున్న గద్యలయందును గావచ్చును) మాత్ర మని గ్రహింపవచ్చును. పద్యములం దిట్టినియమము పాదప్రాంతికముగాఁ జెల్ల నని వజ్ఝలవారు చూపినట్లు ప్రయోగము ననుసరించియే గ్రహింపవచ్చును. అహోబలపతి సీసాదిపద్యములనే ప్రస్తావించుట గమనార్హము. ఐనను నహోబలపతి సామాన్యముగాఁ బాద మని యర్థము చేయుట యొప్పు దనవచ్చు. సీసాదులం దొక్కొక్క పాదమే వాక్య మనియు వృత్తములం దొక్కొక్కయర్థ మొక్కొక్క వాక్య మనియు నర్థము చేయుట విశేషము.

'న స్యాద్ద్రుతస్య విరామే తు' అనుకారికాసందర్భమున 'అత్ర భాషాకావ్యేషు పూర్వోత్తరార్ధయోః సంధ్యభావస్య అదోషత్వేఽపి అర్థే సంధ్యభావో దోషాయ భవత్యేవేతి జ్ఞేయ' మ్మని చెప్పె. దీని

వలనఁ జెనఁగు వాక్యములయందుఁ బూర్వోత్తరార్థముల నడుమనే కాక యర్థములందును బూర్వోత్తరవాక్యముల సంధి లేకుంట దుష్టము కా దని స్పష్టము. అట సహా. ఇచ్చిన, పడగ నున్న హాసము భయవిహ్వాలుఁడు గాడు అరదము నెక్కె నాతఁ డుత్సాహముతో దనునాట వెలఁదిపద్యమున (ఇయ్యది 1-2 శ్లో కాలు పాదములు గావలెఁ గావున.) నా యభిప్రాయమును నిపుణముగాఁ జూపుట స్పష్టము. దీనింబట్టి యచ్చోటి వాక్యశబ్దముచే వృత్తి యంతఁ బ్రతిపాదమును (వాక్యము గనే) గ్రహించినట్లు తెలియుచున్నది. ఇచ్చిన దాఁట వెలఁదియే తైజను వృత్తాదిషు - అని వివరించుట న్యాయము. వ్యాఖ్యాకారివలె సహోబలుఁడు పాదాంతమున వాక్యమంతమునం బదయతి యని చెప్పినవాఁడు గాదు. ఇచ్చినయుదాహరణమునఁ బాదాంతమున వాక్యాంతమును నవుట యాదృచ్ఛికము మాత్రమే. అట్టియభిప్రాయమే యున్న స్పష్టము చేయువాఁడే కదా. అట్టియెడల నిచ్చోట వృత్తములలోఁ బూర్వార్థ మొకవాక్యము ఉత్తరార్థ మొకవాక్యము నని చెప్పుట పూర్వవిరుద్ధము. రెండుచోట్లను వాక్యశబ్దమే భేదము లేదు గదా. ఇచ్చోటిలక్ష్యము మరల పరిశీలింతము.

ఈ కారికయొద్ద రేనాఁడులో నొక్కొక్క పాదమె యొక్కొక్క వాక్యమని చెప్పియున్నాఁడు. ఆ వాక్యమునకు 'సకలకలాభినంద్యకలాకలాపమ్ము దొరయునె దుర్మార్గముతోడ' అని యిచ్చెను. ఇచ్చట నిండుది పాదాంతమునందైనను వాక్యము పరిసమాప్తము గాకుంట స్పష్టము, కాఁగా నిచ్చోట 'వాక్యం చాత్ర పాద ఏవ' యనుటలోఁ బాదాంతమునందే గాదు (ప్రసిద్ధలక్షణలక్షిత మగు) వాక్యమునకంతమును గావలయు ననునియమము లేకుండుట స్పష్టమే కద. దీనింబట్టి సమన్వయించఁగా 'నస్యాద్వాక్యవిరామే' యనుకారికయొద్ద 'పడగనున్న హాసము' - యనులక్ష్యమునఁ బాదాంత మగుటతోపాటు వాక్యాంతము నగుట యనుద్దిష్ట మనియు

వాక్య మనఁ బాదమే కావున నటఁ బ్రసిద్ధవాక్యము నంతము గావలసిన పని లేదనియు గుర్తింపవలెను. ఇట్టియెడలను నచ్చట వృత్తమునం బాదమె యొకవాక్య మని సామాన్యముగాఁ జెప్పి యట నర్థ మొక వాక్య మని యర్థము చేయుటలో వైరుధ్యము తప్పదు. ఇటఁ జెప్పినవాక్యార్థమునే యచ్చట గ్రహింత మన్న నచ్చో నహోబలపతి వివరణమును తల్లక్ష్యమును విరుద్ధము లగును. లక్ష్య మది పూర్వార్థ మనితోడ యుత్తరార్థ మనితోడ చెప్పక తప్పదు. అర్థమధ్యమున సంధ్యభావము దోషకారి యైన నయ్యది దుష్టమే యగును గదా. కావున నట వాక్యములకుఁ గేవలము పాద మనియే వృత్తాదులయం దర్థము గ్రహింపక తప్పదు.

ఇంక నిట నట్లు భిన్నముగాఁ జెప్ప నేల జరిగెను. ఈయహో బలపతివివరణమున కప్పకవియు నమూలము. ప్రస్తుతలక్షణస్థల మున నప్పకవి "పద గంసీసాదికి నిల, వసుమతి నొక్కొక్క పదము వాక్య మనంగా, నెసఁగుఁ బదాంత్యపదములు తుదలఁ బొసఁగు నకా రంబుపొల్లు పోవ న్విలువన్." (4-186) నెను. అహోబలుఁడు దీనిం బట్టియే 'సీసాదిష్షు ప్రతిపాదం వాక్య' మ్మని చెప్పి యొకసీసపద్య మును వెనకి యుదాహరించెను గూడ. లక్ష్యస్థలముఁ గూడ నహో బలునిపై నప్పకవిప్రభావమే కలదు. అప్పకవి యట "తే॥ దానవా రాతి కేళికోద్యానసీమ నాకభూజంబు చెంతఁ గాంతాలవాము ననఘ గుణధామ సత్యభామయు బెరిఁ గనియు నిచ్చట ననఁగ లక్ష్యంబు లయ్యె - (137) నని యుదాహరించెను - ఈలక్ష్యపద్యమున మొదటి చివరిపాదములచివర ద్రుతము లోపించినది. చివరిపాదమున లోపమును జూపుటలో విశేషము లేదు. అయినను మొదటి పాదము చివరను లోపించుటయు 'వాక్యాన్తగతపదాన్తః' యను సూత్రమునకు లక్ష్యముగనే యుద్దిష్ట మైన దనవలె. మొదటిమూఁడు పాదములయందు ద్రుతముయొక్క వివిధస్థితులు చూపఁబడినవి.

'సీసాదుల నొక్కొక్కపదము వాక్య' మని చెప్పెను గదా. కావునఁ బ్రస్తుతము విధింపఁబడినలోపమునకు మొదటిపాదము లక్ష్యము సీసాదులన్నప్పటియాదిపదము ననుసరించియే యిటఁ జేటఁగిటి యుదాహరింపఁబడిన దనుట యొప్పునే కద. కాఁగా మొదటిపాద మిట లక్ష్యమే యనవలసియున్నది. కాని యిచ్చటఁ దరువాతిపదము మొదట (నాకె-నకారము) స్థిర మున్నది. కావున నీయది వాక్యాంతమున లోపించినదిగాఁ గాక స్థిరపరకతలో లోపించినదిగా భావించుట కవకాశ మున్నది. కాని యప్పకవియుక్తి న్యాయ మది కాదని లక్షణమునుబట్టి స్పష్టము.

ఇట నహోబలుఁడు చూపినలక్ష్యస్థలమును బట్టియే యవుట గమనింపనగు. ఇతఁడు సీసము నొసంగుటయే విశేషము. చందురునితోడ... బహుశిష్య...తోడ... ననవలయు శ్రీ... అనుచోట్లఁ బాదాంత ద్రుతమునకుఁ గ్రమముగా నాశస్థిరములు పరముగా నున్నవి. (అప్పకవీయమున స్థిరపరకతయాగునట్లె.) ఇట సరళస్థిరపరకతలో ద్రుతము లోపించిన దనవచ్చు. కాని (యప్పకవిసమతె) అహోబలుఁడుసు సరళస్థిరపరకతచే నని కాక వాక్యాంతమగుటచేతనే లోపించిన దని తలఁచెను. ఇచ్చట ద్రుతలోపము వ్యవస్థితమైన దని 'అత్ర వ్యవస్థితః' అని పేర్కొన్నాఁడు. అనఁగా నిచ్చట ద్రుతలోపము నిత్యముగా వచ్చునని భావము. లోపము రానియెడల సంశ్లేషాదులలో నేయది వచ్చినను నిచ్చట గణభంగమగును గావున లోపము నిత్యమని(అప్పకవియొక్కయు తనయొక్కయు లక్ష్యములకు)అహోబలుఁడు చేసినవివరణ మన్నమాట యిది. 'యత్ర న ఛందోవిరోధః తత్ర వాయం లుగ్వైకల్పికః యత్ర తు ఛందోవిరోధః తత్రవ్యవస్థితోఽయం విధిః' అని ముందుగానే చెప్పుట గమనింపఁదగు. ఇట లోపనిత్యత వ్యవస్థితమైనది. ఇంక 'తోరంబుగన్ ఇతిపాఠే విరోధా న్నాస్య ప్రవృత్తిః' అని చెప్పినచోఁ బాదాంతమునఁ (పద్యాంతమును) గణవిరోధమునుబట్టి

లోప మనలే లేదు. (కలుషకరః అత్ర ప్రస్తుతిః) కాఁగా నహో బలునియీవివరణమునుబట్టి పంచస్థానములు మఁ నవకళసిరపరకతచేఁ గాక ప్రస్తుతసూత్రముచే నై నలోపముగా [illegible] యున్నది. దీనిని బట్టియు నప్పకవియలక్ష్యమున [illegible] దాంతమున ద్రుత మిూలక్షణముచే వాక్యాంత్య మవుట లోపించి [illegible] నని గుర్తింపవచ్చును.

ఇంకఁ బిదప నప్పకవి (లోపము వికల్పము గాఁ) లోపము లేమికి రెండవపాదమును లక్ష్యము చేసె నఁదగు. 'కాంతా లలామ నసఘు' అనుచో (నచ్చరకళ [illegible] న్నది.) ద్రుతము వాక్యాంతమున నఁగాఁ బాదాంతమున లోపించదు. నరిగా నిదే మార్గములో నహోబలుఁడును '[illegible] అత్ర వికల్పః విరోధాభావా' త్తని (యప్పకవి [illegible]) లోపము వికల్ప మనెను. కాంతాలలామ-అనఘు-అన్నను [illegible] లేదు గాన లోపము వికల్ప మని యప్పకవి యభిప్రాయ [illegible] నై యున్నదిది.

పెరిమను - గలియు అనుచో [illegible] పాదాంతమునఁ వరువాతిపాదము మొదటిపరుషమునకు [illegible] (ద్రుతము లోపింపక) స్వత్వ మున్నది. నాల్గవపాదాంతమున ద్రుతలోపము నిత్య మని (అహోబలపతియభిప్రాయమును గణము [illegible] దగు.

ఇట్లహోబలుఁ డప్పకవియభిప్రాయమునే గ్రహించి వివరించుటలోఁ గొంత ప్రమాద మేర్పడిన దని యంగీకరింపవచ్చును.

అహోబలుని యాలోచనాధోరణిని గమనించుట కాతఁ డంతకు ముందు వ్రాసిన కొన్ని వాక్యములు పరిశీలనార్హములై యున్నవి. "ఏవం స్థితే నై జయంతీ నవా శుకనాదములను ఇత్యాదిషు జైమిని భారతాద్యుక్తిషు సమాప్తౌ స్వత్వం [illegible]మేవ. ద్వితీయాది చరణాది వర్ణేషు పరేషు తు స్వత్వం నిర్బాధమేవ. నచాత్ర వాక్యాంతగతేతి

సూత్రవ్యాపారః పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతా మిత్యథర్వణనిషేధాత్ "__

దీనిలో నాల్గవపాదాంతమున స్వత్వ మసాధువు గాని మొదటి మూఁడు పాదములలోఁ జివర నుండవచ్చు నఁట. వాక్యాంతగత సూత్ర మిటఁ బ్రవర్తింపమి రెండు మొదలైన (2-3-4) పాదముల మొదటి వర్ణము పర మైనపుడు స్వత్వ ముండవచ్చును గాన నాల్గవపాదమునం దన్న నథర్వణుఁడు స్వత్వమును నిషేధించె నని యహోబలుఁ డనుచున్నాఁడు. వాక్యాంతగతసూత్రప్రసక్తి కలిగించి జేసి యివ్వాక్యములు పరిశీలింపవలసియున్నవి.

పద్యాంతమున స్వత్వ మసంగతమనియు 2-3-4 పాదాది వర్ణపరకతలో 1-2-3 పాదాంతముల ద్రుతమునకు స్వత్వముండవచ్చు ననియుఁ జెప్పిన పిదప 'వాక్యాన్తగతసూత్రము ప్రవర్తింప దనుచున్నాఁడు. అనఁగా నెట్టి? (అథర్వణుఁడు పద్యావసానమున స్వత్వ మసాధు వనుచున్నాఁడు గావున వ్యాజమునను అనుచో స్వత్వమసాధు వే) పద్యావసానమున స్వత్వము లే దని యథర్వణుఁడు చెప్పెను గాన నిట వాక్యాన్తగతసూత్రము ప్రవర్తింప దని యభిప్రాయమా ? పద్యాంతమునందున్న ద్రుతమునకు (దరువాత నేవర్ణములు పర నగుట సంభవింపదు గావున) బింద్వాదు లెట్లును రావు. అథర్వణుఁడు స్వత్వ మసాధు వన్నాఁడు గావున ద్రుత మట్లే యుండును. అట్టియెడల నా ద్రుతము లోపించియే పోవలె. అనఁగా వాక్యాన్తసూత్రము ప్రవర్తించు ననియే చెప్పవలె. ప్రవర్తింప దనుచున్నాఁ డేమి ?

పైఁగా వాక్యాన్తసూత్రసందర్భమున 'తోఁటంబుగాన్ ఇతి పాఠే వికల్పః' అన్నాఁడు. కావునఁ బద్యాంతమునందలి ద్రుతమున కాసూత్రముచే లోపము రా దనుటకు వీలు లేదు గదా.

"పదాద్యవసానమున స్వత్వము సాధువు గా దనునధర్వణకారికచే నిచ్చట వాక్యాంతగతసూత్రము ప్రవర్తించుటకు నవకాశము లేదు". అనువాక్యమునుబట్టి యిట్లర్థము వచ్చును. వైజయంతీ... వ్యాజమునను అనుచోఁ బాదాంతమున వాక్యాంతగతసూత్రము ప్రవర్తించినచో 'వ్యాజమునను' అనుస్వత్వము సాధింపఁబడు నన్నమాట. ఆసూత్రము ప్రవర్తించుటచే స్వత్వ మగుట యెట్లు? (స్వత్వనిషేధమువలన వాక్యాంతసూత్రముచే స్వత్వము సాధించుట కుదురదని యమరేశంవారును (256. కవిశి.) బేర్కొనిరి). ఆసూత్రము ద్రుతమునకు లోపము చెప్పునదే కాని స్వత్వమును విధించునది కాదే.

అహోబలపతి ప్రాయమున నిట్లూహితము. 'వ్యాజమునను' అనురీతిగా స్వత్వ ముండరాదు. బిందుద్వాదులు నుండవు. లేకున్న నెట్లు? వ్యాజమునన్ - అని యుండవలె. లేదా 'తోరంబుగా' అన్నట్లుగా 'వ్యాజమున' అని యుండుట యొప్పును. వాక్యాంతసూత్ర మిటఁ బని చేయ దనుటలో లోపమే రా దని యర్థము చేయుట యచ్చోటియహోబలునివ్యాఖ్యకే విరుద్ధము గదా. ఇంక వాక్యాంతసూత్రము పనిచేయుట యన నేమి?

'వాక్యాన్తగతపదానాఞ్చ' యనుసూత్రము 'లోపము వైకల్పికముగాఁ జెప్పుచున్న' దని యహోబలుఁడును స్పష్టము చేసె. లోపము వచ్చిన తోరంబుగా అని యగును. ద్రుతమునకు లోపము లేనపు డేమి యగును. స్వరూపస్థితి యందునా. అహోబలుఁడు అలుకిచ అనుసూత్రమున ద్రుతమునకు చశబ్దముచేత స్వరూపస్థితి నంగీకరించుచో దానిని 'ను'స్వరూపముగాఁ జూపుట స్పష్టమే. అదే విధముగా నిచ్చట నయితము లోపము వైకల్పికమగుటచేత లోపము లేనపుడు ద్రుతము స్వరూపస్థితి నుండవలెఁ గదా. అది ను(ని) అని యుండును. లోపించునపుడు నకారవుఁబొల్లు కాఁగా లోపమ్ము

లేనపుడు నుస్వరూపము నందుట యెట్లు? అను ప్రశ్నకుం దావు లేదు. ఏల యన వాక్యాన్తసూత్రమున ద్రుతమునకు లోపము విధించుటచే నుత్వలోపము చేసి యున్నాఁడు. కాని సంశ్లేషము గాదనె. సంశ్లేషము రానపుడు వాలుక్కనుటవలన లోపము లేనపు డేమి కావలె తాన్ ఘనుఁ డనియే యుండవలెఁ గదా. కానీ యుహో. తాను ఘనుఁడు నేను వింటి నని యిప్పుట గమనింప వచ్చును. అట లోపించునపుడు (ఉత్వలోపము చేసి) నకారమునే లోపింపఁజేసియు లోపము లేనపుడు మఱల నుస్వరూపము నిచ్చెను. సీతన్ గజరాజగమనే త్యాదులయందును నిట్లే లోపించునది నకారమ్ముఁ బోల్ల కాఁగా స్వరూపావస్థితి 'ను'వర్ణరూపమై యుంట గమనింప వచ్చు. కావున నట్లే యిట వాక్యాంతమున ద్రుతము లోపింపక యట్లే యున్న దనఁగా స్వరూపముతో నున్న 'ను'స్వరూపము నందును.

కాఁగా 'వ్యాజమునన్' అనుచో వాక్యాంతసూత్రముచే ద్రుతములోపించిన వ్యాజమున - అని యగును. లోపింపకున్న వ్యాజమునను అని యగును. కావున వాక్యాన్తసూత్రము ననుసరించి ద్రుత మిట లోపింప లే దని యూహించినపక్షమున స్వరూపస్థితితో వ్యాజమునను అనురూపము సిద్ధించును గదా. దీని నసాధువన నేల? అనఁగా నథర్వణుఁడు స్వత్వమును నిషేధించెను. వాక్యాన్తసూత్రవ్యాపార మిట లేదు. అనఁగా నాసూత్రముచే ద్రుతము లోపింపక వ్యాజమునను అని స్వరూపస్థితిలో నుంట కుదుర దని యుహోబలునభిప్రాయ మనవచ్చును.

మొదటిమూఁడుపాదములం దన్న ద్వితీయాదిచరణాదివర్ణపరకత యుండుటచే స్వత్వమున కవకాశము గలదు. పద్యాంతమున నింక నేవర్ణము పరముగా నుండదు గదా. అట వ్యాజమునను అ

రీతి స్వత్వ మెట్లు? అనఁగా 'వాక్యాన్తగతపదానాఞ్చ' యను సూత్రము నుపయోగించినచో లోప వైకల్పికతచే లోపము రానపుడు స్వరూపావస్థితిచే వ్యాజమును గావచ్చును. కాఁగాఁ బద్యాంతమున వాక్యాన్తసూత్రముచేతనే స్వత్వస్థితి కవకాశ మున్నది. కాని యది యిట నుపయోగింపదు. అథర్వణుఁడు నిషేధించుటవలన - నని యహోబలునియభిప్రాయము గ్రహింపఁదగును.

అయిన లోపము రానపుడు స్వరూపావస్థితి యుండవలె. అది నుస్వరూపము. అట్టియెడలఁ ద్వారంబుగాని అనుచో లోపము వైకల్పికమున లోపము లేనపుడు ద్వారంబు గాను' అనియుండునా? అపుడు గణవిరోధ ముండదా? ఈయనుమాన మహోబలునికిఁ గలుగక పోలేదు. అందుకే 'పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్య కథ్యతే' యనునథర్వణ లక్షణమును జూపెను. 'క్వచిత్పద్యభేదే నైవ లుక్' - ద్రుతమునకు లోపము రాదు. అపు డెట్లు? సంశ్లేష మగును. ఈయాథర్వణము నింతకు ముందొకసారి చూపియున్నాఁడు. మఱల నిటఁ బ్రస్తావించుట (ద్వారంబుగాను) కరుణాంబుధికిని అనురీతిగా నుండదని సూచించుటకే యని గ్రహింపవచ్చును.

సరిగా నిదే సందర్భమున నప్పకవీయమునందు నీవిషయము ప్రస్తావింపఁబడుట గమనార్హమయి యున్నది. వాక్యాన్తగతసూత్ర వివరణానంతర మప్పకవి యిట్లు చెప్పుచున్నాఁడు. 'నాంతపదాంత ద్రుతమున కెంతయుఁ బ్రథమాబహూక్తి కే తెంచుతృతీయాంతస్థంబు నకుం బద్యాంతంబున స్వరము లోప మగుఁ గొన్నింటన్. (5-138) ఉరులలోప మన్యథా సిద్ధము. ద్రుతప్రకృతికద్రుతమునం దుత్వ లోప మిట ప్రసక్తము. శ్లిష్టతా నస్య కథ్యతే యనుదానియభి ప్రాయ మిదియే. 'నలినాక్ష తెలుఁగుపద్యంబులకడపల నుండునలల పొల్లులకు మహీస్థలి గుడుసులు శృంగములును నిలుపరు చదువునెడ

లాక్షణికు లెచ్చోట్లన్'- (సూ-139)-దీని కనుగుణముగ నున్నది, వ్యాక రణమునను' అనుచోట 'ను' (ఇది ... తనిమతమున స్వత్వము గదా.) సాధువు గా దన్న యహోబలపండితవివరణము. ఇటఁ బొల్లుగా నుంచుటకు వీలు లేదు గదా.

నన్నయాథర్వణులు '...క్యాన్తగతపదానాఞ్చ' యనియు 'వాక్యావసానగస్య స్యాత్' త్రిటను ద్రుతలోపము మాత్రమే చెప్పి సూరివలె ద్రుతస్వరమునకు లోపము చెప్పియుండకే దనుశక్తి ప్రాయమునకుఁ గొంత సమాధానము. వాక్యావసానమునఁ గవిభల్లట సూత్రముచే నెట్లును నత్వాభావము సాధించికొనవచ్చును. 'అల్లనోడు దున్' అనురీతిస్థలములం దనుస్వారలోపము నన్నయాథర్వణులు చెప్పలేదు గదా యని ఓ...సు(న్)అనియే యుండవలె నని తన్మతముగా వజ్ఝలవారు చెప్పిరి. ఇంకఁ గవిభల్లటసూత్రముచే ద్రుతలోప మయిన దంతి... అవసర మయినచోట్ల ద్రుతమని పేరు పెట్టుకున్నను సంశతి...మునకు లోపమును సాధించుకొనుచునే యది విధింపలేదు గాన వీరిమతమున ద్రుతము పొల్లనకారమే యని నిర్ణయించుట యొప్పునా?

పై యహోబలపతియభిప్రాయము ననుసరించి చూడఁగా వాక్యావసానమున ద్రుతలోపము లేనపుడు స్వరూపావస్థితితో 'ను' ఉండును. పద్యభేదావసానేషు శ్లిష్టతా యను వి. వి. వచనమునుబట్టి శ్లిష్టతచే అల్లనోడుదున్ అనురీతిగ స్వరలోపము సిద్ధమే యగును. ఇట్లు పద్యావసానమునమాత్రము ద్రుతలోపము చిం. చెప్పఁగా ద్రుతస్వరలోపము వి వి చెప్పియున్నది. పద్యభేదావసానేషు శ్లిష్టతా' యనుటచే సామాన్యగద్యలయందు వాక్యావసానమున ద్రుతస్వరలోపము (మిక్కిలియరు దగునగు) విశేష మగును.

ఇట్లహోబలునిమతమున ద్రుతము పొల్లనకారమ యైనను ద్రుతస్వత్వము స్వరసహితమువుటంజేసి యిటఁ గొంత సమన్వయమున

నన్వృత్త కవకాశము గల్గినది. ద్రుతస్వత్వములను గుర్తించు నెడల నీయహోబలుని వాక్యము లిట్లు సముచితముగా నన్వయింపఁగలవు.

అథర్వణుఁడు స్వత్వమును నిషేధించుటకును వాక్యాన్తగత సూత్రవ్యాపారము లేకుండుటకును సంబంధమును గుదిర్చియుండుటం జేసి యహోబలునిమతమున వాక్యాన్తగతసూత్రవ్యాపారము లేమి నిటఁ బద్యాంతస్థలమునసే కాని 1-3 పాదములయెడ సమన్వయింప రాదు.

కాని యీ వాక్యములకును ప్రస్తుతస్థలమున సంబంధము లేక పోలేదు. అహోబలుఁడు మొదటి (మూఁడు) పాదములయంతమందలి ద్రుతమునకు స్వత్వ ముండవచ్చుటను సాధించుటకై 'ద్వితీయాది చరణాదివర్ణేషు పరేషు' అని పేర్కొనియున్నాఁడు. అట్టియెడఁ బై సూత్రలక్ష్యస్థలములయందు ద్రుతము తరువాతి పాదము మొదటి సరళస్థిరములు పరము లవుటచేతనే ద్రుతము లోపించిన దని నిర్ణయింపక 'వాక్యాన్త' సూత్రముచే నేల చేసెను? వలయు నను కొన్నను గణానుసారముగా వ్యవస్థచేయుట కా 'లుగ్వా' సూత్రమునందును వాశబ్ద మున్నదే కదా - అని యట వాక్యాంత ముగుట లోప మను టయు నిట ద్వితీయాదిచరణాదివర్ణ పరకతఁ బ్రస్తావించుటయు నెట్లు సమన్వయించు.

మొదటిపాదములయంతమందలి ద్రుతము 'వాక్యాన్త' సూత్ర ముచే వికల్పముగా లోపించును. లోపము వికల్పము గాన నట లోపము లేనిపక్షమునఁ దరువాతిపదాదివర్ణ పరకత ననుసరించి బిందువాదులు పొందును. (చివరి పాదాంతమునందలి ద్రుతమునకు మాత్రము తరువాత నేవర్ణము పరముగా నుండదు గావున నట వాక్యాన్తసూత్రముచే ద్రుతము లోపించియే పోవును. అప్పుకవి పద్యమునఁ జతుర్థపాదాంతమున నిట్లి లోపించిన దన్నమాట.

లేనిచోఁ బద్యభేదావసానేష్వ నుకారిక ననుసరించి శ్లిష్టత యేని గలుగు ననఁగాఁ బద్యాంతమున ద్రుతము లోపించి యేని బోవలయు. లేదా పొల్లయై నిలువవలయుఁ గాని 'ను' అనురీతిగా స్వరూపావస్థితితో మాత్ర ముండ దని యహోబలునిసిద్ధాంతముగా గుర్తింప వచ్చును. అయినఁ బాదాంతమందలి ద్రుతము లోపించినను ఛందోఽనుగుణమై యుండునెడల నట సరళస్థిరము లగు తరువాతి పాదాదివర్ణము పరమవుచో లుగ్వా సూత్రప్రసక్తి యుండదు. అట్లు ఛందోనుసారముగా లోపింపకుండవలయుచో నచటఁ దరువాతివర్ణ పరకత్వము ననుసరించి బింద్వాదివికారములవును.

అహోబలునియీయభిప్రాయము ననుసరించి మొదటిపాదములందు ద్రుతమునకు స్వత్వస్థితియు సంగీకృత మయినది. అప్పకవి లక్ష్యపద్యమునఁ దృతీయపాదాంతమున పెరిమను (గలయును) అనురీతిగా స్వత్వస్థితి యిట్లు సంగ్రహింపఁబడిన దనవచ్చు.

కాని యీయప్పకవ్యహోబలుల యభిప్రాయ మంగీకారయోగ్యముగా లే దని చెప్పక తప్పదు. ఇట వజ్ఝలవారు 'పాదాంతద్రుతమున కుత్తరపాదిహల్లు పర మగును. అచ్చు పర మగునప్పుడును వాక్యాంతద్రుతలోపశాస్త్రము వర్తిల్లనేర' - (306) దనుట యెంతయు నుచితముగా నున్నది. మొదటిపాదములద్రుతము వాక్యాన్త సూత్రముచే లోపింపదు.

అప్పకవియుఁ దదనుసారముగా నహోబలుఁడును మొదటిపాదములతుది ద్రుతము లోపించుచోట్ల సరళస్థిరపరకస్థితులనే చూపిరి. అట 'లుగ్వా' సూత్రముచేతనే లోపించిన దనవచ్చు. 'వా' యున్నాఁడు గదా యని లోపము రాక సంశ్లేషమును (స్వత్వమును) రావలసియున్నది యని భావింప నక్కఱ లేదు.

ఇంక నప్పకవ్యహోబలు లిద్దరును స్వరపరుషపరకస్థితిలోఁ బాదాంతద్రుతలోపమును స్పష్టము చేయలేదు. (అహో. వికల్ప

మనార్హం(షు) పరువపరకత్వమున వాక్యాన్తసూత్రముచే ద్రుతము లోపించునెడల నాపరువ మట్లే యుండినచో (స్వరము నట్టె) కాని యట్టి స్థితి కావ్యములం దెచ్చటను గానరాదు. అక్కడఁ గూడ గణానుసారముగా నాయాయికార్యములతోఁ బ్రయోగము విస్పష్టమే.

ఇట వి.వి. కర్త "వాక్యావసానగస్య స్యాల్లోపో నః ప్రాయశోఽత్ర హి" అని పేర్కొనెను. 'వాక్యాన్తగతపదానాఞ్చ' యను సూత్రము 'లుగ్వా' యని చెప్పుచుండఁగా వి.వి. 'ప్రాయశః' అనుట విశేషము. వాశబ్దముచే వ్యవస్థతో బహుళముగా నాయాప్రయోజనములు సాధించుటకును, 'ప్రాయస్స్యాత్త్యుత్తమాదికస్యేతి' యను సూత్రమునందలి ప్రాయశ్శబ్దమునకు బహుళార్థకత్వము చెప్పుటకును నిచ్చోఁ గారికలోఁ బ్రాయశ్శబ్దమునకును సంబంధ మొకవేళ నున్నదేమో నిశ్చయించి చెప్పలేము.

వాక్యావసానమునం దనుటచేఁ బద్యాంతమునసే యను యర్థము చేయఁదగునా? అవసాన మనఁగా నాపిదప వర్ణము లేవియు లేకుంట గాదా? (ఆపాదమునందుఁ దరువాతి నింకే వర్ణము లుండవు పరమైన నయ్యది తరువాతిపాదాదివర్ణమే. పాదావసాన మన్నను చతుర్థపాదాంతమున ననియే యర్థము చేయునక్కరలేదు.) కాని యీ వి.వి. కర్తయే యింతకు ముందు 'నస్యాద్వాక్యవిరామే తు సంధ్యభావోఽపి దోషకృ' త్తనుచో వాక్యవిరామ మనెను. వాక్యవిరామ మన్నను నిట వాక్యావసాన మన్నను భేదము లేదు గదా. (విరామోఽవసానమ్) ఇంక నట వాక్యవిరామ మనుసందర్భముఁ బద్యాంతమునయం దని యర్థము చేయలేదు. సరియుఁగావు - ఎఱుఁగుము అనురీతిగాఁ బాదావసానము గ్రహింపఁబడియున్నది. దాని ననుసరింపఁగా నిచ్చోట 'వాక్యావసానగస్య' అన్నను మొదటిపాదములం దీలోపము లేదనియుఁ, బద్యాంతమునమాత్రమే యనియుఁ జెప్పుట కవకాశము

లేదు. అట్లయిన నచోఁ బద్యాంతమున సంధి లే దని చెప్పిన నట నుద్దిష్ట మగు ప్రయోజనము సిద్ధింపనేరదు. పాద మని సామాన్యముగాఁ జెప్పుట యట నొప్పదు. కాఁగా నహోబలుఁ డీరెండుస్థలములను గొంతభిన్నముగా వివరించెను. ఆభేదము సమంజసము గాకపోయినను నింకొకతీరు భేదము మాత్రము గలదు. వాక్యావసానమునఁ జెప్పినసంధ్యభావాంగీకారము పాదాంతమున సామాన్యముగా గ్రాహ్యము. అందుకే సూరి 'వాక్యావసానంబున సంధి లేమి' యని సూత్రించి కావ్యములం బాదాంతమందు చూపట్టుటను వివరించెను. ఇంకఁ బ్రస్తుతస్థలమునందలి ప్లుతలోపము పద్యాంతముననే కాని పాదాంతమున నని సామాన్యముగాఁ జెప్పరాదు. అందుకే సూరి సంధ్యభావమును జెప్పునప్పుడు 'వాక్యావసానంబున' నని చెప్పియును నీప్లుతలోపసందర్భమున నవసానంబునందు ప్లుతస్వరంబునకేని - నని యవసాన మనియే చెప్పెను. మొదటిపాదములయందు ద్వితీయాదిచరణాదివర్ణపరకత్వముండును. పద్యాంతమునందలిదానికి నేదియుఁ బరముగా నుండదు గదా. ఇంకఁ దరువాతిపద్యమో గద్యమో గ్రహించుట యుచితమా? (తులకాదులు విశేషముగాఁ జెప్పఁబడుట గమనార్హము.)

మఱి యట్టిభేదము చిం, వి. వి. లందు స్పష్ట మగుట యెట్లు? ఇట్టియెడల నొక్కవిధ మగుసమన్వయము నాశ్రయింపవచ్చు నని తోఁచుచున్నది. 'వాక్యవిరామ' మనుచో గద్యములయెడలఁ బ్రసిద్ధ మగువాక్యలక్షణము గ్రహింపవచ్చును. చిన్నయ 'పాదాంతములందు' యని విశేషముగా వివరించుట ననుసరించి యాయర్థమును విశేషముగానే కారికయందును గుర్తింపఁదగును. (ఏ 'తు' శబ్దమునకో ముడిపెట్టినను దప్పులేదేమో. వాక్యావసానంబున - అని చెప్పిన సూరి లక్షణమున పాదాంతమందు యనునర్థ మెట్లు విశేషమో యట నట్లే

యనియుఁ జెప్పఁదగు. అనఁగా వాక్య మనునది పద్యములను దృష్టియం దిడుకొని చెప్పినది గా దనియు ప్రసిద్ధ వాక్యలక్షణమునుబట్టి తదర్థము వనే ప్రయుక్త మనియుఁ జెప్పఁదగును. ఇంకఁ బద్యములయందుఁ వాక్యము పూర్తి గాకున్నను దదంతమున ద్రుతలోపము చెప్పుకొన వలె. సంధ్యభావస్థితిమాత్రము పద్యావసానమునఁ జెప్పవలసినయవ సరము లేదు. అట సంధి లేమి దోషము గా దన్న సంధి యిష్టమే యనవలసియుండు. పద్యాంతమున సంధి యంగీకృత మవు టెట్లు? పద్యమధ్యమున వాక్యము పూర్తి యైనను నట ద్రుతలోపము ప్రసక్తి యుండుట లేదు. (పాదాంతమున నైనను పాదమధ్యమున నైనను) సంధ్యభావసంపర్కమునఁ బాదమధ్యమున వాక్యాంత మైనను సంధ్యభావ ముండదు పాదాంతమున వాక్యాంతము గాకున్నను సంధ్య భావ ముండవచ్చు. ఇట్టిస్థితి ననుసరించి చూడఁగాఁ బద్యములయెడ వాక్యము నిట్లు గుర్తింపవచ్చును.

పద్యము మొత్తము వాక్యము. ఇట్టి వాక్యావసానమున నవఁగాఁ బద్యావసానమున ద్రుతలోపప్రసక్తి యుండు.

కాని 'సంధ్యభావ' లక్షణముప్రసక్తి లేదు.

పద్యమునఁ బాదాంతమున (వాక్యాంత మైనఁ గాకున్నను) ద్రుతలోపము ప్రవర్తింపదు. కాని 'సంధ్యభావ' లక్షణప్రసక్తి యుండు.

ఇట్టి యెడఁ బద్యమున 'వాక్యావసాన' ప్రసిద్ధ వాక్యలక్షణము నకు భిన్నముగా గుర్తింపవలసియున్నది. దీనికిఁ బ్రత్యేక మయిన యాధారము గానరాదు. ఏ మైనను పాదమధ్యమున వాక్యము పరిసమాప్త మైనను సంధ్యభావము దోషము గాకుండుట వాక్యాంత ద్రుతలోపప్రసక్తి లేకుంట, అనుని రెండులక్షణములు సమానముగాఁ

ప్రవర్తింపవు. (ప్రసిద్ధవాక్యలక్షణ మిట సరిపడక 'పద్యము' వాక్యము అని చెప్పవలసి యుండుట విశేషము.) ఇటఁ దప్ప నితరలక్షణములం దీరెండును బరస్పరవిరుద్ధము లగుట గుర్తింపవచ్చును.

వాక్యవిరామ, వాక్యావసానములం దని సమానముగానే చెప్పఁబడిన యీలక్షణములు వచనములయందు సమానముగానే సరిపడుచున్నవి. కానీ పద్యములందు విరుద్ధముగా వర్తించుచున్నవి. వచనములం దృష్టియం దిడుకొని యీలక్షణము చేయఁబడిన దనియుఁ బద్యములందలి వైలక్షణ్యమును విశేషముగనే గుర్తింపవలసియున్న దనియుఁ జెప్పఁకొనఁదగును.

మొత్తముపై నీవాక్యావసానద్రుతలోపము పద్యములం బాదాంతములందుఁ గాని (చరమేతరములు) పాదమధ్యములందుఁ బ్రసిద్ధవాక్యాంతము లందుఁ గాని చెల్లుట లే దని ప్రయోగానుసారముగ స్పష్ట మగుచున్నది.

అప్పకవ్యాదులు పాద మొక్కొక్కటి వాక్యముగాఁ బరిగణించుటను కేవల మసమంజసముగాఁ ద్రోసి వేయలేము. పద్యము పఠనముతీరుంబట్టి చూడఁగా యోగ్యతాకాంక్షాదులతోడివాక్యలక్షణము ననుసరించి గాక పాదాంతమునందే విరామ ముండుట గమనింపవచ్చును. వచనములందు వాక్యమున కంతమున విరామము గల్గుచుండ నీపాదపద్యములయందుఁ బాదాంతముననే గల్గుట యనుభవసిద్ధము. వృత్తములం దెల్ల నిట్టిస్ఫూర్తి స్పష్టముగా నిర్ణయింప నవకాశము చాలను. సంహితోచ్చారణము లేమి ననుసరించి నీపాదములందు నొక్కొక్కపాద మొక్కొక్కవాక్యముగా నీలాక్షణికు లభిప్రాయపడియుందు రనవచ్చును.

పాదాంతమునందలియిట్టివిరామముచేఁ దరువాతిపాదాదివర్ణపరకతలో నైనలోపముగా సమన్వయించుటకంటె వాక్యాంతతచే నైనద్రుతలోపముగా నెంచుట యుచిత మని తలంచియుండవచ్చును.

అయినను స్వరపరమపరకత్వస్థలమునఁ బాదాంతమందు ద్రుతము లోపించుట గానరాదు. అద్దానింగూర్చి యీయిర్వురు నేమియుఁ జెప్పలేదు. బహుశః అటఁ గూడ లోపింపవచ్చు ననియే యభిప్రాయపడియుందురు. అహోబలుఁడుమాత్రము స్వరపరకత్వమున వికల్పతను జెప్పియుంట గమనింపవచ్చును.

సీసాదులలోఁ బాదమే వాక్యముగాఁ బేర్కొనుటలో నిట్లాధారము కొంత యూహింపఁదగియున్నను నిట్టిలక్షణమునకు శాస్త్రమునఁ బ్రమాణము లభింపమింజేసియుఁ బ్రయోగములును దీనితో నానుకూల్యమును దెలుపమింజేసియు నీయభిప్రాయ మంగీకరింప నవకాశము తక్కువ.

మొత్తముపై వచనస్థలములందు వాక్యమన్న వాక్యమె. కాని పద్యములందు నీలోపము పద్యాంతమునకే సంబంధించినదైనది. వాక్యవిరామమే యనుచోఁ బాదముగాఁ జెప్పఁకొనవలసియుండ నిటఁ బద్యముమాత్రము గ్రహించి తదంతమున నని యర్థము చెప్పవలయుట భేద మని గుర్తింపఁదగియున్నది.

చిన్నయ సైతము పద్యములయెడఁ దదంతముననే యవుటను నవసానంబునందు ద్రుతస్వరంబున కేని ననుసూత్రస్థలవివరణముచేత సూచించె ననవచ్చు.

అహోబలుఁ డాయెడల ద్రుతలోపమునుగూర్చి ప్రవృత్త్యప్రవృత్త్యాదులు వివరించెను. ఈలోపము పద్యములం దంతతలోనే యని సూచించుచున్న చిన్నయ సైతము పైయప్పకవ్యహోబలాదులయభిప్రాయము నాదరించెనా యని యనుమానము. లేక తత్ప్రభావమునకు లోఁబడి యుండవచ్చును. లేనిచో నట నట్టివివరణ పంక్తు లేర్పడెడివియుఁ గావు. అహోబలపతియభిప్రాయమున కను

గుణ మైయున్న వి. వి. వచనము పై తము సూరివివరణమునకుఁ గార ణము గావచ్చును.

ప్రసక్తి ననుసరించి యుచ్చోట సూరివివరణమునుగూర్చి పరామ ర్శించుట యప్రస్తుతము కాదు

చిన్నయభ్రాంతి యేమి ?

బాలవ్యాకరణమునందు సూరియును అవసానంబున ద్రుత స్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు నని యీయర్థమునే స్మరించి యిట్లు వివరించెను. 'ఈలోపంబు పద్యాంత ములయందు గణానుసారముగ వ్యవస్థితం బయియుండు. గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వం బు లేదు. అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్' ఈవాక్యమును గూర్చి వజ్ఝలవారు 'ఇట్టియేర్పాటు బహుళగ్రహణమహిమచే సిద్ధ మగుచున్నది. ఈసందర్భమునందలి సూరివివరణము కొంత యనాలోచితముగ నున్నది ...అరయ నరయ 'పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతామ్' అనుసథర్వణ కారికచొప్పున నైజయంతికవాంశుకవ్యాజమునను అనుజైమినిభారత ప్రయోగ మసాధు వనెడియుహోబలోక్తి సరి గా దనియు నాయథర్వణ వచనము గుర్వవసాయివృత్తవిషయక మనియు నిట్లు సూరి వన్నయాథర్వణమతమందలిస్వత్వము స్వరూపమును గ్రహింపఁజాలక భ్రాంతిమూలక మగువివరణ చేసెనా ? అని ఆలోచింపవలసియున్న (వ్యా. సం. స. 3(8) పనిరి.

ఇందు సూరిభ్రాంతి యెట్టిది? పొల్లనకారమె ప్రాచీనుల మతమున ద్రుత మన్న వజ్ఝలవారిమతములో స్వత్వము ను (ని) స్వరూపముతో నుండుట యసంభవము. కావునఁబద్యావసానే సర్వేషా మని నిషేధింపఁబడినస్వత్వము నుస్వరూపము గలది గాదు. వజ్ఝల

వారివలె వహోబలుండు చిం., వి. వి. ల మతమున ద్రుతము పొల్లు నకారమే యని వివరించియు దానిస్వత్వమును మాత్రము ను (ని) అను రీతిగా గ్రహించెను. దీనివలనఁ బ్రస్తుతకారికచే నిషేధింపఁబడిన స్వత్వమును నట్టిదే ను-ని అన్నది పద్యాంతమున నుంచరా దని పేర్కొనెను. సూరి స్వత్వము లే దనుటలో భ్రాంతి యేమి? స్వత్వము 'ను' అని తలంచుటయా?

వజ్ఝలవారు చిం. వి.వి. లమతమున ద్రుతస్వత్వసంశ్లేషములను నీవిధముగా వివరింతు రని చిన్నయ ముందుగా నెఱుంగని మాట వాస్తవమే. అంతకు ముందటి బాలసరస్వతియు, నప్పకవ్యహోబలులును వివరించినతీరు నాధారము చేసికొని సూరి యొకమార్గము ననుసరించెను. అది యుచిత మని స్పష్టము. కాఁగా నన్నయాథర్వణుల మతము నెఱుఁగమియుఁ దన్మూలమునఁ జిన్నయయందు భ్రాంతియును లేమి తెల్లము.

గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వంబు లే దనుటలో భ్రాంతి యేమి? 'పద్యచ్ఛేదావసానేషు శ్లిష్టతా' యని సంశ్లేషమును జెప్పవలయునా? 'బుధసేవన్' అనునది సంశ్లేష మని యభిప్రాయము. ఏది యే మైనను వీరియభిప్రాయమునుబట్టి చూడఁగా గుర్వవసాయి పద్యము తుదనే కాక లఘ్వవసాయిపద్యములతుదను స్వత్వము లే దనవలె నన్న మాట. స్వత్వ మనఁగా మీఁదివర్ణముతోఁ గూడి యుండుట యని వీరియభిప్రాయము గాఁబోలు నట్లు చెప్పఁదగు నన్న మాట. పద్యావసానమందలి ద్రుతము తరువాతి (గద్య) పద్యము మొదటివర్ణముతోఁ గలియు దని వేఱ చెప్పవలయునా? పూర్వపద్యమందలిస్వరమునకుఁ బరపద్యాదిస్వరము పర మైనప్పుడు సంధి చేయ వచ్చునా? స్వత్వసంశ్లేషములనిర్వచనమం దేర్పడినయసహజత్వము వలననే వజ్ఝలవారిమతమునఁ గొంతయనర్థ మేర్పడి యిది 'చిన్నయ భ్రాంతి' యనిపించిన దనవచ్చు.

కాని 'వాక్యాన్తగతపదానాఞ్చ' యనుసూత్రమునొద్ద సహోబలపతి యాలోపము గణానుసారముగా వ్యవస్థితమై యుండుటను నిరూపించినతీరే యీసూరివివరణమునకుం జాలవఱకాధార మని గుర్తించుటమాత్రము తప్పదు. అయినను జిం., వి. వి. లయం దభిప్రాయ మేదియైన నవుంగాక. సూరి తాను జెప్పినస్వత్వసంశ్లేషముల ననుసరించి గుర్వవసాయిపద్యములతుదిద్రుతమునకు సంశ్లేషము చెప్పకుంటయు 'వ్యాజమునను' అనురీతి స్వత్వము సాధింపంబడుట కనువుగా గుర్వవసాయిపద్యములతుదనే స్వత్వము లే దనుటయు నొప్పునే కద. తద్భిన్నముగాం జెప్పంజో దమసిద్ధాంతమున కనువుగా నున్న దని వజ్ఝలవా రంగీకరింతురా? సూరి తనసిద్ధాంతమునకు విరుద్ధముగాం జెప్పె నని విమర్శింతురా?

గుర్వవసాయి యగుపద్యంబులతుదను స్వత్వము లే దనుటయు సముచితముగా నున్నది. 'తోరంబుగాన్' అనుచో ద్రుతమునకు స్వరలోప మవుట యిష్టమే. ద్రుతలోప మైనను నిబ్బంది లేదు గదా. అనంగా నిట ద్రుతము వజ్ఝలవారిమతము ననుసరించి పూర్వాచ్ఛ నత్తియుండుట యనుసంశ్లేషము నందియే యుండవలె నని చెప్పవలసినయవసరము లేదు గదా. కావున 'స్వత్వము' లే దనుటయే సముచితముగా సరిపడుచున్నది.

కాని యసలిట సహోబలపతిమాటలప్రభావముతో సూరి యిట్లు వివరించుట యవసరమా? యన్నది పరిశీలనార్హము. ఇయ్యది వివరణమునం దుంటచే స్పష్టతకయియే చెప్పినది గావున నంతగాం బట్టించుకొనవలసినయవసరము లే దనుకొనరాదు. పలికినవాండు సూరి యవుటచేతను నియ్యది శబ్దశాస్త్ర మవుటచేతను నావివరణవాక్యములందలిసామంజస్యము నక్షరశః పరిశీలింపవలసియే యున్నది.

పద్యాంతములందు 'ఈలోపము' అనఁగా నవసానంబునం దను సూత్రముచే నగు ద్రుత (స్వర)లోపము. గణానుసారముగా వ్యవస్థితమై యుండు నని యర్థము. ఈలోప మనుటచే నితరవిధులచే నగు లోపము గణానుసారముగా నుండదా? దీనివలన నితరస్థలములందు లోపాదులలో గణవైరుధ్యము గల్గదా?

'వైజయంతీనవాంశుకవ్యాజమునను' అనుచో నవసానమునందు ద్రుతస్వరలోపమున కవకాశము గలదు. కాని యట్లయిన నందు గణభంగ మగును. కావున నిట్టియెడల ద్రుతస్వర మసలు లోపింపదు. 'అల్ల నోడుదుక్' అనుచో నవసానమున ద్రుతస్వరలోపము చేయనిచో గణభంగ మవును. కావున నట స్వరలోపము నియతము. అసురవైరికి వందనం బాచరింతు అనుచో ద్రుతలోపము నియతము. తోరంబుగాన్ అనుచో వైకల్పికము.

కానీ యిట్లని శబ్దశాస్త్రము నియమింపవలసియున్నదా? శబ్దశాస్త్ర మాయాయిసందర్భములం దాయాయూహములను సాధించుచో నం దెయ్యది యైనఁ గవి గణానుసారముగనే ప్రయోగించుకొనుఁ గాక. ఆస్థలమునం దాకార్య మట్లె యని వ్యవస్థ చేయవలెనా? సిద్ధి గాంచిరి యవిముక్తసీమయం దనుచోఁ గ్రియాపదములం దిత్తునకు సంధి వైకల్పికము గదా. కావున 'కాంచి రవిముక్త' అనియు నుండవలెనే. కాని గణభంగ మగును గావున నిట సంధి లేకుండుటయే యుండు నని వ్యవస్థ చేయవలయునా? అట్టియెడల నీ ద్రుతలోపసందర్భమునసే యేమి? ఎల్లెడల నిట్టిస్థితి యవసరమే యగును. వివరింపవలసినదే.

'ఈలోపమే' యేమి? పద్యాంతములం దేలోపము మాత్ర మట్లుండదు? ఉదాహరణమునకు 'నడిగొందెంచి రాహవమున కదితిసుతులు' అనుచోఁ 'బదాంతములం దటయుక్తంబు లయినసులురుల యుత్వమునకు లోపము బహుళము' గదా. ఇట లువర్ణమునం దుత్వ

లోప మవసానమునను సంగీకృతము గావున రాముల్ అనురీతిగా నిట 'సుతుల్' అనియుఁ గావచ్చును. శాబ్దికు లిది యామోదించినను ఛందోవిదు లంగీకరింతురా? గణానుగుణముగా నిటఁ గూడ లువర్ణమున స్వరలోపము రా దనక తప్పదు గదా. ఇటఁ గూడ నట్లు వ్యవస్థ చేయవలెనా? (బాహుళకముచే నీవ్యవస్థ గుర్తింపవలె నన్నమాట.) అయిన 'నవసానంబున' ననుసూత్రమున ద్రుతలోప మెట్లు బహుళముగా విధింపఁబడియున్నదో యట్లె 'పదాంతంబులయి' యనుసూత్రమునను నత్వలోపము బహుళ మనియే చెప్పఁబడినది. కాని భేదమా సూత్రమునొద్ద నాలోపము గణానుసారముగ వ్యవస్థితమైయుండుటను బేర్కొనెను. పదాంతంబు లయి యనుసూత్రమునొద్ద నట్లు పేర్కొనలేదు. ఇట నట్లు వివరింపలేదని గణభంగ మగునట్లుగా స్వరలోపము చేయఁదగునా? వివరింపకున్న నిట నీలోపము గణానుసారముగా వ్యవస్థితమై యుండుట (బహుళశబ్దముచే) మనము గ్రహింపవచ్చును. కాన 'అవసానంబున' అనుసూత్రమునొద్దను నట్లే గ్రహింపఁగలము కాదా? అట నేల వివరించెను?

'గణానుసారముగ వ్యవస్థితమైయుండుట' యను నీయభిప్రాయము నంగీకరించి దానికే వివరణ మనునట్లుగా 'గుర్వవసాయియగుపద్యంబునందును స్వత్వంబు లేదని చెప్పెను. ఈ సూత్రము విధించుచున్నది ద్రుతస్వరలోపమును, ద్రుతలోపమును. బహుళము గావుటచే నివి రెండును రాక ద్రుత మట్లె యుండునట్టిస్థితియె స్వత్వము. గురువే యవసానమునం దుండవలసినపద్యములందును నట్టి స్వత్వ ముండదు. ద్రుతస్వరలోపము ద్రుతలోపము స్వత్వము నను మూఁడింట స్వత్వమును నిషేధించినాఁడు. కాఁబట్టి సూత్రానుసారముగ ద్రుతస్వరలోపమో ద్రుతలోపమో చేయకతప్పదు. బుద్ధి

మంతుఁ డగు బుధసేవన్ అనుచో సూరి ద్రుతస్వరలోప మగుట చూపెను. అవకాశ మున్నది గావున ద్రుతస్వరలోపము గాక ద్రుతలోపమునే చేసి 'బుద్ధిమంతుఁ డగు బుధసేవ' అని యవును. ఇట గణభంగము తప్పదు గదా. 'సుధాపూరంబు తోరంబుగాన్' అనుచో ద్రుతస్వరలోప మేని ద్రుతలోప మేని చేయవచ్చును. ఏది చేసినను గణవిరోధము లేదు. కాఁగా గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వ మెచ్చటను నుండదనిమాట వాస్తవమే యయ్యును నితరములలో నేద యవు? అయ్యదియు గణానుసారముగనే యుండవలెఁ గదా. అనఁగా గుర్వవసాయి యగుపద్యముతుది ద్రుతము లఘుపూర్వకమయినచో నట ద్రుతస్వరలోప మొక్కటే నియతముగా నగును. ఇట స్వత్వముతోపాటు ద్రుతలోపమును నుండదు. (అట్టిది దీర్ఘపూర్వక మగుచో ద్రుతస్వరలోప మేని ద్రుతలోప మేని చేయనగును. కాని స్వత్వముమాత్ర ముండదు.) ఇట ద్రుతలోపమును రాదని గ్రహించు టెట్లు? 'గణానుసారంబుగ వ్యవస్థితంబయి యుండు' - ననుదానిచేతనే గ్రహింపవలె. అట్టియెడల బుధసేవను అనుచో ద్రుతలోపము చేసినను స్వత్వముతో నున్నను గణభంగ మగును గావున గణానుసారముగ ద్రుతస్వరలోపముమాత్రమె యవు నని గ్రహింపఁదగు. కావున బుధసేవ లేదా బుధసేవను అని యుండరా దనియు 'బుధసేవన్' అనియే యుండవలె ననియు గ్రహింపఁదగును. కాఁగా గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వంబుఁ లే దనుటయుఁ గేవలము స్పష్టతకే కాని విశేషప్రయోజనము గలది కాదన్న మాట. అహోబలుఁ డసాధు వన్న 'వ్యాజమునను' అనురీతి వానిని సాధువులుగా నిర్ణయింపవలె నన్నను గణానుసారముగా వ్యవస్థిత మైయుండు ననుదానిచేతనే యా యర్థమును సిద్ధించియే యుండెడిది. ఇంక 'వ్యాజమునను' అనునవియో యట్టిదియే యైనన్న యాముల ప్రామాణిక ప్రయోగ మింకొకటి యేని జూపి విడచినఁ జాలును గదా. కాన

గుర్వవసాయి యగు మొదలగువివరణవాక్యము లఘ్వవసాయి పద్యంబుతుదను స్వత్వ ముండవచ్చు ననునర్థమును సాధించుట కయ్యెను నవసరము గా దనియే నిర్ణయింపవచ్చు నని తోఁచుచున్నది.

పద్యాంతములం దనువివరణము నిట్టిదే యనవచ్చును. అవసానమునం దగునీలోపము పద్యమధ్యమున వాక్యావసాన మైనను రాదు. వాక్యావసానము గాకున్నను బద్యాంతమునఁ గావచ్చును. పద్యాంతమునం దయ్యెడు 'నీలోపము' అవసానంబునం దనుసూత్రముచే నవునది. పద్యమధ్యమం దితరవిధులచే లోపము రావచ్చును. అయ్యది గణానుసారముగ నుండునా ? లేక తద్విరుద్ధముగాఁ గూడ నుండవచ్చునా ? (విరుద్ధముగనే యుండవలయునా?)

సూరి చూపినలక్ష్యపాఠమునే పరిశీలింతము. అతిశయముగ బుద్ధిమంతుఁ డగుబుధసేవన్ అనుచో అతిశయముగను అగును అనునవి ద్రుతాంతములే. వీనికి సరళ మగుబకారము పర మగుటచే ద్రుతము లోపించినది. అయిన 'ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషములు విభాషను రావలసియున్నది. ఒకానొకచో గనఁబడుపూర్ణబిందువు నిట మానినను లోప మొక్కటె కాక సంశ్లేషమును స్వత్వమును రావలసియే యున్నవి కదా. అతిశయముగ న్బుద్ధి - అగు న్బుధ లేదా అతిశయముగను బుద్ధి - అగును బుధ - అనురీతిగా నుండుట శబ్దశాస్త్రానుగుణము. ఈసంశ్లేషస్వత్వములలో నేయొక్కదానితో నున్నను నియ్యది పద్యపాఠమే కాదు.

కాఁగా నిట లోపము గూడ గణానుసారముగనే యగుట స్పష్టము. అవసానంబునం దనుసూత్రముచే నవసానమునం దయ్యెడు నాలోపమే కాక యాయాయిసంధికార్యములయం దొకేసమున ననేక రూపము లగునపుడు లక్షణానుగుణ మైనయవ్వానిలో నది యే నొకటి

ఛందోఽనుగుణముగాఁ గవి ప్రయోగించుకొనును. కవి ప్రయోగించిన యాస్థలమునందలిరూప మది లక్షణబద్ధ మగుచున్నదా లేదా యన్నంతవఱకె పరిశీలింపఁదగియున్నది. కాని రూపద్వైవిధ్యము గలదు గదా యని తత్స్థానమున రూపాంతరము నూహించి గణానుసారముగాఁ గవిప్రయోగములం దట నాకార్యము నియత మని నియమించుకొనవలసినయవసరము లేదు.

మొత్తముమీఁద నిట సూరి చేసినవివరణమువలన విశేష మగు ప్రయోజన మెయ్యదియు సిద్ధించుట లేదు. 'వాక్యాన్త' సూత్రము నొద్ద అహోబలపతివ్యాఖ్యానము ననుసరించియుఁ బద్యభేదావసానేషు పద్యావసానే యను వి. వి. లక్షణములను దృష్టియం దిడుకొనియు సూరి వివరించియుండును. కాని యీవివరణము చేయకున్నను నష్టము లే దని గ్రహింపవచ్చును.

గుర్వవసాయి యగుపద్యంబుతుదను ద్రుత్వంబు లే దనుటలో లఘ్వవసాయి యగుపద్యంబుతుదను గణానుసారముగా ద్రుత్వ ముండ వచ్చు ననియుఁ దన్మూలమున 'వైజయంతీవనాంశకవ్యాజమునను' అను రీతిస్థలముఁ బద్యాంతమం దుండలిద్రుత్వ మసాధువు గా దనియు నెఱుఁగఁ జెప్పుచు నహోబలపతియభిప్రాయమును దిరస్కరించుటను సూరి యుద్దేశించి యుండవచ్చును. భంగ్యంతరమునఁ జెప్పుటలోఁ గొంతయిబ్బందియుఁ గల్గుచున్నది. కావున నాయంశమును స్పష్టము గానే చెప్పఁదగును. పద్యాంతములం దీలోపము అనుటలో నవసానం బనఁ జెప్పినయాలోపము పద్యములందు (వాక్యాంతమునఁ గాక) పద్యాంతమునందే యగు నని చెప్పుటయు నుద్దేశింపఁబడియుండ వచ్చును. పద్యమధ్యమున వాక్యావసానమే యైనను నచ్చటి ద్రుత మున కీకార్యములు చెల్లవు గదా. నాలుగేన్ పాఁడికుఱ్ఱ లనురీతిస్థల ముల నిద్దాని ప్రసక్తి లేక నాలుగేను - పాడి అనుచోఁ బద్యాంతంబు

లయి యను సూత్రముచే నుత్వలోప మయినట్లుగా గుర్తింపఁదగును. తీరవనంబు చూడ్కికె మ్మొయిన్-ఎలమి యొనర్చు మేలు. (శృ-1-135) (నా. రా. 77) అనుచోఁ గాదా. తమున ద్రుతస్వరమునకు లోపము గానవచ్చు నదియుఁ బదాంతంబు లయి యనుదానిచేతను సాధింపఁ దగు పరపదాది పదములకు సరళాదేశాభావము గానరాదు గదా.

సూరి గణానుసారముగ వ్యవస్థిత మైయుండుటను బహుళపదముచే సాధింపఁ దగు నని యెంచె నేమో స్పష్టము కాదు. ఏ మైనను 'ఈలోప మిత్యాదిగా నిచ్చోటివివరణము చేయఁబడకుండఁదగు. ఇంక సూరి స్వరపరకత్వమున దాదాపుగా నెల్లయెడలను ద్రుతస్వరమునకు లోపము చేసియున్నాఁడు. కావున నద్దాని నీసూత్రమందలిబహుళపదముచే సాధించుకొనునవకాశ మున్నది. ఏది యేమైనను నింకలిబహుళపదము స్థలాంతరములందు నుపయోగింపఁదగినదే. 'బుధసేవను' అనుచో ద్రుతలోప (స్వత్వక) మున ప్రవృత్తి. స్వరలోపమునకుఁ బ్రవృత్తి యిత్యాదిగా నెఱుంగుట సూరియభిప్రాయముగా గుర్తింపఁదగు.

—o—

# నకారద్విత్వము

అచ్చు పర మైననాంతపదాంతమునకు సంయుతంబును లోపంబును జగతి లేవు; సంయుతం బయ్యే నేని దుస్సంధి యగును, లోప మైన గ్రామ్యం బగు లోకవినుత (అప్ప-5-44) చూచె నింతి ననెడు చోటం జూచె న్నింతి ననిన సంధిదోష మయ్యెం గృతుల (45) నని స్వరపరకత్వమున ద్రుతమునకు (నకారమునకు) ద్విత్వ మగుట దుస్సంధిగాం జేర్కొనంబడియున్న యిప్పద్యము లప్పకవీయమునం దున్నవి. ఇయ్యది 'లుక్సంశ్లేషౌ నాచి' యను చిం. లక్షణము ననుసరించి చేయంబడిన వివరణ మగునో కాదో యనుమానము. ఆసూత్రాభిప్రాయ మిం దుండుటమాత్రము స్పష్టము. ఏది యే మైనను సంయుత మవుట లేదని చెప్పినయప్పకవి చూచె న్నింతి యనునది సంయుతస్థితి కుదాహరించియుండుటచే ద్రుతసంశ్లేష మనంగా నచ్చరకతలో ద్రుత ద్విత్వ మనియే యర్థము చేసిన ట్లయినది. దీని ననుసరించియే ప్రౌఢ వ్యాకర్త 'లుక్సంశ్లేషౌ నాచి' యని నిషేధించియు నన్నిష్టసఖ యని నన్నయ ప్రయోగించుట ప్రయోగవైరళ్యసూచనార్థముగాం జేర్కొనె నవచ్చును.

అప్పకవికి ముందును లాక్షణికులు కొందఱు ద్రుతద్విత్వమును దుస్సంధిగానో లేక సంధిదోషముగానో పేర్కొనుట జరిగినది. కవిజనాశ్రయాదులు దుస్సంధి యనుట స్పష్టము. ద్రుతద్విత్వము నంగీకరించినవారును లేకపోలేదు. కాని దుస్సంధి యనియే పెక్కురు తిరస్కరించిరి.

అహోబలుండు 'నో వా ద్విత్వ' మ్మను వి. వి. వచనముచే ద్రుతద్విత్వమును సాధింపంబోవుచుండుటచేతను నన్నయ ద్రుతద్విత్వమును బ్రయోగించె నని విశ్వసించియుండుటచేతను గావచ్చును, 'లుక్సంశ్లేషౌ నాచి' యనుసూత్రమునొద్ద సంశ్లేషపదముచే ద్రుత

ద్విత్వ మనునర్థము గ్రహించియుండ లేము. అట్లు గ్రహించిననన్నయ ద్రుతద్విత్వమును బ్రయోగించియు నిషేధించె ననుట విరుద్ధ మగు నని తలంచియుండ నగు. (దానినే ప్రౌఢ. మార్గాంతరమున సమర్థించె) అప్పకవిప్రస్తావనము లేకుండుట విశేషమే.

నన్నయయే ద్రుతద్విత్వమును బ్రయోగించియున్న యెడల లాక్షణికులు పెక్కురు దానిని దుష్టముగా నేల నిర్ణయింతు రన్నది యనుమానము. అనంతుఁడు లక్షణము చెప్పియు లక్ష్యములఁ బ్రదర్శించియున్నవాఁడు గావునఁ జేసి నన్నయప్రయోగములు చూచియుండఁ డనుట యథార్థము గాకపోవచ్చును. నన్నయభారతమున దర్శించియున్నను నట్టిప్రయోగము లాతనిదృష్టి కెక్కలే దనవలసియుండును. పెక్కులక్ష్యములం బ్రదర్శించియున్న యప్పకవియు నిద్దానిని నిషేధించెనే. అయిన నప్పకవి ద్రుతద్విత్వమును దిరస్కరించియుండఁగా నయ్యది నన్నయప్రయోగములందే కనుగొనినయహోబలుఁ డప్పకవిసిద్ధాంతము నేల ప్రస్తావింపక, ప్రస్తావించి తిరస్కరింపకయుండెనో స్పష్ట మగుట లేదు. 'నో వా ద్విత్వ' మ్మను వి. వి. వచనము (ద్రుత) నకారద్విత్వమును సాధించుచున్న దని యహోబలుఁడు తలఁచుట స్పష్టము. (నన్నయ ప్రయోగించినదానినే యథర్వణుఁడు తిరస్కరించె ననుట యుక్తము గా దనియు నహోబలుఁడు సంశ్లేషపదమునకు ద్రుతద్విత్వ మని యర్థము చేసియుండకపోవచ్చు.)

వజ్ఝలవారు "అన్నిష్టసఖిత్యాదులవంటివాని నాలంకారికులు దుస్సంధులనుటం జేసి అన్న+ఇష్టసఖి, అన్నిష్టసఖి - అన్నుక్తియును (బా. సా. పే. 78) అని పేటికా వ్యాఖ్యాత సమర్థింపఁజూచుట యుక్తము గా" (వ్యా. సం. స. 316) దనిరి. కాని తాము ద్రుత 'ను' స్వరూపమును సమర్థించుట యుక్తమే యని వారియభిప్రాయము.

పుట్టిన+ఇల్లు - పుట్టినిల్లు అనురీతివిభాగము దృష్టియందున్న దేమో నిశ్చయించి చెప్పలేము. వృత్త్యం దన్నసుర మొదలగున విట్టిసమన్వయమునకు లోంబడునవే. కానీ వజ్ఝలవారు పేర్కొన్నట్లుగా నన్నయిష్టసఖి' వంటి ప్రయోగము లిట్లు లేమింజేసియు, అనానిష్టసఖ యను రీతిగాం దత్పర్యార్థకవిశేషణరూపముతోడిసమన్వయమే సముచితముగా నుండుట ననుసరించియు నన్న+ఇష్టసఖి యనురీతివిభాగము సముచిత మని నిర్ణయింపరాకుండుట యథార్థము. (శ్రీ. శే.)

చి.వి.వ. లో నిట్టిసమన్వయము నంగీకరింపకయు వజ్ఝలవారు వ్యా.సం.వ. లో "ఇట్టిసమర్థనమునకుం (అన్న+ఇష్టసఖివంటిది) జోటీయని ఎన్నండు న్నేని మోఘము గాదు. ధైర్యస్ఫూర్తికి న్నరుదుగ అనుమహాకవిప్రయోగములు పెక్కులు గలవు. (నన్నయప్రయోగములె యిట స్వీకృతములు.) అనిరి. దీనింబట్టి ఎన్నండు న్నేని ననురీతి స్థలములలో ద్రుతద్విత్వముగాం జెప్పక తప్పమింజేసి యన్న+ఇష్టసఖి యనురీతిగా విభాగించుటలో దోషము లేకపోవచ్చు నని వారిమతము నెన్నవచ్చును.

ఇంక నన్నయప్రయోగములలో ద్రుతద్విత్వము లన్నవానిలో మొదటి దగు ఎన్నండున్నేని అనుదానింగూర్చి చూతము

ఎన్నండున్+ఏని అని యుండంగా ద్రుతమునకు ద్విత్వమయి యెన్నండు న్నేని నని యయ్యె నని యభిప్రాయము. తమి యూరదు నేని మున్నగురీతిప్రయోగములు ననుసరించి కొందఱు నకారాది యగు నేనిశబ్దము నొకదానిని జేర్కొనిరి. నేనిశబ్దమునే యంగీకరించినచో ఎన్నండును+నేని అని యుండ ద్రుతలోపము లేనపుడు 'అలుకి చ సంశ్లేష స్స్యాత్' తను లక్షణముచే సంశ్లేషమయి యెన్నండు న్నేని నని యగును. నేని శబ్దమును జూపు 'నీవును జూచి తట్టి నభ నేని విసంబడ దేయుగంబులన్' అనుచో నున్నది నేని శబ్దమే కావచ్చును. ఈవున-

సభ యేని యని వజ్ఝలవారు గ్రంథకృత్ప్రియుక్తపాఠ మని యూహించిరి ఇట్లు గ్రంథకృత్ప్రియుక్తపాఠము లనుచు నూహించుచో దాదాపుగా నెల్లయెడలఁ దమతమసిద్ధాంతముల కనుగుణముగనే కావ్యము లుండుట విశేషము గాదు. (ఆతరువాతఁ గొందఱింకను 'ఈవును జూచి తట్టిసభ యెందును' అనుపాఠమును జేర్చిరి) ఈశబ్దమును హాలాదిగా గ్రహించినవారు నీవు–నేని అనుపాఠము నిట్లు చూపిరని తలంప వీలు లేదు. అయ్యది యే ముద్రితప్రతులం గానవవుచున్నది. నీలఁగు లోనగువానితో లిహల్లు లోపించుట లక్షణసమ్మతమయియే యుండుటం జేసి నీలుగు–ఈలుగు అని యైనట్లుగా నేని–ఏని అని యవుటలో విరోధమును లేదు. కావున 'ఏని'శబ్దమునకు నీపక్షమున బాధ లేమి స్పష్టమే.

ఈపక్షమందలివిరోధముం గూర్చి వజ్ఝలవా రిట్లు పేర్కొనిరి. 'నేనిశబ్దమె ప్రసిద్ధమైయున్నఁ బ్రాచీనలాక్షణికులు (నేని శబ్దకల్పన మర్వాచీన మని యభిప్రాయము) నిత్యయతి నంగీకరిపవలసిన ప్రసక్తియే లేకుండెడిది. (వ్యా. సం. వ. 3:6) అని యనంతాదుల లక్షణములం జూపిరి. ఆచోట్ల నిన్న నాత్మఁ దలఁచె నేని గృష్ణ నెట్టన హరితలఁపు గలిగె నేని మహాత్మ – యనునాలక్ష్యములందు నిన్న–నెట్టన–అనునవి నకారాదు లగుటచే నేనిశబ్దాంగీకారమున నీయతి యనవసర మని వీరియభిప్రాయము.

నిత్యయతియం దాలాక్షణికులు 'ఏని'శబ్దమునాద్యచ్చుతో సంధి జరిగినసందర్భములందు సంధివిభాగముతోఁ బరపదాదిస్వరము (ఏనిలోనియేకారముతోను) వ్యంజనముతోను (పూర్వశబ్దాంతిమవ్యంజనముతోను) యతి యుభయము చెల్లు ననిరి. అట్టియెడల నేనిశబ్దము నంగీకరించుచో నిత్యయతి చెప్ప నక్కర లేకుండఁ బోవలయు నన్న

నకారముతో మాత్రమే వ్యంజనయతి చెల్లవలసియుండును. పూర్వశబ్దాంతిమవ్యంజనముతో యతి చెల్లు నని సాధారణముగాఁ జెప్పుచుండ నట్టివ్యంజనము నకారముమాత్రమే కావలయు నని యాలక్షణములందు నియమ మున్నదా? లక్ష్యములందు వారు నకారమునే చూపుదురు గాక, దానియెడ మాత్రమే వ్యంజనయతి యనునియమమేది? నకారముతో యతి యిష్టమైన నిట్లు సామాన్యముగాఁ జెప్పక నకారముతో నని స్పష్టముగానే చెప్పవచ్చును గదా. 'అప్పకవి మున్నుగా మున్ను చెప్పియున్నటీకలోనియథార్థ మెట్లోఁ దెలియను రే ననవసరచర్చ తేరికిని నేటికిఁ గలుగుఁ గనుకఁ దెలియుఁడిం కేవి దాని' యనురీతిగా నున్న దనుకొందము. ఇందలియతు లనంతాదులలక్షణములకు విరుద్ధములవునా? నేర్పెసం బొప్ప శిరంబు వ్రక్కలయి తప్పెం దప్పె (రామా. న.సా.స. ద్వా-88.) అనురీతికవిప్రయోగము నసాధు వనవలయునా? నిత్యయతివలన సంధివలనఁ గలిసిన యొహల్లుతో నైనను యతి చెల్లవచ్చు ననియే కదా లాక్షణికుల యభిప్రాయము. నిత్యయతివలెనే చెప్పినవిభాగయతిస్థలమున నప్పకవి 'శివితోడ దోసెఁ డేసి నసడలు' అనురీతి నుదాహరించుట గమనింపవచ్చును. కాఁగా నిత్యయతి సందర్భమున వ్యంజనయతి కేవలము నకారమునకే చెప్పఁబడిన దనుట నిరాధారము. కాన నేనిశబ్దము నంగీకరించిన (నకారేతరహల్లులకు యతి నిషిద్ధ మవుటంజేసి) మాత్రమున నిత్యయతి చెప్ప నక్కఱ లే దని నిర్ణయించుటకు వీలు లేదు. అనఁగా ననంతాదులు నిత్యయతి చెప్పట యున్నది నేని శబ్దాంగీకారమునకు బాధకముగాఁ జాల దని గ్రహింపవచ్చును. ఈకారణము సరి యైనది గాఁబట్టి 'నేని'శబ్దమే ప్రయుక్త మైన దన్న నిట ద్రుతద్విత్వము లే దనక తప్పదు. నీవును జూచి తట్టి సభ నేని - అనురీతిప్రయోగము లిందులకు సాధకములు గాయే యున్నవి. (నారా. 78) (నేని ప్రాచీన మనఁదగు.)

(ఉండు నేని - అనుదానినుండి 'క్వచిద్ద్వోశ్చ తథా భవేత్' త్రిసు శారికచే ఉన్నని' అని కాఁగలదు. ఉండు నేని - అనుసర్థమున 'ఉన్నని' - అనురూపము గలదే గదా.-"నడచు చున్నని (ఉన్న= ఉండు నేని) రహస్యంబు గాక యున్నని (తిక్కన) ఉన్నది, (ఉండు నది-నన్నయ) (వ్యా.సం.స 1405). అదే విధముగా నిట ఎన్నఁ డుండు నేని - ఎన్నఁ డున్నని అనుకృతిరూప మేర్పడుట కవకాశము గలదు. కాని 'ఉండు నేని' యనుకృతియర్థము సముచితముగా నిట నన్వ యింపదు. అందుచేత 'నేని'శబ్దముతో గ్రహింపఁదగియున్నది.)

ఇంకఁ దరువాతిది 'ధైర్యవృత్తికి న్నరుదుగ' నన్నది. దీనిం గూర్చి వజ్ఝలవారి ట్లనిరి. గాణపతవ్యాఖ్యాత ధైర్యవృత్తికి న్నరుదుగ మున్నగువానిని సమర్థించుచు (నా.రా. 77) వాక్యమధ్యపాదాంత్యసంధ్యభావము నంగీకరించెను. 'క్వచిద్వాక్యవిరామే తు సంధ్యభావోఽపి దోషకృత్'- త్రిసునధర్వణకారికకు విరుద్ధ మగుటచే నిది గ్రాహ్యము గాదు. మఱియుఁ బాదమధ్యద్రుతద్విత్వముల కేమి గతి. (317)- పాదమధ్యద్రుతద్విత్వముయొక్క గతికస్థితిని ప్రస్తావించుటం జేసి పాదాంతమున వాక్యాంతము గాకున్నను 'ధైర్యవృత్తికిన్, (అరుదుగ) అనుకృతివానికి గతి కల్పించిన ట్లయినది. 'క్వచి ద్వాక్య విరామే' యనుస్థలమునఁ బాదాంతమున వాక్యాంతమును గావలె నని నియమింప నక్కఱ లే దనిస్థలాంతరమునను స్పష్ట మగు. నా.రా. (77). ఇట్టిప్రయోగము లిచ్చినది. (త్రి. శే.) ధైర్యవృత్తికిన్ - అరుదుగ నరియుఁ గొన్నిప్రాఁతప్రతులం దున్నది. (సంశోధితముద్రణము) ఇట ధైర్యవృత్తికి ట్లరుదుగ ననుకృతిపాఠమును గలదు. పాదమధ్యద్రుతద్విత్వమున కేమి గతి యని వజ్ఝలవా రనుటలో నితర కవిప్రయోగముల నుద్దేశించియుందు రనవచ్చును. నన్నయతిక్కనల భారతములందు నిట్టివి లే వనుట విస్పష్టము. బా. ఉ. చూపిన ఎఱ్ఱన

ప్రయోగమును బాదాంతమునదె. (51) అన్నిష్టసఖి - అన్నరీన్వితుఁ డనురీతిని ద్రుతద్విత్వములు గా వని స్పష్ట మగు.

నన్నయప్రయోగములందు ద్రుతద్విత్వముగాఁ జెప్పఁబడుచున్న పై రెండుస్థలములును మార్గాంతరమున సమన్వితము లగుట స్పష్టమె. ఇయ్యవి పాదాంతమందలి ద్రుతము లవుట యొకవిశేషము. కాన ధైర్యవృత్తి అనుచో మాత్రము ద్రుత మట్లె పాదాంతమున విడువఁబడియుండవచ్చును. సంశ్లేషపదమునకు ద్రుతద్విత్వ మనురీతిగా నర్థము చేసిన ప్రౌఢవ్యాకర్త యీప్రయోగము నేల చూపలేదో. అహోబలుఁ డిది చూపినను అన్నిష్టసఖి యన్నది పాదాంత ద్రుతము కాకుండుటచేఁ బ్రబల మని యెంచియుండు నని చెప్పఁ దగునా? సర్వాంగుని న్ననుభూత - అనునది మఱల నిట్టిదే

కాఁగాఁ గవిత్రయప్రయోగములం బాదమధ్యమున ద్రుతద్విత్వము లేకుండుటం జేసియు, నన్నయప్రయోగములం దున్నవి మార్గాంతరమున సాధింపఁబడుటంబట్టియు వజ్ఝలవారివివరణానుసారముగనే (అన్నిష్టసఖిత్యాదులు ద్రుతద్విత్వములు గాక) నన్నయాదులు కొందఱు ద్రుతద్విత్వము ప్రయోగింపలే దని స్పష్టమే. ఇంక నితరులు ప్రయోగించి రనుట ప్రసిద్ధమే.

వజ్ఝలవారివివరణము ననుసరించి నన్నయ ద్రుతద్విత్వమును ధారాళముగనే ప్రయోగించె ననవలె. అట్టివాఁడు దానిని జింతామణి యం దేల చెప్పలే దని యనుమానము గల్గ వజ్ఝలవా రిట్లు సమాధానము చెప్పిరి. "ఇట్టిద్రుతద్విత్వము నన్నయప్రయోగములలో నగపడుచున్నను జింతామణిలో నాతఁడు 'లుక్సంశ్లేషో నాచి' యని సంశ్లేషమును (ద్రుతము వెనుకటియచ్చు నంటియుండుట) నిషేధించుటచేత నీద్రుతద్విత్వరూపసంశ్లేషమును యథేష్టముగఁ జేయరా దనియుఁ బ్రయుక్తముమాత్రమె గ్రాహ్య మనియుఁ బ్రామాణికు లభిప్రాయ

పడుచున్నా" (చిం. వి. ప. 142) రనిరి. ప్రౌఢవ్యాకర్త నుద్దేశించి యిట్లనియుందురు. తాను ప్రయోగించుచున్న సన్నయ యితరులను ప్రయోగించికొనవలదనుట యుక్తమగునా? అవుఁగాక. పైవజ్ఝలవారివచనములలో 'ద్రుతద్విత్వరూపసంశ్లేష' మనుమాట విచార్యము.

'పరప్రాణేన సంగతేః' - అనుటచే మీఁదియచ్చుతోఁ గూడునపుడే యిట ద్రుతద్విత్వము చెప్పఁబడియున్నది. వజ్ఝలవారిమతమున మీఁదివర్ణముతోఁ గలిపి వ్రాసిన నయ్యది ద్రుతమునకు స్వత్వమగును గదా. అట్టియపుడు ప్రస్తుతస్థలమును వారు సంశ్లేషముగాఁ గాక స్వత్వముగా వ్యవహరింపవలె. ద్రుతద్విత్వరూపస్వత్వ మన్న నదియు నొప్పునా? ఒప్పుకొన్నను దప్పదు. సంశ్లేష మనుటకు వారి మతమున సంశ్లేష మన నేమో వారిచ్చట స్పష్టము చేసియే యుండిరి గదా! కాఁగా ద్రుతము పూర్వాచ్చునత్తియుండుట సంశ్లేషము. అట్టిసంశ్లేషమును 'లుక్సంశ్లేషౌ నాచి' యనుసూత్రము నిషేధించుట చేత 'వచ్చెన్-అతఁడు' ఇత్యాదులందు ద్రుతముపూర్వాచ్చునత్తియుండక పరాచ్చుతోఁ గూడి వచ్చె నతఁ డనురూపము నొదవించు (123) ననిరి - దీనిచే ద్రుతము పరాచ్చుతోఁ గలియుట తప్పదు. ద్రుతమునకు స్వత్వము వచ్చినను రాకున్నను నయ్యది పూర్వాచ్చునత్తియుంట యను సంశ్లేషము లేనే లేదు. సంశ్లేషనిషేధమువలన ద్రుతద్విత్వరూపసంశ్లేషము యథేష్టముగాఁ బ్రయోగించుకొనరా దనిరి. నన్నయ ప్రయోగించినమేర గ్రహింపవలెనే కద. అట్టియెడల వచ్చెన్- అతఁడు అని యుండునా. ద్రుతమునకు ద్విత్వము వచ్చినపిదప నీమొదటి ద్రుతనకారము పైనకారముతోఁ గలిపి వ్రాయఁబడునా? లేక యుభయము స్వత్వ మగును గావున వచ్చెనన్ అతఁడు అనియే వ్రాయనగునా? ఇట మాత్రము ద్రుతము పైనకారముతోఁ గలిసినను స్వత్వము గాక సంశ్లేషమే యగు నన్న వచ్చెన్న

అతఁడు, అనియే యుండవలెను గదా. అసలు ద్రుతముమాత్రము పూర్వాచ్చు పత్తియే యుండి ద్విత్వమువలన నైన నకారమునకు మాత్రము స్వత్వము (పరాచ్చుతోఁ గలియుట) వచ్చి వచ్చెన్ నతఁడని వ్రాయవలయునా? నన్నయ ప్రయోగములందు అన్న్ ఇష్టసఖ అన్న యిష్టసఖ అన్నిష్టసఖ అనువానిలో నేది వ్రాయఁబడినది? అన్నిష్టసఖ యని వ్రాయఁబడుచో నయ్యది స్వత్వము గాకుండ సంశ్లేషమగుట విశేషమే. 'ద్రుతద్విత్వరూపసంశ్లేషము' (ఈవ్యవహారమును బట్టి వచ్చెన్న - అతఁ డనియో వచ్చెనన్ - అతఁ డనియో యుండవలె ననవచ్చును.) అనుట వారి సంశ్లేషపదార్థమున కనుగుణముగాఁ గానరాకున్నది. అట్టియెడ నాసంశ్లిష్టరూపమునకును 'లుక్సంశ్లేషౌ నాచి' యనుసంశ్లేషనిషేధమునకును సంబంధము గలదని చెప్ప నవకాశమే కానరాదు. చూచెదనింతి, అన్నిష్టసఖి యని చూపినయప్పకవి బా॥ సీ॥ ప్రభృతు లగుప్రామాణికలాక్షణికులమతమున సంశ్లేషము లక్షణము భిన్నమైయుండుటచే వారది సంశ్లేష మన్న నందురు గాక. కాని వజ్ఝలవా రట్లనుట వారిమతము ననుసరించి నన్నయాథర్వణసమ్మతము గా దనక తప్పదు.

'లుక్సంశ్లేషౌ నాచి' యనుదానియర్థము బాలసరస్వత్యాదుల మతము ననుసరించి ద్రుతద్విత్వమును (నిషేధరూపముననైనను) ప్రస్తావించునది కా దనుటయే యుక్త మనిపించుచున్నది.

ఇంక నీ రీతిది ప్రయోగములందు విరళ మనునంశము స్పష్టము చేయుటకుఁ జింతామణిలక్షణముకంటె 'నో వా ద్విత్వ' మ్మనుకారికయందలి క్వచిత్, వా శబ్దముల నుపయోగించుకొనుటయే యుక్తము. చింతామణి ద్రుతద్విత్వము ప్రస్తావింపకపోఁగా వి. వి. 'క్వచిద్వా' యని విరళముగాఁ గలిగినని చెప్పుచున్న దని చెప్ప నొప్పును గదా.

అహోబలాదులు ద్రుతద్విత్వము సంగీకరించుటకుఁ బ్రధానాధారము 'నో వా ద్విత్వ' మ్మను వి. వి. వచనమే. (ఇది యహోబల కృతమో కాదో నిశ్చయించి చెప్పరాదు.)- అయిన ద్రుతద్విత్వమున కాధారముగాఁ జెప్పఁబడుచున్న యీకారికయర్థము నెఱుఁగవలసి యున్నది.

నో వా ద్విత్వం క్వచి చ్ఛ్లిష్టం పర ప్రాణేన సంగతేః అన్నది వి. వి. వాక్యము. దీనికి "నకారము పరాచ్చుతోఁ గలిసినపుడు గొన్ని యెడల ద్విత్వమును గొన్ని యెడల సంశ్లేషమును బొందు' నని వ్యాఖ్య పేర్కొన్నది. సర్వము న్నతని ద్విత్వము గాఁగా సర్వము నతని నన్నది సంశ్లేష మన్నమాట. 'పరవర్ణేన సాకం సంశ్లేష శ్చ' యనునహోబలపతియభిప్రాయమున కీయది యనుసరణ మని గ్రహింప వచ్చును.

'క్వచి చ్ఛ్లిష్ట' మ్మనునహోబలపతిచూపినపాఠమునకు బదులుగా క్వచి చ్ఛ్లిష్టః అనుపాఠమును వఝ్ఝలవారు చూపిరి. నారా. 'క్వచి ద్ఘట' మనుపాఠమును జూపినది. వఝ్ఝలవా రన్నట్లు, వి. వి. కారికలకు మూలము కవిశిరోభూషణమే యవుటచే నాపాఠము గ్రహించు టొకన్వను.

దీని కర్థమును వ్రాయుచు వఝ్ఝలవారు 'ఒకానొకప్పుడు స్వపూర్వాచ్చు నత్తి యున్న నకారము దానికిఁ బర మగునచ్చుతో నదుకునపుడు ద్విత్వమును వికల్పముగా నందును' (వ్యా. న. స. 316) అని చెప్పిరి. సర్వమున్+అతని అనుచో వైకల్పికముగా నీద్విత్వము వచ్చిన సర్వము న్నతని ననియు రాకున్న సర్వము నతని – ననియు నవును. వఝ్ఝలవా గిట నిట్టివానికి మున్నుగా అన్నసుర, అన్నేటి తరంగలన్ అన్నిష్వసఖ యని చూపి యావయవికనకారము నన్నయ మతమున ద్రుతమె యగుటఁ గుర్తు చేసిరి అన్+అసుర యని యుండ

కాఁగా నీయభిప్రాయమున కనుగుణముగాఁ బ్రస్తుతకారిక కర్థము నిట్లు గ్రహింపఁదగు నని తోఁచుచున్నది.

క్వచిత్=కొన్ని యెడల ననఁగాఁ గర్మధారయసమాసములందు పెను అను, అను (నొంటు రెంట) కొన్నింట నః=నకారము వా=విక ల్పముగా శ్లిష్టం=శ్లిష్ట మయి - అనఁగా స్వరలోపముచే సంశ్లేష స్థితిని బొందున దయి పరప్రాణేనసంగతేః=మీఁదియచ్చుతోఁ గలి యునపుడు ద్విత్వం=ద్విత్వము నందును.

ఇట్లు శ్లిష్టతయే వికల్పముగా విధింపఁబడినట్లు గ్రహింపవలసి యున్నది. అను+ఇష్టసఖి — అనుచో నకారమునకు శ్లిష్టతవలన స్వర లోపము నపుచున్నది. శ్లిష్టత వికల్పము గావున నది లేనపుడు అను+ ఇష్టసఖి యనియే యుండును. అనునిష్టసఖి యగుట గుర్తింపఁదగు. శ్లిష్ట మగుచో అనఁగా స్వరలోప మగుచో ద్విత్వము నిత్యమే. కావున అన్+ఇష్టసఖి అని యైనపిదప - ద్విత్వము రాక తప్పదు గావున అన్నిష్టసఖి యనియే యగును గాని యనిష్టసఖి యని కానేర దని గుర్తింపవవు.

ఇందు శ్లిష్టతయు ద్విత్వమును విహితము లని స్పష్ట మగుచో ద్విత్వమునకు 'పరప్రాణేన సంగతే' యని నిమిత్తము చెప్పఁబడినది. కాని శ్లిష్టతకుఁ జెప్పఁబడలేదు గదా! కావున నట స్వరలోపము హల్పరకతయందును రావచ్చును. చిం, వి. వి. ల మతమునను నావయ వికనకారము ద్రుతము కానేరదు గావున అన్పారంబు కొన్కోర్కులు చన్త్రోవ - అనురీతిగనె యుండు. వికల్పతచే అనుపురం బను రీతి వాని కెట్టిబాధయు లేదు.

ఇచ్చోటివాశబ్దమునకు వ్యవస్థ చేసికొనఁదగును. దీనివలన హల్ప రకత్వమున నీఅనుకొనుచను పెనుమున్నగువానింటస్వరలోపము వికి

ల్పమే. పెనున కచ్చ్వరకతలో స్వరలోపము నిత్యము. పెను+అరదము అనుచో పెన్నరదము అనురీతి నొక్కరూపమే గదా యుండునది. అన్వాదిధాతుజవిశేషణములకు నంతముల నచ్చ్వరకత్వమున నకారముతో ననునిష్పన్నములంటివి గలవు. పెనుశబ్దమునెడల (పెను+అరదము. పెనుటరద మనియో లేక పెనరదమో కావలయు) నట్టివిభిన్నరూపములు లేవు. కావునఁ బెనుశబ్దమున కచ్చ్వరకతలో స్వరలోపము నిత్యమే యని యంగీకరింపకతప్పదు గదా. అనునకు భిన్నములైన ధాతుజ విశేషణములకు కొన్న్యాదులకు నచ్చ్వరకత్వమున అను+ఇవి అన్+ఇవి- అన్నివి యనురీతిగా (కొ(ను)న్+అతఁడు) కొన్నతఁ డనురీతిరూపములు గానరావు. కావునఁ బ్రయోగము లింకను బరిశీలించి తదనుగుణముగా కొన్ప్రభృతుల కచ్చ్వరకతలో స్వరలోపమున కప్రవృత్తియు నియమింపకొనవలసియున్నది.

ఈయర్థము ప్రయోగానుగుణముగ నుచితమై యనఁదగియున్నది. కాని తత్కర్తృకీయభిప్రాయము గలదా? అని యనుమానము. ఇందున్నలోపము లిట్లు గుర్తింపవచ్చును. 1. ద్విత్వవిధానముకంటె స్వరలోపమునకే ప్రాధాన్యము గల్గుచున్నది. అను పెనులకుఁ దప్ప నితరములకుఁ గానరావు. అందును భేదము ఆరెండింటినిమాత్రమే దృష్టియందిడుకొన్న నిట్లు చెప్పెనా? 'నో వా ద్విత్వం క్వచిచ్ఛిష్టం' మ్మను ప్రారంభమునుబట్టి చూడ ద్విత్వమే వికల్పముగా విధింపఁబడుచున్నట్లున్నది. అయినను నీయవి యంతగాఁ బరిగణింపఁదగినవి కావు. ఎట్లనఁగా నజ్ఞులవారియభిప్రాయమున కనుగుణముగా నిలక్షణ మధర్వణప్రోక్త మయినపుడు, 'తిక్కన కించుక పూర్వుఁడో తర్వాతివాఁడో యనఁదగు నథర్వణుఁడు నన్నయ (తిక్కనల?) ప్రయోగములంబట్టి లక్షణము చేయవలసియున్నది. ఆనన్నయ తిక్కనప్రయోగములందు ద్రుతద్విత్వములే యనఁదగినస్థలములు సరియైనవి గానరావు. పాదమధ్యద్రుతద్విత్వములనుగూర్చి ప్రశ్నిం

చినవఝ్ఝలవా రట్టిదొక్కటియు (కవిత్రయము వారి ప్రయోగముల నుండియు) జూపియున్నవారు గాదు. పాదమధ్యద్రుతద్విత్వము లకుఁగా నన్నిష్టసఖ - యనురీతి వేమో - కానీ యావయవిక కా రము ద్రుత మనుట కవకాశము చిం, వి.వి.లలో లేకుండుటంబట్టియు (నో వా ద్విత్వ మని సామాన్యముగా ద్రుత మనక చెప్పుటయు నిట్టిఁ బరిగణించుట తప్పు గాదు.) నయ్యావి ద్రుతద్విత్వము లని నిర్ధా రింపరాదు. ధైర్యవృత్తికిన్ - అనురీతి పాదాంతద్రుతములు వాక్యాం తము గాకయు మీఁది పాదాదివర్ణముతోఁ గలియకుండ, ద్రుతద్విత్వ మును దుస్సంధి యని తిరస్కరించిన యనంతుని గ్రంథముననే పెక్కు చోట్ల నుండుట, ననుసరించి యవిరుద్ధ మని స్పష్టమవుచున్నది. ఛందో దర్పణమునను బాదాంతమునను కాని మధ్యమున ద్విత్వము గల దను కొనుటకు నాధారమే లేదు. కాఁగాఁ గారికా యథర్వణకర్తృకమై యైనచోఁ బైరీతి అన్నిష్టసఖవంటి ద్విత్వస్థలములఁబట్టి కారిక కట్లు విశేషార్థమునే సమన్వయింపవలె.

అట్లు కాక యప్పకవివలెకును (పిదపను) లాక్షణికులు చాల మంది ద్రుతద్విత్వమును దిరస్కరించుటచే అహో. దానిని సాధింపఁ బూనికతో నిట్లు చెప్పియున్నాఁ డన్న (పాఠభేదమువలననే కాక) వ్యాఖ్యాన విశేషములను నప్పకవీయమునందు వాని నథర్వణోక్తులలో నహోబలుఁడు సంగ్రహించుట ప్రసిద్ధమే - ఇ దట్టి దై యుండెడు నవ కాశమును లేకపోలేదు.

ఆయయికవిప్రయోగములం ద్రుతద్విత్వమును గమనించిన యహోబలుఁడు దాని నాథర్వణముగా నిట్లు పేర్కొనియుండెనవు - అథర్వణగ్రంథ మప్పకవి చూడ లే దని నిశ్చయించి చెప్పినవాఁడు గావున (నెల్లయెడల నేల యని) నిట నప్పకవి ద్రుతద్విత్వమును దుస్సంధి యనుటను బ్రస్తావింపలేదు. కేవల మిట్టియూహాలపై నెట్లు

నిర్ణయింపఁగలము? అహోబలకర్తృకమే యనుపక్షమున దీనిని ద్రుత ద్విత్వముగానే సమన్వయింపవచ్చును. (అహోబలుఁ డన్నిష్టసఖివంటి వీకుంట గమనార్హమే.) వజ్ఝలవారు శ్లిష్టశబ్దమును 'న'శబ్దమునకు విశేషణముగా సమన్వయించిరి. కాని శ్లిష్టమ్మను పాఠము దానిని విధించుచున్న దనకతప్పదు. కొన్నియెడల ద్విత్వమును గొన్నియెడల సంశ్లేషమును బొందు నన్న వ్యాఖ్య (కవిశి. 416) ఎన్నఁడు న్నేని, ధైర్యశక్తికి న్నరుదుగ నను నహోబలోదాహృతులం జూపి ఇతాద్యాచార్యప్రయోగము లిందుకు (అనఁగా ద్రుతమునకు ద్విత్వ సంశ్లేషములు వచ్చు ననుటకు) ప్రమాణము అన్నది. ఎన్నడు న్నేని ధైర్యశక్తికి న్నరు దన్నపుడు ద్విత్వ మనియు దీని నెట్టుల గ్రమ్మరింతు అనుచో సంశ్లేష మనియు.

చిం. 'లుక్సంశ్లేషౌ నాచి' యని యచ్పరకతలో లోపమును సంశ్లేషమును నిషేధించినది. ఇట నహోబలపతి 'లుక్సంశ్లేషౌ నస్య న స్తోఽచి కొలుఁతు నచ్యుతున్ అని సామాన్యముగ వివరించెను. నిర్గళితార్థానువాదక మని యేమో. అప్పకవి 'సంయుతంబును లోపంబును లే'వని పొడిచెర్కుఁడు (పొడిచెన్+అర్కుఁడు) గ్రామ్య మన్నాఁడు. అయ్యది యంగీకార్యమే. లుఙ్నిషేధ మొప్పినది. చిం. సంశ్లేషమును నిషేధింప సంయుతము లే దని యప్పకవి దానికి 'చూచె న్నింతి' అను ద్రుతద్విత్వమును జూపినాఁడు. అది ప్రయోగదృష్టము. చిం. సాధింపలేదు. అహోబలుఁ డీ 'యాథర్వణోక్తి' చే సంగ్రహించెను. అట్టియెడల నః=నకారము పరప్రాణేన సంగతేః=క్వచిత్ వా ద్విత్వం - శ్లిష్టమ్మను చొప్పున వజ్ఝలవారు చెప్పినట్లుగా ద్రుత ద్విత్వరూపసంశ్లేషమును బొందు నని యహోబలునిమతమున నెన్నఁ దగును. అహోబలుఁడు వజ్ఝలవారివలెఁ బూర్వాచ్చు నత్తియుంట సంశ్లేష మని స్పష్టముగా నిర్ణయింపలేదు. ఇంక 'పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ' యని మీఁదివర్ణముతోఁ గూడుటనుగానే చెప్పి

యున్నాఁడు. కావున ద్రుతద్విత్వము నిట సంశ్లేషముగా వ్యవహరించుట దుష్టము గాదు. - పైఁగా నప్పకవి సంశ్లేషము (సంయుతము) అనుదానికి ద్రుతద్విత్వమును జూపెను గావున ద్విత్వం శ్లిష్టం - అను చోట్ఁన ద్విత్వముతో శ్లిష్టతను బొందు నని స్వరపరకద్రుతసంశ్లేషమును ద్విత్వరూప మగుటను వివరించియున్నాఁ డన్నమాట.

'లుక్సంశ్లేషౌ న' యని చిం. సంశ్లేషమును (అప్పకవి తదర్థకముగా ద్రుతద్విత్వమును) నిషేధించియుండఁగా నాపంశ్లేషమును (ద్రుతద్విత్వముగా) క్వాచిత్కముగా విధించుచుఁ జింతామణిని వి. వి. సవరించిన దని గ్రహింపవలసియున్నది, అయిన నిట నిం కొక భేదము గలదు. 'లుక్సంశ్లేషౌ నస్య న స్తోఽచి'యని వివరించినయహోబలుఁడు కొలుతు నచ్యుతున్ అని యుదాహరించె. అనఁగా ద్రుతమట్లు పై యచ్చుతోఁ గూడిన నయ్యది సంశ్లేషము కా దన్నంత వఱకే నంగీకరింపక తప్పదు. ఎన్నఁడు నేని ననుచో నకారము లచ్చుతోఁ గలిసియే యున్నవి. కొలుతు నచ్యుతున్ - అను దానివంటిదే గావున నీయది సంశ్లేష మగుట యెట్లు?

పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్య కథ్యతే యనుచో నహోబలుఁడు 'కరుణాంబుధికిన్' అనునది శ్లిష్టతగాఁ జూపెను. ఇటఁ గూడ నట్టిదే యవు ననవలె. అవుడు ఎన్నఁడున్న్ని - అనురీతిగానే యుండవలె. ఎన్నఁడు న్నని యుండరాదు. ద్రుతము పూర్వాచ్చునత్తియుండుట సంశ్లేష మనువజ్ఝలవారిమతమునందువలె నీపక్షమున నిబ్బంది లేర్పడును.

కాఁగా నిట సంశ్లేషపదార్థము నప్పకవివలెను దా నింతకు ముందు చెప్పినట్లుగ మీఁదివర్ణముతోఁ గూడుటగానే యహోబలుఁ డెంచినట్లు చెప్పక తప్పదు. అట్టియెడల 'లుక్సంశ్లేషౌ నాచి' యను సూత్రము సాధించిన 'కొలుతు నచ్యుతున్' అను రూపమునవలె నిట

ప్రుతము మీఁదివర్ణముతోఁ గలియఁగా దీని నే మనవలె. అహో బలుఁడు కరుణాంబుధికిన్ అనునదియు శ్లిష్టత యనియు సీత నగరాజ గమన యనునదియు సంశ్లేష మనియు భావించియుండి రెండువిధము లైనయభిప్రాయములను స్వీకరించియుంటచే లక్ష్యానుగుణముగా వివరించుకొనవలసియుండును. ఏది యే మైనను స్వరపరకతలో ప్రుత సంశ్లేష మనఁగా నప్పకవి చెప్పినప్రుతద్విత్వ మనురీతిగా సమన్వ యించుటయే యహోబలునియభిప్రాయముగా గుర్తింపనగును. బాల సరస్వతి సైతము మిట నిట్లే చెప్పినయాధారము గానవచ్చు. (చూ. ప్రుతస్వరూపాన్వేషణము.)

శ్లిష్టశబ్దముతోడిసమన్వయము కొంతవఱకుఁ గ్లిష్ట మయ్యును నహోబలుని రెండువిధము లైనయభిప్రాయములనుబట్టి బాధకము గానేరదు.

ఇంకను బూర్వాచ్చు నొత్తియుంట యనుసంశ్లేషము నందిననకా రము పరప్రాణసంగతిలో వికల్పముగా ద్విత్వము నందుట కొన్ని యొదలఁ గల దనురీతియన్వయములోనే యిబ్బంది యున్నది. 'లుక్సం శ్లేషౌ నాచి' యనుసూత్రము స్వరపరకత్వమున ప్రుతమునకు సంశ్లే షము లే దని చెప్పుచున్నది. 'పూర్వాచ్చు నొత్తియున్ననకారము' అనుటచే నిట ప్రుతము సంశ్లేషము నందిన దనవలసియున్నది. సంశ్లే షమును నిషేధించుట యుట్లుంచి చిం. స్వరపరకతలో నసలు విధింపనే లేదు. కావునఁ జిం. అభిప్రాయమునకు భిన్నముగా వి. వి. శ్లిష్టః (ఇది వజ్ఝలవారిపాఠము.) సరి అని చెప్పినసామర్థ్యము ననుసరించి సంశ్లేష మయిన దని యోచవలయును. వజ్ఝలవారిమతమున ప్రుతము నకు సహజస్థితి మీఁదివర్ణముతోఁ గలిసి వచ్చునటఁ డనురీతిగా నుండుట. వచ్చెన్ గోవు లని పూర్వస్వరము నొత్తియుండుటయే విశే షము. అందుకే అలుకి చ అనుసూత్ర మిట్టిసంశ్లేషమును ప్రత్యేక ముగాఁ జేర్కొన్న దని వారినిశ్చయము. కాఁగా నిట వి. వి. వచన

సామర్థ్యమునుబట్టియే యిట్టి సంశ్లేషరూపప్రకృతవికార మయిన దని చెప్పుకొనకతప్పదు.

ఇట్లు శ్లిష్ట మయిననకారమునకు ద్విత్వ మగుట వికల్పము. కాఁగా నాద్విత్వము రానపుడు ప్రయోగ మెట్లుండవలె? ధైర్యవృత్తికిన్ - అరుదుగ నని యుండవలదా? ఇయ్యది గాణపతసమన్వయమున వాక్యాంతసంధ్యభావస్థలముగానే యున్నది (వఝలవారి సమన్వయములో నిది సంశ్లేష మైన విశేషకార్య మయినది గాని) అన్ ఇష్టసఖి - అనురీతిగా ద్విత్వము లేనపు డీనకారము పూర్వస్వరము నంటియే యుండునా? లేక ద్విత్వము రానపుడు సంశ్లేషము పోయి ద్విత్వము వచ్చి అనిష్టసఖి యని కావలెనా? శ్లిష్ట మైననకారమునకు ద్విత్వము వికల్ప మగుటచేత ద్విత్వాభావస్థితిలో శ్లిష్టత యట్లే యుండవలెఁ గదా. వృత్తికిన్ అరుదుగ - ననురీతిగా లేదు గాఁబట్టి ద్విత్వాభావస్థితిలో సంశ్లేషము అనఁగా పూర్వాచ్చు నంటియుండుట యుండ దన్నచో ద్విత్వము వచ్చునపుడే శ్లిష్టత యుండు నన్న మాట. (నిజమునకు అన్నన్ లేదా అన్న్ - ఇష్టసఖి యనురీతిగాను నుండ దని స్పష్టమే) శ్లిష్టతలో ద్విత్వము నిత్యమే యయినపుడు శ్లిష్టః నః అని చెప్పు దనెనో యపుడే ద్విత్వం వా - అనుట కుదురదు. ద్విత్వము నిత్యమే యనవలె. లుక్సంశ్లేషౌ న - అని చిం. సంశ్లేషము సంగీకరించియుండమి శ్లిష్టః అను వి. వి. వచనసామర్థ్యమును బట్టి గదా శ్లిష్టత సంగీకరించునది. లేనిచో వఝలవారిమతము ననుసరించి యసహజమును విశేషమును నైన శ్లిష్టత యెట్లు? కాఁగా శ్లిష్టమైననకారమునకు ద్విత్వము వచ్చు నని నిత్యముగనే ద్విత్వము చెప్పినచోఁ గ్వాచిత్కముగా శ్లిష్టమైననకారమగుటచే శ్లిష్టత లేనపుడు (ద్విత్వము లేదు.) వచ్చె నతఁ డనురీతిగా ధైర్యవృత్తికి నరుదుగ నని యుండుట సహజముగ సిద్ధించును.

అహోబలపతిమతము ననుసరించి యిట సంశ్లేషపదమునకు ద్విత్వ మనియు (విధేయాంశమే) గ్రహించుటచే నాద్విత్వము లేనపుడు కొలుతు నచ్యుతున్ అనురీతిగా నవుట సిద్ధించుచున్నది. కావున నట ద్విత్వం వా యనుటవలన వైరుధ్యము లేదు. వజ్ఝలవారిమతము ననుసరించి 'వా'యనుట సముచితము గాదు.

ఇంక ద్విత్వము వచ్చుసందర్భమునందు సయితము వారిశ్లిష్టత సరిగా నన్వయింపకుంట స్పష్టము. (పరప్రాణేన సంగతేః అనియు నుండె.)

నిజమునకు నహోబలపతిమతము ననుసరించినసంశ్లేషపదార్థపక్షమునను వజ్ఝలవారిమతము ననుసరించినపక్షమునను శ్లిష్టత యనుపది సూత్రమునఁ జెప్పకున్నచో నట్టివైరుధ్యము నుండదు. నకారమచ్చుతోఁ గూడునపుడు కొన్నియెడల వికల్పముగా ద్విత్వము నందు ననురీతియన్వయము సులువై యుండును.

కవిజనమండనవ్యాఖ్య 'నో వా ద్విత్వం క్వచిద్ధిష్టమ్' అని క్వచిత్-హి-ఇష్టమ్-అని యిష్టశబ్దముం జూపెను. అహోబలపతిలక్ష్యములం బ్రదర్శించెనే కాని లక్షణమును వివరించినవాఁడు కాదు. శ్లిష్టశబ్దమున కహోబలపతివివరణ మున్న నాపాఠమునే గ్రహింపవలయుట కాధారము మిక్కిలిబలీయ మైయుండెడి దనుట నిర్వివాదము. కవిశిరోభూషణములం దీ కవిజనమండనపాఠము పాఠాంతరముగను జూపఁబడియుండలేదు.

ఎన్నఁడు న్నేని, ధైర్యశక్తి న్నరుదుగ నని యహోబలపతి దీనికి ద్రుతద్విత్వములనే చూపెను. అన్నిష్టసంధి యనురీతివానిం జూపకుంటనుబట్టి యవి యాతనిదృష్టి కెక్కలే దేమో. అయినను నిటఁ గారికయందు ద్రుతాద్ధ్రితి యనుతరువాతియర్థమునందువలె నిట

ద్రుతశబ్దము ప్రయుక్తము గాక నకార మని సామాన్యముగఁ జెప్పా టంజేసి ద్రుతేతర మగుశబ్దగతనకారమును సైతము గ్రహింప నవకాశము గలదు. లేక నన్నయాదులవారివలె ఏను, తాను, ఏని శబ్దములందే గాక యెల్లెడల ద్రుతముగానే భావించియుండెనో? నో వా-అనుచోఁ గేవలము నకారముపై నకారమును ద్రుతాద్వితః అన్నపుడు 'న' వర్ణముపై నకారమును సాధించుట యాతనిమత మేమో. ఏల యన నుత్తరార్థస్థలమున నదియును గ్గాకేత్యాదిహల్పరకస్థితుల నుదాహరింపక యచ్పరకములనే యుదాహరించుటనుబట్టి యట్లూహింప వీలు గలదు.

ఇట్లే అన్విష్టసఖ యనుకీతి నిట లక్ష్యములె యనుకోను నప్పుడు 'ద్విత్వం వా' అనుచోటి వాశబ్దమునకు వ్యవస్థ చేసికొనవలసియున్నది. దీనివలన అను అనుధాతువవిశేషణమునకు నికార్యము స్వరలోపానంతరము నిత్యము. అనిష్టసఖ యని యుండదు గదా యన్విష్టసఖ లేదా యనన్విష్టసఖ యనునవగును.

నో వా ద్విత్వమ్-అనుదానిచే నకారపుఁబోల్లవయి. ద్రుతాద్వితః యనుదానిచే నువర్ణరూపద్రుతము వయిని సంకోకనకార మగుటనే యహోబలుఁ డుద్దేశించిన ట్లూహింపవచ్చును. కాని యట్టిదింగడిం కవసర మని నిశ్చయింపలేము. దీని కహోబలుని యుక్తియే యాధారముగా నున్నది. 'ద్రుతాద్వితః ఇత్యత్ర ద్రుతశబ్దః కేవలనకార నువర్ణకద్వయసాధారణః ఇతి ద్రష్టవ్యః' (కవిశి. 417) మ్మను చున్నాఁడు. ద్రుతశబ్దము కేవలనకారమును - నువర్ణమును రెంటిని గ్రహింపఁగలదు గదా. అట్టియెడల ఎన్నఁడున్నని అనుచోఁ గేవల నకారముపైని నకారము రాఁగా నత్వ్రతియును నత్వంత...అనుచో నువర్ణముపైని నకారము వచ్చిన దఁడఁదగును. నకారమును నువర్ణ

ముసు ద్రుతములై కాఁగా నకారముపై నకారము వచ్చినస్థలము ద్రుత ద్విత్వము. అనఁగా నకారద్విత్వమె యవును. అనఁగా నీనకార ద్విత్వము సంయుతము ద్రుతముపై ద్రుత మగుటకె లక్ష్య మనఁదగి యున్నది. నో వా ద్విత్వ మ్మనుదానినిఁగూర్చి ప్రస్తావింపనసూరి 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' నని సూత్రించుటలో నట్టిదే యనఁదగిన ప్రస్తుతాహోబల గ్రంథము దృష్టి యం దుండియుండకతప్ప దన్న నెన్నడు న్నని? ననుకీర్తి ద్రుతద్విత్వ ములు సంయుతము ద్రుతముమీఁద నకారము ద్వారానె సాధించు కొనుట కవకాశము గల దని సూరియు నెంచియే యుండె నేమో యని పించు.

అస లహోబలపతియే యట్లు భావించెనా? ధైర్యశక్తికి న్నరు దుగ ఇత్యాది తత్ప్రయోగాత్ – సత్క్రుతియును నత్యంత – ఇత్యాది తద్వచనాత్ ద్రుతాద్ధ్రిత ఇత్యత్ర ద్రుతశబ్దః కేవలనకార సువర్ణకద్వయ సాధారణః – అనుట యట్టి దగు నేమో. పూర్వోత్తరార్థముల ప్రసక్తి లేకుంటయు నిట గమనార్హమె యైయున్నది. ద్రుతాద్ధ్రిత – యనువాక్యమునకుఁ బిదప – తేన – అన్నను నఖండ ఇత్యాది ప్రయోగ స్సాధుః – అన్నాడు గదా యని ద్రుతాద్ధ్రిత యనువాక్యమునకుఁ బూర్వోక్తభాగముతో సంబంధ మేమియు లే దని తలంప నక్కర లేదు. ఆవాక్యమునకు ముందు చూపినసత్క్రుతి యును నత్యంత – సత్ప్రిజయును నానంద–అనుస్థలములలో సువర్ణకము పైనే గదా ద్రుతముచేరినది. ద్రుతాద్ధ్రిత యన్నదానితరువాత 'తేన' మొద లగు ప్రారంభమున నభిప్రాయ మేమి? అనఁగా "సీ వి. వి. వచనములు నన్నయకు సమ్మతములు. నన్నయ కేవలనకారము పైని సువర్ణము పైని నకారము చేసినాఁడు. కాబట్టి ద్రుతశబ్దమున కట్లర్థము గ్రహింపఁదగు, దీనివలన అనఁగా (వి. వి. లక్షణ) నన్నయ ప్రయోగబలము ననుసరించి 'అన్నను నఖండ' అనుకీతిగాఁ గల్పిం

చుట సాధువే" యని కావచ్చును. కానీ యీపక్షమున న్నో వా ద్విత్వ మ్మనుపూర్వార్థము నహోబలుఁడు విడిచి పుచ్చె ననవలసి వచ్చుట విచార్యము.

ఏది యే మైనను ద్రుతాద్ద్రుత ఇత్యత్ర - ము న్నగు నహోబలునివివరణవాక్యమును బరిశీలించి చూడఁగా ఎన్నఁడు న్నని (కేవల నకార) సత్కృతియును నత్యంత(నువర్ణక)యనురీతివి రెండును ద్రుతాద్ద్రుత యనుకారికకె లక్ష్యము లనుట కవకాశము గలదు. ఎల్లయెడ స్వరపరకస్థితిని జూపుటనుబట్టి 'పర ప్రాణేన సంగతేః' అన్నది యహోబలునివివరణమునఁ దోఁచుచున్న దనవచ్చు. దానింబట్టి ఎన్నఁడు న్నని నన్నది న్నో వా ద్విత్వ మ్మనుదానికిని సత్కృతియును నత్యంత-యన్నవి ద్రుతాద్ద్రుత ఇత్యత్ర అనుదానికిని లక్ష్యరూపవివరణములుగా నుద్దిష్టము లని యహోబలునిమతమును గుర్తించినప్పటికి సల్లు వేఱు చేయవలసినయవసరము గానరా దనియు ద్రుతాద్ద్రుత యను దానిచేతనే సాధింపఁబడఁగల వనియు సూరి కొన్నియెడల ననులక్షణమునందు నిట్టిస్థితి నూహించుట కవకాశము లేకపోలే దనియు గ్రహింపఁదగియుండుట గుర్తింప నగు.

ఇట్టియెడల న్నో వా ద్విత్వ మ్మనులక్షణము నహోబలకర్తృకమే యని భావించుటకు నవకాశము లేకపోలేదు. అయిన నేదానికైనను బ్రబల మైనయాధారము గానరాకున్నది. అహోబలపతి కాక యితరు లే వ్రాసియున్నపక్షమునయందు నహో. ఉదాహరించిన యవి యెల్ల ద్రుతాద్ద్రుత యిత్యాద్యుత్తరార్థమునకు లక్ష్యములుగాఁ జేసికొని న్నో వా ద్విత్వ మనునది అన్నిష్టసఖిత్వాదులను సాధించుచున్న దనుకొనవచ్చును. అహోబలపతికర్తృకమే యైన యెడలఁ దద్వ్యాఖ్యానము ననుసరించి ద్రుతద్విత్వ మనియే చెప్పవలసియుండు.

ఏ మైనను నన్నయ ప్రయోగములయందు ఎన్నఁడు న్నేని ధైర్యవృత్తికి న్నరుదుగ - అనునవి మార్గాంతరమున సిద్ధము లవుచుండుటం జేసి యయ్యవి ద్రుతద్విత్వములే యని నిశ్చయించుటకు బలమైన యాధారములు గాఁజాలవు. వాదమధ్యస్థలములయందు ద్రుతమునకు ద్విత్వము వచ్చినచో నొకటియు లేకుండుట గమనార్హము.

అన్నిష్టసఖ — మున్నగువానియందు నకారమునకు ద్విత్వమె యున్నను నయ్యది ద్రుతము గామి ద్రుతద్విత్వ మనరాకున్నది. చిం., వి. వి. లమతమున శబ్దగతనకారమునకు ద్రుతత్వాంగీకారమునకు సరియైన యాధారములు లేమి స్పష్టము. ఇంకను నో రన్యస్యాపి సర్వం స్యాత్ అను వి. వి. లక్షణముచే ద్రుతకార్యము లూహింపఁదగునా ? అను - అన్ అనుచోటినకారమునకు ద్రుతకార్యములవుట యెచ్చటఁ గూడఁ గానరాదు. జడి గొన్ కోర్కులు మున్నగు రీతిగా హల్పరకతలో స్వరలోపముతో నకారమే నిల్చియున్నను దానిపైఁ బరుషములకు సరళాదేశము మొదలుగా ద్రుతకార్యము లెచ్చటను గానరావు. ఎచ్చట నేని ద్రుతకార్యము లేవియు లేకుండఁగా దీనికి ద్రుతత్వాంగీకార మేల? స్వరలోపానంతరము నకారమెల్లయెడల ద్రుతమే యగు ననియే చిం., వి. వి. లు భావించియున్న పక్షమున ద్రుతమునకుఁ దత్కార్యము లేల లేవు? చిం. ద్రుతము లేనివి కళ లన్నది. వీనిచివర నకార మున్నను దానియందు ద్రుతలక్షణము లేవియు లేవు గావున నది ద్రుతము గానేరదు. అది ద్రుతప్రకృతిక మెట్లవు? వి. వి. బహుళ మన్నది గావున ద్రుతకార్యములు లేకపోవచ్చు ననవచ్చును. నో రన్యస్యాపి- యనుచో నెచ్చటనేని ద్రుతకార్యము లున్న స్థలాంతరమున నయ్యవి గానరాకున్న నప్రవృత్త్యాదులసాధనమునకు బహుళపద ముపయోగింపఁదగు. ఎచ్చట నేని ద్రుతకార్యము లేవియు లేకుండ ద్రుతత్వము నంగీకరించి యెల్లయెడల ద్రుతకార్యముల కప్రవృత్తిని జెప్పుకొన నేల?

ఇంక దీనిని ద్రుత మనుటవలనఁ బ్రయోజన మొకఁడే. ఇయ్యవి యెల్ల సమాసములె యైయుండుటచే ద్రుత మనుటతోడనె 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అనుదానిచే లోపము వచ్చుట దానిని 'నస్య లోపశ్చ నేష్యతే' (ఈపాఠము నహోబలుఁడు వ్యాఖ్యానింపలేదు.) యనుదానిచేత వారించుకొనవలసివచ్చుట.

కాఁగా దీనికంటె నీనకారము ద్రుతము కానేర దనియు (స్వరలోప మైన నెల్ల యెడల నకారము ద్రుత మని సామాన్యముగాఁ జెప్పరాదు.) స్పష్ట మగుచున్నది.

కావున నన్నిష్టసఖీత్యాదులు ద్రుతద్విత్వమునకు లక్ష్యములు గానేర వని గ్రహింపవచ్చును. ప్రౌఢవ్యాకర్త పెన్నాదుల కిట్లు ప్రత్యేకముగా విధించుట యెంతయు నుచిత మై (శబ్దగతనకారము ద్రుతము గాదు గావునను) యున్నది.

అయిన నన్నిష్టసఖ యనుకృతివాని నిట్లు గాక గుర్తింప నవకాశము లేకపోలేదు కనుఁగవ - కన్గవ వాలుఁగంటి వాల్గంటి యనుకృతిగా సమాసములయందును స్వరలోపము తెలుఁగునఁ బ్రసిద్ధమే యనఁ దగియున్నది. అదే తీరుగా అను+ఇష్టసఖి అని యుండఁ (కను+కవ వాలు+కంటి యనుచోటు సమాసగతము గలదు.) చేయునతఁ డను రీతిగా అనునిష్టసఖి యని కాఁ గా కనుఁగవ, కన్గవ - అని యైనట్లుగా ననులోని యుకారమునకు లోపము రాఁగా అన్నిష్టసఖి యవును. అన్నసుర మున్నగునవి యిట్లు సిద్ధపడఁగవు. పెను శబ్దమునందుఁ దప్ప (అనునవి?) నెల్ల యెడల నిట్టిస్థితి సంభవింపఁదగియే యుండె. అట్టి యెడల మాత్రము ద్విత్వము విధింప నేల? నిజమున కిట్లె గ్రహింపఁ దగియున్నది. (పెద్దనగ) పెన్నరచి యని పెద్దశబ్దమున కచ్చరకతలో పెన్న అనునాదేశమును జెప్పినసూరిమతాన అన్నిష్టసఖీత్యాదు లిట్లు సాధింపఁదగు నను నభిప్రాయము (సూరికిఁ) గల దేమో.

కాని యిట్టిరూపములను భిన్నమైనవానియందు ధా.వి లలోఁ గానరావు. ఇట్టిప్రయోగములు నయితము ప్రధానముగా నన్నయ ప్రయోగములందే యట నటఁ గానవచ్చుచున్నవి. పైరీతి ప్రక్రియ నాశ్రయించిన నయ్యది యెల్లెడలఁ బ్రసక్తము కాఁగల దని ప్రౌఢ. ప్రత్యేకముగాఁ జెప్పియుండనవు. అట్లు ప్రత్యేకముగాఁ జెప్పఁదగు నన్నను నో వా ద్విత్వ మ్మనుకారిక యాయంశమును స్పష్టముగాఁ జెప్పుచున్నట్లు గానరాదు.

కాఁగా నిది యుపస్కవిమతివిమర్శనముతోఁ దదనుసరణముతో సహోబలపతికృత ము ఱు నకార(ద్రుత) ద్విత్వమునే చెప్పుచున్నదనఁ దగు. అథర్వణుఁడు గాక తను వాతి వా రెవ్వరన్నను నిట్లర్థము చేయనవు.

—o—

# ఆథర్వణోద్ధరణము (ద్రుతముపై ద్రుతము)

అథర్వణశబ్దములోని రెండవవర్ణము తవర్గచతుర్థాక్షర మైన ధకారమే యనుచు వజ్ఝలవారు "అటులైనచో నాశబ్దమునకు వ్యుత్పత్తియు నిటుఁ గుదురుపడుచున్న" దని చెప్పి "అథర్వన్ - అనుదానికిఁ జలనము లేనివాఁ డని యర్థము. శబ్దశాస్త్రమునఁ బ్రమాదమే లేనివాఁ డని తాత్పర్యము" (వ్యా. సం. స 3) మని కుదురుపఱచిరి. శబ్దశాస్త్రమునఁ జలనమే లేనియథర్వణుని సాధింపవలసినస్థితి వజ్ఝలవారే కల్పించుట విశేషము. వీరి కథర్వణునిపయి గౌరవము లే దని కాని తక్కువ యని గాని చెప్ప వీలు లేదు. "ఏకత్వే చ భవే ద్వారు స్తథా లౌ చ భవేత్ క్వచిత్" అను వి. వి. వచనమునకు మహాబలు ననుసరించి వీరు కూడ కూఁతుశబ్దము ప్రథమైకవచనమునకు రువర్ణము వికల్ప మన్నారు. రుప్రత్యయము లేని 'కూఁతు' అను ప్రథమైకవచనాంతరూపమును గూర్చి 'నాకు నట్టి మహాకావ్యములందుఁ గన్పట్ట లేదు. కాని యథర్వణాచార్యసంతతివాఁడు కంఠోక్తముగా నది సాధు వని వచించియుండఁగా నయ్యది యెట్లు నిరాకరింపఁదగిన దగును. అతఁడు సూత్రించుట యొకటి ప్రయోగించుట వే ఱొకటియు నగునా? (వ్యా. సం. స. 725) యనిరి. (అగు నని వారే చెప్పిరి కాని యగునా యని ప్రశ్నింప సమాధాన మేరు చెప్పవలెఁ?) దీనివలనఁ బ్రథమైకవచనములోఁ 'కూఁతు' అనువిధముగా మహాకవిప్రయోగము లేకున్నను ప్రయోగశరణ మైనవ్యాకరణములోఁ బ్రమాదమే లేని యథర్వణుఁడు చెప్పియున్నాఁడు గాఁబట్టి గ్రామ్యమే యని వజ్ఝల వారినిర్ణయము. అథర్వణు లాచార్యులై యుపదేశించిన దెయ్యది యైనాఁ గాని వజ్ఝలవారు నిర్ణయించినయ్యది యపూర్వము. అట్టి గౌరవ మున్నయథర్వణునే స్థలాంతరమున వజ్ఝలవారు ప్రమాద పతితులను జేసియున్నారు.

ద్రుతముపై ద్రుతము :-

'ద్రుతాద్ద్రుతః క్వచి చ్చాత్ర దృశ్యతే కవిభాషితే' యనుకారిక ద్రుతముపై ద్రుతమును జేర్చుచున్నది. ఈకారికను వజ్ఝల వారు నో వా ద్విత్వం క్వచిచ్ఛిష్ట ప్రయోగేణ సంగతేః' అను నింకొక వి. వి. లక్షణముతో సంబంధము నుదిర్చి వ్యాఖ్యానించి యున్నారు. (అహోబలుం డీకారికల వెంటవెంటఁ జూపుట యొక కారణ మైనఁ గావచ్చు.) నో వా ద్విత్వ మ్మనుకారికచేత స్వరపరకత్వములోఁ బూర్వశబ్దాంతిమద్రుతము ద్విత్వమును బొందు నన్నారు. ఆపై నీకారికను వివరించుచు "క్వచిత్=క్వాచిత్కముగ, అత్ర= ఈద్విత్వము వచ్చుసందర్భమున ద్రుతాత్=ద్రుతమునకుఁ బరముగ ద్రుతః=ను అనెడి ద్రుతము, కవిభాషితే=మహాకవిప్రయోగములందు దృశ్యతే=కనఁబడుచున్నది" ఇట్టిచో ద్విమాత్రమై ద్రుతముపై నుచ్చారణస్వభావమున నిరర్థకమగు నింకొకద్రుతము నిల్చు నని తాత్పర్య (వ్యా. సం. స. 31వ) మన్నారు. నో వా ద్విత్వ మనుకారిక ప్రకారము ద్విత్వము వచ్చుసందర్భములలోఁ గ్వాచిత్కముగా మహాకవిప్రయోగాలలో ను అనెడి ద్రుతము కనఁబడుచున్న దని దీని సారాంశము. ఇందౌచిత్యము గల దేమో చూతము.

నకారమునకు (ద్రుతమునకు) ద్విత్వము వచ్చినసందర్భములలో నకారముమీఁద నకారము (ద్రుతము) రాకున్న నింకేమి వచ్చును? ఇంకేదయినఁ వచ్చిన నయ్యది (నకార) ద్విత్వ మెట్లవును? అనఁగా నకారమునకు ద్విత్వము వచ్చు నన్న నో వా ద్విత్వ మ్మనుకారికచేతనే నకారముపైని నకారము వచ్చుచుండఁగా మఱల (నక్కడనే) నకారముమీఁద నకారము వచ్చు నని చెప్పుచున్న యీకారిక వ్యర్థ మయినట్లె కదా! ద్విత్వము చెప్పినయితరసందర్భములలో నిట్టిది గలదా? అట్లై యైన 'అద్విత్వం చ భవే ద్విత్వ' మ్మనుదాని కెన్ని వివరణకారికలు చేయవలసియుండును?

అయిన నిది యొకపక్షమునఁ బ్రయోజనవంతము గాఁగలదు. నో వా ద్విత్వ మ్మనుకారిక నకారమునకు ద్విత్వ మనుచున్నది. అచట ద్రుతశబ్ద ముచ్చరింపఁబడలేదు. ద్రుతాద్ద్రుతి యనునీస్థలమున ద్రుతశబ్ద మున్నది. కావున నో వా ద్విత్వ మనునది నకారమునకు సాధారణముగా ద్విత్వము చెప్పుచుండఁగా ద్రుత మైనదాని కీకారిక చెప్పుచున్న దనవచ్చు. సామాన్యముగాఁ జెప్పుటచేత నో వా ద్విత్వ మనుదానిచేతనే సిద్ధింపకపోదు. స్పష్టత కైనఁ బ్రయోజన మనవచ్చు. కాని వజ్ఝలవారిమతమున వృత్త్యేఁ దన్నసుర ఇత్యాదులలో స్వరలోపానంతరము శబ్దగతి మైనసకారవ్యంజనమును ద్రుతమే యగుటచేత నో వా ద్విత్వ మిత్యాదికారికలక్ష్యములును ద్రుతద్విత్వములే యవుచున్నవి. వజ్ఝలవారిలక్ష్యప్రదర్శనమును నీయంశమునే స్పష్టము చేయుచున్నది. (వ్యా. సం. స. 315) కాఁగా ద్రుతాద్ద్రుతి యను నీలక్షణము వజ్ఝలవారివివరణమునుబట్టి వ్యర్థ మనక తప్పదు.

పైఁగా వీరియర్థమువలనఁ గొన్ని యనర్థము లేర్పడుచున్నవి. ఈ ద్విత్వము వచ్చుసందర్భములలో నకారముపై నకారము క్వాచిత్కముగాఁ గనబడుచున్న దన్నారు. అయిన ద్రుతద్విత్వము వచ్చినసందర్భాలుగా వారిచ్చినలక్ష్యా లన్నింటిలోను నకారముమీఁద నకారము రాని ధైర్యశక్తికి నరుదుగ నమరినవియు నో వా ద్విత్వ మనుదానికి లక్ష్యము లవునా? క్వాచిత్క మన్నారు గదా. ఈ (ద్రుత) ద్విత్వము వచ్చుసందర్భమునఁ గ్వాచిత్కముగా ద్రుతముపై మఱొక ద్రుతము కన్పించు ననఁగాఁ దఱుచుగా ద్రుతము మీఁద ద్రుతము వచ్చుటకే వీలు లేదు. అట్లు వచ్చినప్రయోగములు లేవన వలె. నిజమునకు ద్రుతమునకు ద్విత్వము వచ్చినప్రయోగములే తఱుచుగాఁ గనఁబడవు గాని వచ్చినచోట్ల ద్రుతముమీఁద ద్రుతము రాకుండు టెట్లు? అన లటువంటివి ద్రుతద్విత్వము లవునా? మఱి

రొక ద్రుతము రాకున్న ? నో వా ద్విత్వ మనుదానికిట్టివి లక్ష్యములు గావు. కాఁగా ద్రుతమునకు ద్విత్వ మగుట యరుదనవచ్చును గాని ద్విత్వము వచ్చుచోట నకారముపై నకార మగుట యరుదనరాదు. అనఁగా నియతముగనే యగును. ఈయర్థముప్రకారము కారికయందలి క్వచిచ్ఛబ్ద మనర్థక మైనది.

కవిభాషితే యన్నది పాదపూరణముకొఱకు కంతము. మహాకవి ప్రయోగములలో (ద్రుతద్విత్వసందర్భములో నకారముమీఁద నకారము) వచ్చు నన్న నితరప్రయోగములలో వైలక్షణ్య మేమి? అటఁ గ్వాచిత్కముగాఁ గూడ నీద్విత్వసందర్భములో నకారము పైన కార ముండదా? ఉన్న నది సాధువు కాదా? కవిభాషితే యనున దీపక్షమున నర్థవంతము గాదు. (అహోబలపతిపక్షమునఁ బ్రామాణికతాసూచక మయి స్పష్టతకును నగును)

కాఁగా నీకారికకు వజ్ఝలవారు చేసినయర్థము సంగతము గాదని నిర్ణయింపవచ్చు.

ఇది యిట్లుండఁగా వీరు దీనిని సూరిమతముతోఁ బోల్చుట యింకను వింతగ నున్నది. 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' ననుసూరిసూత్రమునుగుఱించి ద్రుతాద్ధ్రిత ఇత్యాది కారికను మాత్రము ప్రస్తుతసూత్రముతో సంగ్రహించి యనుట విశేషము. బహుశః అహోబలపతివ్యాఖ్య ననుసరించి వీ రిట్లు పేర్కొని రేమో. నిజమునకు వీరివ్యాఖ్య ననుసరించి 'నో వా ద్విత్వ' మనుదానికిని సూరిసూత్రమునకును సంబంధము లే దన్నపుడు ద్రుతాత్తనుకారికకును సూరిసూత్రముతో సంబంధము లే దనియే చెప్పవలె. వజ్ఝలవా రిది గుర్తింపక పోలేదు. 'ద్రుతాద్ధ్రిత మొదలైన కారికా సమూహము ( ? ) సాధించులక్ష్యము లన్నియు దీనిచే సాధింపఁబడె నని సూరితలంచె' నని 'అది వింత' యని వీరు పేర్కొనిరి. వీరు చేసిన

సమున్వయము ప్రకారము సిద్ధించునర్థము సంతకుఁ బూర్వము అనఁగా సూరికిఁ బూర్వ మెవ్వరును జెప్పలేదు. సూరియు నూహించి యుండఁడు. దానివలన నాయర్థమును దాను సాధించినట్లు సూరి యను కొనె నని మన మనుకొనుటకు నాధారము లేదు. అహోబలుఁడు నో వా ద్విత్వ మనుదానిచేత నకారద్విత్వమును, ద్రుతా త్తనుదానిచే నువర్ణముపై నకారమును సాధించియున్నాఁడు. ద్రుతా త్తనుకారిక కహోబలుఁడు చేసినయర్థమునే యంగీకరించి స్వీకరించె ననుటకుఁ గొన్ని యెడల ననుసూత్రమునొద్ద నున్నసూరిలక్ష్యములే సాక్ష్యములు. ఇంక ద్రుతద్విత్వము (సర్వము న్నతని) సూరి సాధించెనా? అది పైని జూతము.

వజ్ఝలవారు సూరిసూత్రమునుగుఱించి యింకను నిట్లన్నారు. 'అంటిని నిందఱకు' చింతామణిచొప్పున అంటినిన్ అనురూపము సాధ్య మగును (కా దని స్పష్టము) బాలవ్యాకరణముచొప్పున 'నంటిని' అని మాత్రమే యగును. ఇచ్చట సైతము ప్రస్తుతసూత్రమునె గతిగఁ గల్పింపనగు నేమో 'అనవుడును నయ్యధోక్షజ' - ఇట ననవు డను భావార్థకరూపమునమీఁద నర్థవిశేషబోధక మగునున్ శబ్దము చేరుట నన్నయాథర్వణీయప్రక్రియ కనుకూలముగా నున్నది. బాలప్రౌఢ వ్యాకరణముల పక్షమున - అనవుడును అనవుడున్ అనురూపములు మాత్రమే సాధ్య మగును. ఇట్టియెడలను బ్రకృతసూత్రమునె గతిగఁ గల్పింపనగు నేమో - అన్నారు. అన లిట్లనుమానింపవలసినయవసర మేమో తెలియకున్నది. లక్ష్యములందు లక్షణమును బ్రవర్తింపఁ జేయుట కింత లేల? అక్కడకు బాల ప్రధాన మైనవిషయమును సూటిగ సాధింపలేకపోయినట్లును నది యొక లోప మయినట్లును జెప్పఁ బూనుట సమంజసముగాఁ గనఁబడదు. 'అంటిని నిందఱకు' ననువిధ మైనప్రయోగములు మిక్కిలియరు దనుట నిర్వివాదము. అదియు వజ్ఝలవారే గుర్తించియున్నారు. కావునఁ 'గొన్నియెడల' నను

దానితో సాధించుట తప్పు గాదు. వజ్ఝలవారి ప్రక్రియలో నేర్పడిన యిబ్బందులు పెక్కులు (చూ. అను - 2)

అనవుడును నయ్యర్థోక్షజ - అనుచోట నయ్యాది సన్నయా ధర్వణీయప్రక్రియ యందురు. కాని యిది సమంజసము కాదు. డువర్ణకమును భావార్థకముగాఁ జిం. కాని వి. వి. కౌని విధించియే యుంత లేదు. అవి చెప్పినవి టవర్ణకమునే. డువర్ణకము భావార్థక మనియు దానిపైని జాద్యర్థక మైనసుశబ్ద మానంతర్యార్థక మనియు వజ్ఝలవారి నిర్ణయము. యువర్ణకా ర్థవిశేషమున వచ్చు నని వి. వి. చెప్పుచున్నది కావున నిట నానంతర్య మర్థవిశేష మనవచ్చును. (డువర్ణకము భావార్థక మగుటయే వ్యాకరణమునం దనుక్తాంశము.) వజ్ఝలవారిక్కడఁ బ్రౌఢవ్యాకరణమును గూడఁ బ్రస్తావించిరి ప్రౌఢవ్యాకర్త (భావార్థమున డుప్రత్యయమును జెప్పలేదు.) కాని భావార్థకటాంతముపై సుశబ్దము చేరి యిది యానంతర్యార్థక మగుట స్పష్టముగాఁ గూడ సూత్రించియున్నాఁడు. (ప్రౌఢ. క్రియా.)

అయిన సుశబ్దము ద్రుతాంత మని వజ్ఝలవారియభిప్రాయము. కానీ యిది సరికాదు. (ద్రు. అను. 3) కాఁబట్టి చిం. వి. వి. మతమునను నిచ్చుట ద్రుతాద్దృతి యనుదానిచేఁ జేసికొనవలసినదే. బాల ప్రౌఢవ్యాకర్తలు సుశబ్దము ద్రుతాంతము గా దని కవిప్రయోగానుసారముగా గుర్తించుట యుచితమే. అట్టియెడ ద్వైస్వప్రయోగములకయి దీనిని ద్రుతాంత మన్న నిబ్బంది యితరత్ర యధికము. కావున దాని నిట్లు సాధించుకొనుట యుచితమే.

ద్రుతము నకారప్రాంబొల్లయే యని భావించినవజ్ఝలవారు నాచేతను నాకును అనురీతిస్థలములందు ద్రుతనుస్వరూపమును సాధించుటకై (తిక్కనాదులు నుస్వరూపము ప్రయోగించి రని వారే యంగీ

ఇవే పాట్లయిన నాచేతను నాకును మొదలయినచోట్ల ద్రుత 'ను' స్వరూపమును సమర్థించుటకు వజ్ఝలవారు చేసిన ప్రయత్నము లన్నియు నేమి కావలె. ఇందుకై ప్రకరణమే ప్రత్యేకముగాఁ బ్రారంభింపఁబడవలసివచ్చుట, చిం. వి. ప. ప్రభృతులలో గమనింపవచ్చు. నిసులపై సరళాదేశము మున్నగువానికి బాలవ్యాకరణ ప్రభావమే కారణమని (౨౮౪ వ్యా. సం. ప.) ఎంతగా విమర్శించినను (దిక్కనాదులమతమున 'ను' స్వరూపము నంగీకరించినను) 'విస్తరభీతిని జూపలేదు' మున్నగురీతిగా వీరును సన్నయాధర్వణీయపద్ధతికి విరుద్ధముగా బాలవ్యాకరణప్రభావమునకు లోనగుట తప్పలేదు. అయినను స్వవచోవిరుద్ధముగనే సన్నయ ద్రుతనుస్వరూపమును సమర్థించుటయూహ్యమైయెడల గమనింపవచ్చును.

మొత్తముమీఁద 'ద్రుతాద్దృతి' యనుకారికకు వజ్ఝలవారు చేసినయర్థము చితముగా దనుట స్పష్టముగా నహోబలునభిప్రాయము సూరిసమ్మతమైయుంటను గుర్తింపవలసియున్నది.

అహోబలుఁడు నైజము వజ్ఝలవారివలెనె ద్రుతము నకారవుఁబొల్లనుసిద్ధాంతమే గలవాఁడు. సముచ్చయార్థకనువర్ణమున నుత్వలోపముచేఁ దదంతము ద్రుతప్రకృతిక మగు ననుటయు తాను నేనులలో నుత్వలోపము నిత్యము గా నన్నఁ దాను చెప్పె ననియుఁ గావలసివచ్చు ననియు భావించుటనుబట్టి యట్లు గుర్తింపవచ్చును.

కానీ యట్టియహోబలుఁడు ప్రస్తుతకారికయొద్ద 'ద్రుతాద్దృతి ఇత్యత్ర ద్రుతశబ్దః కేవలనకారనువర్ణకద్వయసాధారణః' అన్నాఁడు. ఇందు 'నువర్ణక' శబ్దముచే నువర్ణ మనురీతిగా నర్థము గ్రహింపఁదగియుంట స్పష్టము. (చూ. ద్రు.) ఎల్లయెడల ద్రుతము నకారవుఁ బొల్లగనే పేర్కొన్నయహోబలుఁ డిటమాత్రము నువర్ణమును గ్రహించుటలోఁ బ్రత్యేకప్రయోజనాపేక్ష యున్న దనకతప్పదు. ద్రుతా

ద్ధ్రుత యనుచోట మొదటి ద్రుతశబ్దమునకు సువర్ణమనియు నర్థము చేయుట యహోబలపతియభిప్రాయ మని సత్కృతియును సత్యంత మున్నగునాతనిలక్ష్యములనుబట్టి గ్రహింపవచ్చును. ఒక్కచోట నైన నహోబలుఁ డిట్లేల చెప్పెను?

ద్రుత మనఁగా నకారవుఁబోల్లయే కావున ద్రుతముమీఁద ద్రుత మనఁగా నకారముమీఁదినకారమే యగుచున్నది. అనఁగా ధైర్యశక్తికి న్నరుదుగ ననురీతిగా నిది [illegible] ద్రుతద్విత్వమే యగుచున్నది. ఈ ద్రుతద్విత్వమును నోవా ద్విత్వ మను వి. వి లక్షణమే యిం కొకటి సాధించుచునే యున్నది. ద్రుతాద్ద్రుత యనునీకారికకు నర్థ మదియే యైనపుడు పునరుక్తి యగుటయే కాని దీనివలనఁ బ్రయోజన మేమున్నది? (నోవా ద్విత్వ మనుచోట ద్విత్వపద ముండుటచేత నహోబలుఁ డాకారికను నీయర్థమున నుపయోగింపలే దనఁదగు.) కాఁగాఁ బునరుక్తి గల్గకుండ దీనికిఁ బ్రయోగానుగుణముగాఁ బ్రయోజనమును సాధించుటకే యహోబలపతి యిట సువర్ణము నందు ద్రుతత్వమును జేర్కొనియుండును. ద్రుతాద్ద్రుత ఇత్యత్ర అని యీయర్థము నీకారికాస్థలమునందే నియమించుటకును గారణ మది కావచ్చును. చిన్నయ యీయభిప్రాయము నామోదించినాఁడు. ఆతని మతమున సహజముగనే ద్రుతము సువర్ణ మగుటచే నిందును సౌకర్య మేర్పడినది. సత్కృతియును సత్యంతి - అనుము న్నగునహోబలుని లక్ష్యములను బోలినదే యనఁదగిన 'అదియును న్గాక' యనురీతి వానిం జూపి సూరి తనయామోదమును స్పష్టము చేసె ననవచ్చు.

వజ్ఝలవారీయహోబలపతియభిప్రాయము నామోదింపకుండుటకుఁ గారణ మొక్కటే. వీరును ద్రుత మనకారవుఁబోల్లయే యనిరి. కావున నోవా ద్విత్వ మనుదానియర్థమే ద్రుతాద్ద్రుత యనునదియుఁ [illegible]. కావున దీనిని నోవా ద్విత్వ మనుదానికివివరణప్రాయముగా

దానికే సంబంధించినదిగా వ్యాఖ్యానించిరి. ద్రుతము నకారపుంబొల్లే యని భావించినయహోబలుఁడు సిద్ధాంతమునకంటె కారిక సార్థక మగుట ముఖ్యముగా నుద్దేశించి యిచ్చట ద్రుతమును నువర్ణ మన్నాఁడు. లేనిచోఁ దాను చెప్పిన ననుకీర్తిరూపము నాశంకించినవాఁడు ద్రుతము నువర్ణ మను టేమి. ఇంక వజ్ఝలవారు చెట్టిపరిస్థితులలోను దాఁజెప్పిన లక్షణము వ్యర్థమే యగుఁ గాక యింకొక సార్థకమే యగును గాక కానీ ద్రుతము నకారపుంబొల్లే గాని నువర్ణ మెంతమాత్రమును గా రా దని యన్నయాథర్వణులయభిప్రాయముగా నమ్మి యీ కారిక నిట్లనర్థకముగాఁ జేసియుందు రని యూహించుట దోషము గాదు. ఎట్లన "అదియునుం గాక" యనుచోట నిది యర్థవిశేషబోధకచార్థకశబ్ద ద్వయమే గాని ద్రుతాద్ధ్రిత ఇత్యాదిసూత్రములకు లక్ష్యము గా దనియు నన్నయాథర్వణులమతమున ద్రుతమునకు నుస్వరూపము లే (వ్యా. సం. న. 311) దనియు వారే స్పష్టముగా నసలు విషయము తెల్చి చెప్పియున్నారు.

ఇట్లర్థము చేయుటలో వజ్ఝలవారికింకొక ప్రయోజనమును గూడ నుద్దేశించి యుండవచ్చును. ఇట వృత్త్యుఁ డన్నసుర మన్నగు నన్నయప్రయోగములను వీ రుదాహరించిరి. దీనింబట్టి శబ్దగతనకారము ద్రుత మనునభిప్రాయమును నిరూపించుట గూడ నిట్టిసమన్వయము నుద్దేశము (అవాంతరముగా) కావచ్చును. ఏల యన 'నో వా ద్విత్వ మ్మనుకారికలో నకార మనియే యున్నది గాని ద్రుతశబ్దము ప్రయుక్తము గాలేదు. వృత్త్యుఁ డన్నసుర యనునది నో వా ద్విత్వ మనుదానికే లక్ష్య మన్నను నానకారము శబ్దగతము ద్రుత మగు ననుటకు ద్రుతశబ్దము ప్రయుక్త మగు న 'ద్రుతాద్ధ్రిత' - యను కారిక బాగుగ నుపయోగించును గదా. కారిక వి. వి కర్తదె యైనను ప్రయోగము నన్నయది. (పోనీ వి. వి. మతములో నైనశబ్దగత నకారము ద్రుత మగు ననుటకు నీకారిక యుపయోగించుఁ గదా.) ఇట

నున్న 'అన్నిష్టపథ' అను రూపమునుగూర్చి వివరించుటలో వజ్ఝల వారిమాటలలో నీయభిప్రాయమే పొడగట్టుచున్నది. ఈప్రయోజన మవాంతరముగా సిద్ధించునదే. పొల్లనకారస్థితి ద్రుతమునకుఁ దప్ప కుండుట ప్రధానప్రయోజనము. లేనిచో నన్నయ యొక్కఁడే ద్రుతము నకారపుఁబొల్లు యని యెంచెఁ గాని (తిక్కన ద్రుతమును నుస్వరూపముతోఁ బ్రయోగించినను, తిక్కన 'శా హాస్ఫాలించి' నథర్వణుఁడు సాధించె? నన్నను,) యథర్వణుఁడు నువర్ణమని సైతము భావించె ననవలసివచ్చును గదా. అందుకయి యహోబలపతియభి ప్రాయమును వీరుపేక్షించిరన్నమాట.

'అదియును న్గాక' వంటి రూపాలను వజ్ఝలవారు మార్గాంతరమున సాధించియున్నారు. (ఇంక ద్రుతోద్ధృత యనుకారికచే వీనిని సాధింపనక్కర లేదు గాన దానికి వజ్ఝలవారు చెప్పినయర్థమే సిద్ధాంతము నన లైనదనుకొనవలె.) 'అదియును న్గాక' ఇత్యాదులలో అది+ఉన్+కాక - అని ఉండ మఱల నల్పత్వాతిశయము బోధింప నింకొక్క 'ఉన్' చేరిన దని యభిప్రాయము. అర్థదార్ఢ్యమునకై యిట్లు 'ఉన్' పై 'ఉన్' చేరుచుండు నఁట. ఈ పద్ధతి వీరి కిట సమంజసముగానే యున్నది. కాని నా.రా. ఒకచో 'ఏనియున్+యున్' - అని చూపఁగా దానిఁ గూర్చి వీరు 'ఏనిన్ - అనునదే యనుశబ్దయుక్తము. దానిపై మఱల యును శబ్దమును జేర్చుట యసంగతము (వ్యా.సం.స. 108) అనుట వింత నా.రా. ను విమర్శించుట కవసరమైనయీసిద్ధాంత మహోబలాదులను విమర్శింపవలసివచ్చు సమయమున మాఱినది.

నువర్ణమును ద్రుతముగా నంగీకరింపకుండుటకై ఉన్‌పై ఉన్ లేదా ద్రుతము (నకారముపొల్లు) పై ఉన్ వీరు చేర్చియున్నారు గదా. ఇంక యునుపై యును చేర్చుట యసంగతమా? అసంగత మవుఁ

గాక. అట్లని వజ్ఝలవారనుట సక్రమమా? ఇట నయ్యది యసంగత మవునపుడు వీరిట నున్ పై ఉన్ చేర్చుట యెట్లు సంగత మయ్యె. అదియును గాక వంటిరూపాలు తమమతములో సాధించుటకు మార్గాంతరము లేక కావచ్చు.

కానీ యస లిక్కడ సముచ్చయార్థకము 'ఉ' కాదనియు ననుదంతములపై నగు నది 'యు' - అనునదే యనియు స్పష్టము. (చూ. ద్రు.) ప్రత్యయము హలాది యవుటచే నర్థదార్ఢ్యముకొఱకు నిటువంటి ప్రత్యయముపైఁ బ్రత్యయము వచ్చుట కుదురదు. అట్లయిన అదియుయుఁ గాక అదియున్యు గాక - అను మొ॥ విధముగాఁ గావలసి వచ్చును గదా.

కాఁగా నదియును గాక మొ॥ రూపాలను వజ్ఝ... ... సాధించినపద్ధతి సమంజసముగా లేదనక తప్పదు. అంటిని నిందఱ కనురీతివి బాలప్రౌఢవ్యాకర్తలమతమున నొకవేళ నయినఁ గష్టసాధ్యము లగునేమో కాని అదియును గాకేత్యాదులు వజ్ఝలవారిమతమున సముచితమైనమార్గములో నసాధ్యములే యనక తప్పదు. ఇంక వీనికొఱకై 'యువర్ణకః స్యాః' త్తను వి. వి. లక్షణమును ఉవర్ణకః - అనురీతిగా మార్చుకొనవలసియుండు. ద్రుతాంతనుకారికయుం దానర్థ్య మట్లనే యుండును.

వజ్ఝలవారన్నట్లొకవేళ ఉప్రత్యయమే విహిత మను కొందము. అయినను అదియునున్ అనురీతిరూపము లవుట సులువు కాదు. 'ఉ' ద్రుతాంత మని ద్రుతమే చేసి ఉన్ అని గ్రహింతము. కానీ యర్థదార్ఢ్యమునకై దానిపయి మఱల నింకొక 'యున్' అగుట యెట్లు? ఉన్ పై ఉ న్నగుటకు శాస్త్రమున నెట్టియాధారమును గాన రాదు సూరి అదియును+కాక దివంబును+పోలె, అనుచో ద్రుత

ముపై నకారమును విధించెను. అర్థదార్ఢ్యమున నుశబ్దమే రెండు పర్యాయములు వచ్చిన సరిపోయెడిదే కదా. అనఁగా నిట్టిపద్ధతిని సూరిప్రభృతు లూహింపనే లేదనుట స్పష్టము. కాఁగా ఉన్‌పై ఉన్ – అనుమార్గమే సరి కాదు. ఇది నన్నయాథర్వణీయపద్ధతి యనుకొనుటయుఁ గేవలము నిరాధారము.

నిజమున కిట్టిపద్ధతి నన్నయాథర్వణీయసమ్మత మైనచో నథర్వణుఁడు నో వా ద్విత్వ మనుచో ధైర్యశక్తికి న్నరుదుగ నని యుదాహరించు టవసరము కాదే కదా యనిపించును. వీరు ఉన్ చేసి యందలి యుత్వమునకు లోపము నంగీకరించిరి. కళలపై నిట్లుత్వలోపమాయెచోట్ల స్పష్టము చేసిరి. అయ్యది ద్రుతప్రకృతికములపై నేలరాదు. అహోబలపతిపాఠము సున్వేవ యనుచున్నను వీరు సున్వేవ యని చూపి తిఙంతములపైని గూడఁ గల దనిరే కదా. అట్టియెడ ధైర్యశక్తికిన్ (అరుదుగ) అనుచో నాద్రుతాంతముపై నేదో యొక యర్థవిశేషమున 'ఉక్' రాఁగా ధైర్యశక్తికిన్+ఉన్. ఇం దుత్వము లోపింపఁగా ధైర్యశక్తికిన్న్+అరుదుగ ధైర్యశక్తికి న్నరుదుగఁ నని యవునే. అయిన నట్టిస్థితి పాలవసానపరకలా లేదు కాఁబట్టి యుచ్చారకస్థితిలో నూహింపరా దందురా ? అయిన నీయుత్వలోపము కళలపై నయినపుడే యున్నమాట. ఆయంశమును స్పష్టము చేసియుండవలసినది. అన్విష్టసఖిత్వాదులం దప్పదు ద్విత్వవిధానము.

కాఁగాఁ జిన్నయ యుంటిని నిందఱకు ననురీతిస్థలములు సాధించుటకుఁ 'గొన్న యెడల ద్రుతంబుమీఁద నకార' మను శాస్త్ర మాధారముగా నైన నున్నది. వఝ్ఝలవారిసమన్వయము ననుసరించి అదియును న్గాక మున్నగు (సూరి సాధించిన) రూపములు సాధించుటకుఁ దగిన యాధారము చిం. లోనే గాక వి. వి. లోను లేదన్న మాటయే. ఉన్‌పై ఉన్ వచ్చు నని సమన్వయించుట కట్లర్థదార్ఢ్యమున ఉన్‌పై

ఉన్ వచ్చు నని పీసింగూర్చి ప్రస్తావించినయథర్వణుఁడే స్పష్టము చేయలేదు. వజ్ఝలవారి ప్రక్రియనుబట్టి చూడ సూరిమార్గమే సముచిత మని స్పష్ట మగుచున్నది గదా. కాఁగా సదియును న్గా కేత్వాదులకు సాధక మైన 'కొన్ని యెడల' మన్నగుసూరిసూత్రమున కాధార మనఁదగిన ద్రుతాద్ధృతిః అనుకారిక కహోబలుఁడు చేసిన సమన్వయము సంగీకరించియుండమింజేసియే వజ్ఝలవారి కిన్ని యిబ్బందులు కల్గిన వని చెప్పుట దోషము కాదు గదా. కాన ద్రుతాద్ధృతి – యనుకారిక వ్యర్థ మగుటయే కాక దానిచే సహోబలాదులు సాధించి రనఁదగినయదియున్గా కేత్వాదులు సాధ్యములు గాకుండుటయు వజ్ఝలవారిసమన్వయములో నేర్పడినలోపముగా గుర్తింపఁదగి యున్నవి. (బా. సా. పే. అభిప్రాయమును విమర్శించుటకును వజ్ఝల వారు దీని నిట్లు వ్యాఖ్యానించియుందురు.)

పయిలోపములు నివారితము లవుటకు నీకారిక కహోబలుఁడు చేసినయర్థమే గ్రహింపఁదగియున్నది. అహో. సువర్ణ మనియో. కాని యిట్టిది నిపక్షముపైఁ గూడ నంగీకార్యము. అంటిని గొండలకు జగమ్ము లన్నిని నొక్కపెట్టు, తలనిసిన్-అనురీతిరూపములును దీనిచే సాధ్యముల యవు. కాఁగా నిచ్చోటిద్రుతశబ్ద మాద్యము 'నిను' లను రెంటిని గ్రహింపఁజాలియే యున్నది. కాఁగా గాణపతము సరి గా దని తిరస్కరించినపై యహోబలాదుల యభిప్రాయము గ్రాహ్యమే.

అహోబలునభిప్రాయమును సూరి యామోదించుటయు యుక్తముగ నున్నది. కారికయందుఁ గ్వచిత్తనియు సూరిసూత్రమునందుఁ గొన్ని యెడల ననియు సామాన్యముగనే నిర్దేశించుట జరిగినది. ఏది పరముగా నుండవలె నన్నయంశము నిర్దేశింపఁబడలేదు. కాఁగా హల్పరకత్వమున నని కాని యచ్పరకత్వమునన యని కాని చెప్పఁబడకుండుటచేత నాదియును గాక మున్నగురీతిగా హల్పరకత్వమునను,

అంటివి నిండఱకు ననురీతిగా నచ్చరకతయుండును రాముచేతనున్ - మున్నగురీతిగా నవసానము పరమైయున్నను ప్రయోగానుసారముగా ద్రుతము పైని (నినులపైని) ద్రుత మగుటకు వి. వి. మఱియు సూరి లక్షణములచేత సముచితముగా గ్రహింపఁదగును.

ఇట బా. సా. పే. వ్యాఖ్య ఇందలియుదాహరణముల ననుసరించి యచ్చుపర మగునపుడు నీకార్యము ప్రయోగములఁ గన్పట్టెడి (79) నని పేర్కొన్నది. కాని యది యుక్తి మనిపించుట లేదు. ఆయాలక్షణముల క్రింద నిచ్చినలక్ష్యముఁ బట్టి సూత్రార్థమును బరిమిత మొనర్చుటకంటెఁ బ్రయోగానుగుణముగా లక్షణమునందలి యవకాశమునుబట్టి సాధించుకొనుటయే యుక్తము. (లేనిచో నానైయెడలఁ బ్రౌఢవ్యాకరణమందువలెఁ బెక్కుసూత్రములు చెప్పవలసి వచ్చును.) ఈ సూరిలక్షణమునకు మూల మనఁదగిన 'ద్రుతాద్ద్రుత' యను వి. వి. లక్షణమున కహోబలుఁడు నత్కృతియును నత్యంత - ప్రజయును నానంద - అన్నను నఖండ - అనురీతిగా నచ్చరకముల నే యుదాహరించెను. (నో వా ద్వత్వ మనుచో పరప్రాణేనన గతేః అను దానిం దృష్టియం దిడుకొనియో నేమో, సూరి ప్రయోగములం గానలే దన్నను నీయహోబలునిలక్ష్యము) నని బరికించియుండఁడా. పరికించియు నయ్యవి యసాధువు లని నిర్ణయించునా? అట్లు నిర్ణయించె ననుటకు లక్షణమున నాధార మేమి యున్నదా? హల్పరకత్వమున మాత్రమే యని యెంచునపుడు కొన్నియెడల నన్నను హల్పరకతయుం దని స్పష్టముగాఁ జెప్పవచ్చునే. కార్యచిత్కతతో పాటు నిమిత్తమును స్పష్టము చేయనవునే కదా. ఇంకను ద్రుతాద్ద్రుత యనుదాని కహోబలపతి యచ్చరకస్థలములుమాత్రమే యుదాహరించుటచే (నచ్చరకతయుం దగుట యుండెడి స్పష్టము కాఁగా) నటనే కాక యితర స్థలములందును గల దనుటను స్పష్టము చేయుటకే హల్పరకస్థితి నుదాహరించియుండు ననియు నూహింప నవకాశము లేకపోలేదు. 'కొన్ని

యెడల' ననునర్థముతోఁ గారికయందలి క్విచ్ఛబ్దముచేత నీయర్థ మిచ్చుటను గ్రాహ్య మన్నయంశమును సూచించుటయు సూరియభిప్రాయ మన నవకాశము గలదు.

కాని యిట ననుమానింపవలసినయంశ మొండు గలదు. సూరి స్వరపరకత్వమున దాదాపెల్లయెడలను ద్రుతస్వరమును లోపింపఁ జేసియే చూపియున్నాఁడు. నన్నున్+అడిగె - చూడన్+అయితి- మన్నగురీతిగా నెల్లయెడల ద్రుతము పొల్లునకారమునే యిచ్చెను. అట్టియెడల నిచ్చుటను స్వరపరకత్వమున ద్రుతస్వరమును లోపింపఁ జేయఁగా నాద్రుతముపై నకారము వచ్చిన చూడన్+న్+అయితి చూడన్నయితి ననురీతిగా నంత్యాది ద్రుతద్విత్వమే యగును. ద్రుత ద్విత్వమును సమ్మతింపక సూరి యుదాహరింపలేదా? బా. సా. పే. ఆయభిప్రాయమునే గలిగియున్నదా? అట్లయిన సత్కృతియును సత్యంత - అంటిని నిందఱకు - ననురీతిరూపములు బాల. సమ్మతములుగా ననవలె. లాక్షణికు లంగీకరించి ప్రదర్శించినవానినే సూరి తిరస్కరించె ననఁ నేల? కావున స్వరపరకత్వమున ద్రుతస్వరము తఱుచుగా లోపించు నని సూరి (అవసానంబునం దనుసూత్రమునందలి బహుళపదసామర్థ్యముచే) భావించె ననుట లెస్స. తఱు చని చెప్పఁ గొన్న నిట నీసూత్రముచే నంటిని నిందఱకు నిత్యాదులకు నవకాశము గల్గు. అంతే గాక సూరి సమ్మతింపలే దనఁ దగని ద్రుతద్విత్వముతోడి సర్వమున్నతని ననురీతివానికి నీ సూత్రముచేనే యవకాశము గల దని యెంచవచ్చును.

మొత్తముమీఁద 'ద్రుతాద్ద్రుత' యనుదానికి సత్కృతియును సత్యంత - అదియును న్గాక యనురీతివె లక్ష్యములు గావున వజ్ఝల వారు చేసినయర్థము సముచితము గా దనియు నహోబలపతి, సూరి ప్రభృతులు భావించినయర్థమే యుక్త మనియు నంగీకరింపఁదగును.

ఇట్లంగీకరించుటతోడనే 'ద్రుతాద్ధ్రుత' యనుకారికయందలి ద్రుతశబ్ద మహోబలుఁడు చేరొన్నట్లు 'ను' వర్ణమును బోధించుచున్న దని స్పష్టము. అట్టి నువర్ణమే కాక నివర్ణము సైతము ద్రుతశబ్దముచే గ్రహింపవలయుటయు గమనార్హము (ప్రౌఢవ్యాకర్త చింతామణిమతాన ద్రుతమును నువర్ణముగానే యెంచుటయు గమనింపఁదగును) అదియును న్నాక మున్న గురూపములు సముచితముగా సాధించుటయు 'ద్రుతాద్ధ్రుత' యనుకారిక వ్యర్థమును సార్థకమును గాకుండుటకీమార్గము గ్రాహ్యమే యనియు మహోబలాదులయభిప్రాయమునుబట్టి నిర్ణయింపఁదగియున్నది.

ఇంక నిట్లు ను (ని) వర్ణముపై నకార మగుస్థలములందలి ను (ని) వర్ణము ద్రుతప్రకృతికసంబంధియే(ద్రుతమే)యగుటయు గమనార్హము. కళలపై నట నే ద్రుతము కల్పించుచో నట నర్థవిశేషము లేకయే (అన్యత్రాపి - యని వి. వి. చెప్పఁ బాదపూరణమం దని ప్రౌఢ. చెప్పినది గదా.) యయిన నుశబ్దముగా గ్రహింపఁదగియున్నది -

ద్రుతముపై నకార మని సామాన్యముగాఁ జెప్పుటచే నీసూత్రములచే నుం వ (ద్రుతముమీఁది) ద్రుత మర్థవంత మెచ్చటను గానేర దని స్పష్ట మగుచున్నది. ఉగాగమాదులవలె నీ ద్రుతమున కర్థవిశేష ముండమి గుర్తింపనగును. అర్థవిశేషమునం దయిన ద్రుతముపై నకార మని నిరర్థకముగాఁ జెప్పు టెట్లు? కాఁగా బా.సా.పే. 'ఒక్కచో నిరర్థకము గను నొక్కచో నర్థవిశేషద్యోతకముగను గల్గు నని ఫలితము'గాఁ జెప్పుట (79) సరి గా దని యంగీకరింపఁదగు.

# అజ్వత్కార్యము

బాలసరస్వతీయచింతామణియం దున్న "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అనుసూత్రము చేఁ బదాదిని యకార మంగీకరింపఁబడుచున్నది. ఇట్లు పదాదియకారము నంగీకరించినయెడల శబ్దాంతరయోగమున దాని కజ్వత్కార్యము చెప్పుట యవసరము. "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య (ప్రమత్రపకృతికేభ్యః) అను బాలసరస్వతీయచింతామణిసూత్ర మీయర్థమునే సాధించుచున్న దనఁబడుచున్నది. దీని కప్పకవీయ మైనచింతామణి పాఠము అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినా సర్వః" అనునది. ఇం దాద్యగ మ్మనుపదము లేమిఁ బదాదియకార మంగీకరింపఁబడ లే దనవచ్చును. [illegible] స్పష్టముగా నిర్ధారించునదే "వికృతిపదాదౌ ప్రథమా స్వస్థతృతీయానాసికో న స్తః" అనువే ఱొక సూత్ర మందుఁ గలదు. "ఆ ద్రోక్తి మొదల నాద్యంతస్థ ముండదు. ప్రాణ మై యది కనుపట్టుఁ గాని' (అప్ప - 2 - 177) తెలుఁగున యణాకారంబులు గలుగవు శబ్దాదులను యకారముపగిదిన్ బలుకఁబడునవి స్వరము లగు' (2-69) అనుచు స్నగువిధముగ నప్పకవియు వివరించియున్నాఁడు. సామాన్యముగ శ్రుతిగోచర మగుపదాదియకారము (తోఁగూడినస్వరము) కేవలము స్వరముగనే దృష్టిగోచర మగు నని తీర్మానించినాఁ డప్పకవి. దీనిఁబట్టి యప్పకవి వికృతిపదాది నున్నది యచ్చుమాత్రమే యగును గాని యకారవ్యంజనము గానేర దనినవాఁడు. కావున నచ్చునకు శబ్దాంతరయోగమునఁ బ్రత్యేకముగా నజ్వత్కార్యము చెప్పఁ బనిలేదు కావుననే బా. స. చిం. లో నవసర మైనట్టు సర్వత్రాజ్వత్కార్య మిత్యాదిసూత్ర మప్ప. చిం. లో ననవసర మై కనఁబడుచున్నది. అహోబలుఁ డప్ప. చిం. నున్న 'భూతాద్యర్థసముద్ద్యోతినం వినా' యనుపాఠము సరి యైనదిగా నంగీ

కరించుసందర్భమున 'సర్వత్రాజ్వాత్కార్య ఇతి సూత్ర స్తు తత్ప్రస్తకే న దృశ్యత ఏవ' (కవిశి. 785) అని యజ్వాత్కార్యముఁ జెప్పు సూత్ర మప్పకవీయమునందుఁ గనంబడుట లే దని పేర్కొన్నాఁడు. ఈ యహోబలుని యుక్తిపై వ్యాఖ్యాతగారొకటిరెండుమాటలు చెప్పియున్నారు. "సర్వత్రాజ్వాత్కార్య ఇత్యాదిసూత్రమున కనువాదముగా నప్పకవీయప్రతులం దన్నింటఁ గొన్నిపద్యములు గన్పట్టుచున్నవి. పదాది యకార మంగీకరింపనియప్పకవిమతమున నాపద్యము లుంట యసందర్భ మని బహిష్కరింపఁగా నట్టిమాతృకయే యహోబలునికి దొరకి యుండు" నని యభిప్రాయపడిరి చిం. వి. వ. (190)లో. రెండవసారి వ్యాసం. స. లోఁ బై యభిప్రాయముతోపాటు 'లేక యహోబలపతియే యాకారిక లే దని సాహసముతో వ్రాసెనో? తెలియకున్నది'. (126) యనిరి. తెలియకున్న దనుట యుక్తముగా నున్నది. కాని యహోబలునే యనుమానించుట యుచితమా? స్పష్టముగా నప్పకవీయమునందుఁ గనంబడుట లే దనుచుండగా లాక్షణికులు మిన్నకుందురా? లేక యప్పటివారి కెల్లరకును నీపద్యములు లేనిమాతృకలే దొరకియుండు నని యూహింపవలయునా? అప్పకవీయమునందు నేఁడు గన్పించుచున్న యాపద్యములను బరిశీలించిన సత్యము స్పష్టము కాఁ గలదు. అందు మొదటిది.

అరయ వైకృతోక్తులఁ బదాదులయందు యకార ముండ దా
తీరునఁ బల్క వ్రాయ గణుతింపఁగ నచ్చగు - దానిదాపల
న్నీరజనాభ నాంతములు నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చె
న్నారు నితండు చైద్యవసుధాధిపునేఁ బడఁగించె నేఁ డనన్.

ఇందును బాదములు మొదలింటిరెంటియందు నాంధ్రోక్తి మొదల - నిత్యాదిగా నప్పకవియొక్క పూర్వసిద్ధాంతమే పునరుక్తమైనది. పిదప నాయచ్చునకు దాపల ప్రమత్రపకృతికము నిల్చినఁ

ప్రాణసంధి చెన్నారు ననుచున్నాఁడు గదా. అచ్చునకు ముందు ద్రుతప్రకృతికము నిల్చినఁ బ్రాణసంధి చెన్నారిసచో నొకవేళ నచ్చునకు ముందు కళ యున్న వ్యంజనసంధి చెన్నారునా? లేక కళలకుఁ బైన వచ్చిన్న సంధి లేదనియా యర్థము. కాక యెల్లయెడలఁ బదాదినున్న యచ్చే యనుచు ద్రుతాంతములపైఁ బ్రాణసంధి యగు నని చెప్ప నేల? అయినను నప్పకవి పదాదిని యకారమే లేదచ్చే యున్న దనుచు 'ఇవ్వ డీవంకఁ గనుగొంటి ననుచోఁ గళపై బ్రాణసంధి చేసియే యున్నాఁడు. ఈ(యీ)వంక మొదలైనచోట్లఁ బదాదినున్న యకారశ్రుతిని సైతము అచ్చువముతోఁ గనఁబడుటను నిరూపించుచుఁ బ్రాణసంధి జరిగినందుల కుదాహరణముగాఁ బైదాని నిచ్చినాఁ డప్పకవి.

ప్రస్తుతపద్యమందలియుత్తరార్థము సూత్రమున కనువాద మనవలయును. కాఁగా నందలినాంతములు, ప్రాణసంధి - అనుపదములను గూర్చి తెలియవలయును. 'నాంతము లనఁ గా ద్రుతప్రకృతికములకుఁ బే' రని యొకటి యుండే వివరింపఁబడియున్నది. ద్రుతప్రకృతికములన ద్రుతాంతము లైనపదములు. 'ద్రుతాఖ్యో నః' అనుచింతామణి సూత్రమునకు సాధారణముగ 'ద్రుతమనంగ నకార మతిశయిల్లు' ననియే చెప్పియున్నను ద్రుతప్రకృతికములను వివరించుసందర్భమున "కూర్చి విడచి ద్వితీయఁ బల్కునవి మూఁడు, నవతలివిభక్తిఁ దెలుపు వాక్యములు నాల్గు, వలనఁ గంటె లోపల ననువచనములును బది విభక్తులలో ద్రుతప్రకృతు లయ్యె' - నని ని-ను-ల మొద లగునవి ద్రుతాంతము లనెను. ఇందు లవర్ణాదులకుఁ బైని ద్రుతము చేరును గాని నినులుమాత్రము ప్రత్యయములే ద్రుతము లని యప్పకవి భావించె నని స్పష్టము. ఇంతే గా కప్పకవి శబ్దమున నెచ్చట నున్నను నకారము ద్రుతముగా భావించుటయు స్పష్టము. (చూ. ద్రు.) మొత్తముపై నప్పకవిమతమున ను-ని ఒక్కొక్కచో నకారవుఁ

బొల్ల ద్రుతములు. ను–ని(న్) అంతమందుఁ గలవి ద్రుతాంతములు – ద్రుతప్రకృతికములు. ఇవియే యిట నాంతము లనఁబడ్డవి.

ఇంక నీపద్యమున విధింపఁబడినది ప్రాణసంధి. ప్రాణము లనఁగా స్వరములు. కావున స్వరసంధి. అప్పకవిమతమున స్వరసంధి యన నేమి? అనునది తెలిసిన సందలియౌచిత్యానౌచిత్యములు స్పష్ట మగును.

“పరరూపమె వికృతిఁ గానఁబడు స్వరసంధిన్”. (అప్ప–5–38) అనుటచే స్వరసంధి యనఁగాఁ బరరూప మగుట యనుట స్పష్టము. ఈపరరూప మనునది “ఎచట సంధి గలుగు నచటఁ బూర్వపదాంత హల్లుతోడఁ గూడినట్టిస్వరము లోపముగ నొనర్చి యాహల్లుతో మీఁదియక్షరంబు గూర్ప నయ్యె సంధి’ (37) అనుపూర్వపద్యమును బట్టి పూర్వస్వరమున కగునదిగాఁ దేలినది. మీఁదిశబ్దంబులకు నాది వర్ణంబులు స్వరము లైనఁ బ్రాణసంధు లయ్యె’ (35) అనుదానింబట్టి ప్రాణసంధి యగుచోట్ల మీఁద స్వర ముండవలె. సారాంశముగాఁ బూర్వస్వరమునకు లోపముగ నొనర్చి మిగిలినయాహల్లుతో మీఁది స్వరమును గూర్చుటయే ప్రాణసంధి యని గ్రహింపవచ్చు. కావునఁ బ్రాణసంధి జరుగవలె నన్నఁ బూర్వపదాంతమునఁ బరపదాదిని స్వర ముండవలయును. (కర్మధారయసమాసమునఁ బొల్లుటకారము వెట్టుక సంధిఁ జెందుఁ బ్రాణముతోడన్’ – (5–91) అని చెప్పినప్పుడు ప్రాణ సంధిపద ముచ్చరింపకుంట గమనింపఁదగును. ఇది (5–33) సమంజ సమే.)

‘లుప్సంశ్లేషో నాచి’ సూత్రవివరణమునం దప్పకవి “ధరణి ద్రుతప్రకృతులపై, స్వరపూర్వపదములు గదిసి సంధిగలయుచో, నరకాసురదమన ద్రుతాక్షరములు లోపములుగాక కడవల నిలుచున్” అనుపద్యముచే స్వరపరకత్వమున ద్రుతము నిల్చియే యుండు నను

చున్నాఁడు. కావున వచ్చెను+ఎవఁడు మొదలగుచోట్లఁ బ్రాణసంధి విధానమునుబట్టి ద్రుతపూర్వస్వరమునకుఁ బ్రాణసంధిచేయుటకు వీలు లేదు. కాఁగా ద్రుతప్రకృతికములకు ద్రుతవ్యవధానమునఁ బరమున స్వర మున్నను ద్రుతపూర్వస్వరమునకు సంధి ప్రాప్తించునవకాశ మేదియును లేదు. అనఁగా ద్రుతము సంధిప్రతిబంధకము. ద్రుతమును స్వరసహితముగా భావించినయప్పకవి యది సంధిప్రతిబంధక మని భావించుట సహజమే. యుక్తము కూడ. స్వరము పరముగానే యున్నప్పటికిని ద్రుతమునందలిస్వరము అడ్డమై యుండఁగ ద్రుతము నకుఁ బూర్వమునం దున్నస్వరమునకు సంధి యగు టెట్లు పొసఁగును? పొసఁగవలె నన్న ద్రుత ముండరాదు. కావున ద్రుతము సంధి ప్రతిబంధక మని యప్పకవి తలఁచుట యొప్పుచున్నది. పై పద్యమున సంధి గలయుచో ద్రుతము నిలుచునన్నాఁడు. కావున వాఁడు పోయెను ఇతఁడు వచ్చెను మొదలగువాక్యాంతములందలిసంధ్యభావప్రసంగ ములలో ద్రుతము లోపించి వాఁడు పోయె, ఇతఁడు వచ్చె, నని యుండవచ్చు నన్నమాట. బాలవ్యాకరణమున వాక్యావసానసంధి విషయ మిట్టిదే కదా.

ఇట్లు సంధివిషయమున ద్రుతము ప్రతిబంధక మగుటవలననే ద్రుతప్రకృతికములలోఁ బ్రథమేతరవిభక్త్యంతములు సైతము ద్రుత పూర్వస్వరమునకు సంధిని జెప్ప వీలు లేదు. లేదు గనుకనే యప్పకవి ద్రుతప్రకృతికములపై నెట్టిపరిస్థితులయందును నిట్టిసంధిని జెప్పక జాగరూకత చూపెను - అట్టిస్థితిలో సంధిజరుగుటను గూడ వేఱు విధముగా సాధించుకొనెను. చో ర్వా స్వాత్రెసం చిం. సూత్రమును వివరించుచు 'వర్తమానార్థమున షష్ఠవర్ణకృంగంబుతోనిఁ గల్గుపదము వికల్పమున ద్రుతప్రకృతి యగుఁ గైటభద్విత్యదప్పదళిన' అనెను. చిం. వర్తమానార్థకచువర్ణకారమునకు సంధి వికల్ప మనుచుండఁగా నప్పకవి చువర్ణకాంతము వికల్పముగా ద్రుతప్రకృతిక మగు నను

చున్నాడు. ఇట్లు మార్చి చెప్పవలసినయవసర మప్పకవి కేమి గల్గినదిః ఇటనే గాదు. యిట్టిదే యైన 'అనాదిమ' సూత్రవివరణమునను ప్రథమఁ దక్కంగ నితరవిభక్తులందుఁ దుదలఁ గొమ్ములు గల విభక్తులను మష్టిఁ బలుకు కాగుడికిని వికల్పంబువలన, నిల ప్రకృతి కత్వంబు గలుగు చుండు' ననెను. సంధి వికల్ప మను చిం. అభిప్రాయము ను ప్రకృతి కత్వము వికల్ప మని మార్చి చెప్పియున్నాఁడు.

ప్రకృతి కత్వము వికల్పము గావున నది లేనవు డాపదము నకుఁ గళాత్వము సిద్ధించి సంధి యగు నన్నమాట. అట్లు గాక ప్రకృతికత్వమే గలిగినయెడల సంధిసందర్భములందు ప్రుతము లోపింపక నిలిచియుండును గావున నచట సంధి లేదు. ఈవిధముగ మూలమునందలిసంధి లేనితనము ప్రకృతికత్వముద్వారాన నప్పకవి సాధించుచున్నాఁడనఁగాఁ బరస్వరమునకుఁ బూర్వము ప్రకృతిక మున్నయెడలఁ బ్రాణసంధి గా దనియె గదా యభిప్రాయము. ఈవిషయము నాలిడే స్పష్టము చేసినతావులును గలవు.

నన్నా పెద్దరోశ్రీత యనుదానిని వివరించుచు "ఉర్విఁ దద్దర్మమునఁ బ్రథమోత్తమాఖ్యపురుషముల నేకవచనముల్ పోవవిడచి కడమపదములు దిఙ్మధ్యములు గాన గొమ్ములను బ్రాణసంధులు గూర్చు టొప్పు' (అప్ప-౬-78) ననెను. రెద్ధ ప్రథమోత్తమపురుషైకవచనేతరములు దిఙ్మధ్యములు గావునఁ బ్రాణసంధి యగు నని యప్పకవి ప్రతిపాదనము. దిఙ్మధ్యములు 'దిఙ్మధ్య శేషషష్ఠీసుస్మర్మగ వచనీయుజవిభక్తీ' - అను మున్నగుసూత్రముచేఁ గళాసంజ్ఞను బొందును. కాఁగాఁ దిఙ్మధ్యకములు గావున ననఁగా కళలు గావున-నని యర్థము. అవి కళలు గావున బ్రాణసంధి గూర్చు టొప్పు ననఁగాఁ బ్రథమోత్తమపురుషైకవచనములు కళలు గావు కావున ననఁగా ప్రకృతికములు గావునఁ బ్రాణసంధులు గూర్చు టొప్ప దని తాత్పర్యము. ఆప్రకృతికములకుఁ బ్రాణసంధి లే దనుట కప్పకవి చూపిన

కారణ మవి ద్రుతప్రకృతు లగుటయే యని స్పష్టమే కదా. ఈయంశమునే యప్పకవి స్పష్టముగా నిట్లు చెప్పెను. "వదలక తద్ధర్మములను బొదలెడు ప్రథమోత్తమాఖ్యపురుషైకవచఃపదములు ద్రుతప్రకృతు లగు, బవరును నతఁ డోర్తు రేచ బలుమరు ననఁగన్". 'ఉర్వీఁ దద్ధర్మమునన్ - అన్న పద్యమునఁ బ్రథమోత్తమాఖ్యపురుషముల నేకవచనముల్ పోవవిడచి ప్రాణసంధి చెప్పెను గదా. మఱి యాప్రథమోత్తమాఖ్యపురుషైకవచనముఁ సంగతి యే మన నీపద్యము సమాధానము. మిగిలినవానికింతకు ముందు ప్రాణసంధిని జెప్పియున్నాఁడు గావున వీనికి సంధి లే దని చెప్పవలె. కాని యప్పకవి సంధి లే దనుట లేదు. అవి ద్రుతప్రకృతు లనుచున్నాఁడు. దానికిఁ బ్రయోజనము? బవరును నతఁడు అనువిధముగ సంధి లేకపోవుట యని యుదాహరణములనుబట్టి స్పష్టము చేయుచున్నాఁడు. సంధి లే దని చెప్పక ద్రుతప్రకృతికము లగు నని చెప్పి ప్రాణ సంధిజరుగకుంట నుదాహరించుచున్నాఁ డనఁగా సంధి లే దను(విధానము) నర్థముతో ద్రుతప్రకృతికత్వముఁ దెల్పుచున్నాఁ డన్నమాట. అనఁగా ద్రుతప్రకృతిక మన్నఁ జాలును. (ప్రాణ)సంధి లేకుంట యన్నది ప్రత్యేకముగాఁ జెప్ప నక్కఱ లేకయే సిద్ధించు నని యప్పకవి యభిప్రాయము స్పష్ట మగుచున్నది.

ఇట నింకొకవిషయము సైతము గమనింపఁదగియున్నది. 'ఓర్తు నేను' అన్నది ప్రాణసంధి జరుగనిరూపము. ఇది లక్ష్యస్థలము గా దనియు ఓర్తును+నేను అనుచో స్థిరపరకతలో ద్రుతము లోపించిన దనియుఁ దలంపరాదు. 'ప్రథమోత్తమైకవచః పదములు ద్రుతప్రకృతు లగు' ననులక్షణమున కనుగుణముగఁ బవరును నతఁ డనునది ప్రథమైకవచనము ద్రుతప్రకృతిక మగుటకును, ఓర్తునేను అన్నది యుత్తమైకవచనము ద్రుతప్రకృతిక మగుటకును సక్రమముగ సముచితముగ నప్పకవి లక్ష్యముల నిచ్చుచున్నాఁడు. కావున ఓర్తును+నేను అని యచ్చు పరముగా నున్నది. అప్పకవిమతమున నినులు ద్రుతము

లగుట విస్పష్టమే. కావున ఓర్తును అనుచో 'ను' ద్రుతమందలి యుకారమే లోపముగ నొసర్చి మిగిలిన యూనకారముతోఁ బరస్వరము (ఏ)కూర్చుటచే ఓర్తు నేను అనునది ప్రాణసంధి యైనరూప మగును, అనురీతిగా భావించుటకు వీలు లేదు. ఆ ప్రస్తుతలక్షణము స్పష్టము చేయుచున్నది. అనఁగా ద్రుత ప్రకృతికములయెడఁ బ్రాణసంధి యనఁగా ద్రుతపూర్వస్వరమునకే (అప్పకవి మతమున నవు డది ద్రుత ప్రకృతికము కాదు గావున సంత్యస్వరమే యగును) కాని ద్రుతము నందలిస్వరమునకుఁ గా దని సారాంశముగాఁ దేలినది. (ఓర్తు నేను అనునీవానిని బ్రాణసంధి జరుగనందుకుఁ గదా యప్పకవి యుదాహరించుచున్నాఁడు.) ఈ యభిప్రాయమే చిన్నయ సమ్మతించినట్లుగా 'ఇఁకారాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' - మున్నగు బాల. విధానములవలన గ్రహింపఁదగియున్నది. మొత్తముమీఁద ద్రుత మిట సస్వర మైనను ఓర్తు నేను అనురీతివి ప్రాణసంధులు గావని యప్పకవియభిప్రాయము గుర్తింపఁదగియున్నది. ఈయంశమునే స్పష్టము చేయుస్థలాంతర మప్పకవీయమునం దిట్లున్నది. 'గరుడధ్వజ ప్రథమోత్తమపురుషైకవచనము లెల్ల భూతార్థమునన్ ధర యగును ద్రుతప్రకృతులు ధరియించె నుపేంద్రుఁ డేను బ్రదికితి ననఁగన్' - ఇట సంధి లే దనుటకు బదులు ద్రుతప్రకృతిక మగుటయే చెప్పఁబడినది. ధరియించె నుపేంద్రుఁడు, బ్రదికితి ననఁగన్ అనునవి సంధి లేని రూపము లన్నమాట. 'వసుధ నుత్తమపురుషైకవచనమునను దక్క- భూతక్రియాపదాంతమునఁ గల్గునిత్తులకుమీఁద నచ్చులు వత్తునపుడు నిత్యముగను సంధులు ఘటించు దైత్యదమన' అను లక్షణమునుబట్టి యివి సంధి లేనిరూపము లని గ్రహింపవలె. ప్రథమైకవచనస్థలమున నిత్వమె కాని యిత్వ ముండదు గాబట్టి యిటఁ బ్రథమైకవచనము ప్రసక్తి తేలే దనవచ్చు. ఇట్టి 'ద్రుతప్రకృతి గాన నోర్వఁగల నను నుత్తమైకోక్తి దక్కఁ దక్కినవి శృంగములు దుదిఁ దాల్చుకతన స్వర

పరములైన నిత్యసంధిఁ జెందు, (70) అని ద్రుతప్రకృతికమునకు సంధి లే దని స్పష్టము చేసినాఁడు. "పుడమి సూత్రోక్త ముత్తమపురుష మనుచుఁ దత్పురుష మెల్లఁ గొనరాదు, తద్బహువ్రీహి ముమ్మ తిఙ్మధ్యములతోడ నెన్నుకతన నిత్యముగఁ బ్రాణసంధి దానికి ఘటించు - అని నిత్యమను త్తమపురుషక్రియాన్విత యనుసూత్రమందలియుత్తమపురుషపదముచే నుత్తమపురుష మెల్ల గహింపరా దనెను. ఏ లనఁ దద్బహువ్రీహి తిఙ్మధ్యము. అనఁగా నది కళ గావున. దీనింబట్టి కళగాదు గావున ననఁగా నుత్తమైకవచనము ద్రుతప్రకృతికము గావున దానికిఁ బ్రాణసంధి లే దన్నమాట.

ఇవి యన్నియుఁ బ్రాణసంధులు గా వనియే యప్పకవినిర్ణయము. దీనింబట్టి యింకొకవిషయము గమనింపవచ్చును. "పొల్లు యగు పూర్వశబ్దాంతహల్లుమీఁదఁ బరపదాద్యచ్చు నిలిచెడుఁ బ్రాణసంధి (57) అనుటలోఁ బూర్వశబ్దాంతమునఁ స్వర ముండవలయు నని స్పష్టముగాఁ జెప్పఁబడలేదు గావునఁ బరపదాదిని స్వర ముండి యది పూర్వశబ్దాంతిమహల్లుపైఁ గూడినఁ జాలును బ్రాణసంధియే యగు నని భావించుచు నిట ద్రుతమును స్వరసహితముగాఁ గాక భరియించెన్ + ఉపేంద్రుఁ డనుతీరుగాఁ బొల్లనకారము నుంచి పైస్వరమును గలిపి ప్రాణసంధి యవు ననియుఁ దలంపరాదు. అట్టియెడల నీయవియుఁ బ్రాణసంధులే కాఁగా సంధి రాకుండుటను ద్రుతప్రకృతికత్వముచే సాధించినయప్పకవిప్రణాళిక యెల్లను భగ్నము కావలసినదే గద.

"ద్రుతప్రకృతిగాన - నుత్తమైకోక్తి దక్కఁ దక్కినవి శృంగములు తుది దాల్చుకతన' (70) ననుటచే ద్రుత మిట వ్యంజనమాత్ర మయియుండు నేమో యనిపించుచున్నది. తక్కినవి శృంగములు దాల్చు ననియు ఓర్వఁగల ననుచో నుత్తమైకోక్తి ద్రుతప్రకృతిక మగుటచే నది తప్పు ననియుఁ జెప్పుటవలన - 'నోర్వఁగలను' - అనురీతిగా ద్రుతప్రకృతికములయందు 'శృంగమును జూపరాదా' ఓర్వఁగలవు -

అనుచో పునర్ణకమందలిశృంగమునకే సంధి యైనట్లు ఓర్వఁగలను అనుచో సువర్ణకము (ఇచ్చోట ద్రుతము) సందలిశృంగమునకే సంధి యవుట ఓర్వఁగలనను - అనురీతిగా నవుట సిద్ధించును గదా. దీనినిబట్టి యిట ద్రుతము వ్యంజనమాత్రముగనే యుండు నని యప్పకవి భావించె నేమో. స్వరేతరపరకస్థితిలో ను, ని అనురీతిగా స్వరసహితము గానే చూపియున్నాఁడు మఱి. స్వరపరకత్వమున ద్రుతప్రకృతికముల ద్రుతస్వరము నిలువ దేమో. చిన్నయయును స్వరపరకతలో ద్రుతస్వరలోపము చేసి చూపుటలో నప్పకవియభిప్రాయము సూచకమై యుండనోపును. కాఁగాఁ బ్రాణసంధిసందర్భమున ద్రుతము స్వరరహితమె యైనను సంధిప్రతిబంధకమే యని యప్పకవిమతము నెన్నఁదగియున్నది. చిం. ప్రభృతులయందు విధానసామర్థ్యము నాశ్రయించి యట సంధిని సమన్వయించుకొనవలసియుండును. స్వరపరకత్వమున ద్రుతప్రకృతికముల ద్రుతము వ్యంజనమాత్ర మయి నిలుచుట చేతనే యయ్యది మీఁదియచ్చును గలియుట విశేషము గాని యచ్చట సంధి ప్రసంగము లేదనియుఁ బొల్లుహల్లు మీఁదియచ్చును గలియుట సామాన్యమే యనియు నప్పకవి భావించియుండవచ్చును.

'వర్తమానప్రత్యయపూరుషములకు జరుగుస్వరసంధు' లని 'చెప్పెచున్నాఁడికన్' అని యప్పకవి స్వరసంధి నుదాహరించుటచే చెప్పెచున్నాను అన్నచోటినువర్ణము నాతఁడు ద్రుతముగా భావింపలేదనవలయును. ప్రౌఢవ్యాకర్త యిచ్చటస్వరమునకు లోపము రాదన్నాఁడు. బిందువాదులును నప్రసిద్ధములే యని యప్పకవి యది ద్రుతప్రకృతికము గాదని తలఁచియుండనోపును.

ఈ విధముగా నప్పకవి సంధిప్రణాళికను బరిశీలించినయెడల నాతఁ డచ్చు పర మగునపుడు ద్రుతప్రకృతికమునకుఁ బ్రాణసంధి

నిషేధించుటయే గాక యట్లు ప్రాణసంధి నిషేధింపవలసినయెడల దదర్థకముగా ద్రుతప్రకృతికత్వమును జెప్పుట గానబడును. ఈతఁ డీపద్ధతిని దన గ్రంథమునం దెల్లెడల నియతముగాఁ బాటించియుండె ననుట కింత తెలియవలసియున్నది.

అటువంటియప్పకవి యీయొక్క సూత్రమునొద్ద (సర్వత్రాజ్ఞత్వాత్కార్యం) దాపల నాంతములు నిల్చినఁ బ్రాణసంధి చెన్నారు అని స్వసిద్ధాంతమునకు విరుద్ధముగఁ జెప్పె ననుట యుచితమా! తా ననుసరించిననియమమున కనుగుణముగాఁ ఈం. సూత్రాభిప్రాయమును నయితము మార్చి చెప్పుచున్నయప్పకవి యిచ్చట నిట్లు చెప్పఁగలఁడా? అందుచే నిచట ద్రుతప్రకృతికసంధివిధానమునుబట్టియే యిది యప్పకవిమ (కృ) తి మనఁజాలము.

అప్పకవిమతమున నాంతములు, ప్రాణసంధి యనునవేవో తేలినవి. ఇంక నాంతములు నిల్చినఁ బ్రాణసంధి చెన్నారు నని చెప్పిన దాని కిచ్చినలక్ష్యమును బరిశీలింపవలయును. "ప్రాణసంధి చెన్నారు నితండు చైద్యవసుధాధిపునేఁ బడఁగించె నేఁ డనన్" అనుదానింబట్టి చైద్యవసుధాధిపునే ననునది యిట లక్ష్య మనవలయును. ప్రాణసంధి జరుగవలయు నన్న (ద్రుత) పూర్వస్వరము పోయి పరస్వరము నిలువవలె. ఇట్లు చెప్పుటవలన ద్రుతము పోయిన ననుకొన్న వసుధాధిపున్ + ఏవు అనునది వసుధాధిపేవు అని కావలయును. వసుధాధిపు నే నని యుదాహరించు టెట్లు? వసుధాధిపె ననురీతిరూపములు గ్రామ్యములు గదా. 'పాడిచె నర్కుఁ డనెడునెడఁ బోడి చక్కుండు, ప్రాచి ననఁగ గ్రామ్యభాష యయ్యె' నని యప్పకవియే ద్రుతము లోపించి (ద్రుత) పూర్వస్వరమునకు సంధి యైనరూపము లిట్టివి గ్రామ్యము లని స్పష్టము చేసె.

ఇంకఁ బొడిచె నర్కుఁడను దానివలె వసుధాధిపునే వనియే యున్నయెడల ని దన లప్పకవి యనుసరించిన ప్రాణసంధిలక్షణమున కనుగుణము గామి నిట విహితమైన ప్రాణసంధికి లక్ష్యమే కాదు.

ప్రాణసంధి పదప్రయోగమున నిప్పద్యకర్త పొరబడిరని యే చెప్పవలెను. ఈయది సర్వత్రాజ్వత్కార్య మ్మనుసూత్రము నకు వివరణ మగుటచే మూలము ననుసరించి ప్రాణసంధి యనుదాని కజ్వత్కార్య మని యర్థము చేయుదము. అనఁగా నచ్చు పర మగు నపు డగునాగమాదిసంధికార్యము లేవో యవి యగు నని యర్థము చేయవలయును.

అందులకు ముందుగా నసలు ప్రాణసంధి జరుగవలయు నన్న దానికి ముందు ద్రుతప్రకృతిము - నాంతము - ఉండవలయును గదా. కావున నిట ముం దున్న వసుధాధిపశబ్దము నాంత మెట్లయినదో విచారింపవలెను.

వసుధాధిపునియొక్క యే వను నర్థమున షష్ఠీసమాసమునందు షష్ఠికి షష్ఠీ భవే ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నా’ మను సూత్రముచే ద్వితీయాకారము కల్గును. నిగాగమఘటితమైనపై రూపమునకు నివర్ణకయుతమైనద్వితీయాకారము వచ్చును. వసుధాధిపుని+ ఏవు అని యగును. అప్పకవిమతమున ద్వితీయావిభక్తులైన ‘ని ను’ వర్ణకముల పైని ద్రుత మాగమము కాకుండుటయు నా ‘ని, ను’ లే ద్రుతము లవుటయు స్పష్టము. కావున నిట ద్రుతమైననివర్ణము ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు అనుసూత్రముచే లోపించిన వసుధాధిపు+ఏవు అని యగును.

నివర్ణాగమము లేని ‘వసుధాధిపుయొక్క యే వన్నప్పుడు గూడఁ బైనట్టిప్రక్రియ చేయఁగ నప్పకవిమతమున వసుధాధిపుని+ఏవు

అనియే యగును. పైని ద్రుత మైననివర్ణము లోపించును. (పచ్చని+ ఆవు మొదలైనచోట్లను ద్రుతము లోపించు నని యప్పకవి పచ్చావు మొ॥ ఉదాహరించెను) అపుడు మఱల వసుధాధిపు+ఏవు అనియే యున్నది ఇట వసుధాధిపు అనుపూర్వశబ్దము నాంత మెట్లయినది? క్వచి ద్భవే త్సమాసేఽపి ప్రాణిమాత్రస్య సంశ్రుతిః అను వి. వి. వచనము సాధకము గాఁగలదు. కాని యహోబలుఁడు వి. వి. నప్పకవి చూడలే దన్నాఁడే. (పైఁగా నిట నట్లు సాధింపరాదు కూడ.)

ఇట 'వసుధాధిపు' అనునది నాంతము గావలయు నన్న 'షష్ఠ్యా ఉతోఽచి నుమ్నో' అనుసూత్రముచే నుమాగమము రావలె. ఐన దనుకొందము. వసుధాధిపున్+ఏవు అని యగు. ఇపుడు డాపలి పదము నాంత మైనది. కానీ యీనకారము వచ్చున దచ్చు పర మగు నపుడు గదా. నుమాగమము వచ్చుటవలననే పైనున్న దచ్చే యని స్పష్ట మయినది. అచ్చు పర మగునపుడు వచ్చు నుమాగమము చేరిన పిదపఁ బరముగా నున్న యీయచ్చు పొల్లయిపోవునా? అట్టి యపు డచ్చుకరముగ నుండఁగా నకార మాయచ్చుతోఁ గూడదా? దానికై అచ్చు పర మగునపుడు ద్రుత మెట్లాయచ్చుతోఁ గూడునో యట్టి యద్వైతాత్కార్య మగు ననుచుఁ బ్రాణసంధి చెప్పవలసినయవసర మేమి? షష్ఠ్యా ఉతోఽచి నుమ్నో యని పొల్లనకారము చేసిన యప్పకవి 'కొడుకునా' లని యుదాహరించెనే కాని పొల్లనకార ముండఁగాఁ బ్రాణసంధిని విధించినాఁడా? పరపదాదియందే కాక పూర్వశబ్దాంతమునను (ద్రుతేతరమునందు) ప్రాణ మున్నపుడే యప్పకవి ప్రాణసంధిపదమును బ్రయోగించుట గానవచ్చును.

పోనీ యచ్చు పర మగునపుడు వచ్చు నా నుమాగమసంధికార్యమే యిచ్చట నున్న యద్వైతాత్కార్య మనునర్థము గల ప్రాణసంధిపదముచే నప్పకవి విధించె ననరాదా యనవచ్చును. అప్పు డొకవైరుధ్యము

నివర్ణము ద్రుతమై యైనను 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అనుదానిచేత లోపించునా ? [illegible] నప్పకవి పౌరపాఠే యైన నిట్లు చెప్పెను. వసధితసరోజ యంబుపటువంటి యనుచుఁ బరపవ విశేషణము తేటపఱచుకొనుచుఁ దొలుతటిపదంబు కొన నుండు ద్రుతము గుడియుఁ దనుసమును నెఱుఁగెడు లోపములు కృతుల (ఓ-164) ననుటచేఁ గర్మధారయమునం దున్న నివర్ణమే లోపించు నని చెప్పిన ట్లయినది. మఱి యీ నివర్ణము లోపించు నని యప్పకవి తలంచియుండు ననుట యనుమానాస్పదము

ఇట్లు గుణవచనములనివర్ణము లోపించినను బైపదములు సరళములే యగు ననియు నచ్చు పర మైనపుడు సంధి యై వచ్చావు నల్లావు (167) అనురీతి నవు ననియుఁ జెప్పెను. ఈనివర్ణముగూడ నట్లు లోపించు నన్న లోపించిన స్థానమునకెల్లా సంధి జరుగవలయును. కావున వసుధాధిపేవు అనియే కావలయును గదా యనవచ్చును. కాని యిట్టియెడల 'షష్ఠ్యా ఉక్తోఽచి నుమ్సే' యని నుమాగమము విహిత మైయున్నది గావున వసుధాధిపునే పనియే యగును గాఁబట్టి లోపించిన సంధి రావలయు నేమో యను నిబ్బంది లేదు. కానీ యసలు లోపము వచ్చు నని యప్పకవి యెంచెనా యన్నది నిర్ణయింపవలసి యున్నది.

షష్ఠీసమాసనుమాగమస్థలమున నప్పకవి చూపినకోడుకునాలు రాజునానతి యనురీతి లక్ష్యము లీయంశము నర్థయుమునకు దోహద పడవు. ఈస్థలమున నిర్ణయించుటకు సరి యైనయాధార మిందు లభ్యము గాకున్నది. ద్రుతమై యైనపుడు సమాసమున లోపింప కుండు టెట్లు ? అనునభిప్రాయమునుబట్టి లోపించు నని యప్పకవిమత ముగా గుర్తించుచో నీయది నుమాగమనకారమవును. (పక్షాంతర మున నివర్ణాగమాభావరూపముతోఁడివిగ్రహము ననుసరించిన నుమా

గమామే యనక యెట్లును దప్పదు.) కొడుకునాలు, రాజునానతి యను రీతిలక్ష్యములు ననుసరించి విసర్గాగమము లేనివానియందే యుదంతముల కట నుగాగమము చెప్పఁబడెఁ (బహుజనపంత మనియు విసర్గాగమము గలవానింట సంధిచేత నీ యాదేశము లగు ననియు నప్పకవి భావించెనా? రాజు (యొక్క) ఆనతి రాజునానతి ఇట నాగమవిధానము తప్పదు. వసుధాధిపుని (యొక్క)+ఏవు ఇట సంధి. వసుధాధిపునేవు అనురీతిగా నప్పకవి తలంచియుండె నేమో. నిర్ణయమున కాధారము దొరికినది కాదు. అట్లు యువ్వఁ గాక. ఐనను వసుధాధిపుని+ఏవు అనుచో వసుధాధిపుని ద్రుతప్రకృతికము గదా. ద్రుతప్రకృతికములకుఁ ద్రుతసంధి విధి యిట యప్పకవిమతానుగుణము గాదు. ఇట నజ్ఞాతార్థ్య మున నేమి? వసుధాధిపుని - ఏవు అనుచో సంధి జరుగుటయా? ద్రుతప్రకృతికమునకు సంధి యెచ్చటఁ జెప్పఁబడినది? అట్లు గాక వసుధాధిపున్ అనురీతిగా నకారపుఁబొల్లు యుండునా? అప్పకవిమతమునను స్వరపరకత్వమున ద్రుతము పొల్లునకారముగనె నిల్చునేమో యని యింతకు ముం దనుమానించియుంటిమి. అయిన నీనకారపుఁబొల్లు విసర్గాగమసంబంధియే యగునా? యొక్క-లోపమునే నాగమవిసర్గము పదాంతమున నుండుటచే (లేక ద్వితీయాతుల్యత యైన ప్రత్యయవిసర్గము) వసుధాధిపు ద్రుతాంతము గాఁగా స్వరము పర మైనది గావునఁ బొల్లుగా నిలిచి (ఇట్లు మన మనుకొనవలసినదే గాని గ్రంథమునఁ బ్రత్యేకవిధానము లేదు.) వసుధాధిపున్+ఏవు అని యుండునో కాబోలు. ఇట్టియెడల వసుధాధిపుని అని నిల్చుటకే యవకాశము లేదు. కావున వసుధాధిపునియేఁవు అనురీతిగా యప్రకృతితో డిరూపము సాధువులా? విసర్గము నట్లె యుంచిన సంధి విధానము లేమి వసుధాధిపునే వని యగు టెట్లు?

ఇట్టి క్లిష్టమార్గము నాశ్రయించుటకంటె విసర్గ మాగమ మయిన రూపముతో నున్నపుడు యప్రకృతితో వసుధాధిపునియే యనునదియు

నివర్ణాగమాభావపక్షమును గలిగించుటకు నీ సందర్భమున నుమాగమముతో వసుధాధిపునే యనునదియు సాధించుట సూరిసమ్మతమగు సముచిత మార్గము గదా.

అట్లు నుమాగమము పై వసుధాధిపున్ ఏవు వసుధాధిపునే వని యైన దని యంగీకరించగా నజ్వత్కార్యాదర్శ ప్రాణసంధివిధానము వ్యర్థమే యని స్పష్టమగుచున్నది. అసలు ప్రాణసంధి యనుదాని నాయైచోట్ల ప్రయోగించినదానికి విరుద్ధముగా నిటు ప్రయోగించుట వింత. అజ్వత్కార్యము ననుసరించు విశేషమే. 5_33 పద్యము ననుసరించి మీఁదిపదము మొదటివర్ణ మచ్చైనఁ జాలు నది ప్రాణసంధియే యగు నని తలంపరా దనుట యింతకు ముందు స్పష్టము.

అన లివి సంధియైనరూపము లగుటయే యనుమానాస్పదము. ఇట్టినుమాగమ మయినరూపములలో నకారము మీఁదియచ్చుతోఁ గలియుటను ప్రాణసంధిగాఁ గాక ప్రకృతిభావముగానే యప్పకవి స్థలాంతరమున నిట్లు స్పష్టము చేసియున్నాఁడు "ప్రాణసంధి కొమ్ముపైఁ దక్క నితరస్వరమ్ముమీఁద నచ్చు గదిసిన నచట లే దాంధ్రమునను" నని చెప్పుచు "నలినమునివాస మానెలనాఁగ వాణికి దేవి యన నీపదింటిపైఁ దెలుఁగున స్వరము లెసిరిసఁ బ్రకృతిభావం బె నిలుచు – (53) – అని యుదాహరణ వాక్యములకు సంధి లేదని యుదాహ రించుచు 'నివాసమానెలనాఁగ' అనున దాకారముపైఁ బ్రకృతిభావ మనినాఁడు. నివాసము+ఎలనాఁగ అని యుండ ధాతునదసమ్భవానా ముత స్రథా ను మచి' యని నకార మై అవున్+ఎలనాగ ఔన్+ఎల నాఁగ ఔ నెలనాఁగ యని యైనది. ఇది ప్రకృతిభావ మని యప్పకవి చెప్పుచున్నాఁడు. అదే విధముగా వసుధాధిపున్+ఏవు అనుచో నుమాగమమున నకారము మీఁదియచ్చుతోఁ గలిసి వసుధాధిపునేఁ వని

యైనట్టి యిదియుఁ బైదానివలెనే ప్రకృతిభావమే కదా! అనఁగాఁ బ్రాణసంధి కాదని స్పష్టమే. ఇది ప్రాణసంధి యన నొప్పదని యప్పకవిలక్షణమునుబట్టి గ్రహింపఁదగియున్నది.

దీనింబట్టి యెట్టులు సమన్వయింపఁ జూచినను 'వసుధాధిపునే' వనునది ప్రాణసంధి చెన్నారుట కప్పకవిమతానుసారముగా నుదాహరణ మయ్యెడునవకాశము గానరాదు.

పోనీ చెన్నారునితం డనునదే లక్ష్యముగా గ్రహింపవచ్చునా? అన్న నదియుఁ బొసఁగదు. చెన్నారును (లేక చెన్నారునున్) అనునది తద్ధర్మప్రథమైకవచనము. అప్పకవి తిద్ధర్మప్రథమోత్తమైకవచనము లందుఁ బ్రాణసంధి నిషేధించియుండుట 73, 75 పద్యములలో నింతకు ముందే స్పష్ట మయియున్నది. కాని యొక యనుమానము. అచటఁ బదరును నతఁ డనునది సంధి జరుగ నందు కుదాహరణము గాఁగాఁ జెన్నారు నితం డనునిది ప్రాణసంధి యైనందులకు లక్ష్య మగును గదా యని. కాని సంధి లేకుండుటయే యట విహితము గాని సంధి యవుట కవకాశము కల్పింపఁబడనే లేదు. పదరును నతఁ డనునది విశేషస్థలముగాఁ దోఁచుచున్నది. నిజమున కప్పకవిమతము ననుసరించి యటఁ 'బదరు నతం డోర్తు నే' ననురీతిగనె యుండవలసియున్నది. చింతామణికి వజ్ఝలవారివివరణము ననుసరించి భూతకాలిక మైన యుత్తమ పురుషైకవచనరూపము బ్రదికితినిన్ అనియుండవలె. అప్పకవి 'బ్రదికితి ననఁగన్' అనునది సంధి జరుగనిది గా నుదాహరించియున్నాఁడు. చెన్నారునున్+ఇతం డనువిభాగముతోఁ జెన్నారు నితం డనున దెప్పుడు సంధి జరిగినందుల కుదాహరణ మైనదో యప్పుడే బ్రదికితి నిన్+అనఁగన్ బ్రదికితి ననఁగన్ అనునది నయితము సంధి యైనందు లకే లక్ష్యమగును. కాని దీని నప్పకవి సంధి కావందుల కుదాహరించి

యున్నాఁడు. కావున బ్రదికితి ననఁగన్ అనుదీని ననుసరించి యట 'వదరు నతం డని' యుండుటయే యప్పకవిమతానుగుణము. ఐనఁ బదరును నతఁ డనుచోటఁ బదరు నతం డనున దప్పకవిమత మనుకొన నేల? బ్రదికితి ననఁగన్ అనుచోటనే (వఝ్ఝలవారిమతానవలె) బ్రదికితిని ననన్ అన్న దప్పకవిమత మనవచ్చును గదా యని సందేహము కల్గవచ్చును. కాని యప్పకవిమతమున 'బ్రదికితిని' అనునదే యుత్తమైకవచనరూపము. ద్రుతప్రకృతికములచివరి ను (ని) వర్ణము చింతామణి సాధించియున్నచోటుల నదియే ద్రుత మనియు దానివలననే నాశబ్దము ద్రుతప్రకృతిక మగు ననియు ద్రుతప్రకృతికము లైనయే శబ్దములకుఁ జివర ద్రుతము ప్రత్యేకముగ విధింపఁబడదో (అప్ప. చిం. లో విధింపఁబడియే యున్న దేమో? ఆ చింతామణియంతయు లభ్యము కాలేదు గదా.) యచ్చటమాత్రమే ద్రుత మాగమ మగును. (అన్యే - అనుసూత్రముచేఁ గావచ్చును.) అనునప్పకవియభిప్రాయము గమనించియున్నారము. కావునఁ గొలిచితిని అనుచోట నివర్ణముపై నింకొక ద్రుతము చేరుట యప్పకవిమతము గాదు. బ్రదికితి ననఁగన్ అనునది సంధ్యభావరూపమే.

అసలు పదరును నతఁ డనునది యెట్లును విశేషమే యనక తప్పదు. వల యనఁ వఝ్ఝలవారిమతమున నైనను బ్రదికితినిన్ అనుచోట నివర్ణముపై ద్రుత ముండును గాని తద్ధర్మప్రథమైకవచనమునఁ బదరున్ అనియే యుండవలయును. ప్రథమైకవచనలోప సద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్తు దానిచేఁ బ్రథమైకవచనలోపము రాఁగా ద్రుతప్రకృతికము గావునఁ జివర ద్రుతము చేరి పదరును అనియే యగును. ఇట్టివే యనఁదగు భూతార్థకప్రథమపురుషైకవచన రూపముల నప్పకవి పెరిగెను, చంపెను (5-144) మున్నగురీతిగనే చూపుట గమనింపవచ్చును. దాని ననుసరించి పదరును అని కాఁగా నట ద్రుతముపై నింకొక ద్రుత మైన దన్నమాట. పదరు నతం డని

యున్నఁ జక్కఁగా సరిపోయెడిది. ఏది యే మైనను చెన్నారు నితం డనునది మాత్రము ప్రాణసంధి యైనందులకు లక్ష్యము గా దనుట యథార్థమే గద.

అయినను 'ప్రాణసంధి చెన్నారు, నితండు చైద్యవసుధాధిపునే పడఁగించె నేఁ డనన్' అనువాక్యరచనమునుబట్టి చూడఁగా వసుధాధిపునే యనునదే లక్ష్యముగాఁ దత్కర్త భావించినట్లు తెలియవచ్చును. చెన్నారు నితం డనునది యెట్లున్నను వసుధాధిపునేఁ యనునది ప్రాణసంధికి లక్ష్యముగా నుద్దేశింపఁబడిన దనకతప్పదు. అది సరిగా దని స్పష్టమే.

మొత్తముమీఁద నీపద్యమునందు 'ఆరయ వైకృతోక్తులఁ బదాదులయందు యకార ముండ దాతీరునఁబల్కు ప్రాయి గణుతింపఁగ వచ్చును' - నన్నంతవఱకే యప్పకవిసిద్ధాంతముల కనుకూలముగా నున్నది. మిగిలినపద్యభాగము పదాదియకారము విషయమున నట్లుంచి యప్పకవిసంధిసిద్ధాంతములకును విరుద్ధము నై యుంట గమనార్హము. అనఁగా సర్వ ప్రాజ్వత్కార్యమ్ జ్ఞేయ మ్మనుసూత్రమునకు వివరణ మనఁదగిన దెల్ల నప్పకవి యితరాభిప్రాయములకును విరుద్ధ మై యుండ నిది యప్పకవి చెప్పియుండునా?

పోనీ యప్పకవి గా దని మఱి యేకవి చెప్పె నన్నను నప్పకవి సిద్ధాంతములకు విరుద్ధముగా వసుధాధిపునే యనునది ప్రాణసంధిగా నెట్లు తలంతురు? అప్పకవీయ మన లెఱుఁగకయే యిట్లు వ్రాయఁదల పెట్టరు గదా! ఇట ననుమానింపఁదగినయంశ మొండు గలదు.

పొల్ల యగుపూర్వశబ్దాంతహల్లుమీఁదఁ, బరపదాద్యచ్చు నిలిచెనుఁ బ్రాణసంధి, కొమ్మునపైఁ దక్క నితరస్వరమ్ముమీఁద నచ్చు గదిసిన నచట లే దాంధ్రమునకు' అనుచో నప్పకవిలక్షణమునందుఁ

బొల్లి యగుపూర్వశబ్దాంతహల్లుమీఁదఁ బరపదాద్యచ్చు నిలిచెడుఁ బ్రాణసంధి (న్) అని ప్రాణసంధిపదమును దరువాతివాక్యములోని కన్వయింపవలసియుండఁగా (ప్రాణసంధి కొమ్ములకుఁ దక్క నితర స్వరమ్ముమీఁద నచ్చు గదిసిన నచట లేదనురీతిగా నన్నమాట) బూర్వభాగములోనే నిల్పి పొల్లుహల్లు పైయచ్చుతోఁ గూడుకొను టయే ప్రాణసంధి యనురీతిగాఁ బ్రాణసంధిపదార్థమునఁ బొరవడుటకు వీలు గలదు.

ఇట్లే "మీఁదిశబ్దంబులకు నాదివర్ణంబులు స్వరంబు లైనఁ బ్రాణ సంధు లయ్యె" - ననుచోటఁ బ్రాణసంధిపదము ప్రయుక్తము. గణానుకూల్యమువలననే యున్నను ప్రస్తుతస్థలమునను బ్రాణసంధి చెన్నారు నని ప్రాణసంధిపదము ప్రయుక్తము. మీఁదివర్ణము స్వర మైనఁ బ్రాణసంధి యనుటచేఁ బ్రాణసంధి యనుటకుఁ బైపద్యము నాధారము గావచ్చును. ఇట్లే ద్రుతపూర్వస్వరసంధిసందర్భమునందు సైతము "ధరణి ద్రుతప్రకృతులపై స్వరపూర్వపదములు గదిసి సంధి గలయుచో ... ద్రుతాక్షరములు లోపములు గాక నిలుచున్ - అనుచో సంధిపదము ప్రయుక్తము. ఇట సంధి గలయుచో ద్రుతాక్షరములు లోపములు గాక నిలుచు ననుటచే సంధి గలియకున్న ద్రుతము లోపించి యచట నిలువకుండుట సంభవించు ననునర్థము లభించు. (అనఁగా నెచట ద్రుతము లోపించునో యచట సంధిలేకుండె నన్నమాట. ఇట్లు ద్రుతము లోపించిన 'లోప మైన గ్రామ్య మగును' అను నప్పకవిమాటచేతనే యది గ్రామ్యమగును. కాఁగా గ్రామ్యము గాకుండవలయు నన్న ద్రుతము లోపింపక నిలువవలయును. ద్రుతము లోపింపక నిలువవలయు నన్న నచట స్వరపూర్వపదములు గదిసి సంధి గలియవలయును. అచ్చరకత్వమున నెప్పుడును ద్రుతము లోపించుట లేదు గావున నట్టె ద్రుతము నిలువవలయు నన్న (బ్రాణ) సంధి గావలయును గాఁబట్టియును బ్రాణసంధి చెన్నారు నని చెప్పియుండ

వచ్చును. వీనియన్నింటింబట్టి నకారపుంబొల్లు యగుహల్లు నిలిచియుండి మీఁదియచ్చుతోఁ గలియుట ప్రాణసంధిగాఁ దలఁచి వసుధాధిపునే వనురూపమున ప్రాణసంధి జరిగినదిగాఁ దత్కర్త యభిప్రాయపడియుండవచ్చు. అనఁగాఁ బోడిచె నర్కుఁ డిత్యాదిరూపములు ప్రాణసంధి జరిగినవిగా భావించియుండవచ్చు.

పొల్లటకారము వెట్టుకే సంధిఁ జెందుఁ బ్రాణముతోడన్ (5-91) (ఇటఁ బొల్లుటకారము మీఁదియచ్చుతోఁ గలియుటయుఁ జెప్పఁబడినది) అనురీతిగాఁ బొల్లుహల్లు మీఁదియచ్చుతోఁ గలియుటను అప్పకవి సంధిగాఁ జేర్కొనుట గలదు. కాని యది "వెనుకటిశబ్దమునకుఁ దుదిఁ, దనరెడువర్ణమును బైపదమునకు మొదలం గనుపట్టు నక్షరంబును, సవికస్తుతి కూర్చి పలుకే సంధి యనఁ జనున్ (5-33) అనుసామాన్యలక్షణము నుద్దేశించియే యిట్టియెడలఁ బ్రయోగింపఁబడినట్లు స్పష్టమే కదా.

మీఁదిశబ్దములకు నాదివర్ణంబులు స్వరములైనమాత్రమె ప్రాణసంధి యనరాదనియు మొదటిపదము చివరఁ గూడ స్వరమే యుండవలయు ననియు నింతకుముందే గమనించితిమి.(మీఁదిశబ్దములకు నాదివర్ణంబులు ... హల్లు లయ్యెనేని వ్యంజనాక్షరసంధు లయ్యె (6-35) నన్నయప్పకవి యూపిదపఁ బొల్లు లగు నాలకవతలిహల్లులు ద్విత్వంబు లగుచు నసురాంతక సంధిల్లును వ్యంజనసంధులు (5-50) అని పేర్కొనుట గమనింపఁదగు. అయిన హల్లున కచ్చు పరమైనను, అచ్చునకు హల్లు పరమైన నాసంధు లేమియ్యు? రామున్+ఆజ్ఞ - రామునాజ్ఞ, వాఁడు గొట్టె? వీనిఁ గూర్చి నిర్ణయింప నిట నాధారము వెదుకవలసియున్నది.) ఇంక నప్పకవి స్వరసంధిని (ఇదియే గదా ప్రాణసంధి యన్నను) వివరించునట్టుగఁ బరరూపమె వికృతిఁ గానంబడు స్వరసంధిన్ (5-38) అని పరరూప మగునదిగాఁ జేర్కొనెను.

పొల్లువాల్లు మీఁది ప్రాణముతోఁ గలియుటలోఁ బరరూపత్వము గల దనుట కవకాశమే లేదు గదా. మఱి యిది ప్రాణసంధి యగు టెట్లు? ద్రుతప్రకృతికములయెడఁ బ్రాణసంధివిషయమున నప్పకవిమత మింతకు ముందు స్పష్టము. కాఁగా వసుధాధిపునే పనునది ప్రాణసంధి యగుట యప్పకవిమతవిరుద్ధము. ప్రాణసంధిపదమున కిట్టిసంధిపర ముగా నర్థము చేసిన నిది సమన్వయింపదు. ఇంక నద్వ్యత్వార్య మాత్రముగా నర్థము చేసిన నాంతములు ప్రాణసంధి, అనువానిసమ న్వయమున నన్యోన్యాశ్రయదోష మేర్పడుటచే నట్లును జెప్పరా కున్నది. ఇంకను నీపక్షమునఁ బదాదియకార మంగీకరింపకయే నాంత ములపై నద్వ్యత్వార్యవిధానమువలనఁ దదితరము లైనకళలపై నద్వ్య త్వార్యము లేకపోఁగా నటఁ బదాదిని యకార మట్లె యుండు నని నిర్ణయింపవలసియుండును. "తెలుఁగున ... శబ్దాదులను యకారము పగిదిన్ బలుకఁబడునవి స్వరము లగు. (అ.చిం) ప్రాణ మై యది కను పట్టుఁ గాని (2-177) యని యీ వ్యాఖ్యానము చేసినసిద్ధాంతములనుబట్టి వాఁ డెవ్వఁ డిత్యాదిరూపములును యథాప్రయోగముగా సిద్ధించు చుండఁగా నీవిశేషశాస్త్రారంభముచే వాఁడు యెవ్వఁ డనియే యుండ వలయు. ఇచ్చటనే గణుతింపఁగ నచ్చుగు నన్నాఁడు గదా అన్న నాంతములపైనే యద్వ్యత్వార్య మేల? అన లచ్చున కద్వ్యత్వార్య మేమి?

ఇవి యప్పకవిసిద్ధాంతములకు విరుద్ధములు గావని సమన్వ యించుటకై వజ్ఝలవారు వ్యవహారమందలియకారము (వువువోవోలు) అనునొక నూతనమార్గము నవలంబించిరి ఇది కేవలము చిం., వి.వి.లు వువూవోవోలనుగూర్చి ప్రస్తావించిన వ్యాసమును సమర్థించునదిగా నున్నదే కాని యప్పకవీయమును సమన్వయించునది కాదు. పదాదినియకారమును వువువోవోలును లేవనునదే వ్యవహారమందలి దోషమును వారించునది గదా. ఇటఁ బ్రత్యేకముగా వ్యవహారగత

యకార మని దాని కజ్వత్కార్య మేల? 'పల్కువ్రాయి' (యనుట వ్యవహారమునే యుద్దేశించిన (129 వ్యా. సం. స.) అచ్చగు నన్నది యటనే కదా. అది యెక్కడ, వ్రాంతలోనా? పలుకులోనా? పలుకులో యకారముండ వ్రాంతలో నచ్చుగా నున్న నిఁక నజ్వత్కార్య విధానసమన్వయ మెట్లు? ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థ ముండదు ప్రాణమై యది కనుపట్టుఁగాని' (2-177) యనునప్పకవిపూర్వసిద్ధాంత స్థలమునను 'గనుపట్టుఁగాని' యనుట యాద్యంతస్థమై వినిపించుట ననఁగాఁ నట్లు పల్కఁబడుట సూచించుచు వ్యవహారస్థలమునే ప్రస్తావించిన దనవచ్చు. మఱి యంట నట్టియెడలే కద. ప్రత్యేకించి చెప్పనేల? వ్యవహారగత మనురీతి సమన్వయముతో సర్వత్రేత్యాదివివరణ మప్పకవిపూర్వసిద్ధాంతమున కనుగుణ మనుట సమంజసము గా దనక తప్పదు. ఇటు నప్ప.ప్రణాళికలో లోకము పదాదివుపూవొవోల కజ్వత్కార్యము చెప్పసూత్రము సూచనము కాక పదాది యకారమునకు నాంతములపై నజ్వత్కార్యము చెప్పసర్వత్రేత్యాది సూత్రము చెప్పుటయే యని నిశ్చయింపఁదగును.

అప్పకవి పదాదియకారము నొక్కటియే కాక 'క్వచి దపిన స్త ఉదోత్తా దంతోష్ఠభవస్య విక్కృతిశబ్దాదా' యనుతనచింతామణి యాధారముగా వుపూవొవోలును జేసి చెప్పెను. అదియు దృష్టియం దుంచుకొని ప్రస్తుతసూత్రమునకు వివరణముగా నింక రెండుపద్యములు వ్రాయఁబడినవి. అవియుఁ బరిశీలింతము.

శృంగాంతవక్రయుగములసాంకర్యము నాకు నాంధ్రసంస్కృతములనా
దిం గలుగ దట్టివ్రాంత ధరం గలయు ద్రుతాంతములను బ్రాణము లట్లన్

సంస్కృతాంధ్రములలో వకారమునకు 'ఉఊఒఓలతోఁ గలయిక (వుపూవొవోలు) గలుగ దనియు నట్టివ్రాంత ద్రుతాంతముల మీఁద నచ్చులవలెఁ జెల్లు ననియు నిప్పద్యము చెప్పుచున్నది. కానీ

యింతకు ముం దప్పకవి 'జాతివాగిలవోర్ధ్వశబ్ద మొక్కటి దక్క, సంస్కృతాంధ్రముల నుడిజగములందు శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు నొత్వంబులు గల్గ నొకటి కైన - వాను శృంగములకై వడి నొత్వములభంగి శబ్దాదిఁ గలయవి స్వరము లగును (2-21) అని చెప్పి యున్నాఁడు. వోర్ధ్వశబ్ద మొక్కడానియుం దున్నను నద్దానిని బ్రస్తావనము గల్గినచోట్ల నెల్లఁ జెప్పవలసినయవసరము లేదు. కావున నీ స్థలమున సాధారణముగా సంస్కృతాంధ్రములందు లేదనుట దోషము గాదు. కానీ యింతకు ముందు వృవ్రావొవోలవలె శబ్దాదుల నున్నవి స్వరములె యగు నన్నాఁడు. కావునఁ గళాద్రుతప్రకృతికములకుఁ బరముగా నున్నను కానున్నను శబ్దాది నున్నవి ఉఊఒఓ లే యవుట యుట సిద్ధించియున్నది. కాని యిట ద్రుతాంతములపైఁ బ్రాణము లట్లు నుండు ననుటచే నితరస్థలములందుఁ బదాదివకారము ఉఊఒఓలకు ముం దట్లే యుండు నని చెప్పిన ట్లగుచున్నది. ఇంతకు ముం దప్పకవియే లక్షణపద్యమునందు నీనిస్వరాదిత్వమునకు లక్ష్యములను జూపెను. 'కొమ్ములు నొత్వ' మన్నపుడు ద్రుతాంతముపైని శబ్ద మొక్కటికల్గ నొకటికి ననుచోఁ గళాపదములపైఁ గూడ నత్వముతో సంధికార్యములు చేసిచూపియున్నాఁడే. అట్టివాఁడు ౯వ ఆశ్వాసము కడకు వచ్చువరికి 'ద్రుతాంతములపై బ్రాణము లట్లు యుండు నని చెప్పచోఁ బైప్రయోగములు శబ్ద మొకటీత్యాదులగతి యేమి? ఇంక నీలక్షణము లక్ష్యముగా నీఁబడినతరువాతి దగు'.

ముంగాముఱువులు నాలుగుసుంగరములు మూఁడు నేఁడు నొడ్డాణంబుల్
వాఁగుచు నొసంగి హరి యొకయుంగనను రమించె ననుదాహరణంబుల్

అను పద్యమున ద్రుతాంతములపైఁ బ్రాణము లట్లు నుండుటకే లక్ష్యములు చూపఁబడినవి. (ఒడ్డాణంబుల్ వాఁగుచు అనునది ప్రస్తు

తాంశమున నుపయోగించునది కాదు. కాని "రెంటను లాంతుల నుండుఁ (వువ్వూవోవో లన్నమాట) గృష్ణుండు గిన్క మోదినఁ జెట్లు వాలిసె నవఁగ (2-221) అనునప్పకవిపల్కులలో దీనికి సామ్యము తోఁచుచున్నది.) మొత్తముపై ద్రుతాంతేతరస్థలములను బ్రాణములే యుండుట యనునప్పకవిసిద్ధాంతమున కిది విరుద్ధము.

ఇచటఁ బ్రాణసంధి యగు నచట ప్రాణము లట్ల చెల్లు ననుటచే ఆదయ మున్నగునింతకుముందటిపద్యమునం దున్న విరోధ మిందు లే దనవచ్చును. కాని యదే యభిప్రాయ మిందు నుద్దిష్టమైన దన్నచో మాత్రము దీనియెడఁ గొంతయిబ్బంది తప్పదు.

ఇంక నీలక్షణపద్యమునందు నస్పష్టత గనవచ్చును. సంస్కృతాంధ్రపదములమొదట - వకారమునకు ఉఊఒఓలతో సాంగత్యము లేదు అనుట కొంత యుచితము. ఇటనైనను బదాదిని ఉఊఒఓలకే (ముందు) వకారముతో సాంగత్యము లే దని చెప్పిన లెస్సయై యుండు ననిపించుచున్నది. ద్వితీయాశ్వాసలక్షణమునను నిచ్చటవలెనె యీయంశము చెప్పఁబడియుండుటచే నిది యిచ్చటి లోపమే యనరాదు. పిదప నట్టి వ్రాఁత అనఁగా నెట్టి వ్రాఁత? ఇంతకు ముందును యకార ముండదా తీరునఁబల్కు వ్రాయి — యనుటచే యకారము(తో)వలె నుచ్చరింపఁబడు నక్షరము వ్రాఁతలో నచ్చే యగు నని స్పష్టము. కాని వువ్వూవోవో లుండ వని చెప్పుచు నట్టి వ్రాఁత యన నేది? వువ్వూవోవోలవంటి వ్రాఁతయా? అది లే దని చెప్పఁబడినది కదా. ఇంక నుచ్చారణమునం దట్టి దున్నమాట నిజమే. వ్రాఁతలోను నట్లె యుండునా? అయిన వువ్వూవోవోలె యెల్లయెడఁ బదాదిని వ్రాయఁబడుచుండఁగా నట్టి వ్రాఁత ద్రుతాంతములపైఁ బ్రాణము లట్ల నగు ననుటవలన నితరస్థలములందు వువ్వోవో అను

రీతిగనే ప్రాఁత యుండునా? మఱి పద్యమునఁ బూర్వార్థమునభి ప్రాయ మేమి?

పకారమున కుఊఒఓలతో సాంగత్యము లే దన్నను బదాది నున్న ఉఊఒఓలే పకారముతోఁ గూడక యట్లే యుండునని చెప్పుట తత్కర్త యభిప్రాయ మని యూహించుట దోషము కాదు గదా. అట్టియెడలఁ బదాదిని ఉఊఒఓలే యుండును. ఇవి ప్రాణములే కదా. అపుడు ద్రుతాంతములపైఁ బ్రాణము లట్లు నుండు టేమి? ప్రాణములు ప్రాణములు గాక యే మగు? ఇంకను బ్రాణము లట్లగు ననుటచే నచ్చోటి ప్రాఁత నిజముగాఁ బ్రాణముతో నుండు నది కా దనియు నఁగా వువోవొవోలే ప్రాఁతయం దుండు ననియు (నవి ద్రుతాంతములపై మాత్రమె ప్రాణములవలె నగు ననియు) జెప్పవలసియున్నదే గదా.

ఏ దెట్లున్నను ద్రుతాంతములపై మాత్రమె ప్రాణము లట్ల ననుటచే నితరస్థలములందుఁ బ్రాణములు గాదు గదా ప్రాణముల వలె నయిత ముండ రా దని యర్థ మగుచున్నది. ఇది యప్పకవిమత మునకువిరుద్ధ మగుట స్పష్టము.

వాకు శృంగములకై వడి నోత్వముభంగి గలయువి స్వరము లగును' - అని పదాదిని పుపూపొపోల ప్రయోజనాభావమును దుష్టతను గురుతించినయప్పకవి యిట నిట్లు చెప్పియుండునా? చిం.లో క్వచి దపి న స్తి యని ప్రత్యేకముగాఁ జెప్పఁబడఁగా నిట్టికల్పనము పూర్వవిరుద్ధము గదా.

అందుకే పద్యము లీయవి సర్వత్రాద్వతార్ణ్య మిత్యాది సూత్రమున కనువాదము లనఁదగినవి యప్పకవికృతములు గా దను టయే యుచితముగాఁ దోఁచుచున్నది. - దానికిఁ గారణములను సారాంశముగా నిట్లు గుర్తింపవచ్చును.

1. సర్వత్రాజ్ఞాతాచార్య మనుసూత్ర మప్పకవీయమునందు లే దని యహోబలుఁడు పేర్కొనుట. దీనిని ఖండించినపూర్వ గ్రంథములు లేకుండుట.

2. అహోబలుఁ డప్పకవికి సమీపకాలమునకే చెందినవాఁ డగుటచే నట్టిస్వల్పవ్యవధిలోనే- సర్వత్ర - సూత్రానువాదపద్యము లుండి యాపిదప నయ్యవి తొలఁగి యట్టిప్రతు లేర్పడుట సంభవమా ? అట్టివానిమాత్రమే యహోబలుఁడు చూచె ననుట యును సమంజసముగాఁ గానరాదు.

3. అహోబలుఁడు కవిశి. నిర్మాణమున నంతకు ముం దున్న బా. స. అప్ప. లను సమగ్రముగాఁ బరిశీలించుట సంభవమే. తచ్చిహ్నములు కవిశి.లో నుంట స్పష్టము. (బా. స. తో) అప్ప. నుండి సంస్కృతీకరించినవ్యాఖ్యానభాగము కవిశి. లోఁ గానవచ్చు. పెక్కు చోట్లనప్ప. నుద్ధరించుటయుఁగలదు. అప్పార్యపుస్తకారూఢపాఠ భేదా ద్య దుత్థితమ్, మయా సంగృహ్యతే రూపంత త ద ప్యాథర్వ ణోక్తిత యని యప్పకవీయవిశేషము లథర్వణోక్తులపేర సంగ్రహిం చితి ననుచు తత్ఫక్కికాలోకనలాలసా త్యజ్యతాం బుధైః - అనుచు నప్పకవీయమం దేపద్యము నథర్వణునిపేర సంస్కృతీకరించెనో యా పద్యమునే వెనువెంటఁ బ్రవర్తించుచు (కొన్నియెడల) నున్నయహో బలుఁడు అప్పకవిపుస్తకమం దున్నది లే దని వ్రాసె ననుట విశ్వస నీయముగా లేదు. (దీనివలన నహోబలున కొరుగున దేమియు లేదు. నిజమున కాపద్యము లున్న వన్న నది యప్పకవిపొరపాటుగా వర్ణించిన నహోబలునకు గౌరవమే కలిగెడిది గదా.)

పదాదిని యకారమును వృవ్రూవ్రావ్రోలును లే వనునంశము బా. స. చిం. లోఁ గానరాకున్నను దనచిం.లో నాసూత్రములఁ జూపిన

యప్పకవిమతమునఁ బదాది నున్న దచ్చే గావున నచ్చున కట్వాత్కార్యము చెప్పవలసినయవసరము లే దనుట విస్పష్టమే.

4. ఇంక నప్పకవీయపద్యములను జూచిన - ఆరయ - అను పద్యమునఁ బదాదినియకారము లే దచ్చే యున్న దని చెప్పుచున్నది. అట్టియెడల నాంతములపైఁ బ్రాణసంధి చెన్నారు ననుట విరుద్ధమగును. సంధి యనునది యప్పకవిప్రణాళికకు విరుద్ధముగా నాపద్యమునందుఁ బ్రయుక్తము. అద్వ్యాత్కార్య మనునర్థమును గుదురదు. వసుధాధిపునేఁ డనునది సరియైనలక్ష్యమే గాదు.

5. ద్రుతప్రకృతులపైఁ బ్రాణసంధి చెప్పకుంటయే గాక ద్రుతము సంధిప్రతిబంధక మని భావించుటయు ద్రుతప్రకృతికత్వముతో ననఁగా నాంతతతోఁ బ్రాణసంధినిషేధమును సాధించిన యప్పకవి 'డాపల న్నాంతములు నిల్చినఁ బ్రాణసంధి చెన్నారు ననుట యసంభవము. వికృతిపదంబుల నకారంబులు వలయుచోఁ గొనలఁ బొడము' నని ద్రుతప్రకృతికత్వవికల్పతను మొదటినుండియు సాధించుకొనుచువచ్చినయప్పకవి ప్రణాళిక యిట్లు పరిణమించుట విశ్వసనీయము కాదు. ద్రుతము సంధిప్రతిబంధకముగా భావించుట యప్పకవి యజ్ఞత (కాదనియు నుచితజ్ఞత యనియు నింతకు ముందు స్పష్టము.) యని చిం॥వీ॥వ॥లో వ్యాఖ్యలవారే విమర్శించియున్నారు.

అప్పకవిమతమున ద్రుతప్రకృతికములయెడఁ బ్రాణసంధి యనఁగా ద్రుతపూర్వస్వరసంధి యగుట గమనింపవచ్చు.

6. అద్యః క్రియాసు అనుసూత్రమున నాద్యగ మ్మనునది లేకుంటచేతనే కాక స్పష్టముగా 'వికృతిపదాచ్చ ప్రథమాన్తస్య తృతీయానునాసికౌ చ స్తః' - అని శబ్దాదినియమకారంబులు గలుగ వనియును 'క్వచి దపి న స్త ఉదోతౌ దంతోష్ఠ్యభవస్య వికృతి

శబ్దాదాయని పదాదిని వువూవోవోలు లే వనియును-అవి స్వరములే యగు ననియు ముందుగనే చెప్పియున్నాఁడు - అట్టియెడల నిట ద్రుతాంతములపై మాత్రమె యచ్చు లగుటయో యచ్చుల ట్లగుటయో చెప్పుట మిక్కిలివిరుద్ధ మగుచున్నది.

7. సర్వత్ర - అనుస్వారము వువూవోవోల కజ్వత్కార్యము చెప్పునది కాదు. అయినను సందర్భమునుబట్టి యప్పకవిసిద్ధాంతము లనుబట్టియు నిటఁ దరువాతి పద్యములు వ్రాయఁబడియుండవచ్చును. అనఁగా వువూవోవోల కజ్వత్కార్యమును జెప్పుటకై యీచింతామణియందు సూత్రము ప్రత్యేకముగా లేకుండుట నంతగాఁ బట్టించుకొనన క్కఱలే దనియభిప్రాయము.

ఐనను 'శ్రీ...నముల' ననుపద్యము క్లిష్టాన్వయముతో నుంట యట్లుంచి ...నెడపలెనె యిచ్చటఁ గూడ నాయిబ్బంది లేర్పడియున్నవి.

పదాదిని యకార ...న్న దన్నది గావున బా. స. చిం.లో సర్వత్రాజ్వత్కార్య ము...త్రమనవసర మైనది. దాని కనుగుణముగా నీసూత్ర ముప్పకవీయమునఁ జెప్పఁబడియుండదవు.

అహోబలపతికి ముం...పద్యము లప్పకవీయమునందు లేకుండుటచేతనే యాతఁడు లే దని చెప్పఁగాఁ దరువాతివారు చేర్చియుండుట సంభవించియుండవచ్చు. అహోబలునికిఁ బిదప ననతికాలములోఁ జేరుటచేఁ గ్రమముగా నేఁ...ట ...పద్యములు గావచ్చును. అప్పకవ్యహోబలులమధ్యవ్యవధాన మల్ప మగుటచే నడుమనే భేదము లేర్పడుటకంటె నిది సంభవ మనుట కవకాశ మెక్కువయే.

ఇట్లు పరిశీలించిన నీపద్యము లప్పకవికృతములు గా వని గుర్తింపవచ్చును.

కానీ యిట నింకొకయవరోధమున్నది.

ఈపద్యము లప్పకవికృతములు గా దన్న సర్వత్రాజ్వతాత్పర్యమనుసూత్ర మప్పకవీయమునందు లే దని యభిప్రాయ మగుచున్నది. కాని యిది పద్యమునం దొకయర్థమే. బా. స. చిం. ననుసరించి యీపద్యమునుత్తరార్థము లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు' - అ నది - లేనవు డీపద్యముమొత్తము లేకుండవలయును. ఒకయర్థము మాత్రమే లేక యిం కొకటి యుండుట యెట్లు? లుక్సంశ్లేషౌ నాచి యున్నసూత్రమును దానివివరణపద్యములు నప్పకవీయమునం దున్నవి. దీనింగూర్చి యహోబలుఁడు ప్రస్తావింపలేదు. సర్వత్ర యనుసూత్రము లే దనుటచే (ఆపద్యములేదనక) లుక్సంశ్లేషౌ నాచి -' యున్నసుభాగ మున్నదా? ఈ సూత్రమున కప్పకవివలె నహోబలుఁడు ద్రుతద్విత్వాసాధుత్వపద్ధతిలో వ్యాఖ్యానింపలేదు. ఇంకను అహో. ద్రుతద్విత్వమును సాధించెను గూడ.

ఇట నెట్లు నిర్ణయించుటకును సరియైనయాధారము దొరుకలేదు. లుక్సంశ్లేషౌ నాచి (ద్రుతస్య) అనుభాగమునకు మాత్రము ద్రుతమునకు లోపమును సంశ్లేషము అనఁగా ద్రుతద్విత్వమును నని నిర్ణయించి యవి యసాధువులుగాఁ జేర్కొనుచు 5-44,45,46 పద్యములు కన్పించును. ఇటనే యున్న 47-48-49 పద్యములు మఱల ద్రుతప్రకృతిసంధివిషయమును ప్రస్తావించునవి కావు. అది యట్లుండఁగా (ద్రుతస్య) సర్వత్ర లుక్సమాసేషు-అను లక్షణమును జూపఁబడియున్నదే, కాని వివరింపఁబడియుండలేదు. లోపద్విత్వములను వివరించినస్థానమున నసామాసికద్రుతలోపవిధానమునకుఁ బ్రసక్తియే లేదు గదా. అప్పకవి దీని నేల వివరింపలేదు?

ఇదియే యిట్లుండఁగా ప్రథమలు గపి ద్విమలోన్వః 'ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు' - అని ద్రుతస్య మున్నసులక్షణము

స్థలాంతరమున నప్పకవీయచింతామణి యందుఁ గాననవచ్చుచున్నది. అట నప్పకవీయవివరణముపై తము 5-104 నుండి 107 పద్యములలోఁ గన్పించుచున్నది.

కాఁగా నీచింతామణియందు ప్రమతస్య సర్వత్ర లుక్సమాసేషు అనుశ్లోకభాగము పునరుక్తమైనదన్నమాట. అట్టిపునరుక్తి (ఇంక నెచ్చట నిటుఁ గానరాకుండుట యట్లుంచి) ప్రస్తుతస్థలమున ననఁగా సర్వత్ర మున్నగుపూర్వార్థ మప్పకవీయమున లేదేమో యని యనుమానించుస్థలముననే యుండుటయు నింకను ననుమానమును బెంచుచున్నది. పైఁగాఁ బునరుక్త మగుచో స్థలాంతరమున దీనికి వివరణ మున్నది. కానీ ప్రస్తుతస్థలమున ప్రమతస్య మున్నగు భాగమునకు వివరణము చేయఁబడలేదు. అనఁగా నీవివరణసందర్భము ననుసరించి ప్రమతస్య సర్వత్ర లుక్సమాసేషు - అనుభాగము నయితము లేదని చెప్పఁదలఁచినను వైరుధ్య మేర్పడునవకాశమే లేదన్నమాట-కాఁగా నింక వివరణ మున్న లుక్సంశ్లేషానాచి (ప్రమతస్య) అనుభాగము. నిజమునకు సర్వత్రేసూత్రవివరణము మొదలుకొని లుక్సంశ్లేషానాచి సూత్రమునకును గల యప్పకవీయవివరణమును దొలఁగించిన 5-39 పద్యమునకుఁ దరువాత 47వ పద్యమున్న సందర్భము సముచితముగా నతికిపోవుచున్నది - కాని 44-45-46 పద్యములును లేవనఁదగునా? అట సంశ్లేషమునకు ద్విత్వముగా నర్థము చేయుట యనువిశేషము దప్ప నయ్యది సూత్రమునకు వివరణమే. అదియు నెవ్వరేఁ గలిపిరా? లేక లుక్సంశ్లేషాదు లున్నగురీతి సూత్రము లేకయే యప్పకవి చెప్పియుండెనా? - అట్టియవకాశము లేకపోలేదు.

మొత్తముపై సర్వత్ర మున్నగుసూత్ర మప్పకవీయమున లేదని యుహాపోబలుఁడు చెప్పఁగా నద్దానియుత్తరార్థమునందలి ప్రమతస్య సర్వత్ర లుక్సమాసేషు - అనుభాగమునకు వివరణమే చేయఁబడ

## అనుబంధము - 2.

# ద్రుతపూర్వస్వరసంధి

ఆంధ్రభాషయందలిపదములు ద్రుతప్రకృతికములు - కళ లని ద్వివిధములుగాఁ జెప్పఁబడుట స్పష్టము. చింతామణియందు సంధి ర్నాచోఽచ్యనుత యనుసూత్ర మచ్చున కచ్చుపర మగునపుడు సంధిని గూర్చి ప్రస్తావించుచున్నది. అట్టిసంధిస్వరూపమును పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవే త్తను వి. వి వచనము పూర్వస్వరము పోయి పరస్వరము నిల్చుటగాఁ జెప్పుచున్నది. ఇట్టిస్వరసంధిసందర్భమునఁ బరస్వరమునకు ముందు కళయే యున్నయెడల నచ్చున కచ్చు పర మగుట స్పష్టముగా సంభవించును. (రాముఁడు+అతఁడు)

ఇంక ద్రుతప్రకృతికములసందర్భమున మొదటిపదముతుదిని ద్రుత ముండును. ద్రుతమును ను (న) స్వరూపము గల్గినదిగా భావించి నప్పుడును స్వరపరకస్థితిలో నయ్యది పొల్లుగానే యుండుటను గుర్తింప వలసియున్నది. నన్నన్+అడిగె, చూడన్+అయితి ననురీతిగా సూరి చూపుట గమనార్హము. ద్రు. ప్ర. ల యెడ స్వరసంధిసందర్భము ద్రుతపూర్వస్వరమునకె యనుట స్పష్టము. (ఇయ్యది చిం., వి. వి. ల మతమునను గుర్తింపఁదగియున్నది) అట్టియెడల రామున్+అభిరామున్ అనురీతిగా ద్రు. ప్ర. ల కచ్చు పరమైనస్థితిలోఁ బరస్వరము పూర్వ మున్న ద్రు. ప్ర. తుదినకారమునకు ననఁగా పొల్లునకే పర మవుచున్నది. కాఁగాఁ గళలవలెఁ గాక ద్రు. ప్ర. ల స్వరసంధిలో పూర్వస్వరమునకును బరస్వరమునకును నకారపుఁబొల్లుతో వ్యవధానము గల్గుచున్నది. (అచ్చునకే యచ్చు పర మగుట సరాసరిగా సంభవింపదు.)

పూర్వాపరస్వరములకు ద్రుతముతో వ్యవధానము గలుగుటం జేసి సంధి యెట్లు? సంధి యగుట యిష్టమె యైన నా ద్రుతము ప్రతిబంధకము గా దనుకొనవచ్చును. ఇష్టము కానియెడల ద్రుతము స్వరసంధికిఁ బ్రతిబంధకము గా దనుకొనవలె. కొన్ని యెడల నట్లును గొన్ని యెడల నిట్లును నిర్ణయింపరాదు. ఇట్టియెడల ద్రుతము స్వరసంధికిఁ బ్రతిబంధక మగునా? కాదా? అనఁగా ద్రుతపూర్వస్వరములకు సంధి యవుట యిష్టమా? అనిష్టమా? అన్న యంశము పరిశీలింపవలసియున్నది.

వఝ్ఝలవారు ద్రుతము సంధిప్రతిబంధకము కా దని నన్నయాధర్వణులమతము గా భావించిరి. అనఁగాఁ జింతామణియందు స్వరసంధిని జెప్పుచున్న 'సంధిర్నాచోఽచ్యనుతః' మున్నగులక్షణము లెల్ల ద్రుతపూర్వస్వరములకు సంధిని జెప్పునవనియే యభిప్రాయము. ఇట్టి భావమునకుఁ గారణము నస్యాత్తద్ధర్మోత యనుసూత్రమే యనవచ్చును. నిషేధము ప్రాప్తిపూర్వకము గావలెను గాన 'వచ్చున్+అతఁ' డని యుండ 'నస్యాత్తద్ధర్మోత'యని సంధిని నిషేధించుచుండె ననఁగా నచ్చట సంధి ప్రాప్తించుచున్న దన్నమాటయే. ఉత్వమునకు సంధిని జెప్పుచున్న-చింతామణియందలి - సంధిర్నాచోఽచ్యనుతః అనాదిషు విభక్తిషూతో నా, చో ర్వా స్యాత్తనులక్షణములు మూఁడింట అనాదిషు, చోర్వా యన్నవి ప్రవర్తింపనేరవు. కావున సంధిర్నాచోఽచ్యనుత యనుసూత్రముచేతనే సంధి రావలయును. వచ్చున్+అతఁ డని యుండ 'సంధిర్న' యనుసూత్రముచే సంధి వచ్చు నన్న నాలక్షణము ద్రుతపూర్వస్వరమునకు సంధిని జెప్పుచున్న దని యర్థము. ఇట నిట్లంగీకరింపఁగనే నాఽఽతః మున్నగులక్షణములును ద్రుతపూర్వస్వరములకు సంధిని జెప్పునవిగా నంగీకరింపఁబడిన ట్లయినది. ఇట్లు ద్రుతపూర్వస్వరసంధి చిం. సమ్మత మని నిర్ణయించుటకు నస్యాత్తద్ధర్మోత యనుసూత్రమే యాధార మనవచ్చును.

'లు క్స్వం శ్లేషో నాచి' యనుసూత్రమునకు నహోబలునివలెనే వజ్ఝలవారు నర్థము చేసి వచ్చెన్ అతఁ డని యుండఁగా వచ్చె నతఁ డని యగు ననిరి. అసలు ద్రుత మెప్పుడు లోపించును? చిం. మతము ననుసరించి సంధివిధాన మున్నపుడే యని 'యచాం సంధౌ' యను వి. వి. వచనముచే గ్రహింపవచ్చును. వచ్చెన్+అతఁ డనుచో ద్రుత పూర్వస్వరము 'ఎ' కారము గదా. ఎకారమునకుఁ బదాదిస్వరపర కత్వమునఁ సంధి చెప్పలేదు గావున 'సంధి ర్నాచోఽచ్యనుతే' యను సూత్రముచే సంధి నిషేధింపఁబడుచున్నది. కాఁగా సంధి రాదు. సంధి రానపుడు ద్రుతము లోపింపవలసినప్రసక్తియే లేదు. కాఁగా వచ్చెన్+అతఁ డని యుండఁ సంధి నిషేధింపఁబడినది గావున ద్రుతము లోపము గల్గనేరదు. కావున మఱల 'లు క్స్వం శ్లేషో నాచి' యను సూత్రముచేఁ బ్రత్యేకముగా నిషేధింపవలసినయక్కర యేమి? మొత్తముమీఁద నెక్కడ సంధి ప్రాప్తి లేదో యక్కడ లు క్స్వం శ్లేషో నాచి యనుసూత్రమునవసరము లేదు. (ఆవశ్యకము కాదు కాని పర్జన్యవ ల్లక్షణప్రవృత్తిః కదా ప్రవర్తించు.) కాఁగా (ఇఁకాదులకుఁ దప్ప) ద్రుతప్రకృతికములకు సంధి లేదు అన్నవిషయమునే సాధింపవలయు నన్న అనఁగా నీసూత్రము ద్రుతపూర్వస్వరమునకు సంధి నిషేధించునదే కావలయు నన్న నెచ్చట సంధి ప్రాప్తించుచున్నదో యచ్చట సంధి నిషేధించునది గావలయును. అహోబలుఁ డీటఁ గొలుతు వచ్చ్యతున్ అని యిచ్చు టంతయు సముచితముగా నున్నది. అత్తు - ఇత్తు - ఉత్తు అనువానికే పదాదిస్వరపరకత్వమున సంధి చెప్పఁబడి యుండుటచే నచ్చట మాత్రమె 'లు క్స్వం శ్లేషో నాచి' అను సూత్ర మవసరము గాఁగలదు. వజ్ఝలవారిట్లు చెప్పనుండుటకుఁ గారణము లేకపోలేదు.

సంధి ర్నాచోఽచ్యనుతే - మున్నగుసూత్రములచే నన్ని ద్రుత పూర్వస్వరసంధి 'లు క్స్వం శ్లేషో నాచి' - అనునీసూత్రమే నిషేధించు

చున్న దన్నచోఁ జిం. లో - వచ్చున్+అతఁ డనుచో 'నసుత' యను సూత్రముచే సంధినిషేధము ప్రాప్తమగుచున్నది. కావున న స్యాత్తద్ధర్మోక్త యను సూత్రముచేఁ బ్రత్యేకముగా సంధి నిషేధింపవలసిన యవసరము లేదు. అట్లైన నాసూత్రమునకు నిషేధపర మైనవారివివరణము పూర్తిగా వ్యర్థ మై పోవలసివచ్చును. అందులకే 'లుక్సంశ్లేషౌ నాచి' అనుసూత్రమువద్ద వచ్చున్ - అతఁ డని యీయక వారు వచ్చెన్+అతఁ డని యిచ్చిరి. కావున 'లు క్సంశ్లేషౌ నాచి' యను సూత్రము ద్రుతపూర్వస్వరమునకు సంధి నిషేధించునదే యైనయెడల నస్యాత్సూత్ర మనర్థక మె యగును.

లు క్సంశ్లేషౌ నాచి యనుసూత్రము ద్రుతపూర్వస్వరసంధిని నిషేధించున దని చెప్పుచో నస్యాత్తద్ధర్మోక్త యనుసూత్రము వ్యర్థమైపోవు ననియే యూహాబలుఁడును భావించెను గాఁబోలును. రామున్+అభిరామున్ అనుచో నట్టిసంధిని వారించుట యవసరమైనను 'లు క్సంశ్లేషౌ నాచి' యనునీసూత్రము నాశ్రయింప లేదు. రాములన్+అభిరాములన్ అనుచో సంధి స్తు ద్రుతపూర్వస్య ప్రాయశో న భవే దతః' - అనుకారికచే వారించుకొనెను. ఈ వి. వి. లక్షణము ద్రుతపూర్వక మైనయత్వమునకు మాత్రమే సంధి నిషేధించుచున్నది. లు క్సంశ్లేషౌ నాచి యనుసూత్రము ద్రుతపూర్వస్వరమునకు సాధారణముగా సంధిని నిషేధించునదే యని వి. వి. కర్తయుఁ దలఁచిన మాటల నిట్లు ద్రుతపూర్వక మైనయకారమున కేల సంధి నిషేధించెను. ఇఁకన్ (ఎప్పుడు) ము న్నగునొండు రెండుచోట్ల సంధి జరుగుటకా ? చిం. సంధిని నిత్యముగా నిషేధింపఁగా వి. వి. ప్రాయిక మని సవరించినదా ? కానీ యీ రెండుచోట్లసూత్ర మె ద్రుతపూర్వక మైనయకారమునకు సంధి యగుటను జెప్పవలసియున్నవు వదియు చెప్పక చిం. చెప్పినినిషేధమునే (ప్రాయికముగా) విధింప నేల ? ఇఁక ఇఁగ అను రెండుచోట్లను ద్రుతపూర్వక మైనయుత్వమునకు సంధి

వికల్పముగానే యగుచున్నది. అయ్యాది 'వాఽఽత' యనుసూత్రముచే రావలసినసంధిని సంధిస్తు అని ప్రాయికముగా నిషేధించె నని గ్రహింపఁ దగియున్నది. అటఁగా లుక్సంశ్లేషా యనుసూత్ర సిద్ధానిని వారించుట లే దనవలెను. వఝ్ఝలవారు గూడ సంధిస్తు అనుకారికనుగూర్చి 'అచాం సంధావిత్యాదిచోఽప్యనఁ శాక్తికసంధి గలుగకుండ ప్రాయిక సంధి నిషేధము' (వ్యా. స. క. 220) విధింపఁబడిన దనిరి. ఇట్టికారికలో సంధినిషేధమే విధేయాంశ మగుట స్పష్టము. ఇఁక వఝ్ఝలవారు లుక్సంశ్లేషా యనువానికిఁ దాము చేసినయర్థము నట స్మరించినట్లు లేదు. ఇట వీరు అచాం సంధావిత్యాదిచోఽప్యనఁ శాక్తికసంధి రావలయు ననుట యబద్ధము. సంధి యవునపుడు 'అచాం సంధౌ ద్రుతోఽస్పృశ్యః' యనుకారిక ద్రుతము లోపించు నని చెప్పుచున్నది. అంతే కాని యది యెట్టిసంధి నైనను విధించునది గాదు గదా. అట్టి యపుడు అచాం సంధౌ యనునది శాక్తికసంధిని విధించుచున్న దనుట యెట్లు సరిపడును? 'వాఽఽతి' యనుసూత్రముచేఁ శాక్తికసంధి రావలసియుండ నీసంధిస్తు - అనుకారిక సంధినిషేధమును ప్రాయికముగా విధించుచున్న దని వారియభిప్రాయ మనఁదగును. ఇట్లు ద్రుతపూర్వస్వరసంధి వఝ్ఝలవారిమతమునను (చిం. వి వ. మొ॥) సుస్థిర మైనది.

'సంధిర్నాచోఽప్యసుత' యనుసూత్రమునొద్ద విపుల మైన చర్చ చేసినయెడలో. ద్రుతపూర్వస్వరమునకు సంధి జరుగు నని సిద్ధాంతీకరించుట స్పష్టమే. కావుననే యాతనిమతమున 'వచ్చెన్ + అతఁ' డని యుండఁగా 'సంధిర్న' - యనుసూత్రముచే నెట్లు సంధి ప్రాప్తించినదో రామున్ + అభిరామున్ అనుచో నయిత నాసూత్రముచే సంధి రాకతప్ప దేమ. కనుకనే యహోబలుఁడు 'ద్వితీయాప్రతీతి' గలుగ దని సంధిని వారించెను. సంధిని వారించినపద్ధతి యసహజముగా నున్నను సంధిప్రాప్తిని చేర్కొనుట సక్రమముగా నున్నది. వఝ్ఝల

వారు సంధి రాకుంటకుఁ గారణము - 'అనాదిష్టు విభక్తి ష్వాతో వా' అనుసూత్రము విభక్తిగతోకారమునకు మాత్రమే సంధి చెప్పుటగాఁ బేర్కొనిరి. ప్రత్యయగత మైనయుకారమునకు సంధి విధించుటచేతఁ బ్రకృతిగత మైనయుకారమునకు సంధి రానేరదు. అహోబలుఁడును బ్రకృతిగతోకారమున కీసూత్రముచే సంధి యవు ననలే దని వీరే చిం. వి. వ. లో గుర్తించియున్నారు. అహో. 'అనాదిష్టు' సూత్రముచేఁ బ్రత్యయగతోకారమునకే సంధి యగు నని స్పష్టముగా 'ప్రత్యయగతోకారస్య' అని పేర్కొనినాఁడు. అట్టియెడల "అహోబలపతి యయిరీతిని (ప్రత్యయోకారమునకనుటచేఁ బ్రకృత్యుకారమునకు రా దని) వ్యాఖ్య చేయక" మొదలుగా వీరహోబలునివిమర్శించినతీరు సమంజసము గా దని నిర్ణయింపఁదగును. అహోబలపతియు నీసూత్రము విభక్తిగతోకారమునకె సంధి చెప్పునదిగా భావించుటచేతనె రామున్+అభిరామున్ అన్నపుడు అనాదిష్టు విభక్తి ష్వాతో వా యనుసూత్రము ప్రకారము కాక 'అనుత ఇతి ప్రాప్తౌ' అని సంధిర్నాచోఽచ్యనుత యనుసూత్రముచే సంధి ప్రాప్తించుచున్న దని పేర్కొనెను. అట్టియెడల వజ్ఝలవారహో. మతము విమర్శించుచో నహోబలుఁడేసూత్రముచే వచ్చు ననెనో యాసూత్రముచే రా దని చెప్పవలె. అతఁ డొకసూత్రముచేఁ బ్రాప్తిని బేర్కొనుచుండ వీ రిం కొక సూత్రముచే నట్లు వచ్చుట లే దనుటెట్లు? - కావున నీవిమర్శన ముచితము గాదు.

అహోబలునిమతమునను వజ్ఝలవారిమతమునను 'సంధిర్న' - మొదలగుసూత్రములు ద్రుతపూర్వస్వరమునకు సంధిని జెప్పునవి. నాకొఁ ఆకున్+ఇచ్చె రామున్+అభిరామున్ అనుస్థలములందు అనుత యనుసూత్రముచే సంధి రానలె. అట్టియవు డనాదిష్టుసూత్రము నాకొఁ ఆకున్+ఇచ్చె అనుచోట్ల సంధి వికల్ప మనుచున్నది. ప్రకృతిగత మైనయుకారమ సందర్భమున నీసూత్రము ప్రవర్తింపనేరదు. అట్టి

యప్పుడు సంధిర్వాచోఽచ్యనుత యను సూత్రముచే సంధి యవుట కవరోధ మేమి? అనాదిషు సూత్రముచే వైకల్పికసంధి లేదు కాని సంధిర్న అనుసూత్రముచే నిత్యసంధి కలుగవలె.

ఇంక వీరు 'న స్యాత్తద్ధర్మోతి' యను సూత్రమునొద్ద' వచ్చున్+అతఁ డని యుండఁగా సంధి ర్వాచోఽచ్యనుత యనుసూత్రముచే నిత్యసంధి రావలసియుండఁగా 'నస్యా' త్తని నిషేధించె ననిరి. వచ్చున్+అతఁ డని యుండఁగా వచ్చెడునిత్యసంధి రామున్+అభిరామున్ అనుచో వచ్చుట కడ్డ మేమి?

చో ర్వా స్యా త్తనుసూత్రముగూడ ధాతువున కయిన 'వర్తమానార్థకచువర్ణకో' కారమునకే సంధి చెప్పుచున్నది. కాఁగా నితరమైనధాతువునకు విధింపఁబడినదానియుండలియుకారమునకును (ద్రుతపూర్వమున కనఁదగు) సంధి రా వీలు లేదు. అట్టియెడు వచ్చున్+అతఁ డన్నపుడు ధాతువుసంబంధ గఁబడుచున్న యుకారము వర్తమానార్థకచువర్ణకసంబంధి గాదు గదా. కావున వచ్చుటియుకారమునకు సంధి రానేరదు. అట్టియవుడు నస్యాత్తద్ధర్మోతిః అన నేల? నస్యాత్తనుదానికి నిషేధపరమైనయర్థము చెప్పకొనినచోఁ బైచోట్ల సంధి యెట్లు వారించుకొనవచ్చునని వీ రెట్లు ప్రశ్నింపఁగలిగిరో బోధపడదు. వచ్చున్+అతఁ డని యుండఁగా - చో ర్వా స్యా త్తనునది ప్రవర్తింపమి సంధిర్న - యనుసూత్రముచే నెట్లు సంధి ప్రాప్తించుచున్నదో, అట్లె రామున్ అభిరామున్ అన్నపుడును 'అనాదిషు' సూత్రము ప్రవర్తింపనపుడు సంధిర్న - యని సంధి యేల ప్రాప్తింపదు? ప్రాప్తించు నని యహోబలుఁ డనుట తప్పెట్లగును? సముచితము.

ఇంకను వజ్ఝలవారిమతమున 'అనాదిషు' సూత్రముచేతనే యిచ్చట వైకల్పికసంధి రావలసియుండుట గమనింపవలసియున్నది.

ఎట్లో చూతము. ప్రాతిపదికకు శస్సు పర మగునపుడు 'స్నమ్మా ప్రాస్వ శ్చాదే రమి శసి చ' అని 'మ్ము' ఆగమ మై ముందు ప్రాస్వ మై 'తయో ర్బహుత్వే మః' అని మకార మై మమ్ము+శస్ అని యైనది. ఇట భూయ ఉభయార్థ వాచీ - శసోఽః అని ప్రత్యేకముగా మనశబ్దముపై ని శస్సునకు లవర్ణము విధించుటవలన ను మ్మనుశబ్దముపై శస్సునకు లవర్ణకము రానేరదు గావున నపదాన్త్యస్య యేత్యాది సూత్రముచే లోపించును. పిదప నన్త్య ద్రుత ప్రకృతయు యని ద్రుత మై మమ్మున్ అని యవు. 'ఇ శ్లేర్ప్రడుటచేతనే మమ్ములోని 'మ్ము' అనుదానియందియు కారము ప్రత్యయసంబంధిగా గణింపబడును. (వ్యా. సం. స. 217) అనిరి వీరు. ఇటను 'శస్' లోపించుటచే దాని ప్రత్యయధర్మము ముందున్న మ్మువర్ణముపైఁ బడిన దేమో. కావున 'మమ్మున్+ఏలె' నని యుండ మమ్ము అనుదానిలోనియుకారము ప్రత్యయోకార మైపోయి అనాదిషుసూత్రముచే సంధి జరిగి మమ్మేలె మమ్ము నేలె నని యగు ననిరి. నన్నేలె ననుదానిని ద్రుత ద్విత్వముగా సమర్థింప వారి కవకాశము కల్గినది. కావున నట్టిసమన్వయమునకు నవకాశము గానరాని 'మమ్మేలె' ననుదానికయి యిట్టి విశేషసమన్వయమార్గము నాశ్రయించి రనవచ్చును అవుఁగాక.

అదియే నిజమైన నిటమాత్రిను శ్లేల సంధి రాదు? రాము+ అమ్ అని యుండఁగా నిరమో మహాతా మ్మని నివర్ణక మై రాముని అని యై అన్త్య ద్రుతప్రకృతయ యని ద్రుత మై రామునిన్ అనియవు. ఇవుడు 'లుక్ప స్యాత్రసి' అమ్‌స్థానికనివర్ణము లోపించి (అమ్మే లోపించి) రామున్ అని యవును. ఇందాఁక శస్సు లోపింపఁగా (దాని ప్రత్యయధర్మము ముందున్న మ్మువర్ణము పైఁబడి) మ్మువర్ణమును కారము ప్రత్యయసంబంధిగాఁ బరిగణింపఁబడి యెట్లు సంధి జరిగినదో యదే విధముగా నిచ్చట 'ని' (అమ్) అనువర్ణకము లోపించుటచే (దాని ప్రత్యయధర్మము ముందున్నమువర్ణముపైఁ బడి) మువర్ణము

నుకారము ప్రత్యయసంబంధిగాఁ బరిగణింపఁబడును గదా. అపుడు మమ్ములోవలె 'రాము' లోనిమువర్ణోకారము ప్రత్యయగతమే యగుటచే ననాదిషుసూత్రముచే సంధి యై (మ మ్మేలె, మమ్ము నేలె నని యైనట్లే) రా మభిరాముఁన్, రాము నభిరామున్ అని యగుట వజ్ఝలవారిమతమున సిద్ధించుచునే యున్నది గదా. అట్టియపుడు మమ్ములోనియుకారమునకు సంధి యగుటకుఁ జూపినకారణము రా మభిరామున్ అనుసంధిరూపనిషేధమునకు నుపయుక్త మగునా? కాఁగా ననాదిషుసూత్రము ప్రత్యయోకారమునకు సంధి చెప్పిన దగుటచేత 'రామున్' అనుచోఁ బ్రకృత్యుకారము గాన సంధి లే దనురీతిసమన్వయము సక్రమము గా దనవలయునే గద. అహోబలుని సమన్వయమునే యాశ్రయించినను నాతనిమార్గమునకు విరుద్ధ మగు ఫలితము వజ్ఝలవారిమతమున నేర్పడుచుండఁగా నహోబలుని విమర్శించుట సమంజసముగా లేదు.

'ప్రత్యయస్థోకారములకే వైకల్పికసంధి వచ్చు ననియుఁ దక్కిన యుకారమునకు సంధి రానేర దనియు 'అనాదిషు విభక్తి ష్వాత్తో వా' అనునీసూత్రమునకు 'వ్యవస్థావాచి యగువాశబ్దముచే నర్థము చేయుట సన్నయభట్టారకహృదయము' (చిం. వి. వ. 139) అని వజ్ఝలవారు ప్రకృత్యుకారమునకు సంధి రాకపోవుటను 'వా' శబ్దమునకు వ్యవస్థచేసి సంపాదించిరి. ఇది యెట్లు? 'విభక్తిష్వాతః' అని యీసూత్రము విభక్తిగత మైనయుకారమునకే గదా సంధిని జెప్పుచున్నది. అట్టియెడల ఇట్లుకారసంధి పాక్షికతావిధానముచే నెతత్సూత్రములకు (అనాదిషు, చోర్వా) విషయము గానియుకారమునకు 'అనుతః' అనుసూత్రమున నిత్యసంధి యుద్దేశింపఁబడె ననుట స్పష్టము. (వ్యా. సం. స. 209) అనుమాటనుబట్టి సంధిర్నాచోఽచ్యనుత యని రావలసినసంధి నీవాశబ్దము నిషేధించు నని యభిప్రాయమా? ప్రకృ

త్యుకారమునకు ననాదిషుసూత్రముచే సంధి ప్రాప్తింపకయే పోవుచుండ నందలివాక్యమున కిట సంధిరాదని వ్యవస్థ చేయు టెట్లు? ప్రాప్తి యున్నచోటఁ గదా వచ్చునని కాని, రాదని కాని నియమించుకొనుట. అట్లు ప్రాప్తి లేనియున్నస్థలములందు నిత్యార్థము రాదని నియమించుచుచో నిచ్చోటఁ దప్ప ద్రుతపూర్వోకారమున కెచ్చటను సంధిరాదనియే నియమించుకొన్నట్లగు. ప్రకృత్యుకారమె యన నేల? అట్టియెడలఁ బ్రత్యేకముగాఁ జెప్పినఅనాదిషు, చోర్వా యనువానిస్థలములఁ దప్ప ద్రుతపూర్వోకారమునకు సంధి యుండదు. వచ్చున్ అతఁ డనుచోటఁ గూడ సంధి యుండదు. న స్యాత్తని సంధినిషేధము వ్యర్థమే కదా.

అప్పకవి ద్రుతప్రకృతికములయెడ స్వరసంధి యనఁగా ద్రుతపూర్వస్వరమునకె యని భావించెను. అందుకే యాతఁడు ద్రుతప్రకృతికముల కట్టియెడ ద్రుత ముండమిని విధించుకొనెను. న స్యాత్తద్ధ్రోత యనుసూత్రమునకు నప్పకవి చేసిన - ప్రథమోత్తమాఖ్య పురుషైకవచఃపదములు ద్రుతప్రకృతులగు ననువివరణమే విపులమై 'ప్రథమ శ్చోత్తమ శ్చైవ తాసు తద్ధర్మసంజ్ఞికౌ భూతాద్యవిషయా తత్ర చైకత్వార్థాభిధాయకౌ, ఉదన్తౌ చ సదా నాన్తౌ న సంధి స్తత్ర కల్ప్యతే' యనుకారికగాఁ బరిణమించిన దనవచ్చు. ఇట నుత్తమపురుషైకవచనము వజ్ఝలవారిమతమున 'వచ్చుదునున్' అనునదె యైన నప్పకవ్యహోబలులమతమున 'వచ్చుదును' అనియే యుండును. వచ్చుదును+అనెను అని యుండిన వచ్చుద ననె నని కావలెను గాఁబట్టి యహో. సంధి యువు ననవలె. నాంతము లనఁగా ద్రుతప్రకృతికములు. ఇది ద్రుతప్రకృతికము గావలె. అనఁగా నువర్ణమున స్వరము లోపించి వచ్చునన్ అని యుండఁగా నాంత మగునిందలియుకారము వచ్చుదు అనుచోటిదువర్ణమునందలిది. అందే సంధి నిషిద్ధ మన్నమాట. (సస్వర మహోబలమతమునఁ గళయే యన్న వజ్ఝలవారిమతమునఁ

దానునేనులవలె నిట వచ్చుదును కళ యని యహోబలుఁ డెంచె ననవలె ?) 'తద్ధర్మోతః' అన్నసూత్రమున ద్రుతాంతము గావలె నన్న యంశము లేదు. సంధినిషేధము ద్రుతపూర్వోకారమునకే యహోబలుఁడు చేసె. అనఁగా నీతఁడును ద్రు. ప్ర. ల యెడ స్వరసంధిని ద్రుతపూర్వస్వరమునకే యని యెంచె ననుట కిది యాధారము కాఁగలదు. ఇట్లే నిత్య మనుత్తమపురుషక్రియాస్థితి యనుచోఁ బర్యుదాసము చేయఁబడిన యుత్తమపురుషక్రియల నీతఁడు కిమాదులలోఁ జేర్చెను. 'ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవేచ్చ్యుతి' యను వి. వి. వచనమును నుత్తమపురుషక్రియేకారమునకు సంధి వికల్ప మనుచున్నది. కూర్చుండిరి యొండొరు - ననుదానివలెన యప్పకవి యంగీకరింపని 'బ్రదికితిసన్' అను సంధిని నయిత మంగీకరించుట యహో. మతము. అట సంధి యైనరూపమును (కొలిచితిని అబ్ధిజను అనుదాని ననుసరించి) కొలిచితి నబ్ధిజను అనురీతిగాఁ గాక (కొలిచితి (న్) అబ్ధిజను అనుదానిఁబట్టియో ?) కొలిచి తబ్ధిజను అని చూపెను. అనఁగా నిట సంధి యగుట ద్రుతపూర్వక మైనయికారమునకె వజ్ఝలవారిమతమున కొలిచితిఁన్ అనునదే యిట నన్నయాధర్వణసమ్మత మైనరూప మైనను నప్పకవ్యహోబలులు (బా. స. కూడ) కొలిచితిని అనియే భావించుట స్పష్టము. కూర్చుండిరి+ఒండొరున్ - కూర్చుండి రొండొరు, కూర్చుండిరి యొండొరు అనురీతిగా నిత్యమును బొందిన సువర్ణకముగండలియిత్తునకే సంధి చూపవలెఁ గదా. సంధి యైనఁ గొలిచితి నబ్ధిజను అనియు సంధి రాకున్న యశ్రుతితోఁ గొలిచితిని యబ్ధిజను అనియుఁ గావలెఁ గదా. అట్లు గాక ద్రుతపూర్వస్వరమునకే సంధి చేయుటనుబట్టి ద్రు. ప్ర. ల యెడ స్వరసంధి యను ద్రుతపూర్వస్వరమునకే యని యహోబలపతిమతము స్పష్టము. ఇంతియు నేల యని కాఁబోలు నప్పకవి వికల్పముగా ద్రుతప్రకృతు లగు ననురీతిగా సంధిసందర్భమున ద్రుతము లేకుండుటను బేర్కొని తత్పూర్వస్వరమునకే సంధిని సమన్వయించెను.

ఇట్టియెడల మొదటిపదము నెట్లు చూపవలెను? వచ్చుదును అని సస్వరముగనా లేక వచ్చుదున్ అనురీతి స్వరలోపముతోనా?

వజ్ఝలవారు 'వచ్చుదునునన్' అనుచో ద్రుతలోపమును నాపిదపఁ గవిభల్లటసూత్రముచేతనే యుత్వలోపము చేసి వచ్చుదున్ అని చూపుదురు. అహోబలుఁడు నిట్లె స్వరలోపముతోఁ జూపనెంచెనా? అది యట్లైనఁ 'గొలిచితిని' అనుచో నిత్వలోప మెట్లు? ఇట నహోబలపతి నివర్ణము ముందటితివర్ణమునందలియిత్తునకుఁ గదా సంధి చేసినాఁడు. ఇట వజ్ఝలవారొకమార్గము నుపదేశించిరి. చేసితిని మన్నగు వానిలోని 'ని' యనునది నుస్థానికమే యగుటచే నీసూత్రము (కవిభల్లటైః) చే చేసితిన్ మన్నగురూపములు సిద్ధించు నని యెన్న నగును. (వ్యా. సం. స. 789) నుస్థానికమే యవుటచే నువర్ణమునఁ గల్గుస్వర (ఉత్వ) లోపకార్యము 'ని' అనుదానియం దిత్వమునకు నవు నని వారి సిద్ధాంతము - ఇది సమంజసము కాదు.

నివర్ణము నుస్థానికము గావున నువర్ణమున కగుస్వరలోపము నివర్ణమునం దగు నని చింతామణివ్యాఖ్యయమె యైనచో 'నిత్య మనుత్తమపురుషక్రియాస్వితః' యనుదానియారంభ మట్లుండ దన వచ్చును. నిత్యమిత్యాదిసూత్రము చూచిరి చూచితివి చూచితిరి' - అనురీతివానియందలియికారమునకు సంధిని జెప్పుచున్నది. ఇచ్చోటి 'తివి' అనునవి రెండును రువుస్థానికములే యగుట భూతాదుత్తాం పరేషా మిత్తనుదాని ననుసరించి స్పష్టము. నువర్ణములోనియుకారమున కెట్లయినదో యట్లె యిటఁ గూడఁ జూచుదురు చూచుమవు అనురీతిస్థలములయందలిరువులలోనియుత్వము నకు 'సంధిర్నాచోఽచ్యనత' యనుసూత్రముచే విధింపఁబడినసంధికార్యమును రువుస్థానికములే యైన 'తివి' యనువానియందలియికారమునకును వచ్చునే కద. మఱలఁ బ్రత్యేకముగాఁ జెప్ప నేల? చూచితి(వి) అనురీతిరూపములను జింతామణి స్పష్టము చేసియు నుండకుంట గమనింపఁదగును.

అయిన నీనిత్యమిత్యాదిలక్షణారంభము ప్రయోజన మేమి? ఉత్తమపురుషక్రియాపదములందు నిచ్చటియికార ముకారస్థానికమే కావునఁ బ్రథమమధ్యమపురుషక్రియలయందువలెనే యుత్తమపురుష క్రియలయికారమునకును నిత్యసంధియే రావలసియుండఁగాఁ దన్నివార ణార్థము అనుత్తము - అని చెప్పఁబడిన దనఁదగునా? అట్టియెడల సిద్ధించుచున్న నిత్యసంధినే చెప్పుటకంటె నుత్తమపురుషక్రియేకార మునకుఁ బ్రాప్తించుచున్న నిత్యసంధి యిష్టము కాక వైకల్పికసంధి యిష్ట మగుటంజేసి యాయుత్తమపురుషక్రియేకారములవైకల్పిక సంధియే విధింప నగును గదా. వజ్ఝలవారియభిప్రాయమె చింతా మణికర్తకు నున్న నట్లె విధించియుండెడివాఁ డనుటలో దోసఁగు లేదు. అన లింతకును నుత్తమపురుషక్రియేకారమునకుఁ గావలసిన వైకల్పికసంధియే యుద్దిష్ట మున్న నాయంశము నీ 'యనుత్తమ' సూత్రము సాధింపఁగలదా? అనుత్తమశబ్దముచే నిట దానికి వికల్పత సాధింపఁబడియున్న నీ యుత్తమపురుషక్రియలను గిమాదులలోఁ జేర్ప వలసినయవసర మేమి? దాని కిష్టమైనవైకల్పికసంధినిబట్టి నిత్య మిత్యాదిసూత్రము లేకున్నను నాయుత్తమపురుషక్రియేకారమునసంధి వికల్పముగా సిద్ధించుట కిమాదిగణగణనమునంజేసియే కాని నిత్య మిత్యాదిసూత్రముచేఁ గా దని స్పష్టము గదా. ఇంకను వజ్ఝలవా రిట్టిసమన్వయమునే బాల. లోను జూపిరి. అది యింకను నసమంజసము. (చూ. బా. సూ.)

కాఁగా రువృస్థానికములే యైన 'రివి' వర్ణములందలియిత్తునకు సంధి యపుటకై ప్రత్యేకశాస్త్ర మారబ్ధమనఁగా నుస్థానికమే యైనను నివర్ణములందలియిత్తు లోపించుటకును బ్రత్యేకశాస్త్ర ముండవలె.

అహోబలుఁడు కొలిచి తద్భిదను అనురీతిగాఁ జూపెనె కాని దానిని విభాగించి చూపలేదు. కొలిచితిని+అద్భిద అనియే యుండ

వలెనో కొలిచితిన్ అనియే యుండవలెనో స్పష్టము గాదు. తాను నేనులకు ద్రుతకార్యములు చెప్పఁబడుటఁ జేసి యందుత్వలోపము నకై ద్రుతత్వసాధనము నకు యత్నించెను. ఇట స్వరలోపమునుగూర్చి ప్రస్తావింపనే లేదు. అన్యే ద్రుతప్రకృతయ యని తిఙ్మధ్యాదీతరము లగునీయవి ద్రుతప్రకృతికము లవుటచే సహజముగనే స్వరము లోపించు నని యెంచె నేమో. ఏల యన నీలేఁదు ద్రుతాద్ద్రుత యను స్థలమునఁ దప్ప నెచ్చటను ద్రుతమును స్వరసహితముగాఁ జూపుట కానరాదు. కొలిచితిని+అబ్ధిజను అనుచో నివర్ణమే ద్రుత మన్న అచాం సంధౌ యని 'ని' ద్రుతము లోపించి కొలిచి తబ్ధిజను అని కాఁ గలదు. కాని సంధ్యభావమున ద్రుతము లోపింపదు గావున యాశ్రుతితోఁ గొలిచితిని యబ్ధిజను అని కావలయును గదా. కొలిచితి నబ్ధిజ నని చూపియున్నాఁడు మఱి. వికల్పమున ద్రుతప్రకృతులగు నను రీతిగాఁ జెప్పినయప్పకవి సంధిసందర్భమున ద్రుతప్రకృతికశబ్దముల చివర ద్రుత ముండకపోవుటను జెప్పె. ద్రుతమును సస్వరముగానే చూపినయప్పకవియు బ్రతికితి నఁగన్ అనురీతి నవుట యెట్లో చెప్ప లేదు. స్వరము లోపించు నని కాని లోపింపనిచో నందలిస్వర మే మగునో యది కాని చెప్ప లేదు. సంధి లేమి నవు డా ద్రుతము సస్వర మైనను (గాకున్నను) మీఁదియచ్చుతోఁ గలిసిపోవు నని భావించి యుందురు.

అహో. న స్యా త్తద్ధర్మోత యనుసూత్రమునొద్ద వెలయు నతని కీర్తి యని యిచ్చి యట్టివానినే స్పష్టము చేయున దన్నట్లు 'లు క్సంశ్లేషా నాచి' యనుసూత్రమునొద్ద 'కొలుతు నచ్యుతున్' అనురూపము నుదాహరించియున్నాఁడు. ఇట్లే స్థలాంతరమున 'వ్రూజలఁ దన్వాడు నల్గ నోడుదున్ 'ఇత్యాద్యాచార్యప్రయోగాణా మంతే నువర్ణక స్యోల్లోపో జ్ఞేయః' అనెను. ఓడుదున్ అనుచో నవసానమున నుత్వలోప మైనది. అదియే యుద్దేశించెనా? లేక తన్వాదు నల్గ - అనుచో నచ్ఛరకస్థితినే

యుద్దేశించినా ? చేసితిని అనురీతినివర్ణకస్థలమునం దిట్టిప్రస్తావనము చేయలేను. అట్టియెడఁ దన్ప్రదును అల్ల, లేక తన్ప్రదున్+అల్ల అనియా యెట్లుద్దేశించెను. అస్పష్టము. ద్రుతభావన యున్నను స్వర లోపస్థితి వర్ణింపవలెఁ గదా.

ఇం తేల ? సంధి ర్న అనుసూత్రము ద్రుతపూర్వోకారవ్యతి రిక్తవిషయము గా దని రామున్+అభిరామున్ అనుచో స ధిని శంకించుటలో మొట్టమొదటనే స్వరసంధి ద్రు. ప్ర. ల యెడ ద్రుతపూర్వ స్వరమునకె యనుట యహో. చే నిర్ధారింపఁబడినదే కద. కాఁగా నట్టిచో సంధిని నివారించుటకు వజ్ఝలవారు చేసిన సమన్వయము సరి కా దని స్పష్టము. అహోబలునిసమన్వయమును సరి గా దని గుర్తించుటకు మున్న చింతామణియందలి ద్రుతపూర్వస్వరసంధిప్రాప్తినిగూర్చి చూతము.

సంధి ర్నాచో ఽచ్యుతత యనుసూత్రము 'ఉద్భిన్నాచ్ఛ్వసకు' సంధి లే దని చెప్పుచున్నది. అయినను వాఽతః అనునవి యత్తునకు తద్వ త్తదాదిజస్య, ప్రాయ స్తు స్యా త్క్వమాదిక స్యేతః. అపిశబ్దార్థ స్యేత యనునవి యిత్తునకును సంధిని చెప్పుచున్నవి. కాఁగా నుత్తున కత్తునకు నిత్తునకుఁ దప్ప నితర మైనయచ్చులకు 'సంధిర్న' యని సంధి నిషేధము సిద్ధ మైనది కావున నట్టిస్వరమునకు(ద్రుతపూర్వమునకును) సంధికిఁ బ్రాప్తియే లేదు. కాఁగా వచ్చ నతఁడు మున్నగువాని యెడల ద్రుతపూర్వస్వరమునకును సంధినిషేధము చేయవలసినయవ సరము లేదు. కావున నదిదుత్తులకుమాత్రమే యట్టియెడల సంధి నిషేధ మవసరము.

'సంధి స్తు ద్రుతపూర్వస్య ప్రాయశో న భవే దతః' అను వి. వి. వచనము ద్రుతపూర్వక మగునకారమునకు సంధిని నిషేధించు చున్నది. 'పరిమితౌ సమస్తానా' మన్నపుడు పరిమితే సమస్తానా మ్మను

నది తత్కర్తృహృదయ మని వజ్ఝలవా రన్నట్లుగా న భవేద తః అనునీస్థలమునను 'సంధి స్తు ద్రుతపూర్వస్య ప్రాయశో న భవే దచః' అనునది తత్కర్తృహృదయ మని సహృదయులు భావింపనగు నని మన మనవిము. 'న భవే దచః' అని యున్న నహోబలుఁడు 'రామున్+అభిరామున్' అనుచో ద్రుతపూర్వోకారమునకుఁ గూడ నీకారికచేతనే సంధ్యభావమును సాధించికొనియే యుండువాఁడు గదా పరిమితౌ అనుదానికిఁ 'బరిమాణార్థకేవర్ణకే' యని వివరించినట్లుగనే యహోబలుఁ డీకారికయొద్దను 'న భవే దతః' అనుదానితో 'ద్రుతపూర్వాకారస్య' అనియే యర్థము చేసినాఁడు. అహోబలపత్యాదుల మతము ననుసరించి చూచిన 'న భవే దచః' - అని చెప్పిన బాగుండెడి ననిమాత్రమే మన మనుకొనవచ్చును. మొత్తముమీఁద 'న భవే దతః' అని ద్రుతపూర్వాకారమునకు సంధి నిషిద్ధ మయినది. (ఇఁకా దులకుఁ దప్ప)

ఇంక నిత్తునకు - అపి శబ్దార్థస్యేత యన్నది గాని లేదా తద్వ త్తదాదిజస్య యనునది గాని ద్రుతపూర్వక మైనయికారమునకు సంధిని చెప్పుట దన నక్కర లేదనవచ్చు. మిగిలినది 'ప్రాయస్తు స్యాతి క్రమాదిక స్యేతః' అన్నది ఇందలి ప్రాయశ్శబ్దమున నహో బలుఁ డించుకతక్కువగా బహుళార్థమును సాధించి యం దప్రాప్తి కిఁగా 'కంటి నంబుజాక్షున్' మొదలైన వుదాహరించె. కాఁగాఁ గొలిచి తద్బిదన్ అనురీతిస్థలములందు 'ప్రథమే చోత్తమే చైవ' యను దాని ననుసరించి సంధి నంగీకరించినప్పటికి నితరస్థలములందు ద్రుత పూర్వకేకారమునకుఁ బ్రాయశ్శబ్దముచే సంధినిషేధము సాధించి యున్నాఁడు.

ఇంక మిగిలినది యుత్తు - దీనికిమాత్రము ద్రుతపూర్వోకార మునకు సంధిని వారించుట కెట్టియాధారమును లేదు. నస్యాత్తద్ధ

ర్శోత యన్నది యొకటిరెండుచోట్ల వారించుటచేతఁ గూడ నితర స్థలములం దిది యనివార్య మైనది. అందువలననే యహో. రామున్ + అభిరామున్ అనుచో వివక్షితద్వితీయా ప్రతీత్యభావ ప్రసంగము కారణముగాఁ జూపి సంధిని వారించికొన్నాఁడు.

ఈయహోబలునివివరణమునందుఁ గొన్ని యిబ్బందు లున్నవి. 1. అత్తునకు ద్రుతపూర్వమునకు సంధిని నిషేధించుచున్నది వి. వి. వచనము. (దీని కహోబలుఁడే కర్త యనలేము. అట్లైన న భవే దచః అనియే చెప్పియుండెడివాఁ డనవచ్చును.) కాఁగాఁ జింతామణి మతమున ద్రుతపూర్వాకారమునకు సంధి నిషేధము లేదు. కావుననే యహోబలుఁడు రాము నభిరామున్ అనుచోట వలెనె చింతామణి పక్షమున 'ద్వితీయా ప్రతీతి యుండ దనుకారణమునే యాశ్రయించి వారించి నన్నయ ప్రయోగ మొక్కఁడు ప్రమాణముగాఁ జూపెను. అహోబలుఁడే కారికాకర్త యగుపక్షమున ధరణిపతులనదిమి యను దానికే గతి కల్పించి 'రాము నభిరామున్' అనుదాని నుపేక్షించుట జరుగునా ? శాస్త్రానుసారముగా ధరణిపతు లదిమి అనియే చింతా మణిపక్షమునఁ గావలసివచ్చుట యొకలోపముగాఁ బరిగణించుట దోసఁగు గాదు గదా !

2. ప్రాయస్తు అనుచోటిప్రాయశ్శబ్దమునకు విశేషముగాఁ జెప్పికొన్న బహుళార్థముచేత నహోబలుఁడు దా నవసర మనుకొన్న చోట్ల సంధి నివారించెను. కిమాదులలోఁ జేర్చి యట్టియెడల ప్రవృత్తి యని చెప్పవలసినయవసరము లే దని తోఁచుచున్నది. ఇకా రమునకు ద్రుతపూర్వమునకు (ఇతరమునకును) సంధి ప్రయోగ దృష్టము గానపుడు దానిని గిమాదులలోఁ జేర్చుకొన నేల ? సంధి రా దని చెప్పుకొన నేల ? కిమాదులలోఁ గాని తదాదులలోఁ గాని

యికారపూర్వకద్రుతాంతశబ్దములను జేర్చుకున్నచో (కి-లిప్స) సంధి రాన్నచో నుచ్చ్యమత యనుదాని ననుసరించు సంధినిషేధమే ప్రవర్తించును గదా! ప్రథమశ్చేత్తను శ్రైవ యని వి.వి. ఉత్తమపురుష క్రియాపదములందలి యికారమునకు సంధిని జెప్పుటచే దానిని జిం. లో సాధించుటకుఁగా నహోబలుఁ డుత్తమపురుషైకవచనాంతములను గిమాదులలోఁ జేర్చియుండవలె. అవు డెల్లయెడలఁ బ్రాప్తించుచుండ ననవసరమైనచో నట్లు వారించుకొనుట దోసఁగు కాదు, కాని యిట నీతఁడు సాధించినకొలిచి తబ్ధిదను అనురీతి వానికిఁ బ్రాచీనప్రయోగముల ప్రామాణ్యము లేదు. చిం ఉత్తమపురుషైకవచనములను గిమాదుల లోనే చేర్చెను దని నిశ్చయించుటకుఁ దగినయాధారమును లేదు కావునఁ బ్రయోగానుగుణముగా నుత్తమపురుషబహువచనములను మాత్రమె కిమాదులలోఁ జేర్చుట చింతామణిసమ్మత మనఁదగు. కొలిచి తబ్ధిజనువంటివానిని సాధించుటకయియే యహో వానినిగూడఁ జేర్చినది యనవసరము.

3. ద్రుతపూర్వేకారమునకు సంధి నిషేధించుట కహోబలపతి చూపినకారణము సరియైనది కాదు. క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేమిని జిం. విధింపకపోవుటచే నట్టియెడల నర్థప్రతీత్యభావము కారణముగా సంధిలేమిని జేర్కొనుచున్నామా? కృదంతము లివి క్రియాపదములు గామి నిత్యమనుత్తమసూత్రముచే సంధి ప్రాప్తి కవకాశము లేదు గదా. అందుకే నన్నయాదులవారు క్త్వార్థకమగునిప్రత్యయమునైతము కిమాదులలో (నిల్లెబిదాదులలోఁ బఠింపనిచో దీనిసంధికిఁ బ్రాప్తియే లే దనిరి (వ్యా. సం. స. 48) సంధి జరుగుటకు, జరుగకుండుటకు నర్థప్రతీతి, తదభావము కారణములని చెప్పుట యసమంజసము. చిం చిచ్చు ఎఱిం గెఱి. గి యనురీతిస్థలముల నర్థప్రతీతి లేదా? అట్టియెడల వి.వి. నిషేధ మేల? సమకాలమునందలి కవిప్రయోగముల నున్న క్త్వార్థకేకారసంధి నిరసించుటకై యథర్వణుఁ

డిట్లు చెప్పె నని వఝలవా రందురు. అథర్వణుఁడే యున్నయెడల నట్లు చెప్పె ననుట విశ్వసింప సాధ్యము కా దనవచ్చును. అసలు రామభిరాము అనుచో నర్థప్రతీతి లే దనుటయు విశేషమే. ఏది యే మైన నర్థప్రతీతితదభావములే సంధితదభావములకు హేతువు లన్న నిన్నిలక్షణము లేల? అర్థప్రతీతి లేదు గాన సంధి లే దనుచో నర్థప్రతీతి యున్న సంధి కావచ్చు నన్నమాట. వాతః ఇత్యాదు లేల? అర్థప్రతీతి యున్నది గనుక సంధి చేయుదుము. అర్థప్రతీతి యున్న సంధి నిత్యమూ, లేకున్న సంధ్యభావము వికల్పము గాదు గదా. కాఁగా వివక్షితద్వితీయార్థప్రతీతి లేదు గావున సంధి లే దను రీతిన నన్వయము శాస్త్రోచితము గా దనక తప్పదు.

ఇట్టియెడ ద్రుతపూర్వస్వరమునకు సంధి వారించుకొనుటకు మహాబలపతిమతమున నెంతయు నుచిత మగుమార్గము కలదు. ఆతఁడు లుక్సంశ్లేషౌ నాచి యనుసూత్రము నిర్గళితార్థానువాదక మేవ యని ప్రయోజనహీనముగాఁ జేర్కొనెనే కాని యట్లు చెప్ప నేల?

ఇన్నైలె మున్నగుస్థలములందు 'అనాదిష్టు' సూత్రమున సంధివిధానసామర్థ్యముచే ద్రుత మదృశ్య మగుటను దెలియఁదగు ననెను గదా. అనఁగా సంధివిధానము లేనపుడు ద్రుత మదృశ్య మగుట యసంభవము. అదృశ్యత యనఁగా లోపమే. సంధివిధాన సామర్థ్యముచే ద్రుతము లోపించు (ఇన్నైలె అనురీతి నవును) ననఁగా సంధ్యభావమున ద్రుతలోపము లేదు. సంధివిధానముచే ద్రుతము లోపించు నన నేల? ద్రుతపూర్వస్వరమును బరస్వరమును గలిసి పరస్వరైకాదేశమునందుటకు ద్రుతము లోపించినది. కాఁగా సంధ్యభావమున ద్రుతము లోపింపమి ద్రుతపూర్వస్వరమును బర స్వరమును గలియమి యన్నమాట. అట్టియెడల ఇన్నడిగె ననుచో ననాదిష్టవిధానసామర్థ్యముచే ద్రుతము లోపింప రాము నభిరామున్

అనుచో నేవిధానముచే లోపించు. సంధిర్నాచోఽచ్యనుత యను దానిచే లోపించునా? అనాదిష్టుసూత్రము ద్రుతప్రకృతికములయెడనే సంధిని జెప్పుటచే ద్రుతము లోపింపకున్న సంధి రా వీలు లేమి నావిధానము వ్యర్థ మగుఁ గావున విధానసామర్థ్యము నాశ్రయింప నొప్పును. సంధిర్న అనుసూత్రము రాముఁ డత డనురీతి కళాస్థలము లందుఁ జరితార్థమె కదా. అట విధానసామర్థ్యము నాశ్రయించు టెట్లు? అయినను నస్యాత్త్రిధర్మోత యను దాని ననుసరించి ద్రుతపూర్వస్వర సంధి జ్ఞాపిత మయి సంధిర్న యనుసూత్రము ద్రుతపూర్వస్వరము నకు సంధిని జెప్పిన దగుటచే నట సంధివిధానసామర్థ్యము నాశ్రయించి ద్రుతలోపము సాధింప నవకాశ మున్న దనవచ్చును. కాఁగా నిట్లు సంధివిధానస్థలములందు ద్రుతలోపము విధానసామర్థ్యముచే సాధింపఁబడు చుండుటంజేసి సంధ్యభావస్థలములలో ద్రుతము లోపింపమి నచ్చరకత్వమున సిద్ధించుచునే యున్నది. అట్టి యెడల లుక్సంశ్లేషౌ నాచి యని లోపమును నిషేధింప నేల? సంశ్లేషమువిషయ మట్లుంచిన స్వరపరకత్వమున ద్రుతలోపము లేదు. అట్టియెడల సంధిర్న అనురీతిసామాన్యవిధులయెడ ద్రుతపూర్వస్వరమునకు సంధి నాశంకింపఁ బని లేదు ఇంకఁ బ్రత్యేకముగా ద్రుతప్రకృతికములకు సంధి చెప్పిన తావులయందుమాత్రమే విధానసామర్థ్యము ననుసరించి లుక్సంశ్లేషౌ నాచి యనుసావకాశ విధానమును బాధించి ద్రుతలోపమై సంధి యగు ననఁదగును. లుక్సంశ్లేషౌ న అని లోపనిషేధమునుబట్టి స్వరపరకత్వమున ద్రుతము లోపింప వీలులేదు గావున నట్లు ద్రుతము లోపింపకున్న నిట్టిసంధి రా నవకాశము లేకుంటంబట్టి సంధిర్న మున్నగువిధులు ద్రుతపూర్వోకారమునకు సంధి చెప్పునవి కా వనవచ్చు. సంధి ప్రాప్తించుచున్నను లుక్సంశ్లేషౌ న అని ద్రుతలోపమును నిషేధించుటంజేసి రాముఁ డతఁ డిత్యాదులందుఁ జరితార్థమైనయవ్విధులచే ద్రుతపూర్వస్వర సంధిని మానవచ్చును. అనఁగా రామున్ అభిరామున్ అనుచో సంధిర్న

అని సంధి ప్రాప్తించుచున్నను ఉక్సం శ్లేషా నాచి యని ద్రుతలోపము నిషిద్ధ మగుటంజేసియు ద్రుతము లోపింపకున్న సంధి రావీలు లేమియు (అందుకే గదా నన్నడిగె నిత్యాదులలో సంధి విధాన సామర్థ్యముచే ద్రుతము లోపించు నని యహోబలుండు పేర్కొనెను) ననుసరించి సంధిర్న యనుసూత్రముచే సంధి రాదనవచ్చును. అనాదిషు సూత్రసందర్భమున నిట్లు బాధించినచో నావిధి నిరవకాశ మగును గదా. కావున నయ్యాది ద్రుతలోపనిషేధమును బాధింపఁగలదు. సంధిర్న అనునది రాముఁ డతఁ డిత్యాదులం దవకాశము గల్గియే యున్నది గదా.

ఇట్లు రాము నభిరాము ననుచో ఉక్సం శ్లేషా నాచి యనుసూత్ర మాధారముగా సంధిని వారింప ననకాశ మహోబలపత్యాదులమతమున నున్నది. అయినను నిట బాధకాంశము నస్యాత్తద్ధర్మోత యన్నది.

అహోబలుండు గాని సజ్జనారు గాని రామున్ + అభిరామున్ అనుచో సంధినిగూర్చి విచారించుటకుఁ జిం., వి.వి.లయందలిసంధి విధానములు ద్రుతపూర్వస్వరమునకును సంధిని జెప్పవనిగా నెంచుటకు అనాదిషు చోర్వా అనునని యప్రాప్తవిభాష లన్నను నిబ్బంది లేదు గాన సంధులకు ముఖ్యమైన హేతువు నస్యాత్తద్ధర్మోత యనుసంధినిషేధమే యని యహోబలపతిచర్చనుబట్టి గ్రహింపవచ్చును. కాఁగా నటువంటినస్యాత్సూత్రమునుగూర్చి విచారింపఁదగి యున్నది.

ఆలక్షణమునకు నహోబలపతిమతమున లక్ష్యము లెన్నో చూతము. ఈలక్షణమునకు వివరణముగా లక్ష్యస్థానములను నిర్ణయించునది, ప్రథమ శ్చోత్తమ శ్చైవ తాసు తద్ధర్మసంజ్ఞకౌ తత్ర చైకత్వార్థాభిధాయకౌ ఉదన్తౌ అనువి.వి.వచన మున్నది. దీనింబట్టి

తద్ధర్మార్థక ప్రథమోత్తమపురుషైకవచనములు రెండుమాత్రమె ధాతువునుండిలక్ష్యము లవును. ఇందు ప్రథమైకవచనాంతమును చింతామణి 'వచ్చున్' అను దానినిమాత్రమే సాధించెఁగా వి.వి. తద్ధర్మప్రథమే స్యాతాం డుడివర్ణౌ చ నాన్తగౌ' యని 'వచ్చెడున్' వచ్చెడిన్ అనురీతి మఱిరెంటిని చేర్చియున్నది. ఇందు వచ్చెడున్ అనుడుప్రత్యయాంతమె యుత్పూర్వకనాంత మగుటచే నదియే యిట గ్రహింపఁబడును. కాఁగాఁ దద్ధర్మప్రథమైకవచనములు వచ్చెడున్, వచ్చున్ అనురీతివి ధాతువునుండి రెండు. ఉత్తమైకవచనము వచ్చుదున్ (వత్తున్) అనురీతి దొకటియు.

అప్పకవి యీసనాతనసూత్రముతోఁ దద్ధర్మప్రథమోత్తమైకవచనములు రెండే చేర్చెను. తద్ధర్మార్థకములైన ధాతుజవిశేషణము లగు వచ్చు వచ్చెడు అనురీతి వానికి నచ్చరకత్వమున 'ధాతుపద సమ్భవానాం విశేషణానాం మితే స్త్రథా ను మచి' యని నుమాగమము విశేషముగా సాధించెను. అప్పకవి సాధించిన యివ్వానింగూడ నుమాగమవిధానము లేదు బా.స.చిం లో న స్యాత్తనునీసూత్రముచే సంగ్రహించునభిప్రాయముతో (బా.వ్యా. అనుసరించి?) సూత్రమునం దున్న తద్ధర్మపదము చేతఁ దద్ధర్మ క్రియా తజ్జన్యవిశేషణాశ్చ గృహ్యాతే యని చేర్చియున్నాఁడు. ఇట్లు తద్ధర్మార్థకధా.వి లకును నీ సూత్రముచేత సంధినిషేధము కాఁగా ఒనర్చు నంబుజాతాక్షు వని యవు ననెను. దీనింబట్టి ధా.వి లనీతఁడు ద్రుతప్రకృతులుగాఁ దలఁచె ననవలెను. ధాతుజవిశేషణములు నిట గ్రహించుటలో నిబ్బంది పైని స్పష్ట మగును.

మొత్తముమీఁద సహోబిలపతిమతమునఁ దద్ధర్మప్రథమోత్తమైకవచనములు తద్ధర్మార్థక ధాతుజవిశేషణములును నిట లక్ష్యము లవుచున్నవి.

ఇంక వజ్ఝలవారిమతమును బట్టి (బా. వ్యా.) లో 'వచ్చు' అను రీతి దొరకుటమాత్రమె వస్తుతస్సూత్రమునకు లక్ష్యమయి యున్నది. ఉత్తమపురుషైకవచనాంతము వజ్ఝలవారిమతమున 'వచ్చుదునున్' అనురీతిగా నుండును. ఆ సంధి నిత్యకల్పితే యనుదానిచే నిట సంధి లేదన్న వచ్చునను అనె అనిదో కావలెఁ గాని వచ్చుదు నను నని కాదు. అట్లు కావలె నన్న నుత్తమపురుషైకవచనస్థలమున సంధి యువు నని యే చెప్పవలయును గాని సంధి నిషేధింపరాదు.

న స్యాత్తద్ధర్మోత యన్నపుడు తద్ధర్మాత్మకే ధాతూకారమునకె సంధి నిషిద్ధమనియు నిట్లాటపదముల ప్రత్యయోకారమునకు సంధి యువును గావున వచ్చుదును అంటే వచ్చును రంటి ననురీతి సంధి యువుటలో నీసూత్రమునకు వైరుధ్యము లేదనియు వజ్ఝలవారి మతము. కానీ యిట వి.వి. కర్త 'ప్రత్యయోత్తమశ్చైవ' అని పేర్కొనుచు ఉత్వయుతో వన ... నను సూత్రముచేఁ జెప్పఁబడిన ప్రత్యయముల యుకారములకు సంధి నిషేధించుచున్నాఁడు. ఇట్టియెడల ధాతూకారమునకె యనురీతిగా నీ యర్థము చేయుట వి.వి. సమ్మత మని నిర్ణయింప నవకాశము లేదు. వి.వి. కర్త ప్రత్యయోకారము ధాతూకార మనురీతి పక్షమ్ చేయక యెల్లెడల నెచ్చట నిషేధ మవసరమో ఆ రెండు క్రియాపదములను బేర్కొనఁగా వీరు తద్ధర్మాత్మః అను దానికి ధాతూకారమునకని యర్థము చేయని వారిపక్షమునం దిచటితద్ధర్మాత్మశబ్దము ప్రథమోత్తమపురుషైకవచనమాత్రపర మని యిక్కిందతిని వ్రాసెను. (వ్యా. సం. స. 245) అని యథర్వణమతమునకును ఈమతమునకును భేదము లే దన్నట్లు పేర్కొనిరి. అథర్వణునిమతమున నుత్తమపురుషైకవచన మేది? దానిని వీరు 'చేయుదునున్' అనురీతిగాఁ జూపిరి. చేయుదునున్ అనునది వజ్ఝలవారిమతాన సంపూర్ణరూపము. అథర్వణా

చార్యులవారు ధాతూకారమున కని వీరివలె నర్థము చేయలేదు గనుక 'చేయుదునున్' అనుచో 'ద్రుత్వ యోకారమునకు సంధినిషేధము తగుల దనఁగలమా? 'చేయుఁదునున్' అనుదానిలోని 'నున్' అను దాని తుదియుకారము ధాతుసంబంధి గాక ప్రత్యయసంబంధి యగు టచే చేయుదునున్ అవుడు చేయుదు నవుడు అనురూప మేర్పడు నని తాము సమర్థించికొనిరి. కాని యథర్వణవచనములం దట్టియవ కాశము లేదే. అందువలననే కాఁబోలును నథర్వణవాక్యములు వివరించినపిదప 'చేయుదునున్' అనురూపము తద్ధర్మార్థమైకవచ ముగా నున్న యంశమును వారు స్పృశింపలేదు. స్పృశించినఁ దమ మతమునవలె సమర్థించుట కవకాశ ముండదు. అట్టియెడల నాసూత్రము నకు వివరణప్రాయ మైన ప్రథమపక్ష మున్నదానింబట్టి తమ వివరణము సరి కా దని చెప్పఁకొనవలసియుండును. అట్లు గా దన్న నథర్వణుని మతమున నుత్తమపురుషైకవచనము 'చేయుదున్' అనియే యుండు ననవలె. అన్యే అని ద్రుతము చేయకుంట వారిమతమునకు విరుద్ధము. ఇట్టియెడల నుత్తమపురుషైకవచనాంతరూపము నైన మార్చుకొన వలె లేదా సూత్రార్థమునైన మార్చుకొనవలసియుండును. ఏ రట్టి సిద్ధాంతము నేదియు విడిచిపుచ్చుకొనకుండఁగనే తమమతమె యథర్వ ణమత మని చెప్పఁబూనుట సరికాదు.

'చేయుదున్' అని యథర్వణపక్షమునను దమపక్షమునను నిషేధసందర్భమునఁ జూపుట వింత. 'చేయు దునున్' అనుదానినుండి సాధింపఁబడిన 'చేయుదున్' అనుదాన ద్రుతపూర్వక మైన'దు' లోని యుకారమునకు సంధి లే దసిరి. చేయుదునున్ అనుదానినుండి రూపాంతరములు సాధింపఁబూనినచో 'చేయుదున్' అని యైయుంతట నాగిపోదు. 'చేయుదునున్' అనుచోట ద్రుత మెట్లు లోపింపఁ జేసిరో యట్లె 'చేయుదున్' అనుచోట ద్రుతమునుగూడ లోపింపఁ జేయ వచ్చునే. అవుడు చేయుదు. అనియే యుండు. ఇవుడిది యుకంత

మైనను నాంతము కాలేదు గావున సంధి నిషేధము లేదు. కావున సంధి రావచ్చు. చేయుదున్ అవుడు అనుచో సంధి లే దని యే రూపము నివారింపఁబడినదో యాచేయు దవు డనురీతిరూప మీ పక్షమున నేర్పడుచున్నది. అథర్వణుఁడు సదా నాన్తా యన్నాఁడు, గనుక చివరి ద్రుతము లోపింప దండురా? అవుడు చేయుదునున్ అనుచోట ద్రుతమె లోపింపదు. సంధినిషేధ మచ్చటనే ప్రవర్తించి చేయుదునవు డను ప్రసిద్ధరూపములే లక్షణవిరుద్ధము లవుచున్నవి. అథర్వణుఁడే యిట్లు చెప్పుచుండెనా?

అసలు చేయుదునున్ అనుదానినుండి చేయుదున్ అని యగుటెట్లు? చేయుదునున్ అవుడు అని యుండఁగా వాక్యాన్తగతపదాన్నాశ్చ అను సూత్రముచే విహిత మగు వాక్యాంతద్రుతలోప మిట నెట్లయినది? (ప్రసిద్ధ వాక్యలక్షణమునుగూర్చి వా రిటఁ బ్రస్తావింపరే) ఇట స్వరము పర మైనదిగదా అవసాన మేది? (ఇట్లు చేయుదును. అవుడు అని కాఁగా నట్టియెడఁ గవిభల్లట సూత్రముచే నుత్వలోప మగు ననిరి. ఎట్లో చేయుదున్ అగుఁగాక. పోనీ స్వరపరకత్వమున రా వీలులే దన్న ముందుగనే చేయుదునున్ అనియున్నవుడే ద్రుతలోపాదులతో చేయుదున్ అని సిద్ధింపఁజేసి యాపిదపనె అవుడు అనుదానిని బరముగాఁ జేర్ప నగుఁ గదా యనవచ్చును. అవుడు వాక్యాన్తసూత్రముచే ద్రుతలోప మిటను నవసానముండే యైనదనుకొనవచ్చును. కాని యుదేపద్ధతిలో చేయుదునున్ అన్నవుడును వాక్యాన్తసూత్రముచే ముందే ద్రుతలోపము చేసి యాపిదపనె యవు డనుదానిని బరముగాఁ జేర్పఁ జేయు దవు డనురీతి యుపరూపములు గాక తప్పునా? కవిభల్లటసూత్రముచే నవసానపరకత్వమున నుత్వలోపము రా దన వీలు లేదు గదా. అట్టియెడల నల్గ నోడుదున్ ఇత్యాదు లసాధువు లని నిశ్చయింపవలసియుండును.

ఇట్టిపద్ధతివలన నిచ్చటనే కాక యితరస్థలములందును ననర్థము లున్నవి. నన్నున్ చూచుచున్ నున్నగుచోట్లను నిట్లు ముందుగా ద్రుతమును లోపింపఁజేసి నన్ను, చూచుచు అనురీతి చేసిన నిట స్వర పరకత్వమున సంధిర్నాచోఽచ్యవుత యనుసూత్రముచే సంధి జరిగి నన్నడిగె, చూచు చున్నాఁ డనురీతి నవును. వాక్యాంతద్రుతలోపము వా యనుటచే వైకల్పికమే కావున లోపింపఁజేయక యట్లు యుంచిన నన్నున్ అడిగె నని యుండఁగా (వచ్చెన్ అతఁ డన్నచోటవలె) లు క్సంశ్లేషౌ నాచి యనుసూత్రముప్రకారము ద్రుతమునకు లోపము లేదు గావున నన్ను నడిగె ననియే యవును. ఇట్లు చూచు చేఁగెను చూచుచు నేఁగెను అనురీతి ద్వైరూప్యమును సిద్ధించును. అహో బలపతియు సంధివిధానసామర్థ్యముచేతనే యిట ద్రుతలోపము చేసి యుండెఁ గావున ద్రుతలోపము లేనప్పుడు సంధియు నుండదు గదా. 'అచాం సన్ధౌ'యను వి.వి. వచనమునకు ఫలితము నిట్లు గుర్తింపనవు. అట్లు గాక లు క్సంశ్లేషౌ నాచి యనుదానిచే వచ్చు నతఁ డిత్యాదులు సిద్ధించినచో నస్యాత్తద్గ్రహణే యనుసూత్రము ననవసర మగుఁ గావున నిచ్చట నాకోఅకు నిచ్చె నిత్యాదరూపములు గా ననవచ్చు. అట్టి యెడల వాక్యాంతద్రుతలోపశాస్త్రము ననుసరించి ద్రుతము లోపించి 'సంధిర్న' అని సంధి యై నన్నడిగె నిత్యాదులు సిద్ధించుచునే యున్నవి కావున సిద్ధింపవలసిన నన్ను నడిగె ననురీతిరూపములకై సంధ్యభావము నచ్చటఁ జెప్పఁదగుఁ గదా. అనాదిష్వు, చోర్వా అని సంధినే విధింప నేల?

తద్ధర్మార్థకములస్థలమునను వాక్యాంతద్రుతలోప మైన పిదప వచ్చు+అతఁడు వచ్చతఁడు అని యవును. ద్రుతలోపము వికల్పము గావున లోపము లేనపుడు నస్యాత్తనిషేధము ననుసరించి వచ్చు నతఁ డని యవు. ద్రుతాంతత స్పష్టముగా నిర్దేశింపమి వచ్చు యతఁ డనురీతిరూపములప్రసక్తియు నుండక పోదు.

ఇట్లీసంధి ప్రణాళిక యంతయు వివాదాస్పద మవుచున్నది. అంతే గాక పరుషసరళస్థితిలోని - కాన (కానన్) తగ, ఏ (ఏను) చక్కం బెట్టువాఁడ, నే (నేను) చెల్ల నోయమ్మ ఇత్యాదిస్థలము లందును ద్రుతప్రకృతికముల ద్రుతమునకు ముందుగా లోపము చేసి యాపిదప నాయాపదములు పరముగాఁ జేర్చిన (కానతగ మొ॥) పై ప్రయోగము లన్యథా సమర్థింప నక్కర లేదు - అంతే గాక ద్రుతప్రకృతికముపై పరుషము లున్న యుండి ద్రుతము లోపించుట సిద్ధించు. (సరళస్థిరపరకతలో లోపము విధింపకున్నను బాధ లేదు.)

చేయుదున్+అవుడు అనురీతిగా నిల్పుటకై వజ్ఝలవా రనుసరించినమార్గమువలననే యిన్ని యనర్థము లేర్పడుచున్న వనుట స్పష్టమే కద. కాఁగాఁ జేయుదునున్ అనునది తద్ధర్మోత్తమైకవచనముగా సాధించి వజ్ఝలవా రచ్చట ద్రుతలోపము చేసి ప్రస్తుతస్థలము లందుఁ జూపుట సంగతము కా దనకతీరదు. కానఁ జేయుదునున్ అనురీతిగానే యుండవలసియున్నది. (నువర్ణము వారిమతమున ద్రుతము గాదు గదా.) అవు డుత్తమపురుషైకవచనమునకు సంధిని నిషేధించుట వి.వి. వచనములో వజ్ఝవారిసిద్ధాంతమునకు విరుద్ధమగును. నన్వాత్తముచో వజ్ఝలవారుత్తము పురుషైకవచనము గ్రహింపరాదు గూడ.

కయివజ్ఝలవారి ప్రక్రియావిధానము సక్రమముగా లేకుంటయు నిట్లు గుర్తింపఁదగియున్నది. చేయుదునున్ అనుదానికి రూపాంతరమగు చేయుదునున్ అనుదానికి నిట సంధి లే దనిరి. అప్పుఁ గ క. వీరిమతమున భూతకాలికోత్తమపురుషైకవచనము 'కొలిచితినిన్' అను రీతి నవును (కిమాదుఁ లోఁ జేర్చిఁ ప్రాయు సుస్త్ర స్యా త్క్రమాదిక స్వేత యనునదియును.) ప్రథమే చోత్తమే చైవ క్రియాతో వాంఛ వే చ్ఛ్యతిః అనువి వి. వాక్య ముత్తమపురుషక్రియాకారమునకు సంధి

వికల్ప మనుచున్నది. ఇక్కడ సంధి యెక్కడ? అనఁగా 'కొలిచితినిన్ అనుచోట నివర్ణములోనియికారమున కని వ్యాఖ్య చేసిరి. కొలిచితి నర్థిజ నన్నది సంధి యైనరూప మనియు కొలిచితిని నర్థిజ (అంటిని నిందటికు) ననునది సంధి కానిరూప మనియుఁ జెప్పవచ్చు ద్రుతపూర్వ స్వరసంధి నన్నయాథర్వణసమ్మత మని - అంటిని నిందట కనురీతివి క్వాచిత్కములు గాన నివర్ణకేకారమునకు సంధి ప్రాయికముగా జరుగు ననిరి. ఇది పూర్వవిరుద్ధము కాదా? 'కొలిచితినిన్' అన్నప్పటినివర్ణమునందలియికార మెక్కడిది? 'చేయుదునున్' అన్నప్పటి వలెనే యిచటఁ గూడ ఉత్వయుతౌ వనకారౌ స్యాతా మ్మని నువర్ణమైనది. ఆనువర్ణమునుత్వమునకే భూతాదుతాం పరేషా మి త్తను సూత్రముచే నిత్త్వము వచ్చినది. అనఁగా చేయుదునున్ అనుచో నువర్ణమునందుఁ గన్పించునుత్వము కొలిచితినిన్ అనుచో నిత్వమైనదని స్పష్టము. అట్టియెడల 'ఉదన్తా చ నాన్తా న సంధి స్సత్ర కల్ప్యతే' యనుకారికచే రావలసినసంధినిషేధము చేయుదునున్ అనుచోట నువర్ణకమునందలియుకారమునకుఁ గాక దానికి వెనుకనున్నయుకారమున కగు టేమి? ప్రథమే చోత్తమే చైవ క్రియేతః అని చెప్పినయుత్తమపురుషక్రియేకారము సంధి (ఆనువర్ణమునకే చెందిన) నివర్ణకము ఏకారమున కగు టేమి? అట సంధినిషేధము 'చేయుదున్' అనుచోట (నువర్ణకము ముందటి) ఉకారమునకె యైన నిటఁ జెప్పిన సంధియును (నివర్ణకముముందటి) యికారమునకు కావలయుట సక్రమము. కొలిచితి(ని)న్ అన్నపుడు తివర్ణకేకారమునకే సంధి వికల్పముగా రావలయును - అహోబలుఁ డిట్లు సక్రమముగా భావించి యున్నవాఁ డగుటచేతనే తివర్ణకేకారమునకే వైకల్పికసంధిని జూపె. కొలిచి తర్థిజను అనునది సంధి యైనరూపము గాఁగా కొలిచితి నర్థిజ ననునది సంధి కానిరూప మనె. వింటిని ఇత్యాదులలో రావలసియుండ మార్గాంతరమున వారించుకొనెను. అయ్యదియే సక్రమముగా

నున్నది. కొలిచి తద్ధిజ మనురీతిరూపము లంగీకారయోగ్యములుగా వారును దలంపలేదు - కావున నివర్ణకేకారమునకు సంధి యనిరి. చేయుదు నవు డనురీతివి సంధి యైనరూపము లనుట సరి గా దని యిట నిషేధము నువర్ణకపూర్వోకారమున కనిరి. ఏది యైనా యొక్కటి పొరపా టనక తప్పదు.

చేయుదుఁ న్ అనుదానినుండి చేయుదున్ అని సాధించి దాని కచ్చరకత్వమున సంధి లే దన్నవ్యాఖ్యలవారికి కొలిచితినిన్ అను దానినుండి సాధింపఁబడు - కొలిచితిన్ అనుదాని కచ్చరకత్వమున సంధి యగునో కాదో చెప్పవలసినయవసరము కలదు. వారు దానిం గూర్చి 'కొలిచితిన్ - అద్భిజ' అని యుండ నట సంధి రా దనియుఁ గావున దానిని గిమాదులలోఁ జేర్ప రా దనియుఁ జేర్కొనిరి. అట్లు చేర్చుట యహోబలునిభ్రాంతి యని మామూలుగనే చెప్పిరి. కిమాది యాకృతిగణ మవుటచేఁ గొలిచితినిన్ అనురీతివి చేరుటయుఁ గొలిచి తిన్ అనురీతివి చేరకుంటయు విరుద్ధము గానేర దనవచ్చును. కాని ప్రథమే చోత్తమే చైవ యను వి.వి వచనమున నుత్తమపురుష క్రియ యని సామాన్యముగాఁ జెప్పఁబడినది గదా. అట్టియెడల నిపి. వి. వచనస్థలమునఁ గొలిచితిన్ అనునది మాత్రమె గ్రాహ్య మనియుఁ గొలిచితిన్ అనునది గ్రహింపఁబడ దనియుఁ జెప్పుట యెట్లు? కొలిచితిన్, వింటిన్ అనురీతి వృత్తమపురుషక్రియలు గావా? ఇట వారించుట వి.వి. మతమున నసాధ్యమె, అందుకే కాఁబోలును వ్యాఖ్యాతారు కారికసందర్భమున నిట్టివానిం గూర్చి ప్రస్తావించియుండ లేదు.

అహోబలపతివివరణము ననుసరించి కొలిచితిన్ చేయుదునున్ అనునవి సాధారణముగా నేర్పడునవి కావు. అట్టియెడఁ గొలిచితి(ని)న్ చేయుదు(ను)న్ అనియే యుండును. ఉదన్తా చ నాన్తా

అన్నపుడు 'చేయుదునున్' అనుచోట దువర్ణమునందలియుకారమునకే సంధి నిషిద్ధము. అట్లే 'ప్రథమే చోత్తమే చైవ' యని వికల్పసంధి విధానము నయితము కొలిచితిన్ అనుచోటితివర్ణమునందలియికారమునకే. అదియే యుక్తము. కానీ యీపక్షమున నహోబలుఁడు సాధించినకొలిచి తబ్ధిజ ననురీతిరూపములకును వజ్ఝలవారును సరి యైన నివారణోపాయమును జూపినవారు కారు. కాని యట్టిప్రయోగములు లే వని స్పష్టము చేసిరి. కంటి నంబుజాక్షున్ అనురీతిసందర్భముల సంధి లే దని యహోబలుఁడే స్పష్టము చేసెను. కానీ యట్టివాని నాతఁడు 'ప్రాయ స్త్రి స్యా త్త'న్నప్పటిప్రాయశ్శబ్దముచే సాధించెను. కొలిచి తబ్ధిజను అనురీతిరూపములను లేకుంటనుబట్టి యుత్తమపురుషైకవచనాంతము లగుక్రియాపదములందలియికారమునకు సంధి లే దని గ్రహింపఁదగును 'ప్రాయస్తు' అను చిం. లక్షణమున నుత్తమపురుషబహువచనాంతక్రియాపదములనుమాత్రమె గ్రహింపవచ్చును కాని వి వి. ఉత్తమపురుషను సాధారణముగాఁ జేర్చొన్న దే. అహోబలుఁ డన్నట్లు ప్రాయశ్శబ్దముచే వింటిని ఇత్యాదులయందలియికారమునకు సంధిని వారించుకొనుట చింతామణియుద్దేశమైనపుడు వి.వి. దానికిఁ దరువాతిది గావున నదిమాత్రము సామాన్యముగా సంధి చెప్పుట యొప్పునా? కం టంబుజాక్షున్ అనురీతిరూపములను వి.వి. సాధించుచున్న దనవలెనా? కొలిచి తబ్ధిజన్ అనురీతివానిని చిం.,వి.వి.లు సాధించుచున్న వనియుఁ గం టతని అనురీతివానిని చింతామణి వారించుచుండఁగా వి వి. సాధించుచున్న దనియుఁ జెప్పుట యుక్త్యనుగుణమా?

అందులకే వజ్ఝలవారు 'ఉత్తమే చ క్రియేతో వా భవేచ్ఛ్రుతిః' అనుచోట నున్నయుత్తమశబ్దముచే కొలిచితిన్ అంటిన్ అనువంటిరూపములనె గ్రహించిరి. ఇట్లు చెప్పినపీఠిపక్షమునందును

సంధి రానప్పటి - కొలిచితిని సబ్ధిజను అనువంటిరూపములు ప్రచురములుగా వని స్పష్టము చేసిరే కదా. చింతామణి ప్రాయికమనుచుండఁగా వి.వి. వైకల్పికమనుట యిట గమనార్హము. ఇంక నహోబలుఁడు కొలిచితిన్ అనురూపముతో సంధివలన సాధించినకొలిచితబ్ధిజను వంటివి లేకపోఁగా కొలిచితినిన్ అనుదానితో వజ్ఝలవారు సంధ్యభావరూపముగా సాధించిన - కొలిచితిని సబ్ధిజను అనురీతివి మిక్కిలివిరళములు. ఇట ద్రుతముమీఁది ద్రుతముగా సమన్వయింపఁ దగును.

కాఁగాఁ జింతామణియందుఁ గిమాదులలో భూతార్థకోత్తమ పురుషబహువచనాంతములే గ్రహింపఁదగు. ప్రథమే చోత్తమే చైవ యనుకారికయందలి వాశబ్దమునకు నుత్తమైకవచనములయెడ నప్రవృత్తి మాత్రమును నియమించికొనవచ్చును.

ఇంక మొత్తముమీఁద 'చేయుదు(ము)న్' అనురీతిరూపమును జూపినవజ్ఝలవారు దానిని నస్యాత్తనుదానికి లక్ష్యము చేయుట సరి కాదు. అట చేయుదునున్ అను వీరిమతమున సంధి విధింపవలసియే యుండును. వి.వి. కారికలోను సంధి నిషేధమున వైరుధ్య మేర్పడుట స్పష్టమే

అంతే గాక వజ్ఝలవారివ్యాఖ్య ననుసరించి చేయుదున్ అనుచోటిదువర్ణమునందలియుకారమునకు సంధి రావలసియే యుట గమనింపవచ్చు. తద్ధర్మోత యనుచోఁ దద్ధర్మార్థకధాతూకారమునకే సంధినిషేధమనియు నిట్లనుటవలనఁ బ్రత్యయోకారమునకు సంధి నిషేధము లేమి సంధి యవు ననియుఁ జెప్పిరి కదా. చేయుదున్ అనుచోటిదువర్ణమునందలియుకారము ధాతువునకు సంబంధించినదగుట యెట్లు? 'దుతివర్ణకౌ క్రమాత్ త్రః' అనుసూత్రము ననుసరించి చింతామణిచేసిదువర్ణము ప్రత్యయముగా విధింపఁబడియున్నది.

వీరివ్యాఖ్యనుబట్టి ప్రత్యయోకారమునకు సంధి యగును గావున ద్రుతపూర్వకమై యైనను దువర్ణకోకారమునకు సంధి ర్న - అను సూత్రముచే సంధి యయి చేయుదున్ అగుడు - చేయు దగు దని మాత్రమె యగును. చేయుదు వనఁగ ననురీతిస్థలములందువలెనె యిట సంధ్యభావమున కవకాశము లేదు. చిన్నయసూరి లాట్టురుఃఖు పరంబగునపుడు ధాతువునకు దుగాగమముగా నీదువర్ణము ధాతువునకంతాగమముగా విధించియున్నవాఁడు కావున నయ్యాది ధాత్వవయవమయి యందలియుకారము ధాతూకారమె యనురీతిగాఁ జెప్ప నవకాశమున్నది. 'దుతివర్ణకౌ' యని చెప్పిన చింతామణియం దిఁక ప్రత్యయోకారము కాక ధాతూకార మగుట యెట్లు గుదురును ? వి. వి. వచనమునం దిట్లుకారము ధాత్వవయవమా ప్రత్యయావయవమా యనువివక్ష లేదు గాన నిట పరిపడి సంధినిషేధమే వర్తిల్లును. వజ్ఝలవారివ్యాఖ్య కనుగుణముగాఁ గారికయందును ధాతూకారమె యధర్వణహృదయ మన్న నచ్చుటనునింతియ. ప్రత్యయ మనఁగాఁ గ్రియావిభక్తియే యని వా రుద్దేశించిరేమో. కానీ యయ్యది స్పష్టముగాఁ జెప్పలేదు. అట్టియవకాశము సూత్రమున నెట్లును లేదు.

కాఁగా నిట వజ్ఝలవారిమతమున నుత్తమపురుషైకవచనము నన్యత్సూత్రమునకు లక్ష్యస్థలము గానేర దని స్పష్టము.

ఇంకఁ బ్రథమపురుషైకవచనస్థలమునను వి.వి. ననుసరించి చేయున్ చేసెడున్ అనురెండుచోటులయుకారము లక్ష్యస్థాన మై యున్నది. వజ్ఝలవారిమతమున 'వచ్చెడున్' అనునది యిట గ్రహింపఁ బడుట కవకాశము లేదు. 'వచ్చు+ఎ+తిప్' వచ్చు+ఎ+ఉన్ వచ్చెడున్. వచ్చు+ఎ+డిన్ వచ్చెడిన్' (వ్యా.సం.స. 1339) అను వీరివివరణము ననుసరించి 'తద్ధర్మప్రథమే స్యాతాం డుడివర్ణౌ చ నాన్తకౌ' యనుచోట డుడివర్ణములు ప్రథమైకవచన మగుతిఙ్స్థానము

వనె యవుచున్నవి గదా. అట నట్లు చెప్పినవీరే యిచట చేసెదున్ అనుతద్ధర్మ ప్రథమపురుషైకవచనరూపమునందలి 'దు' అనునది ధాతువునకు విధింపఁబడినదే గాన (తద్ధర్మప్రథమే స్యాతాం డుడీవర్ణౌ చ నాన్తకౌ) నచట ధాతూకారసంధినిషేధము వగులను. చేసెదున్+ఎవుడు - చేసెదు నెవుడు. (24) అని యెట్లు వ్రాసిరో యర్థము గాదు. ఇటఁ దివ్వన కాదే సైన దువర్ణము ధాతువునకు విధింపఁబడినదే కాన నందలియుకారమునకు సంధి రా దనుచో — "అట్లగుటచేఁ దద్ధర్మక్రియలయందలి కృత్య యోకారములకు సంధి నిషేధము తగులదు గావున చేయుదురు+ఎవుడు చేయుదు రవుడు (వ్యా.సం.స. 244) అనుట యెట్లు ఈడువులుమాత్రము ధాతువునకుఁ గాక నామమునకు విధింపఁబడినదా? వచ్చెదన్ అనుచో దు ప్రత్యయము మాత్రము ధాతువునకు విధింపఁబడినదే గదా. కావున నీయుమన్యయాంతరముచే నుత్తమపురుషైకవచనమున దువర్ణోకారమునకు సంధి నిషేధము సాధించుకొనవచ్చును గాని వచ్చెదురు, చేయుదురు అను రీతి స్థలములందుమాత్రము సంధినిషేధము తప్పక ప్రాప్తింప వలసియున్నది.

వీరు నస్యాత్తదర్థోక్తి యనుచో దువర్ణము ధాతువునకు విధింపఁబడిన దనుటలో ధాతువున కాగమ మని తలఁచిరా? చేయు+ఎ+తిప్ అని యుండఁగాఁ దివ్వరికత్వము నిడు లను ధాతువున కాగమములు చేసి చేసెదు+తిప్ అనువిధముగా నుంచి యాపిదపఁ బ్రథమైకవచనలోప స్తద్ధర్మార్థితయోః క్రియాణాం స్యాత్తని తిప్పనకు లోపము చేసి పిదప ద్రుతము నాగమముగాఁ జేయవలెను. కాని యిట వి.వి. దుడి వర్ణములను మాత్రమే విధింపక 'డుడీవర్ణౌ చ నాన్తకౌ' యని వానిని నాంతములుగా విధించినది. అప్పుడు తిప్పనకు ముందే ధాతువునకు వీని నాగమములు చేసినచో చేసెదున్+తిప్ అని యుండఁ దద్లోపానంతరము అన్యత్ర మత్ప్రకృతయ యని ద్రుత మాగమము మైన చేసెదున్ న్

అనుకీతిగా ద్రుతద్విత్వ మేర్పడును. దానిని వారించుటకయి వజ్ఝల వారు ఇందు నా స్త్రకా యనునది 'అన్యే ద్రుతప్రకృతయ' అను సూత్రముచే సిద్ధించు ద్రుతప్రకృతికత్వమున కనువాద మగుచున్నది. ప్రథమపురుషైకవచనములు డుజ్వర్ణకాంతములై కళ లగుట సహజ మగుటచేత నిట నట్లు గా దని తెలుపుటకై యి ట్లనువదింపఁబడెను (వ్యా. సం. స. 1339) అనిరి. కానీ యిది సక్రమముగాఁ దోఁపదు. వీరే యింతకు ముందు 'అన్యే ద్రుతప్రకృతయః' అనుచోఁ బ్వాన నీరెండును (తద్ధర్మభూతక్రియలు) ద్రుతప్రకృతికములగును గదా. వచ్చు+ఎ+తిప్ వచ్చు+ఎ+న్. ఇది భూతార్థకము వచ్చు+తిప్ వచ్చున్ మొ॥ అని (1339) పేర్కొఁని యున్నారు. వచ్చున్ అనునది ప్రథమపురుషైకవచ నాంతమె యైనను అన్యే యని ద్రుతప్రకృతిక మైనదే. తిఙ్మధ్యేతర క్రియ గాన నట్ల యగు, అట్లే వచ్చెడున్ అను ప్రథమపురుషైకవచనాం తము ద్రుతప్రకృతికము గాకుంట యేమి ? ఇట్టి డుజ్వర్ణకాంతము కళయే యని స్పష్టముగాఁ జెప్పకున్నను నాదిపదముచే నట్లు కళ యవుఁగాక. అట్లని యీడిఁవర్ణకాంతములు కళ లని భ్రమించుట యెట్లు ? వచ్చెడున్ అనుచో నున్నది డువర్ణమే కాని డుజ్వర్ణకము కాదు గదా. (డి వర్ణమునకు డుజ్ఞుతోఁ బోలిక యేమాత్రమును లేదు.) ఇట డుజ్ (డిజ్ ?) అని చెప్పలేదు గాఁబట్టి యీడిఁవర్ణ కాంతము కళ యనుకొను టెట్లు గుదురును? సామ్యమే లేమి భ్రాంతి మాత్ర మెట్లు? ప్రథమైకవచనమాత్రసామ్య మున్న వచ్చున్ అనునది ద్రుతప్రకృతికము కాలేదా ? కాఁగా డు జని చెప్పుపక్ష మున భ్రాంతివారణ మవసర మగు నేమో కాని యిట ననవసరము. తిఙ్మధ్యకములు గాని యీక్రియాపదము లన్యే యని ద్రుతప్రకృతు లగుటయే సహజము. డుజ్వర్ణకాంతములు కళలలో స్పష్టముగా నిర్దే శింపకున్నను నయ్యవి ద్రుతప్రకృతికములు గాక కళ లగుటకు నాధా రము ప్రయోగములం దవి ద్రుతాంతములు గాకుండుటయే. దానింబ ట్టియే యాద్యశబ్దముచే నయ్యవి సంగ్రహింపఁబడుచున్నవి. నా స్త్రకొ

అనునప్పటి నకార మట్టిద్రుతము ననుసరించునదే యవుఁగాక. కళలను భ్రాంతిని వారించుటకనుట సరికాదు. స్పష్టత కని చెప్పఁగొనఁ దగును. కాఁగా డిడులను ధాతువున కాగమము చేయరా దని గ్రహింపఁదగు.

అయినను నీవివాదమేల? వారే స్పష్టముగా నీడిడులను దిత్వస్థానమున నాదేశము చేసియుండిరి. కాన నీడువర్ణము ప్రత్యయమైయైనది గాని ధాత్వవయవము గాదు. కాఁగా ధాతూకారమునకుఁ జేసిన నస్యాత్తనసంధినిషేధము చేసెడున్ అనుచోటి ప్రత్యయోకారమునెడల వర్తింపనేరదు. కాఁగాఁ జేయుదురు+అవుడు చేయుదురవు డనురీతిగానే చేసెడున్+అవుడు చేసె డవు డనురూప మొక్కటయే కావలసియున్నది. ద్రుతపూర్వస్వరసంధి నన్నయాథర్వణసమ్మత మని గదా వారి సిద్ధాంతము. నన్నయాథర్వణులు లాక్షణికులుగా సమ్మతించిరేమో కాని యీయవి కవిప్రయోగములకు మాత్రము విరుద్ధములు.

ధాతూకారమున కని చెప్పని వి.వి. ననుగురించి యీయవి లక్ష్యము లగుచుండ వజ్ఝలవారివివరణమునుబట్టి నస్యాత్సూత్రమునకీయవి లక్ష్యములు గాకుండఁ బోయినవి.

ఇంక మిగిలినది ప్రథమైకవచనాంత మగు ‘చేయున్’ అనురీతిదొక్కటి మిగిలియున్నది. అయినను వజ్ఝలవారిమతమున నిట్టిదియుఁ బ్రస్తుతసూత్రమునకు లక్ష్యము గాకుండఁబోవునవకాశమును గుర్తింపవచ్చును.

నా ప్రాతిపదికకు శస్సు చేయఁగా మమ్మున్ అనురూప మేర్పడుననియు నప్పుడు శస్సు లోపింపఁగా ముం దున్న యుకారము ప్రత్యయసంబంధి యై (లోపించినశస్సునందలి ప్రత్యయధర్మము ముందటివర్ణ

ముపైఁ బడి?, అనాఙిషు విభక్తిషు అను సూత్రముచేఁ బ్రత్యయో
కారమునకుఁ జెప్పినసంధి యగు నని వజ్ఝులవారు పేర్కొనియుంట
నింతకు ముందు గమనించియున్నారము. అదే విధముగా చేయుధాతు
వుపైఁ దిప్పు చేయఁ జేయు+తిప్ అని యుండఁ బ్రథమైకవచనలోపః
అని తిప్పు లోపించినది. (అన్వయని ప్రమత ము ము చేయున్ అని
యగును) కాఁగా నింతకు ముందు శస్సవలెనే యిట దిప్ప్రత్యయ
మును లోపింపఁగా (దిప్పునందలి ప్రత్యయధర్మము ముందున్న వర్ణ
ముపైఁ బడి) ముందున్న చేయులోని యుకారము ప్రత్యయసంబం
ధిగాఁ బరిగణింపఁబడ నవునే కదా. ఇట నెట్లును (ఇంతకు ముందు
విభక్తిషు అని స్పష్టముగాఁ జెప్పినచోటవలె) ప్రత్యయోకారము
నకు సంధినిషేధము లేదనియు ననఁగా సంధి ప్రవర్తించు ననియుఁ
జెప్పిరే కదా. అట్లే యిట చేయున్+అతఁడు అనుచోట సైతము
మమ్మున్ (ఏలె) అనుచోటవలెనె ప్రత్యయసంబంధియుకార మవుట
చేత సంధి జరిగి చేయుతఁడు అని కావలయునే కద. కాఁగా వజ్ఝుల
వారిస్థలాంతరవివరణము ననుసరించి యిట చేయున్ అనురీతిస్థలము
లందలి యుకారము సైతము లక్ష్యస్థలము కాకుండఁబోయినది.

అస లింతకును నస్యాత్తద్ధర్మోత యన్నది ధాతూకారము
నకే సంధి నిషేధ మనియుఁ బ్రత్యయోకారమునకు లే దనియు
స్పష్టముగాఁ జెప్పునది కాదు. తద్ధర్మోతః అనుదానికిఁ దద్ధర్మక్రియో
కార మనియే సామాన్యముగా నర్థము గ్రహింపవలసియున్నది.
ప్రయోగానుగుణముగా వచ్చుదు రవు డనురీతికస్థలములయందలి
సంధిని సాధించుకొనుట యభిమతము కావున విశేషార్థము సాధింపఁ
బూనవచ్చు. కాని యందులకై ధాతూకారమున కని చేయవలసిన
యవసర మేమి? సూత్రమునందు నిర్బంధము లేమి ప్రయోగాను
గుణముగా గ్రహింపవలసియున్నపుడు ధాతూకారమునకే యని నేల?
ని.వి. పేర్కొన్నట్లుగా ప్రథమోత్తమైకవచనములు అనియే విశేష

మును వివరింపఁదగుఁ గదా. వి.వి. ఇట్లు ధాతూకారమున కని కాక ప్రథమోత్తమైకవచనముల కని పేర్కొనుటచేఁ దన్మతమున నీ సూత్రమునకుఁ గొన్నియేని లక్ష్యములు గల్గినవి.

ఇంకిట నహోబలపతి తద్ధర్మపదముచేఁ దద్ధర్మార్థక ధాతుజ విశేషణములను గ్రహించి రక్షణ మొనర్చునంబుజాతాక్షు నని చూపె. ఒనర్చున్+అంబు- అని యుండ సంధి లేమి ఒనర్చు నంబు-అని యైన దన్నమాట. ఈ లక్ష్యవివరణముల ననుసరించి యాతనిమతమున ధాతుజవిశేషణములు ద్రుతప్రకృతికము లని స్పష్ట మగుచున్నది. చేయునతిథి అనురీతిస్థలములందును నాగమము విధింపనిచిం.వి.వి.లమతమున ధా.వి.లు ద్రుతప్రకృతులే యని వజ్ఝలవారును పేర్కొనిరి. అయిన నిట ధా.వి.లు సూత్రలక్ష్యము లవునా? అన్నది పరిశీలింపవలె.

అయినను నీ ధా.వి.లకు విశేష్యములతో సమాస మయిన దని చెప్పకతీరదు. చేసినయాతఁ డనురీతిస్థలములందును జేసినవాఁడు అనురీతిరూపములు లేకుండుటంజేసి యియ్యవి నియతముగా వాఁడి విశేష్య(తచ్ఛబ్ద)ములతో సమాసము నందియే ప్రయుక్తము లవు నని నిర్ణయింపక తప్పినది కాదు. అట్టియెడల ధా.వి.లివి ద్రుతప్రకృతికములే యన్నను (నెప్పుడు) వాఁడిశబ్దముతో సమసించుచుండుటచే నందలి ద్రుతమునకు ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు అని లోపము రాకతీరదు. కావునఁ జేయున్+అతఁడు చేయు+అతఁడు చే యతఁ డనియే యవుఁ గాని (నుమాగమము విధింపమి ద్రుతప్రకృతికములే యన్నను) ద్రుతము నిలిచియుండ నవకాశము లేమి చేయు నతఁ డనునిష్టరూపములు సిద్ధింపనేరవు. అహోబలుఁ డిట ద్రుతలోపప్రాప్తినిగూర్చి ప్రస్తాపింపనే లేదు. వజ్ఝలవా రయ్యది ప్రస్తావించి యిట్లు పేర్కొనిరి. ఇట ధాతూకారసంధినిషేధస్వారస్యముచే

'ద్రుతస్య సర్వత్ర లు క్సమానేషు' అనుసూత్రముచొప్పున ద్రుత లోపము గల్గనేర దని వ్యాఖ్యానము చేసికొనవలయును. కాఁగా సంధినిషేధమువలన ద్రుతము లోపింపలే దన్నమాట. కాని వీరే తక్కినధాతుజవిశేషణములచోటులందుఁ బయి సూత్రముచే సామాసికద్రుతలోపము గల్గి చేసినయట్టి చేసెడియట్టి మున్నగురూపములే యేర్పడును (245)అనిరి. ఇది విరుద్ధము గదా. వీరిమతమున ధా.వి.లు ద్రుతాంతములు. కావున చేసినన్+అట్టి, చేసెడిన్+అట్టి అని యుండును. చేయున్+అట్టి అనుచోట సంధినిషేధ ముండుటచేఁ గదా ద్రుతము లోపింపనిది. అట్లైన చేసినన్+అట్టి మున్నగు నిట్టిచోటులఁ గూడ సంధిర్న యనుసూత్రముచే సంధినిషేధ మున్నది గాఁబట్టి ద్రుతము లోపింపరాదు గదా! చేసినయట్టి యని య్రశుతి చేసియున్నా రనఁగా సంధి జరుగలే దన్నమాటయే. కాఁగా చేసినన్ (సంధి స్తు ద్రుతపూర్వస్య ప్రాయశో న భవే దత యనియు) చేసెడిన్ అనుచో సంధిర్న అని సంధి లేమిని ద్రుతము లోపింపదు.(చేయుదునవు డనురీతిగా న స్యాత్తనుసూత్రమునకు నితరస్థలములం దవకాశ మున్నట్లే సంధిర్న అనుదానికి నితరస్థలముల నవకాశ మున్నది కాన బాధ లేదు). కావునఁ జూడ నయితి ననురీతిగా నిట చేసినన‌ట్టి, చేసెడినట్టి యనురీతి గావలసియుండఁగా య్రశుతి యె ట్లయినది? పైఁగాఁ 'జేసినయట్టి చేసెడియట్టి యనురూపములే' యనుచోటియవధారణార్థకము తమసిద్ధాంతమునందలి బలమును వ్యక్తీకరించుటకుఁ గావచ్చును. అనఁగా నిట నవధారణార్థకముచే ద్రుతలోపము ఏర్పడవచ్చునని వజ్ఝలవారియభిప్రాయ మనవలెనా? లేనియెడల ద్రుతలోపముతోపాటు సంధ్యభావమును (య్రశుతియును) నియతములే యనవలసియుండు. సంధి యైన చేసినట్టియనురీతిరూపములు సాధువులు గాక పోవు గదా. నూరి వచ్చినట్టి రాముఁడు (పుట్టినిల్లు) అని సంధిని

జూపుట గమనింపవచ్చును. కాని యిట్లు సంధి యైనరూపములు వజ్ఝలవారి కిష్టములే కావచ్చును.

పైని వివరణము ననుసరించి సంధినిషేధము గలిమి చేసినన్ ఇత్యాదులందు ద్రుతలోపము చేయు నతఁ డనుచోవలెఁ బ్రాప్తింపమి చేసిన నట్టి యనియే కావలెఁ గాని చేసినట్టి యని యవుటకు వీలు లేదు. సంధి స్తు ద్రుతపూర్వస్య యను కారికావివరణమునందు వీరు ప్రాయశః అని యనుటచేత ఇఁకన్, ఇంకన్, ఇఁగన్, ఇంగన్ (పూర్ణ బిందురూపములను గూడఁ జూపుట లక్ష్యములసంఖ్య యొకింత పెంచుట కేమో?) అనువానికిమాత్రమే పాక్షిక సంధి (220) అని వ్రాసిరి. కాఁగా ద్రుత పూర్వాకారమునకు పై ఇఁకాదులు నాల్గింటఁ దప్ప వే ఱొకచో సంధి లేదు. చేయుచున్నన్+అట్టి చేయగలన్+అట్టి అనుచోట్లఁ గూడ సంధి లేదు. ద్రుతాంతము లవుట సంధి లే దన్న చేయుచున్నట్టి యిత్యాదులు గావు. ఈపక్షమున సంధ్యభావమున చేయుచున్న నట్టి యనియుఁ గావలెఁ గదా. సంధి యనలే లే దన్న చేయుచున్న నట్టి యనిమాత్రమే కావలసి యుండు. వజ్ఝలవా రిట సామాసికద్రుతలోప మవు నని భావించుటచే చేసిన+అట్టి (చేసినట్టి) చేసినయట్టి యనురీతిరూపములస్థితికి నీద్రుతపూర్వాకారసంధి నిషేధము బాధకము గా దని యెంచియుందు రనవచ్చు. కాని యది సరి కాదు. చేయునిన్+అట్టి చేసెడిన్+అట్టి అనురీతియికారస్థలములందును నిట్టిబాధ తప్పదు ద్రుతము పరమందుఁ గల యికారములకుఁ గిమాదులలోఁ బాఠము నుజ్జగించుట నటను భేదము (సంధి) లేదు (247) అని యొకచోఁ జేర్చినారు. కిమష్టి యందలియికారము ద్రుతము పరమందుఁ గలదే. అం. నను వీరు తదాదులలోను (కిమాదులలోఁ గూడ) బఠించిరి. కాఁగా నట సామాన్యముగాఁ జెనప్పిను కిమష్టిస్థలమునఁ దప్ప ద్రుతపూర్వక మైన యికారమునకు సంధి లే దనుట సారాంశము. కాఁగాఁ జేయునిన్+

అట్టి అనుచో సంధినిషేధమే యున్నది (సంధిర్న) కావున నిటను ద్రుతలోపము వచ్చుటకు వీలు లేదు. కాఁబట్టి చేసిన నట్టి చేయుని నట్టి యనియే కావలె. ద్రుతపూర్వాకారసందర్భమునఁ బైనివలెనే యిట నిబ్బంది లేర్పడుట స్పష్టమే.

కాఁగా సంధినిషేధస్వారస్యముచే చేయు నతఁ డని లోపింప దన్న చేసినయట్టి యనురీతిస్థలముల ద్రుతము లోపించుట కాకారణము చేతనే వీలు లేదనవలసి యుంట స్పష్టము. చేయు నతఁ డనురీతిగా సంధినిషేధము ప్రత్యేకముగా విధింప బడుటచే నట ద్రుతము లోపింపలే దనియు చేసిన నతఁ డను మొ॥చోట్ల సంధి యట్లు ప్రత్యేకముగా నిషిద్ధము గాకుండుటంజేసి ద్రుతము లోపించు ననియుఁ జెప్పనవునా? ఇట్లని వారును స్పష్టముగాఁ జెప్ప లేదు. అట్లు చెప్పుట సహజము గాదు. ఎట్లయినను సంధినిషేధము గలదు గదా. ఇంకను నస్యోత్తమపద ధా.వి.లకు మాత్రమే ప్రత్యేకముగా సంధి నిషేధించుట లేదే. చేయున్+అనఁగ చేయు ననఁగ అనురీతిగా నయ్యావి తద్ధర్మార్థకక్రియాపదములందునయితము (ప్రథమోత్తమైకవచనముల) సంధినిషేధమును జెప్పుచున్నదే కద.

ధాతూకారమునకు సంధినిషేధస్వారస్యముచే చేయున్+అతఁ డనుచో ద్రుతము లోపింప దనిరి. చేసెడున్+అతఁ డనురీతిగా నీధాతుజవిశేషణము డు(న్) వర్ణాంతమై యున్నపుడు నట్లే లోపింపదా? క్రియాపదస్థలమునఁ దిప్పనకే డు ఆదేశము చేసిరి. విశేషణ మైనపు డయ్యది ధాతువున కాగమ మగునా? అస్పష్టము.

అసలు సంధినిషేధమునకును సామాసికద్రుతలోప మవుటకును సంబంధమేమి? సంధినిషేధము ప్రాప్తించుటకు ద్రుతలోప మగుట బాధకమా? (సామాసికలోపము గానిచో) సంధివిధానసామర్థ్య

ముచేత (లేదా అచాం సంధౌ యని సంధియుండే ద్రుతము లోపించు ననుటచేతను) సంధి లేనపుడు ద్రుతలోపము కాదు. సంధినిషేధ మున్న నెట్లును గాదు. ఇట వచ్చు ద్రుతలోపము సంధి జరుగుటకై సంధియుం దవుచున్నది గాదు గదా. ఇట్టిసంధితో సంబంధము లేక (యచ్చే పర మైనను లేదా హల్లు పర మైనను) సమాసము గావుట వలన నవునది. సమాసమున ద్రుతము లోపించిన దే యనుకొందము. సంధినిషేధము ప్రవర్తించుట కిబ్బంది యున్నదా? చేయున్ అతఁ డని యుండఁగా ద్రుతలోప మై చేయు+అతఁ డని యైన నిట సంధి నిషిద్ధ మైనది. కావున యశ్రుతి వచ్చి చేయు యతఁ డని కావచ్చునే. భామయొక్క-భామన్+ఆసనము అని యుండ సమాసమున ద్రుతము లోపించి భామ+ఆసనము అని కాఁగా యశ్రుతితో భామయాసన మని యవుట లేదా? సంధి లేకుంటను బట్టి సామాసికద్రుతలోపము వారింపఁబడినదా? సామాసికద్రుతలోపమునకును సంధినిషేధము నకును బాధ్యబాధకసంబంధము లే దనక తీరదు. వి.వి.కర్త యే 'వినా లవర్ణం నో సంధిః మిశ్రతత్సమయో ర్లుకి' యని చెప్పుచున్నాఁడు సామాసికద్రుతలోపానంతరము లవర్ణముఁ దప్ప సంధి లే దని.

కాఁగా వజ్ఝలవా రిచట సంధినిషేధస్వారస్యముచే ద్రుతము లోపింప దనుట యుచితము గాదు. అయినఁ జేయు యతఁ డనురీతి నపరూపములు గావా? అనవచ్చును. అయ్యవి ప్రయోగవిరుద్ధము లనుమాట వాస్తవమే. ఐనను ప్రయోగములనుబట్టి యిట నిర్ణయ మెట్లు? ఇంకను ప్రయోగానుగుణముగా ద్రుతము లోపింప దన్నను గొంతయేని కుదురు నేమో కాని సంధినిషేధమువలన ద్రుతలోపము లే దని శాస్త్రమున సమన్వయించుట సరి కాదు. అపరూపసాధన మేల? ప్రయోగానుగుణముగా సమ్మోచిత యని స్వరపరకత్వమున

నిట సమాగమమే చేయుదుము. ఏ విషయమైన ననుక్త మయినను గొంత సహ్యము గాని దురుక్త మనుట యుక్తము కాదు. కాన దద్ధర్మార్థక విశేషణముల కృదంతముల కచ్చరకత్వమునఁ జింతామణి వి.వి. సమాగమము చెప్పలే దనుటేని గొంతయుక్తమే.

ఇవి యెల్ల ధా.వి.లు ద్రుతప్రకృతికము లనుపక్షమున. ధా.వి.లు ద్రుతప్రకృతికములా? కళలా? యనునంశమునునికిని పూర్వస్థలాంతరమున విస్పష్టము. చేయు+అతఁ డనియే యుండుఁ గాని చేయున్ అనురీతి నుండదు. (సమాగమ మన్యథా సమ్యోతః– సాధించికొనఁ దగు.) కాఁగా నహోబలుఁ డీసూత్రమునొద్ద ధా.వి.లను బ్రస్తావించుటయు దాని వజ్ఝలవా రామోదించి సమర్థించుటయు సముచితములుగా వని నిర్ణయింపవచ్చును.

వి.వి. 'ప్రథమ శ్చోత్తమ శ్చైవ' మున్నగా ప్రథమోత్తమ పురుషైకవచఃపదములనే యిటఁ బ్రస్తావించినది. కాని భేదకములను బేర్కొనలేదు. (అహోబలపతియే స్వప్రక్రియానుగుణముగ నింత మాత్రమే గ్రహించి ధా.వి.లను గారికలోఁ జేర్పకుంట విశేషమ యనఁదగు.)

ఇట్లు వజ్ఝలవారిసమన్వయము ననుసరించి చూడ నస్యోత్తమ సూత్రమునకుఁ గ్రియాపదములే కాక ధా.వి.లు కూడ లక్ష్యములు గాకుండఁ బోయినవి. నస్యోత్తమసూత్రమున కీపక్షమున లక్ష్యము లసలే లేవన్నమాట.

ఇంక నహోబలునిమతమున ధా.వి.లు గ్రహింపఁబడినను నిష్ట రూపములు సామాసికద్రుతలోపముచే సిద్ధింపవు. కావున నవ్వాని నిట గ్రహించుటవలనఁ బ్రయోజనము లేదు. కావున వానిని బ్రస్తావింపరాదు. కాఁగా వి.వి.వచనానుసారముగా నిట నాతనిమతము నను గ్రహింపఁదగినవి ప్రథమోత్తమపురుషైకవచఃపదములు రెండు

మాత్రమే. ఇది యిట్లు గ్రహింపఁబడుటవలన స్థలాంతరమున నిబ్బందులు మాత్ర మధికముగనే యున్నవి.

'సంధిర్న' యనుసూత్రము ద్రుతపూర్వోకారమునకు సైతము సంధిని జెప్పుచున్నది. కాఁగా నస్యాత్త్యనుసూత్రము తద్ధర్మార్థకక్రియాపదములయందు మాత్రము ద్రుతపూర్వోకారమునకు సంధినిషేధమును జెప్పుచున్నది. కాఁగాఁ దద్ధర్మేతరస్థలములం దుకారమునకు 'సంధిర్న' యనుసూత్రముచే సంధి నిత్యముగనే రావలసి యున్నదని స్పష్టమే కదా.

ఆనంతర్యార్థకమగు దువర్ణము ద్రుతాంతమె. కావున వేవెలుంగు తోఁతెంచుదున్ అబ్జంబులు వికసిల్లు అనుచో ద్రుతపూర్వోకారమునకు నిత్యసంధి రావలసియే యున్నది. తోఁతెంచు దబ్జంబులు అని మాత్రమె యగును. సాధువైన తోఁతెంచుదు నబ్జంబులు అనునది యసాధువె యగును.

ఇట్టె కృష్ణుఁడున్+అర్జునుఁడును కృష్ణుఁ డర్జునుఁడును అని మాత్రమే యగు నువర్ణము ద్రుతాంత మనుట సరి గాదు కావున కృష్ణుఁడు నర్జునుఁడు ననురూపమునకుఁగా నవకాశము లేదు. ఇట్టె అదియున్+ఇట్లనియె అది యిట్లనియె నని మాత్రమె యగు. చింతామణి యిట్టిశబ్దములనుగూర్చి పేర్కొనలేదు. కాని అన్యయని ద్రుతప్రకృతికములలోఁ జేర్పకతప్పదు గదా.

ఇంకఁ జింతామణి సాధించియున్న- ద్వితీయాస్థలములందు మాత్ర మెట్లు? రామున్+అభిరామున్- రాము నభిరామున్ ధనమున్+అడిగె- ధన మడిగె వసువున్+ఇచ్చె వసు విచ్చె కొడుకున్+ఒసఁగె కొడు కొసఁగె విపరీత యపరూపములు తప్పవా?

కాఁగా న స్యాత్తనుసూత్రము ననుసరించి తద్ధర్మార్థకక్రియాపదములకంటె భిన్నములగు స్థలములం దెల్లయెడల ద్రుతపూర్వోకారమునకు సంధినిషేధము లేమి 'సంధిర్న' అని ప్రాప్తించుసంధిని వారించుట కెట్టియాధారమును లే దనక తీరదు గదా. ద్రుతపూర్వోకారమునకు బెక్కెడల సంధ్యభావమే యుండఁగాఁ దద్ధర్మస్థలములందు మాత్రమే సంధి లే దని చెప్పుట పొసఁగు టెట్లు?

అందుచేఁ గొందఱు న స్యాత్తద్ధర్మేత (నః) అని నకారాగమపరముగా నీ సూత్రమును భావించిరి. బాలసరస్వత్యాదులు న స్యాత్తనుపాఠముతో సంధినిషేధపరముగా వ్యాఖ్యానించుట యొక్కటియే ఈయాగమపాఠాంగీకారములో బాధకాంశము. అట్టియెడల న స్యాత్తనునది సరియైనపాఠము గా దన్నపక్షమున న స్యాత్తను నీసూత్రము సంయుతములు క్వంశ్లేషా నాచి యనుసూత్రమువలెనె సిద్ధలితార్థానువాదక మని యహోబలుఁ డుపేక్షింపవలసియుండు ననిపించును. వజ్ఝలవారిమతమును బైని జూచితిమే కద. ఇట నెట్లును లక్ష్యములు లేవు.

కాఁగా ఏ 'న స్యాత్తద్ధర్మేత' యనుసూత్రముసార్థక్యము నకయి యనఁగా సంధినిషేధపర మయినయర్థము ప్రయోజనవంత మగుటకొఱకయి చింతామణి (వి.వి.ల) యందలిసంధిని విధించు సూత్రము లెల్లను ద్రుతమునకు ముందున్నయుచ్చునకు సంధి చెప్పుచున్న వని యంగీకరించిరో యాన స్యాత్తనుసూత్రమునకు వజ్ఝలవారి మతము ననుసరించి యసలు లక్ష్యములే లేకపోఁగా నహోబలుని (వి.వి.) మతమున లక్ష్యములు కొన్ని కలవు. కానీ యితరస్థలములం దనర్థమే యధిక మవుచున్నది అట్టియెడల సంధినిషేధపర మగు నస్యాత్తనుసూత్రము వ్యర్థ మగుటయే కాక యనర్థకము నైయున్న దనకతప్పదు.

న స్వ్యాత్తనురీతి నకారాగమపర మైనయర్థమును గ్రహించుచునాపాఠమును ప్రమాణీకరించుచోఁ బైరీతియనర్థము లేవియు నుండవు. అంతే కాక (సూరిసమ్మతములగు) చేయు నతఁ డనురీతిరూపములు ప్రసిద్ధములు స్పష్టముగా సాధింపఁబడుట యను ప్రయోజన విశేషమును సిద్ధించు.

కాఁగా నహోబలాదులవివరణమార్గము ననుసరించి చూచిన నొక్కయంశము స్పష్టము. నస్యాత్త్ని యాసూత్రము ద్రుతపూర్వోకారమునకు సంధి నిషేధించునది కా దనియే భావించునెడలఁ జింతామణియందలిసంధివిధానములు ద్రుతపూర్వస్వరమునకు సంధిని జెప్పునవిగాఁ జెప్పవలసినయవసరమే లేదు.

ద్రుతపూర్వస్వరమునకు సంధి ప్రాప్తింపనేర దని భావించుటయుఁ గేవలము నిరాధారము గా దని గుర్తింపఁదగును.

'అనాదిష్టు విభక్తిష్వాత్ వా' యనుసూత్రముప్రకారము ప్రథమేతరవిభక్తులయం దున్నయుకారమునకు సంధి వైకల్పికము. నాకొఱకున్+ఇచ్చె నని యుండఁగా సంధి జరిగినచో నాకొఱకిచ్చె నని యగును. కాని సంధి లేనిస్థితిలో నాకొఱకున్ - ఇచ్చె అని యుండ (అచాం సంధౌ యనియు ద్రుతము లోపింపనేరదు గావున నది యట్లే యుండఁగా) యశ్రుతి మార్గ్యా లఘుయం ప్రవద న్ని ప్రాణతః పరం ప్రాణమ్ అనుసూత్రముచే యశ్రుతి రానగునే కద. నాకొఱకు న్యిచ్చె నాకొఱకు యిచ్చె (నాకొఱకును యిచ్చె ?) అను నట్టిరూపములు గావలయును-ఇట్టియపరూపములు సాధించుట యే తదభిప్రేతమా ?

'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' ననుసూరిలక్షణమున 'స్వరంబుకంటెం' ననుతఱము

చేత ద్రుతప్రకృతికములపైని స్వరమునకు యడాగమము రా దని గు. ప్ర. ప్రభృతివ్యాఖ్యలు స్పష్టము చేసియున్నవి. సూరి ద్రుతమును న(ని) స్వరూపముగ భావించినవాఁడే యయ్యును స్వరపరకత్వమున ద్రుతమును (స్వరలోపము దాదాపు నియతముగనే చేసి) వ్యంజనమాత్రముగానే చూపియున్నాఁడు. నాకొఱకున్ ఇచ్చె ననుచో సంధ్యభావసందర్భమున మీఁది స్వరము ద్రుతమునకు ననఁగా నిటఁ బొల్లునకారమునకు ననఁగా పొల్లునకంటెఁ బర మయినది కాని స్వరంబుకంటెం బరం బయినది కాదు గదా. కావున నట యడాగమము లేదు. కావున పొల్లనకారము పయియచ్చుతోఁ గూడి నాకొఱకు నిచ్చె ననియే యగును గాని నాకొఱకు న్యిచ్చె నిత్యాదిగాఁ గాదు. ఇట్టిసమన్వయము సముచితముగనే యున్న దనవచ్చును.

ఇటఁ గూడ నదే విధముగాఁ జింతామణికర్త యశ్రుతిని జెప్పునపుడు 'ప్రాణాతః పరం ప్రాణమ్' అనుట గమనింపవచ్చును. ప్రాణాతః అనుటచేఁ బరప్రాణము స్వరంబునకంటెఁ బరం బయినది కావలె. ద్రుతప్రకృతికములయెడ సూరిమతమునవలెనె యిటఁ గూడఁ బొల్లునకారముగు ద్రుతమునకు ననఁగా పొల్లునకుఁ బరముగా నుండుటచే ప్రాణాతః పరం ప్రాణమ్మని చెప్పిన పరస్వరమునకు యశ్రుతి రాదని గుర్తింపనగును. ఇట పొల్లునకుఁ బర మవుటచే యశ్రుతి రాలే దనఁగా నాకొఱకున్-అనుచోటియుకారము స్వరమునకంటె ఇచ్చె అనునప్పటియికారము పరమయినది గా దన్నమాట. అనఁగా నాయుకారమునకుఁ బరస్వరముతో ద్రుతమువలన వ్యవధానము గల్గఁగా ద్రుతముతోడియవిరోధమువలనఁ బరప్రాణము ప్రాణముకంటెఁ బర మయినది కాకపోవుటచే యశ్రుతి రాలేదు. అనఁగా యశ్రుతి యగుటకు ద్రుత మవరోధమే యని స్పష్టము.

యశ్రుతి కావలసినప్పు డట్టి ద్రుతము సంధి యగునప్పుడు మాత్ర మేల కాదు. యశ్రుతిని విధించునపుడు డెట్లు ప్రాణాతః పరం

ప్రాణ మ్మని యున్నాఁడో యట్లే సంధి విధించుస్థలమునసైతము 'సంధిర్నాచోఽచ్యసతి' యనుచో 'అచః అచి' యనియే చెప్పెను. ఇందలి యచి యనుపదమును దరువాతిసూత్రములలోని కనువర్తించి 'అనాదిష్వు విభక్తిష్వాతో' వాచి యని యవియు నచ్చునకంటె నచ్చు పర మగునపుడే గదా. కాఁగా యశ్రుతిసందర్భమునవలెనే యీ సంధిసందర్భమునను 'స్వరంబుకంటె స్వరంబు పరం బగునపు' డనియే చెప్పియున్నాఁడు. కాఁగా ప్రాంతేః ప్రాణ మ్మని విధించినయశ్రుతి ద్రుతాంతములపై వచ్చునని (అనఁగా యశ్రుతికి ద్రుతము ప్రతిబంధకము కాదని) యంగీకరించినచో సూత్ర్యాదిసంధిసందర్భములందు నయితము ద్రుతము పూర్వస్వరమునకు సంధి నంగీకరింపఁదగును. ద్రుతముపై యశ్రుతి యనిష్టమనుట స్పష్టమే. కాఁగా నట యశ్రుతి వారించుటకు ద్రుతము ప్రతిబంధక మని యంగీకరింపఁగా ద్రుతపూర్వస్వరమునకు సంధిని ప్రస్తావించుటకు వీలు లేదు. అనఁగా సంధి యవుటయందును ద్రుతము ప్రతిబంధకమే యని యంగీకరించుట సక్రమమే యవుచున్నది.

ద్రుత మిట్లు సంధికిఁ బ్రతిబంధక మవుటను భావించుటచేతనే చింతామణిలో ద్రుతపూర్వస్వరమునకు ఇఁకాదులకుఁ దప్ప నని బాలవ్యాకరణమునందువలెనే సంధినిషేధము విధించి యుండలే దని గుర్తింపఁదగును. అయిన నిట ననుమానము స్వరంబుకంటెం బరం బయినస్వరంబున కని చెప్పినసూరిమతమునను చింతామణియందువలెనె ద్రుతము సంధిప్రతిబంధక మవుచుండఁగా సంధిప్రాప్తింపమి 'ఇఁకాదులకుఁ దప్ప, నని సంధినిషేధ మేల? సూరిమతమున ద్రుతము సంధిప్రతిబంధకము కాదా? అనఁగా నిఁకాదిసూత్రసందర్భమును బరిశీలింపవలసియున్నది.

ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లే దను సూరిలక్షణము ద్రుతపూర్వస్వరమునకు సంధి నిషేధించుచున్నది. నిషే

ధము ప్రాప్తిపూర్వకము కావలయును గావున నిట ద్రుతపూర్వ స్వరమునకు సూరిమతమున సంధి ప్రాప్తించుచున్న దనియే తలంప వలెను. అనఁగా ద్రుతము సంధికిఁ బ్రతిబంధకము గా దనవలసియే యున్నది. వజ్ఝలవారీయభిప్రాయము సంగీకరింపలేదు.

ఇఁకారాదిలక్షణము 1. ద్రుతప్రకృతికములలో నిఁకారాదులకు సంధిని జెప్పుట, 2. తదితరద్రుతప్రకృతికములకు సంధిని నిషేధించుట యను రెండంశములు గలిగియున్నది. ఇఁకారాదులకు సంధిని జెప్పుటయే సూత్రమున విధేయాంశ మనుచు వజ్ఝలవారు ద్రుతప్రకృతికముల సంధినిషేధము ప్రధానాంశ మనునభిప్రాయమును దిరస్కరించిరి. తమ సిద్ధాంతమునకుఁ వారు గొన్ని హేతువులు చూపియున్నారు. వానిం బరిశీలింతము.

బాలవ్యాకరణపక్షమున ద్రుతము నుస్వరూపము కాన బాల వ్యాకరణపక్షమున ద్రుతపరకస్వరమునకుఁ బ్రత్యేకవిధానస్థలము లందు విధానసామర్థ్యమున ద్రుతలోపపూర్వకపరరూపసంధి ప్రాప్తించునే కాని తదితరస్థలములందు 'ను' వ్యవధానమున ద్రుతపరకస్వరమునకుఁ బరరూపసంధి ప్రాప్తింపనేరదు. అచటఁ బరరూపసంధి ద్రుత స్వరమునకే ప్రసక్త మగును. (వ్యా.సం.న. 275)

వీరంతకు ముందు నిదే యభిప్రాయమును వివరించుచు "స్వర పరకత్వమందున్నైతము సంధ్యుదాహారణసందర్భమున ద్రుతస్వరూప మును బరరూపసంధిసందర్భమున సాకల్యముగ ద్రుతలోపమును సంభ వించు నని యెఱుంగునది (214) అనిరి.

ఈ మాటలనుబట్టి స్వరపరకతలో సంధివిధాన మున్నచోట్ల ద్రుతస్వరలోపమును (సంధి యువుచోట్ల ద్రుతలోపమును) సంగీకరించుట స్పష్టము. సంధివిధానము లేనిచోట్ల ద్రుతస్వరలోపావకాశము

లేదు. కావున వచ్చును+అతఁ డని స్వరసహితముగనే యుండును గావున ద్రుతస్వరమునకె పరరూపసంధి యగు నన్నమాట. కాని పైని వీరు చెప్పుచున్నమాటలనుబట్టియే స్వర ముండఁగా ద్రుతపూర్వ స్వరమునకు స్వరపరకత్వము సిద్ధింపదు గాన నట సంధిప్రసక్తియే ద్రుతపూర్వస్వరమునకు లేదు గదా. అట్టియెడ ద్రుతపూర్వస్వర మున కీఁకాదులలోఁ దప్ప సంధి లే దని చెప్పుట యేల? ప్రాప్తి లేకుండఁగనే నిషేధావసర మేమి? సంధి లే దని సూరి యేరూపము సాధించుచున్నాఁడో యదే రూపమును వజ్ఝలవారు సంధి యయిన రూపముగా సాధించుచున్నారు.

సంధ్యుదాహరణసందర్భమున ద్రుతస్వరలోపము చేయవలె నని వీరు సంగీకరించిరి. సంధి చెప్పుటనుబట్టి, ద్రుతమున స్వర మున్న ద్రుతపూర్వస్వరమునకు సంధిప్రసక్తి యుండదు గదా. సంధివిధా నము లేనిసమయములందును సూరి ద్రుతపూర్వస్వరమునకు సంధి నిషేధించుచున్నాఁడు. అంతే కాక చూడన్+అయితి ననురీతిగా ద్రుతస్వరలోపముతోనే యుదాహరించియున్నాఁడు కూడ. కాఁగా నిట్లు ద్రుతపూర్వస్వరమునకు సంధి నిషేధించినసామర్థ్యముచేతను ద్రుతస్వరముతో నుదాహరించినసామర్థ్యముచేతను నిచ్చటఁ గూడ ద్రుతస్వరలోపము సంగీకరింపవలసియుండుటయు స్పష్టమే కద. ఎక్క డెక్కడ సంధి జరుగునో యసలు సంధిసందర్భ మెక్కడ నున్నదో యక్కడ నెల్ల ద్రుతస్వరలోపము సంగీకరించితిమి. చెప్పఁగా మిగిలిన చోట్ల సంధి నిషేధించుచున్నాడు. కావున నిచ్చటను (ద్రుతపూర్వ స్వరమునకు సంధి యసలు లేనిసందర్భములందును) ద్రుతస్వరలోపము సంగీకరింపక తప్పదు. ఇంక (స్వరపరకతలో) ద్రుతస్వరలోపము

లేనిది యెక్కడ? మఱి ద్రుతస్వరమునకుఁ బరరూపసంధి యవుసది యెక్కడ? మొత్తముమీఁద వజ్ఝలవారివివరణము ననుసరించియే వచ్చెను - అతఁ డని యుండుటకాని ద్రుతస్వరమునకుఁ బరరూప సంధి యవుట యున్నది గాని సూరిసమ్మతము గా దనియు నింక సంధి యవుసందర్భములందే కాక సంధినిషేధసందర్భములందు సైతమనఁగా స్వరపరకత్వమున బాదాపుగా నెల్లయెడల ద్రుతస్వరమునకు లోప మగుటయే సూరిసమ్మత మనియు స్పష్టముగా గుర్తింపఁదగి యున్నది.

నిజమునకు వీరిపద్ధతి ననుసరించినచో సంధివిధానసందర్భము లందు సయిత ముదాహరణసామర్థ్యముచేతనే ద్రుతస్వరలోపము చేయవలసియున్న దేమో యనిపించును. (కిమపి శత్రర్థమువర్ణంబు లని యుచ్చరించిన చోట్ల నట్లుంచిన) ప్రథమేతరవిభక్తిస్థలముల నుకారమునకు సంధి యన ద్రుతపూర్వస్వరమునకే యని యెట్లర్థము చేయవచ్చు? ద్రుతస్వరమునకే యని భావింప నవకాశము లేదా? తృతీయాదులకు నుగాగమము చెప్పఁబడినది. నాకొఱకును అనుచోటి నుక్కు విభక్తి కంత్యావయవముగాఁ జెప్పిన దవుటచే విభక్త్యవయ వమే యవును. విభక్తియుకారమున కన 'నాకొఱకును' అనుచోట ద్రుతరూపనువర్ణమునందలియుకారమే గ్రహింపరాదా? అట్టి యెడల వికల్పవిధానము ననుసరించి నాకొఱకు నిచ్చె నని యవుఁ గాని నాకొఱ కిచ్చె నని కాదు. ఇంకను నాకొఱకును యిచ్చె మున్నగు నపరూపములకును నవకాశ మేర్పడుచున్న దనవచ్చును గదా, అని యనుమానము.

ఇఁకను 'నన్నును' అనుచోటి చివరినువర్ణమే ద్వితీయావిభక్తి. సూరి తృతీయాదులకు నుక్కును జెప్పెను గాని ద్వితీయకుఁ జెప్ప లేదు గాన నన్నును మమ్మును అనురీతి వానియందలినువర్ణము

ద్వితీయావిభక్తియే కాని యాగమనువర్ణమును గాదు. న్నువమ్ములలో నుకారము విభక్త్యకార మవు టెట్లు? అన్ని నువమ్ములు విభక్తి కాగమములుగా వజ్ఝలవారు నూహించిరి. (విభక్తికి ముందయిన న్నువమ్ములలోనియుకారము విభక్త్యకార మైనట్లు కిత్వముచే సంతాన్య వయవముగా నయిననుగాగమమందలియుకారమును విభక్త్యకార మవుట స్పష్టమే.) కావున సర్వనామపక్షప్రక్రియ సూరి యుపదేశింప లేదు గావున న్నుమ్ముతే ద్వితీయాప్రత్యయములు గాఁ గా నిట మాత్రము ద్వితీయకు నుగాగమ మైన దని భావింపవలసినయవసరము లేదు. అట్లే భావించినను నుగాగమమందలియుత్తునకు సంధి ప్రాప్తించుట యింతకుముందు స్పష్టమే. ఇట్లె యిఁకాదులయెడను.

అవుఁ గాక. వజ్ఝలవారు పేర్కొన్నట్లుగాఁ జైవిధానస్థలము లందు సంధి ద్రుతపూర్వస్వరమునకే కాని ద్రుతస్వరమునకుఁ గా దని యందము. ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లే దను నిచ్చట నెచ్చట? ఇట్టిచోట్ల సంధివిధానము లేమి ద్రుతస్వరము లోపింప దనియే వజ్ఝలవారియభిప్రాయము. ఇటఁ గూడ లోపించిన ద్రుతస్వరమునకుఁ బరరూపసంధిప్రసక్తియే లేమి స్పష్టమే. కాఁగా నిచ్చట నిఁకాదిభిన్నములలో ద్రుతము స్వరసహితమె యై యుండును. ద్రుతప్రకృతికములకు సంధి లే దనెనే కాని సూరి ద్రుతపూర్వ స్వరమునకు సంధి లే దనలేదు. ఇట్లు ద్రుతము స్వరసహితమె యై యుండఁగా ద్రుతపూర్వస్వరమునకు ప్రత్యేకవిధానము లేనిచో సంధి ప్రసక్తియే లేమి నిట సంధి ప్రాప్తింపమి నిషేధించుట వ్యర్థ మనుట ట్లుంచి) కావున చూడను+అయితి అనుచో ద్రుతప్రకృతిక మున కనఁగా ద్రుతప్రకృతికముతుదిస్వరమున కని యర్థము. ఇట ద్రుతమున స్వరము లోపింపమి నాద్రుతస్వరమునకె యని వ్యాఖ్యానింపవలె. అట్టిదానికి సంధి లే దని గదా సూరి చెప్పుచున్నాఁడు. కావున వచ్చెను+అతఁడు, చూడను+అయితి అనుచో ద్రుతప్రకృ

తిక స్వరమునకు సంధి లేదు (ద్రుతస్వరము లోపింపదు) స్వరంబు
కంటె స్వరంబు పరం బయినది గావున యడాగమము వచ్చి వచ్చెను
యతఁ డిత్యాదిగాఁ గానక్కర లేదా? కాఁగా నిచ్చోట ద్రుతము
స్వరము లోపింపక యున్న నిందు విధింపఁబడినయాసంధినిషేధము
ద్రుతస్వరమునకె యగును. ఇట్లును ద్రుతస్వరమునకుఁ బరరూప
సంధి లే దని నిర్ణయింప వీరివివరణమునుబట్టి వీ లేర్పడుచున్నది.
స్పష్టప్రతిపత్తికిఁగా వచింపఁబడిన (215) యీవిధానమువలన నవ
రూపములే యేర్పడుట విశేషము.

కాఁగా నిట నిషేధింపఁబడినసంధియు ద్రుతపూర్వస్వరమునకె.
ద్రుతమున స్వర ముండఁగా నయ్యది యప్రసక్త మగు నని మొద
లుగా వారు వివరించినదానింబట్టియే యిట సంధి నిషేధించినస్థలములం
దును ద్రుతమున స్వరము లోపించు ననియే చెప్పవలె. ఇంతయు నేల?
సూరియే సంధి రానిరూపముల నుదాహరించుసందర్భమున ద్రుతస్వర
లోపము చేసియే చూపియుండఁగా ద్రుతము స్వరసహిత మగుటయు
నిట ద్రుతలోపము లే దనుటయు నెట్లు? ఇంక నిచ్చటను ద్రుతస్వర
లోపము నంగీకరించినచో సంధివిధానస్థలములందు సంధి నిషేధస్థలము
లందును ద్రుతస్వరము లోపించుచునే యున్నది. కావున ద్రుత
స్వరమునకుఁ బరరూపసంధి ప్రస్తావనమే యుండదు. వచ్చెను+అతఁడు
అనురీతిగాఁ జూపుటయు సరికాదు.

ద్రుతము నుస్వరూప మని సామాన్యముగాఁ జెప్పికొనినందు
వలనఁ గాఁబోలును 'బరరూపసంధి ద్రుతస్వరమునకె' యని పేర్కొ
నిరి. ఉత్తునకు సంధి యవుచునే యుండును గాన నట వైపరీత్య
ముండదు. కాని నువర్ణమునుత్వమున కిత్వమైనచోట్ల నదియే
ద్రుతము. రాముని గొలిచెద ననురీతిగనె గదా ద్రుతస్వత్వ
ముండును. ఇట్టిచోటుల హరిని+అడిగె శ్రీని+ఇచ్చె ననురీతిస్థలము

లందుఁ బరరూపసంధి యెట్లు ? కివష్టివలె నిద్వితీయ నేమ్యాదులలో సూరి చేర్పలేదు. అత్యాది యాకృతిగణము యవుటచేఁ జేర్పరాదా యనరాదు. అట్లు చేర్చుటయే సూరి యుద్దేశమైన నిద్వితీయను జెప్పక (తరువాతిదగు) కివష్టి నొక్కదానినే పేర్కొనననుట యుచితము కాదు గదా. అట్టియెడల వారిని యడిగె, శ్రీని యిచ్చె ననురీతి యపరూపములుమాత్రమె యగును. ఆకృతిగణ మని సాహసించి మనమే చేర్చినను నేమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికము గావున. వారి నడిగె ననురీతిరూపములతోపాటు వారిని యడిగె ననురీతి యప రూపములు సయితము సాధింపఁబడినట్లే కదా. ఇట్లే వచ్చితిని+అంటిని వచ్చితిని యంటి, చూచెడిని యనె ననురీతిగా నపరూపము లేర్పడిని వజ్ఝలవారిసిద్ధాంతపక్షమున నేర్పడుచున్నవి.

కాఁగా ద్రుతస్వరమునకు బాలవ్యాకరణపక్షమున నెంతమాత్ర మును బరరూపసంధి ప్రసక్తి లేదని గుర్తింపవలె. స్వరపరకత్వమున ద్రుతస్వరలోపము దాదాపుగా నెల్లయెడల సూరిమతమని గ్రహింప వలెఁ దద్విరుద్ధ మగువజ్ఝలవారియభిప్రాయము సరి కాదు.

అహోబలుఁడు చింతామణియందుఁ బేర్కొన్నట్లుగా సంధి యువ్వ స్థలములలో విధానసామర్థ్యముచే ద్రుతలోపమును గుర్తించుట యుచితమే.

"ద్రుతప్రకృతికముల ద్రుతపరకస్వరముల కెల్లయెడలను బర రూపసంధి ప్రాప్తించుచుండఁగాఁ బ్రత్యేకముగా సంధి విధించుస్థల ములఁ దప్పఁ దక్కినచోటులందుఁ బ్రాప్తించుపరరూపసంధిని ఇఁకాది సూత్రము వారించుచున్న దనియు సూరికే యభిప్రాయ మున్నయెడల నాతఁ డట్టివిషయమును స్పైతము ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని అని వివరించినరీతిని యిఁట వివరించి

యుండఁడా? అచాం సంధా విత్యాద్యథర్వణకారికార్థమును వచించి యుండఁడా?" అని పేర్కొనిరి. ఇదే మార్గములో నిట్లాలోచింప వచ్చును. వ్యాఖ్యలవారు పేర్కొన్నట్లుగా నిఁకాదులకు సంధి విధించుటయే ప్రధానోద్దేశమైనచో 'ఇఁకాదులకు సంధి వైకల్పికముగా నగు' నని సూరి సూత్రించియుండఁడా? ద్రుతప్రకృతికములకు సంధి లే దనుస్పష్టార్థమును జెప్పుకొన నేల? ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున నని సర్దుకొన నేల? ఇఁకాదులకు సంధిని జెప్పుటయే ప్రధానమైన సంధి వికల్పముగా జరుగు ననుదానిని-వీనికి సంధి వైకల్పిక మని వివరణములోఁ జెప్ప నేల? ప్రధానమైనసంధివిషయమునే వివరణములోనికి నెట్టి యప్రధానమును స్పష్టము నై యున్న ద్రుతప్రకృతికములకు సంధి లే దన్న యంశము సూత్రమునఁ జెప్పె ననుట యుక్తమా? సూత్రవివరణముల తీరు ననుసరించి చూడఁగా ద్రుతప్రకృతికములకు సంధి లేమిని జెప్పుటయే ప్రధాన మనియు నిఁకాదిసంధివిషయ మప్రధాన మనియు గుర్తింపవచ్చును.

ఇఁక వా రన్నది- ద్రుతపరకస్వరమునకు సంధి ప్రాప్తించుచుండఁగా నిషేధించుటయే సూరి యుద్దేశమయిన నాతఁ డది వివరించియుండఁడా యన్నది. దీనికి వివరణ మేల? ద్రుతప్రకృతికములకు సంధి లేదు అనుసూత్రము ద్రుతస్వరమునకు సంధి నిషేధించున దనరాదు గదా. కావున ద్రుతపరకస్వరమునకె సంధిని సూత్రము నిషేధించుచున్నది. సూత్రముచేతనే యీయర్థము నట సూరి చూపిన సూత్రలక్ష్యములలోను స్పష్ట మగుచుండఁగా దానికిఁ బ్రత్యేక వివరణ మేల? ఇఁకాదులకు సంధి వైకల్పిక మని వివరించెను గాని యట్టిసంధి వికల్పతకే లక్ష్యము లీలేదు. అయ్యది ప్రధానోద్దేశ మనుట యొప్పునా?

ఇఁకఁ బై యభిప్రాయమే ద్రుతపరకస్వరసంధి ప్రాప్తమే యని యన్న అచాం సంధౌ అని వివరింపఁడా? అనుచు దింకొకటి వారు పేర్కొనిరి. ద్రుతపరకస్వరసంధి సూరి యుద్దేశము గా దనుటకు వివరింపకున్న నష్టము లేదు. వివరించిన నయ్యది స్పష్టతకే యనవలసియుండు. ఏ లన నసలు సంధి యనఁగాఁ బూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశం బగుట యని సూరి స్పష్టము చేసెనే కద. అట్టిది జరుగవలయు నన్న నాపూర్వపరస్వరములకు నడుమ నున్న ద్రుతము లోపింపవలయును. కాఁగా నట్టిసంధి విధించినస్థలములలో నడుమ ద్రుతము సంధివిధానసామర్థ్యముచేతనే లోపించును. 'అచాం సన్ధౌ' యనులక్షణమును చింతామణి చెప్పలేదు. అహోబలుఁ డటఁ గారిక లే దని ద్రుతలోపము లే దనియెనా సంధివిధానసామర్థ్యము చేతనే ద్రుతముయొక్క యదృశ్యత జ్ఞాపిత మయినట్లు వివరింపలేదా? అట్లె బాలవ్యాకరణమునందును. సంధివిధానమువలననే సంధి యవుటకు వీలుగా ద్రుతలోపము సిద్ధించుచుండగా 'అచాం సన్ధౌ' యను రీతిగా నధర్వణుఁడు చెప్పుటయే స్పష్టతకు. అది లేకున్న సంధి రాదన్న నాయయిసంధివిధులు వ్యర్థములు గావా? సంధి చెప్పినచోట్ల సంధివిధానసామర్థ్యముచేతనే ద్రుతము లోపించుచున్న దని గ్రహింపఁదగు. దీనివలన సంధ్యభావస్థితిలో ద్రుతము లోపింపకుండుట యన్నదియు సిద్ధమే యవుచున్నది. అందులకే చింతామణియందు నన్న నడిగె ననురీతిగా సంధ్యభావస్థితిలో ద్రుతము లోపింపక నిల్చియుంట సిద్ధించుచున్నది. బాలవ్యాకరణమున ఉత్తున కిత్యాదిసూత్రములచే ద్రుతపరకస్వరమునకు సంధి ప్రాప్తించుచున్నను (అట్టి సంధి ప్రాప్తిచేఁ దదనుగుణముగా ద్రుతము లోపింపవలసియున్నను) నీయిఁకాదిసూత్రముచే ద్రుతపరకస్వరమునకు సంధి నిషేధింపఁబడినది. కావున సంధిలేమి నిట ద్రుతలోపమును సిద్ధింపదు. ఇట్లు సంధి విధాన సామర్థ్యముచే ద్రుతలోపమును సంధ్యభావస్థితిలో ద్రుతలోపాభావ

మును సిద్ధించుచునే యుండఁగా నఃటల అచాం సన్ధా యనుకారికార్థమును వివరింపవలసినయవసరము లేదు గదా. ఆయర్థము చెప్పనందున నష్టము లేమి యది చెప్పకపోవుట యన్నది ద్రుతపరకస్వరసంధి సూరిమతమునఁ బ్రాప్తింప దనురీతినిర్ణయమునకు నవకాశ మీయఁజాలదు.

కాఁగా వజ్ఝలవారియీయభిప్రాయము బలవంతము గాదు. ఇంక 'ద్రుతవ్యవధానమున సంధికిఁ బ్రాప్తియే లేకుండఁగా నది సమ్మత మైనచో విధింపఁబడనక్కఱ లేదా? (248) అనువజ్ఝలవారి వివరణము పై మొదటివారి వాక్యమునకె విరుద్ధ మని మాత్రము గుర్తింపవచ్చును.

'సంధిర్నాచోఽచ్యనుత' యనుచింతామణిసూత్రముతో నచ్చునకచ్చు పర మగుచుండఁగా సంధి లే దనునిషేధ మెట్లు సిద్ధార్థానువాదమో యట్లె సూరిగారిప్రకృతసూత్రమునందును ద్రుతపరకస్వరసంధినిషేధము సిద్ధార్థానువాదకమే యనియు నచ్చట ఉకారసంధివలెనె యిచ్చట సైత మిఁకాదిసంధియే విధేయ మనియు... సమన్వయించుకొనుట యుక్త (247) మనువారిపలుకులలో యుక్తి గలదేమో గాని యథార్థము లే దనవచ్చును. 'సంధిర్న' యను సూత్రము సిద్ధార్థానువాదక మవుఁగాక. కాని దానింబట్టి 'యిఁకాది' లక్షణమును సిద్ధార్థానువాదక మనుట సరి గాదు. పైఁగా సూరి ద్రుతప్రకృతికములకు సంధి లే దనుచుండఁగా సూరికి ద్రుతపరకస్వరసంధి సమ్మతమె యైనచో నట్లు స్పష్టముగా వచించియే యుండును (248) అనుట విరుద్ధముగ నున్నది. (చింతామణిమతమున నవిరుద్ధ మని వారి యభిప్రాయము.) అసలీసూత్రము సిద్ధార్థానువాదక మనుటయెట్లు? అనఁగా 'ఉత్తున కిత్త్వాదిసంధివిధులు ద్రుతవ్యవధానముచే ద్రుతపరకస్వరమునకుఁ జెప్పనవి కావున ద్రుతపరకస్వరసంధి లేకపోవుట

సిద్ధమై యుండ నాయుక్తమునే యింకాదిసూత్రము చెప్పుచున్న దన్న మాట.

కాని యది సూరిసమ్మతము గాదు. ఉత్తున కిత్యాదులు ద్రుత పరకస్వరమునకు సంధిని జెప్పునవి గా వన్నచో నేమ్యాదులలో 'కిమపి.' పఠన మనవసర మనవచ్చును. కిమపి. నింకాదులలోఁ జేర్చిన నది చేరకుండునా? ఇంకాదులలోఁ గిమపి. నిగూడఁ జేర్చి యవియే యింకాదు లనఁదగును గదా. కిమపి నింకాదులలోఁ జేర్చిన నింక ఉత్వ, అత్వ, ఇత్వసంధిసందర్భములందు ద్రుతప్రకృతికము లుండ వని గ్రహింపవచ్చునే కద. కిమపిని సూరి యేమ్యాదులలోఁ జేర్చె ననఁగా నావిధి ద్రుతప్రకృతికా ద్రుతప్రకృతిక సాధారణ మనుట స్పష్టము. ఆయా కృతిగణమునఁ బ్రయోగానుసారముగా ద్రుత ప్రకృతికములం గీవే నున్నఁ జేర్చుకొనవచ్చును గదా. కి మపీతరము లలో నట్టియిత్వసంధి లేకుండుఁ గాక. ఉన్న గ్రహింప వీలున్నదా? లేదా? కిమపి గణనముచేతనే యున్నదనకతప్పదు. అనఁగా నయ్యది ద్రుతపూర్వ స్వరమునకు సంధిని జెప్పునదే కద. ఉత్వసంధియు నత్వ సంధియు నట్లేల కావు? 'ఏమ్యాది' ఆకృతిగణము గావునఁ బ్రయో గానుసారముగాఁ గిమపి యుండొక్కచో మాత్రమె సంధి యున్న నది యొక్కటియ యేమ్యాదులలోఁ జేర్పఁదగియుండును. కాని ఉత్తున కచ్చు, అత్తునకు సంధి అనువిధానములు సామాన్యములగుటచే నట ద్రుతపూర్వోకారాకారము లెల్ల సాధారణముగ గ్రహింపఁబడ వలసియే యున్నది గదా. కాఁగా వచ్చున్ + ఇపుడు అనుచో 'నుత్తునకు' ననుసూత్రముచేతను చూడన్ + అయితి అనుచో అత్తు నకు ననుసూత్రముచేతను సంధి ప్రాప్తించుచునే యున్నది. అందుకే సంధి లే దని సూత్రించి దీని నట సూరి యుదాహరించె నని గ్రహింపఁ దగును.

ఇట్లే క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు ననుసూత్రము (చే వైకల్పికసంధి రావలసియుండ మధ్యమపురుష క్రియలయం దిత్తునకు నిత్య మగుటను జెర్కొనె. కాఁగా) ప్రథమోత్తమపురుషక్రియాపదములం దిత్తునకు సంధిని జెప్పుచున్నది. కాఁగా ద్రుతప్రకృతికములె యైనను ప్రథమోత్తమైకవచనములకును నీసూత్రముచే వైకల్పికసంధి రాకతప్పదు గదా. ప్రథమేతరవిభక్తులం దున్నయుకారమునకుఁ జెప్పినయుకారసంధి ద్రుతపూర్వస్వరమునకె ట్లయినదో యట్లే యిచ్చటను ప్రథమోత్తమైకవచనస్థలముల ద్రుతపూర్వ మగునిత్తునకు సంధి రావలసియే యున్నది. వచ్చితిన్ + ఇవు డని యుండ వచ్చి తిపుడు వచ్చితి నివు డని ద్వైరూప్య మేర్పడవండా? బాలవ్యాకరణమున వచ్చితిని అనియే యుండు నని వజ్ఝలవారు నంగీకరింపకతప్పదు. చింతామణియందు వీరు వచ్చితినిన్ అనురీతి సాధించికొని యవియే యేమ్యాదులలో నున్న వందురు గదా. వచ్చి తివు డనురీతియసాధువులను సాధించుట యెప్పనా? అట్లు గాక యిట ద్రుతస్వరమునకు లోపము (చేయవలసియున్నను) వజ్ఝలవారు చేయరు గాన వచ్చితిని+ఇవు డట యుంచిన వచ్చితి నిపుడు వచ్చితిని యివు డని రావలసియుండును. వచ్చి తివు డను నసాధురూపము వారిత మైనది గాని వచ్చితిని యివు డన్నది క్రొత్తగా నిట నేర్పడుచున్నది. దీనిని వారించు టెట్లు? ఇట వారు తరణోపాయము నిట్లు పేర్కొనిరి. "కొలిచితిని ఇట్టివానికి స్వరము పర మగునపు డిచటి 'యి' కార ముకారస్థానికము గాన నుకారము నకువలె నిత్యసంధి యగును. కొలిచితిని+అపుడు కొలిచితి నపుడు"- ఇది యసంగతము. కొలిచితిని అనుచోటియికార ముకారస్థానికము గాన నిత్యసంధి యనుకొందము 'కిమపి.' లోని యికారముమాత్రము 'ఉ' కారస్థానికము కాదా. సూరి ఇకారంబుమీఁదివునవు'-అని చెప్పెనే కద. అట్టియపుడు కిమపిలోనియికారము నుకారస్థానికమే

కావున కువర్ణమునందలియుకారమునకుఁ బ్రథమేతరవిభక్తివిధానముచే నెట్లు వైకల్పికసంధి ప్రాప్తించినదో దానిచేతనే కిమష్షిలోనియుకారమునకును వైకల్పికసంధి ప్రాప్తించునే. మఱి దానిని సూరి యేమ్యాదులలో నేల చేర్చెను? కాఁగా ఇకార ముకారస్థానికము గావున నుకారమునకువలెనె సంధి యను వజ్ఝలవారివిలక్షణసిద్ధాంతము సూరికిఁ దోఁచియుండలేదు. అట్టియెడలఁ బ్రథమేతరవిభక్తిసూత్రము నొద్దనే కిమష్షిని గూడఁ జూపకపోవునా? సూరి కిమష్షి నేమ్యాదులలోఁ జూపుట ననుసరించియే వజ్ఝలవారియీసిద్ధాంతము సూరిమతమునకు విరుద్ధమని స్పష్టమగుచున్నది. ఇంక వచ్చితివు డనియో వచ్చితిని యివు డనియో కాక తప్పదు. ఇట వజ్ఝలవా రింకొక యభిప్రాయము వెలువరించిరి. 'అచటఁ బరరూపసంధి ద్రుతస్వరమునకే ప్రసక్తమగును' (215) అని. సంధివిధానము లేనపుడు ద్రుతగతస్వరమునకే పరరూపసంధి యగును గావున ద్రుతప్రకృతికములకు సంధి లే దనుట సిద్ధార్థానువాదక మన్నవారే యామాటలకు విరుద్ధముగ నిట్లు చెప్పిరి. బాలవ్యాకరణపక్షమున నికారాంతములకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు గావున నందును 'కొలిచి తబ్ధిజన్' మున్నగుసంధులు సాధువులు గావు. (237) కొలిచితిని+అబ్ధిజ యని యుండఁగా నికార ముకారస్థానికము గావున నిత్యసంధి యనిరే కదా. ఒకవేళ నుత్వలోప మై 'కొలిచితిన్' అని యైనపుడు ఇఁకారాదిసూత్రముచే సంధి లే దన్నమాట. దీనింబట్టి యిఁకారాదివిధానము ప్రయోజనవంతమె యైనది. స్వరలోపము లేక పరరూపసంధి యగు నని సార్వత్రికముగా నిర్ణయించుపక్షమున నిఁకారాదిసూత్రప్రసక్తియు ద్రుతపరకస్వరసంధియు నుండదే. ద్రుతప్రకృతికములకు ఇఁకారాదిసూత్రముచే సంధి లేదు గావున 'కొలిచి తబ్ధిజన్' అని కా దనఁగా సంధి యవుచో కొలిచి తబ్ధిజన్ కావలె. అనఁగా నిపుడు కొలిచితిన్+అనియే యుంచవలె. లేనిచో ద్రుతపూర్వస్వరమునకు సంధి ప్రసక్తియే లేదు గదా. (కొలిచితిని+అని అని యుండఁగాఁ

బరరూపసంధిచే కొలిచితి నని యని యవుచుండఁగా నిఁకాదిసూత్ర మేల) సంధివిధానసందర్భములందు ద్రుతస్వరలోప మంగీకరించిరి కదా. ఇట నట్టిసంధివిధానము లేకపోలేదు. క్రియాపదంబులం దిత్తున కనుసూత్ర మిటఁ బ్రవర్తించునే కద. ఇట్లు స్వరలోపముతో ద్రుత పూర్వస్వరమునకు సంధి ప్రాప్తించుచుండఁగా నట్లు గా దని నిషేధించుచున్నయిఁకాదిసూత్రము సిద్ధార్థసాధక మెట్లగును? వజ్ఝలవారును ఇఁకాదిసూత్రముచేతనే కొలిచి తబ్ధిజ ననురీతి రూపములు గా వని విస్తరముగ స్పష్టము చేసిరి. ఈరెంటినిబట్టి చూడఁగా కొలిచితిని+అబ్ధిజ అని యుండఁగా ద్రుతస్వరమునకుఁ బరరూప సంధి యై యేర్పడినదియు, కొలిచితిన్+అబ్ధిజ అని యుండఁగా (ఇట్లుండనిదే లక్ష్యమే కాదు) ద్రుతపూర్వస్వరమునకు సంధి నిషేధముచే నేర్పడినదియు కొలిచితి నబ్ధిజ ననునొక్కరూపమే. అట్టియెడల నిట్టివానిని సాధించుటకు రెండుమార్గము లేల? ఏదే నొకదానినే యాశ్రయింప నగునే.

ఇఁకాదిసూత్రసందర్భమును బట్టియు సముచిత మగుటంబట్టియు కొలిచితిన్+అబ్ధిజ, కొలిచితి నబ్ధిజ ననురీతిప్రక్రియయే యుచిత మని గ్రహింపవచ్చును.

(వీరు హరిని శ్రీని మొద లగుద్వితీయాంతస్థలములందును నిట్లే యికార ముకారస్థానికము గావున నిత్యసంధి యని సమన్వయించిరి. అదియు సరి గా దనకతప్పదు.)

సంధ్యుదాహృతులనుబట్టి సంధిస్థలములయందు ద్రుతస్వర లోపము నంగీకరించిరి. కానీ యిట్టియెడల సంధ్యభావదశయందు ద్రుతమున స్వరము లోపింపక యద్దానిక సంధి యవు నని వీరి యభిప్రాయమా? కొలిచితి+అబ్ధిజ ననుచో ఇఁకాదులకుఁ దప్ప అనుసూత్రముచే ద్రుతపరకస్వరమునకు సంధి నిషిద్ధ మైనది. కావున

కొలిచితిన్+అబ్ధిజ అని ద్రుతమున స్వరము లోపింపక కొలిచితిని + అబ్ధిజ-నని యే యుండు ననియు నప్పుడు ద్రుతస్వరమునకే సంధి యవు ననియు వజ్ఝలవారు భావించి రేమో. అట్టియెడల వారివాక్యము లందుఁ గొంత వైరుధ్యము తోఁచును. కాని వచ్చెన్ + ఇపుడు - వచ్చె నిపు డనురీతిగా సూరి చూపినతీరు పయిసిద్ధాంతము సరి యైనది గా దనియే నిరూపించుచున్నవి. పయియభిప్రాయమే సూరికి నున్న వచ్చెను - ఇపు డనురీతిగా నుదాహరింపవలసియున్నది గదా. పయిగా నిట్టియెడల వజ్ఝలవారు సంధి యవుసందర్భములందు నేవి ద్రుతస్వరలోపమును జేర్కొనుట వ్యర్థమే కాఁగలదు. సంధివిధాన సామర్థ్యముచే నెట్లును ద్రుతము లోపించునే కదా. అట్టియెడల స్వరరహితమునే యేల? స్వరసహితమునే లోపింపఁజేయనగును గదా. నాకొఱకును + ఇచ్చె అనుచో సంధివిధానసామర్థ్యముచే ద్రుత మైనను వర్ణమే లోపించిన దనవచ్చును. అందుకై స్వర లోపమును జేయనేల? ద్రుతమున స్వర ముండఁగా ద్రుతపూర్వ స్వరమునకు స్వరపరకత సిద్ధించు టెట్లని వజ్ఝలవారు ద్రుతస్వర లోపమును జేసియున్నారు. కాని యిట ద్రుతపూర్వస్వరమునకు సంధిని విధించినసామర్థ్యముచేతనే ద్రుతమును సందలిస్వరమును నుపేక్ష్యము లవు నవచ్చు. లేదా స్వరపరకతాసిద్ధికయి - సంధి విధానము ననుసరించి ద్రుతలోపమును జేసి స్వరపరకతయు సంధియు నూహింపనగును గదా. కావున సంధిసందర్భమునమాత్రమే ద్రుత స్వరలోప మనియుఁ దదభావస్థితిలో స్వరలోపము లే దనియుఁ జెప్ప నక్కఱలేదు. సూరిలక్ష్యము లట్లు చెప్పరా దనియే నిరూపించు చున్నవి.

సూరి యెల్లని స్వరపరకతలో ద్రుతమును స్వరలోపముతోనే చూపియున్నాఁడు. అట్టియెడఁ బూర్వస్వర(పరస్వర)ములకుఁ జెప్పినసంధి ద్రుతము స్వరరహిత మైయుండఁ జేసి ద్రుతపూర్వ

స్వరమునకే యగుట సిద్ధించును - ద్రుతప్రకృతికములకును సంధిని దదభావమును జెప్పుచో సూరి ద్రుతపరకస్వరమున కని స్పష్టముగా నిర్దేశింపకుండుటం బట్టియుఁ బై యంశమును నట్లు సూరిమతముగా గుర్తింపఁదగియున్నట్లు తోఁచును. ద్రుతపూర్వస్వరమునకే యగు టలో వజ్ఝలవారి యభిప్రాయము గల్గియున్నట్లు స్పష్టము గాదు. అది యట్లయైనను వచ్చెన్ + ఇవు డనురీతినిర్దేశ మెట్లును వారి సిద్ధాంతమునకు బాధకము.

మొత్తముమీఁద (కొలిచి తద్భిద ననురీతిరూపములవిష యమున) నిఁకాదిసూత్రము ద్రుతపరకస్వరమునకు సంధి నిషేధించు టను వజ్ఝలవారును స్పష్టము చేసిరి. ఇట మాత్రము సంధినిషేధ మేల? ముందు సంధి ప్రాప్తింపదు కదా. అటఁ గ్రియాపదములం దిత్తున కనుసూత్రముచే సంధి ప్రాప్తించు ననుట స్పష్టమే. కాఁగా బాలవ్యాకరణమునఁ గ్రియాపదములం దనుసూత్రము ద్రుతపూర్వ స్వరమునకు సంధిని జెప్పుచున్న దని యంగీకరింపవలసియే యున్నది. ఇత్వసంధిని జెప్పునే వ్యాకరణసూత్రములో కిపష్ఠిని సూరియే చెప్పెను. కాఁగా బాల.లో స్వరసంధివిధులు ద్రుతపూర్వస్వరమునకు సంధిని జెప్పుచున్న వనుట స్పష్టము.

సూరి యిఁకాదిసూత్రస్థలలక్ష్యములె యీ విషయమును స్పష్టముగా నిరూపింపఁజాలుచున్నవి. అట సూరి వరుసగా వచ్చెన్ + ఇవుడు, చూడన్ + అయితి, ఉండెడిన్ + అతఁడు అని యుదా హరించెను. సూరి యంతకుముందు ఉత్వ, అత్వ, ఇత్వ సంధులను జెప్పిన క్రమమునే యనుసరించియుంట గమనార్హమైయున్నది. నిషే ధము ప్రాప్తిపూర్వకము కావలెఁగదా. కాఁగా వచ్చెన్ + ఇవుడు అనుచో ఉత్తున కచ్చనుసూత్రముచేతను చూడన్ + అయితి అనుచో అత్తున కనుసూత్రముచేతను ఉండెడిన్ + అతఁ డనుచోఁ 'క్రియాపదములం'

దనుసూత్రముచేతను సంధి ప్రాప్తించుచుండఁగా నాసంధి యిట నిషేధింపఁబడిన దన్నమాట. క్రియాపదములం దనుసూత్రముచేఁ బ్రథమోత్తమైకవచనములందు నికారమునకు సంధి ప్రాప్తించుచున్నది. తరువాతిసూత్రము ననుసరించి మధ్యమపురుష క్రియల నట నుదాహరింప మానె. ఇంకఁ బ్రథమోత్తమైకబహువచనములు చూపవలసి యుండఁగాఁ బ్రథమోత్తమబహువచనములనుమాత్రమె చూపి యేకవచనముల నేల చూపలేదు. ప్రథమైకవచనమున భూతార్థమున లేకున్నను వర్ధర్మాదులం దెడిగాగముచేఁ గ్రియాపదమునం దిత్వముండునే కదా. అట నయ్యది యుదాహరింపకుండుట యిట నిట్లు సంధి నిషేధింపఁబోవుటచేతనే యనుట సక్రమమే కద. ఉదాహరణములెల్లఁ జూపియే తీరవలె నని నియమము లేదు గాని మొదటి దగు ప్రథమైకవచనమును విడచి ప్రథమపురుషబహువచనమునే ముందుగాఁ జూపుటలోఁ గారణము లేమి (ఇట్లై యుత్తమపురుషస్థలమునందు నేకవచనమును జూపక తరువాతి దనఁదగినబహువచనము చూపుటం బట్టియు) పై నట్లు చెప్పుట యుక్తమె - అంతే గాక యీయంశ మిట స్ఫురించునట్లుగా సూరి యిఁకాదిసూత్రసందర్భమునఁ బ్రథమపురుషైకవచనమునే యికారమునకుఁ జూపుటయు నీయంశమునే నిరూపింపఁ గలదు. ఇత్తునకు సంధి చెప్పినయింకొకఁ డగునేమ్యాదిస్థల మాకృతిగణ మగుటచే సంధి లేని దేమ్యాదులలోఁ జేరకపోవుటచే నాసూత్రముచే సంధి ప్రాప్త మవుచుండఁగా నిఁకాదిసూత్రము నిషేధింపవలసినతా వుండకపోవుటయు నిట గుర్తింపఁదగును. కాఁగా నిదంతము లగు ప్రథమోత్తమైకవచన క్రియాపదములు ద్రుతప్రకృతు లగుటచేతను ద్రుతప్రకృతికముల (యెడ సంధి యను ద్రుతపూర్వస్వరమునకె కావునను,) సంధి యిఁకాదిసూత్రముచే నిషేధింపఁబడు చుండుటచేతను (తరువాతిసూత్రముచే నిత్యసంధినిబట్టి మధ్యమపురుష క్రియలను జూప పేలు లేనట్లై) ప్రథమోత్తమైకవచనములు చూపింప

నవకాశము లేకపోవుటనుబట్టియే సూరి క్రియాపదములం దను సూత్రమునొద్ద వ్రాసిని జూపలే దని సముచితముగా గుర్తింపవచ్చును.

అత్వేత్వోత్వక్రమమునఁ గాక దాను సంధి చెప్పినవరుస ననుసరించియే యిట సూరి క్రమముగా ఉతాత్వోత్వములను జూపుటం బట్టి యావిధులు ద్రుతపూర్వస్వరమునకు సంధిని జెప్పునవే యని సముచితముగా గ్రహింపఁదగును.

కాఁగాఁ బై పరిశీలనము ననుసరించి రెం డంశములు స్పష్టమగుచున్నవి. ఇఁకాదిసూత్రము విధేయాంశము ద్రుతప్రకృతికములకు సంధినిషేధమే. కాని యిఁకాదులకు సంధివిధానము కాదు- అందువలననే సూత్రానుగుణముగ సంధ్యభావము నీ యట లక్ష్యములందు సూరి ప్రదర్శించెను. (ఇఁకాదుల సంధిని జూపనే లేదు.)

2. బాలవ్యాకరణమునందు స్వరపరత్వమున ద్రుతస్వరము దాదాపుగా నెల్లయెడల లోపించును. ద్రుతప్రకృతికములయెడ స్వరసంధి యన ద్రుతపూర్వస్వరమునకే. కాఁగా ఉత్వాదిసంధివిధానములు ద్రుతపూర్వస్వరమునకుఁ గూడ సంధిని జెప్పునవే. కావున నిట్లు ద్రుతపూర్వస్వరమునకు సంధి ప్రాప్తించుటచేతనే యిఁకాది సూత్రము నిషేధమును జెప్పుచున్నది. కాఁగా నీసూత్రము ప్రత్యేకముగాఁ బ్రయోజనవంతమే కాని సిద్ధార్థానువాదకము కాదు. ఇట్లు ప్రాప్తించుచున్న ద్రుతప్రకృతికస్వరసంధి నివారింపవలసియుండుట చేతను నిందలివిధేయాంశము నిషేధమే కాని యిఁకాదులకు సంధిని జెప్పుట కానేర దని స్పష్టము.

అస లిఁకాదులకు సంధిని జెప్పవలసియున్నదా? అన్నదియుఁ బరిశీలించిన నందు సంధివిధానము ప్రధాన మేమో స్పష్ట మగును- 'ఇఁక ఇఁగ ఎట్టకేలకు ఎట్టకేని యీయవి యిఁకాదులు' అని సూరి

స్పష్టము చేసెను. కావున నింక నొక్కటి ద్రుతప్రకృతికము స్వర సంధిని బొందునది లేదు. వీనికిఁ జెప్పవలెనా?

ఇందులో ఇఁకిన్-ఇఁగిన్ అనువానింట ద్రుతమునకుఁ బూర్వమునం దకార మున్నది. బాల.లో సంధివిధానములు ద్రుతపూర్వస్వరమునకు సంధిని జెప్పవవే యనుకొంటిమి కదా. అట్టియెడల ఇఁక-ఇఁగ అనువానింట నత్వమునకు అత్తునకు సంధి బహుళముగా నగు ననుసూత్రముచేతనే సంధి యగును-అట సంధి బహుళ మగును గావున నిట వికల్ప మగుట సిద్ధమే. దీనికి వికల్పసంధివిధాన మేల?

'చూడన్ + అయితి' అనుచో ద్రుతప్రకృతికము గావున సంధి లే దని సూరి పేర్కొన్నాఁడు. అట సంధి లే దని నిషేధించె ననఁగా నంతకుముం దసలు సంధి ప్రాప్తించవలె యును గదా. అత్తునకు సంధిని జెప్పినది 'అత్తునకు సంధి' యనుసూత్ర మొక్కటే కనుక నాసూత్రము చేతనే యట సంధి ప్రాప్త మయ్యె ననక తప్పదు. చూడన్ + అయితి యనుచో అత్తున కనుసూత్రముచేఁ బ్రాప్తించినసంధి నిఁకాది సూత్రము వారించిన దన్నమాట. అట్టియెడల చూడన్ + అయితి అనుచో ద్రుతపూర్వక మగు నకారమున కత్తున కనుసూత్రముచేఁ బ్రాప్తించినసంధి ఇఁకన్ + ఏమి అనుచో సూత్ర మేల ప్రాప్తింపదు. అట్లు ప్రాప్తించుచుండఁగా నిఁకాదులకుఁ దప్ప సంధి లే దన్నాఁడు. కావున ఇఁకాదులలోఁ జేరనిచూడన్ అనుచోఁ బ్రాప్త మయిన సంధి వారిత మైనది. ఇఁకాదులలోని దగు ఇఁక అనుచో అత్తున కని ప్రాప్త మయినసంధి వారింపఁబడమి ప్రవర్తించును. బహుళము గావున నిటఁ బ్రవృత్తియా విభాషయా? వైకల్పిక మని వివరణము ప్రసక్తము. అది ప్రత్యేకముగా విధింపవలసిన యంశము కాదు గదా.

కాఁగా ఇఁక ఇఁగ అను రెంట వైకల్పికసంధి అత్తున నుక సూత్రముచేతనే సిద్ధించుచుండఁగా దానిని విశేషముగా విధింపవలసిన యవసరము లే దనుట స్పష్టమే కదా.

ఇంక మిఁగిలినవి ఎట్టకేలకు ఎట్టకేని అనునవి రెండు.

ఇందు రెండురెండుశబ్దము లున్నవి. ఇఁకాదులలోని దేది? 'ఎట్ట కేని' అనుచోట 'ఏని' అనునది (కళ యని యు) ద్రుతప్రకృతికము గా దని ఏని యున్ అనురూపముచే శ.ర.కర్త పేర్కొనెను. వజ్ఝల వారును ఎట్టకున్+ఏని అని యుండ సంధి యయినరూపమునే సూరి యిటఁ జూపె నని పేర్కొనియున్నారు. దీనింబట్టి యెట్ట కేలకు నన్నపుడు నయితను ఎట్టకున్+ఏలకు ననురీతివిభాగముతో ఎట్టకు శబ్ద ముద్దేశింపఁబడిన దని గ్రహింపవచ్చును. ఎట్టకు నేని (విరాట. 2-220) అనురీతిగా దీనికి సంధి వికల్ప మన్నమాట. ఇట్లే ఏలకు అనుచో నయితము సంధి వికల్పమే. ఎట్ట కేల కెలుంగు దెచ్చికొని (శల్య. 2-10) ఎట్ట కేల కెఱిఁగితిన్ (మాన. 1-207) ఎట్ట కేలకు నుడిగి (ఉద్యో. 3-18?) ఎట్ట కేలకు నొకయెడ (మానస. 1-18?) కాఁగా ఎట్టకు ఏలకు అనునవి యింకను రెండుశబ్దము లిఁకాదులలోని వన్న మాట. ఇఁకాదులు మొత్త మిట్లు నాలు గయినవి. ఎట్ట కేలకు ఎట్ట కేని అనుచో నెట్టకు శబ్దమునకు రెండుదాహృతు లీఁబడినవి. దీనికిఁ గారణము 'ఎట్టకు' అను శబ్దమొక్కటివిడిగా ననఁగా స్వార్థకత్వ మునఁ గాని యవసానమునఁ గాని కానరాదు. (స్వరపరకతయుందును) ఏలకు ఏని అనువానిలో నేదో యొకటి పరముగాఁ గలిగిమాత్రమే ప్రయుక్త మగుచున్నది. అనఁగా ఎట్టకు అనుశబ్దము విడిగాఁ బ్రయుక్త మగుట యెచ్చటను లేదు. ఏలకు ఏని అను రెండే పర మగుటయు నట సంధి వికల్ప మగుటయు ననుసరించి సూరి యిట్లు చూపె ననుట యుక్తమె. ఇంకను ఏలకు ననునది నయితము విశేషమే

వేలకో ఇత్యాదిగా నట నటఁ గాన నవు దానికి దీనితో సంబంధము లేదు. ఎట్టకేలకు అనుచో ఎట్టకు నేలకు అనురీతి ప్రయోగము గాన రాదు. దానింబట్టి చూడఁగా ఇఁక ఇఁగ అనువానివలె ఎట్టకేలకు అనునది మొత్త మొక్కటిగా నిఁకాదులలోఁ బఠించుట సూరి యుద్దేశ మేమో యనిపించును. 'ఎట్ట కేని' అను తరువాతిశబ్దమున ఎట్టకు నేని ననురీతి రూపములు గలవు గావున ఎట్టకున్ అని విభాగింపక తప్పదు. అట నట్లు విభాగింపఁదగుచో ఎట్ట కేలకు ననుస్థలమునను ఎట్టకు నని యేల విభాగింపరాదు? విభాగింపఁ దగు. కాని నిత్యసంధి యనవలె. కాని సూరి దీనికి సంధి వైకల్పిక మన్నాఁడే. అట్టి యెడల 'ఎట్టకేలకు' అనునది మొత్త మొక్కటిగా నిఁకాదులలోని దనియు దీని కచ్చు పర మగునపుడు సంధి వైకల్పిక మనియుఁ జెప్పి పైరీతి ప్రయోగములను గుర్తింపఁదగును. ఎట్ట కేని యను స్థలమునుబట్టి యెట్టకు ననునది సైత మిఁకాదులలోనిదే యనియు (నద్దానిని నేని శబ్దముతోఁ గలిపి చూపుటనుబట్టి యేని) దాని కేనిశబ్దము పర మయి నపుడు సంధి వికల్ప మనియుఁ జెప్పకొన వలసియుండును. ఎట్టకు నేలకు ననురీతి ప్రయోగమునకై వెదుకఁదగియున్నది. ఎట్ట కేలకు ఎట్ట కేని_అనునవి రెండుశబ్దములును గలిసియే చిట్టచివరకు ననురీతిగా నర్థ మిచ్చుచున్నవి. ఎట్టకు ఏలకు అనునవి ప్రత్యేకములై యే యర్థము నిచ్చునవిగాఁ గానరావు. ఏని ప్రసిద్ధమే. ఎట్టకేని ఎట్టకు నేని ననుదానింబట్టి ఎట్టకున్ అనురీతివిభాగము తప్పదు. ఎట్టకు ఏలకు ననునవి యిఁకాదులలోని వనుకొనఁదగు. వీనికి వైకల్పిక సంధి యెట్లు? చిట్ట చివరకు ననురీతియర్థమునుబట్టి (యింపలికువర్ణ మును బట్టియు) ఇవి సప్తమ్యర్థకావ్యయము లని తలంచినను ప్రథమేతర విభక్తిసూత్రముచే వైకల్పికసంధి యవు నని భావింప నవకాశము చాలకున్నది. అట సప్తమ్యర్థకము లయిన అందు ఇందు ఎందు అనువానియందలియు కారమునకు సంధి యవుచున్నది. అట్టికువర్ణము

వంతలియు కారమునకును సంధి చేయఁదగును. కాని యట్టి సంధి ప్రాప్తించు నన్న వీని నిఁకాదులలోఁ జేర్పవలసిన యక్కఱ లేదు. ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశము గావున సావకాశ మగు నిఁకాది విధిని బాధించును. కావున ఎట్టకేని అనురీతిని ప్రథమేతరవిభక్తి సూత్రముచే నిర్బాధమౌటే కావున నిఁకాదులలోఁ జేర్పనేల? కావున నా సూత్రమునకు లక్ష్యములు గా వనక తప్పదు. అట్టియెడల నిఁక నుత్తునకు సంధిని జెప్పినది యుత్తున కచ్చు పరం బగునపు డనునది యొక్కటే. ఇంక నా సూత్రముచేతనే సంధి యవు నన్న నిత్యముగనే రావలయును. ద్వైరూప్య మెట్లు?

ఇయ్యది ప్రథమేతరసూత్రమునకు లక్ష్యస్థలము గా దన్న ఉత్తున కనుదాసచేఁ గాక తప్పదు. ఇఁకాదిసూత్రలక్ష్యములలో నూరి వచ్చున్ + ఇవు డని చూపెఁ గదా. అట నుత్తున కనుసూత్రముచే సంధి ప్రాప్తింప నిఁకాదిసూత్రము నిషేధించుచున్న దనుట స్పష్టము. ఉత్తున కనుసూత్రముచే సంధి నిత్యముగా రావలసి యుండఁగాఁ బ్రథమేతరవిభక్తిసూత్ర మూరైవానికి సంధి వైకల్పిక మనుచున్నది కాఁగాఁ బ్రథమేతరసూత్రమునకు లక్ష్యములు గాని స్థలము లెల్ల నుత్తున కనుసూత్రముచేతను నిత్యసంధి నందవలయును. ఎట్టకే ననురీతిది ప్రథమేతరసూత్రమునకు లక్ష్యము గానిచో నుత్తున కనుసూత్రముచే సంధి రాక తప్పదు. ఎట్టకే నని అనురీతిరూప మెట్లు? సంధి వికల్పత ఈ వివరణము ననుసరించియే యనక తప్పదు. అనఁగా ఉత్తున కనుసూత్రముచేఁ బ్రాప్తించుచున్న సంధిని వైకల్పిక మని వివరించుటచే సంధి వికల్పముగనే యగు నన్నమాట. కాఁగా ఎట్టకేని, ఎట్ట కేని అనుచోట్ల సంధి వికల్పత నిరియే పేర్కొనుచున్న దనవచ్చును. అట్టియెడల నీసంధివిధానము ప్రధానోద్దేశముగా భావింపవచ్చునా? ఇఁక ఇఁకల కట్టియవసరము లేమి గుర్తించితిమి. ఈ రెండుచోట్లఁగూడ నుత్తున కనుసూత్రముచే సంధి ప్రాప్తించు

టయు స్పష్టమే. వికల్పతను జెప్పఁదలచినను నయ్యాది ప్రధానము గా నక్కర లేదు. "ప్రేరణేంచుక్కు వరం బగునపుడు వకారంబు చకారంబున కగు" నని యుగు నదియే సూత్రించిన సూరి యట వత్వంబు పెచ్చునకుం గల్గదు. మెచ్చునకు విభాష నగు నని వివరించుట గమనింపఁదగియున్నది. ఇది యట్టిదే యనియు గ్రహింపవచ్చును. కాఁగా నింకలివికల్పతావిశేషము సూత్రమునందే విధింపఁబడవలె (విధింపఁబడను లేదు గదా) అని కాని యట్టి విధానమే ప్రధానోద్దేశ్యమని కాని చెప్పరాదు.

కాఁగా మొత్తముమీఁద నిఁకాదులకు సంధిని ప్రత్యేకముగా విధించుటయే యనవసర మనఁదగియుండఁగా నది ప్రధానోద్దేశ్యముగా సూరి యిఁకాదిసూత్రమును వచించె ననుట సరి కా దనవచ్చును. ఇంతే గాక సూత్రము లక్ష్యములును వివరణముసైతము ద్రుతప్రకృతికములకు సంధి లే దని చెప్పుటయే ప్రధానోద్దేశ్యముగాఁ దెల్పుటలో వివాద మనవసరము. సంధిర్నాచోచ్యమత యనుదానికిని దీనికిని పోలిక లేదు. ఇట ఇఁకాదులకును దదితరములకును ద్రుతప్రకృతికములకు (అ, ఇ, ఉ లకు) సంధి ప్రాప్తించుచుండుటచే ఇఁకాదులకుఁ దప్ప నితరములకు లే దను నీవిధానము నిషేధరూప మైన యర్థమును జెప్పవలసియుండుటంబట్టియుఁ బ్రధానోద్దేశ్య మదియ యగుచున్నది.

వచ్చెన్+అతఁ డనారీతిని నియుతము ఇఁకాది సూత్రమునకు లక్ష్యముగాఁ జూపవచ్చును. అఇఉ భిన్నము లగుస్వరములకు బాల. సంధి చెప్పకుండుటచే నట ద్రుతపూర్వక మైనయెకారాదులకును సంధి లేదనుమాట నిజమే. (విధాత్మన్ అడిగె మొ॥) కావున నట సంధినిషేధ మనవసరము. ప్రాప్తియే లేదు గాఁబట్టి. ప్రాప్తి గలుగుటను స్పష్టము చేయుటకే సూరి యిఁకాదిసూత్రమువొద్ద ఉ, అ, ఇ

స్వరములను జూపెను కాని వచ్చెను అనురీతివానిని జూపలేదు. స్పష్టతకు ననవచ్చును. కాని వచ్చెన్+అతఁ డనురీతిస్థలముల ద్రుత పరకమగు అ, ఇ, ఉ, భిన్నస్వరమునకు సంధి ప్రాప్తింపకుండ నిషేధావసరము లేకున్నను పర్జన్యవల్లక్షణాప్రవృత్తి యనున్యాయము ననుసరించి యీ యిఁకాదిసూత్రము వలనిసంధినిషేధముమాత్రము ప్రాప్తించు ననియే గ్రహింపఁదగియున్నది. క్త్వార్థం బైనయిత్తునకు సంధి లే దనుచోట వచ్చి+ఇచ్చెను అనులక్ష్య మీయంశమునే సూచించుచున్నది. వఁగి+వఁగి అనురీతి దగు నామ్రేడితపరకస్థితిలోనిసంధిని వారించుట యవసరము. అందుకై నిషేధవిధాన మవసరము. వచ్చి+ఇచ్చెను అనుచోట సంధికిఁ బ్రాప్తియే లేదు త్వాంతము కామి క్రియాపదంబులం దనుసూత్రముచేతను సంధిలేమి నేమ్యాదులలోఁ జేర్ప వీలు లేమి నేమ్యాదులలోనిది గామి నేమ్యాదిసూత్రముచేత నిట సంధి ప్రాప్తింపదు గదా. మఱి యిట నిషేధ మేల? కాఁగా వఁగి+వఁగి అనుచో వచ్చున కామ్రేడితం బను సూత్రముచే సంధి ప్రాప్తింపవలయును గావున నినిషేధ మిట నవసరము అందుకే సూరి యిట దీనిని స్మరించియుండవచ్చును గూడ. వచ్చి+ఇచ్చెను అనుచోఁ బ్రాప్తియే లేమి నిషేధావసరము లేకున్నను అవసరమైనయామ్రేడితపరకస్థలమునకై నిషేధము చేయఁబడఁగా పర్జన్యవల్లక్షణాప్రవృత్తి యనుదాని ననుసరించి వచ్చి+ఇచ్చెను అనుచో నయితము సంధి నిషేధము వర్తింపఁగల దని గ్రహింపఁ దగును. అదేవిధముగా నిచ్చట నయితము వచ్చెన్+అతం డనురీతి స్థలములును ఇఁకాదిసూత్రమునకు లక్ష్యములే యవుచున్నవి. కాఁగా ద్రుతపరకస్వర మెద్దాని కైనను నీ సూత్రముచే స్వరసంధి వారింపఁ బడుచున్న దన్నమాట

ఏది యే మైనను బైవిచారణమునకు సారాంశముగా నిట గ్రహింపఁబడుచున్నయంశము - బాలవ్యాకరణములోనిసంధివిధా

నములు కళాద్రుతప్రకృతికసాధారణములు. అనఁగా నట ద్రుతపూర్వస్వరమునకును సూరి దాదాపు నియతముగనే లోపము చేసి యున్నవాఁడు కావున ద్రుతప్రకృతికములయందు సంధి యనఁగా ద్రుతపరకస్వరమునకే యని స్పష్టమగుచున్నది. ద్రుతప్రకృతికములకు మాత్రమే సంధి చెప్పుచున్న ప్రథమేతరవిభక్తిస్థలములందును ద్రుతపరకస్వరమునకు సంధి ప్రాప్తించుచున్న దనఁగా బాలవ్యాకరణమతమున నీ ద్రుతము (పొల్లునకారము) సంధికిఁ బ్రతిబంధకము గా దన్నమాట. ఇఁకాదుల కనుప్రస్తుతసూత్రమునయిత మాయర్థమును స్పష్టము చేయుచున్నది. వచ్చున్+ఇవు ఉనుచో ఉత్తున కనుసూత్రముచే సంధి ప్రాప్తించుచున్న దనఁగా ద్రుతము సంధికిఁ బ్రతిబంధకము గా దనియే గదా తాత్పర్యము.

అయిన నిట నొకవైరుధ్య మేర్పడినది. ఉత్తున కచ్చు పరంబగునపుడు అని చెప్పినసంధి వచ్చున్+ఇవు ఉనురీతి నుండఁగా ద్రుతపూర్వస్వరమునకుఁ బ్రాప్తించుచున్నది గదా. సంధి వచ్చుట కడ్డము గానియీ ద్రుతము యడాగమము వచ్చునపు డెట్లడ్డమగును. అట్లె స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు అనుచో మాత్రము నడుమ ద్రుత మున్నను బరస్వరమునకు యడాగమము రావచ్చునే కద. స్వరంబుకంటెం బరం బయిన అనుటవలన ద్రుతము (నకారము) హల్లుకంటెఁ బర మవుటచే ద్రుతప్రకృతులపై యడాగమము లే దని యింతకు ముందు పేర్కొనుట విరుద్ధము గదా యనవచ్చును

సంధిసందర్భమునవలెనె యడాగమసందర్భమునను ద్రుతము ప్రతిబంధకమే కా దన్న నాయడాగమలక్షణమున స్వరంబుకంటెం బరం బయిన అను మాటలు వ్యర్థములు. సంధి యెక్కడ లేదో యక్కడ నెల్ల కళాద్రుతప్రకృతికములు రెండింటిపై యడాగమము వచ్చుచో-యట్టు పరస్వరమునకు రావలెను గానఁ బరస్వరంబున కనుదళ ముంత వలసినదే. ఇంక సంధి లేనిచోటఁ బరస్వరంబునకు యడా

గమం బగుచున్నఁ బైయర్థము సిద్ధింపదా? అంతకు ముందు నిర్వచించిన సంధిలక్షణము ననుసరించియు సంధి లేనిచోట నన్నమాత్రమునసే యీయర్థము సిద్ధమవుఁ గదా? కాఁగా స్వరంబుకంటెఁ బరంబయిన అని మఱల నేల చెప్పెను? ఇట్లు చెప్పుటనుబట్టియే పూర్వస్వరము నకు స్వరపరకతలో ద్రుతము వ్యవధాయక మగుచున్న దని గుర్తింప వచ్చును. కాఁగా సంధి సందర్భమున ద్రుతము ప్రతిబంధకము గాకున్నను యడాగమ సందర్భమున స్వరంబుకంటెం బరంబయిన అని ప్రత్యేకముగాఁ జేర్కొనుట ననుసరించి యడాగమము నందుట కాస్వరము స్వరమునకే సాక్షాత్పరము గావలె ననియు నందు వలన ద్రుతము (పొల్లు) నకుఁ బర మయిన స్వరమునకు యడాగ మము లే దనియు సముచితముగా గుర్తింపవచ్చును.

అది యట్లైనను జింతామణియందు మాత్ర మ ట్లేల భావింపరాదు? ఉత్తునకు మొద లగు బాలవ్యాకరణవిధులవలెనె సంధిర్నాచోచ్యనుత మున్నగు చింతామణివిధులును ద్రుతపూర్వస్వర మునకు సంధిని జెప్పునవె. ప్రాణతః పరం ప్రాణ మ్మనుటచే ద్రుతమునకుఁ బర మైనస్వరమునకు యాగమము లేదు. కావునఁ జింతామణిలోను బ్రతిబంధకము గా దనియు ద్రుతపరకస్వరసంధి చింతామణి సమ్మతమే యనియుఁ జెప్పవచ్చును గదా యనవచ్చును. నిజమే కాని బాలవ్యాకరణమునందు ద్రుతపూర్వస్వరసంధి ప్రాప్తిని స్పష్టము చేయునది, ఇఁకాదులకుఁ దప్ప అను ద్రుతప్రకృతులకుఁ జేసినసంధి నిషేధమే యనుట గుర్తింపఁదగినదే. అట్టి ద్రుతప్రకృతి కములసంధినిషేధము చింతామణియం దున్నదా? అట్టియెడల నందలి సంధి విధులు ద్రుతపరకస్వరమునకు సంధిని జెప్పున వని యంగీకరింప వలసినయవసర మేమి? నసాన్త్యద్ధర్మోక్త యనుదానిం జూచితిమొ దా.

సంధిర్నాచోఽచ్యనుతయాం చో అచః అచి సన్ధిః అనుటచే నచ్చునకచ్చు పర మగునపుడె సంధి యవ్వుట ప్రస్తావింపబడినది. అనాదిషు విభక్తిషు, చోర్వా యనుసూత్రములు ద్రుతపరకస్వరము నకే సంధిని జెప్పుచున్నవి. ఇటఁ గూడ నహోబలుఁడు సంధివిధాన సామర్థ్యముచేతనే ద్రుతలోపమును జేర్కొనెను. అచ్చు పర మగు నపుడు సంధి యవును గావున నచ్పరకత్వమున కనుగుణముగా ద్రుతము లోపించు నని సంధివిధానము ననుసరించి గ్రహింపనగును. అప్పకవి సయితము సంధిని విధించు సందర్భములందు వికల్పమువలన ద్రుతప్రకృతు లగు నన్నాఁడు. ద్రుతప్రకృతు లవుటలోఁ జివర ద్రుత మట్లు నిలిచి యుండును, దనభావస్థితిలో నది ద్రుతప్రకృతికము గా దన్నమాట అనఁగా ద్రుతాంతము గాదు. అనఁగాఁ జివర ద్రుత ముండదు. ద్రుతము లోపించు ననుట కిది యొక్కయాధారము కాఁగ లదు. అచాం సన్ధౌ ద్రుతోఽదృశ్యః అనుచో వి. వి. వచనము నందును నిట్టియభిప్రాయమే కలదనవచ్చును. ఈ వి. వి. వచనము వలననే ద్రుతము సంధికిఁ బ్రతిబంధకము కా దనియు ద్రుతపరక స్వరసంధి యన్నయాథర్వణస్మృతి ననియుఁ జెప్పఁగనుపడునా ? విధానసామర్థ్యమువలన లోపించు నన్నదాని నీకారికే స్పష్టముగాఁ జెప్పుచున్న దనఁదగును. కేవల మిా ద్రుతలోపవిధానముచేత సంధి యవు నని చెప్పవలనుపడదు కాఁగాఁ జింతామణి ననుసరించి ద్రుత పరకస్వరసంధి యెచ్చట విహిత మయినదో యచ్చటనే యీ కారికచే ద్రుత మదృశ్య మగుటను గుర్తింపవలసియున్నది. కాఁగా నీయర్థము స్పష్టతకే యనుట గమనార్హము.

అసలు మనభాషలో ద్రుతపరకస్వరమునకు సంధి జరుగునది యెక్కడ ? 1. ప్రథమేతరవిభక్తి యందును శత్రర్థచువర్ణమునందు నున్న నుగాగమునను 2. కిమర్థకము దనియెకారమునకును. 3. ఇఁకా

దులకును మాత్రమే యని బాలవ్యాకరణము ననుసరించి గ్రహింపఁ దగును. దీని కితరములందు ద్రుతపరకస్వరమునకు నెచ్చటను సంధి లే దనియే చెప్పవలసియున్నది గదా.

ఇందుఁ బ్రథమేతరవిభక్త్యుయందలి యుకారమునకు అనాదిష్వ సూత్రముచేతను, క్త్వార్థమువర్ణమునందు నుకారమునకు చోర్వా అను సూత్రముచేతను జింతామణి చెప్పియే యున్నది. కిమాదిగణ మాకృతిగణ మవుటఁ జేసి యందుఁ గిషష్ఠిని జేర్చుకొనఁదగును. అం దిది యొక్కటియె ద్రుతపరకేకారము గల దగుటంబట్టి యాసూత్రము వలన నిబ్బంది యేమి లేదు. ఇంక నితరములఁ బ్రయోగములు లేవు గదా సంధి యవుటకు. ఇట్లు చాలవఱకుఁ జింతామణి వీని సంగ్రహించియే యున్నది.

ఇంక మిగిలినవి యిఁకారాంతములు. ఇందు ఇఁక ఇఁకన్ అను రెంట నత్వమునకు సంధి రావలసియున్నది. అహోబలపతి సంధిస్తు ద్రుతపూర్వస్య ప్రాయశో న భవే దత యనుదానిచేత దీనియందలి సంధిని సాధించెను. ఈకారికతో ద్రుతపరకస్వరసంధి తత్సమ్మతమనుటకుఁ బ్రబల మైనయాధారముగాఁ జెప్పవలసివచ్చుచున్నది. ద్రుతపరకస్వరసంధి తత్సమ్మతము కానిచో క్వాచిత్క మగు నాసంధిని విధింపవలసియే యున్నది. కాని న భవే త్తని వారి చెప్పుటెట్లు? న భవే త్తని నిషేధింపఁబడిన దనఁగా నట సంధి ప్రాప్తించుచున్న దన్న మాట. అనఁగా నత్వసంధిని జెప్పుచున్న 'వా౽త' యనునది ద్రుతపరక మగు నకారమునకును సంధిని జెప్పుచుండఁగా నట్లు గా దని నిషేధించుచున్నాఁ డనవలయును. ఈ వి. వి. వచనమును బురస్కరించుకొని వా౽త యున్నది ద్రుతప్రకృతికములకును సంధిని జెప్పకదే యున్నచో వైరుధ్యము చింతామణియందే యధికము గాఁగలదు. ఇఁకన్ ఇఁగన్ అనునొండు రెంట సాధింపఁగల్లుట యొక్క ప్రయోజన

నట్లో ఉండెడిన్ అనురీతివానిని గూడ గ్రహింతము. ఆయవకాశము వి. వి. కల్పింపలేదు. కొలిచితినిన్ అనునవే గ్రామ్యములనియు నిట గొలిచితిన్ అనురీతిని గ్రహింపఁబడ వనియు వఙ్ఝలవారు చెప్పుటకు నుత్తమపురుషస్థలములందు వారినుతమున నవకాశమున్నను నిట నట్టియవకాశమే లేదు. ఉండెడిన్ అనురీతిగనే యిట గ్రహింపఁబడకతప్పదు. ఉత్తమపురుషైకవచనస్థలములందును వఙ్ఝలవారినిర్ణయము నిరాధార మని యింతకు మున్న స్పష్టము. 'అనుత్తమపురుష క్రియాసు' అన్న చింతామణిలో నుత్తమపురుషక్రియలు పరిహరింపఁబడుటచే నయ్యావి కిమాదులలోఁ జేర్పుటలోఁ బ్రయోగానుగుణముగా నుత్తమపురుషబహువచనములను మాత్రమె యటఁ జేర్చి యేకవచనములను గిమాదులలోఁ బరిగణింపకుండుట కవకాశము గలదు. ప్రయోగానుసారముగాఁ గొలిచి తబ్ధిజను వంటిరూపములట్లు వారింపఁబడును గూడ. కాని వి. వి. ప్రథమే చోత్తమే చైవ అని యుత్తమపురుష నుచ్చరించుట చేతను (ప్రథమశ్చోత్తమశ్చైవ అనుచో నేకత్వార్థాభిధాయకౌ యున్నట్లుగా నిచట బహుత్వార్థాభిధాయకములం దని యనకుండుటచేతను) ప్రథమోత్తమైకవచనస్థలములందు వైకల్పికసంధి విధింపఁబడిన దనియే చెప్పవలసియున్నది గదా. అట్లు గాఁగా ఉండెడిన్, కొలిచితిన్ అనురీతిస్థలములం దిత్వసంధి వికల్పముగాఁ బ్రాప్తింపవలసియే యున్నది. 'సంధి స్తు ద్రుతపూర్వస్య' యని యుత్తునకు నిషేధించెనే కాని యిత్వముసంగతి యెత్తుకొనలే దేమి? కొలిచి తబ్ధిజ ననువంటిరూపములు వి. వి. మతమున వారింపఁబడవలయు నన్నఁ గారికయందలి వాశబ్దమున కిట సంధి లేదని వ్యవస్థ చేసికొనవలయును. బహుత్వస్థలములనే గ్రహించి పేర్కొన్నచో నీయిబ్బంది యుండెడిది గాదు. ఈసంధి స్తు కారికయందిత్తును సంగ్రహింపఁ గూడ నవకాశ మేర్పడిన బాగు. వాశబ్దముచేనిట నిత్వమునకు సంధి వారించుకొనుచో వాటత యనుచోఁ జింతా

మణియందలి వాశబ్దముచేతనే ప్రాయశో న భవేత్తను నర్థము సిద్ధింపఁ గలదు. ఆకారిక యేల? అటఁ బంకాపాణిచే సిద్ధించునర్థమును స్పష్టముగాఁ జెప్పఁబూనినవాఁడు తనలక్షణమునందుమాత్ర మట్టిస్పష్టత కేల యవకాశము కల్పింపఁడు? (కొలిచి ద్విజ ననురీతిరూపము లహోబలుఁడు సమ్మతించుటకును ఏచోట్లఁగూడ నీకారిక వైకల్పిక సంధి నంగీకరించుటకును సంబంధము నేరీతిగా గుర్తింపఁదగునో పరిశీలనార్హము.)

అది యట్లుండఁగా నిట వి. వి. కర్త వీనికి సంధి వైకల్పికమని చెప్పుచుండుట లేదు ఇంక క్రియేతో వా భవేచ్చ్యుతి యను రీతిగా నిత్యమునకుఁ జ్యుతిని జెప్పుచున్నాఁడు. అనఁగా నిట నాయిత్వము లోపించు నట యర్థము చేయవలసియున్నది చూచిరి+అమరులు అనురీతిశాస్త్రములయందు నిత్యము లోపించు నన్నను చూచిరి+అమరులు చూచి రమరు లనురీతి నవుటలో బాధ లేదు కాన నట నిబ్బంది లేదు. అనఁగా 'క్షుత్రచిత్సప్రతీయోఽపి ప్రాణోఽపస్త్రత చ్యుతో భవే' త్తనుచున్నగు రీతిగాఁ బూర్వస్వరలోపము చెప్పుట శాస్త్రములయందు నెట్టియిబ్బందులు లేకుండఁగనే సరిపడును. కాని ద్రుతాంతములస్థలములం దెట్లు? చ్యుతి యనఁగా సంధి యువునా? ఉండెడిన్ + అతఁడు అనుచో నిత్తు చ్యుతి యనఁగా ఉండె డతఁ డనురీతిగానగును గదా. ద్రుతలోప మెట్లు? ఇచ్చో న ధో యనుసూత్రము సంధియందు ద్రుతలోపమును జెప్పుచున్నది ఇటఁ బూర్వస్వరలోపము విధింపఁబడినది. అది సంధి యని వి. వి. భావించినదా? పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్తని వి. వి. చెప్పుచున్నాడే. అయ్యు ఉండె డతఁ డని కాక తప్పదు.

ఇట నప్పకవిమతము భాసించుచున్నది. అప్పకవి సంధిని నిర్వచించుచో పూర్వపదాంత్యస్వరమునకు లోపముగ నొసర్చి యామిగి

లినవాల్లును దైవర్ణముతోఁ గూర్చుటయే సంధి యని పేర్కొనుట గమనింపవచ్చును. అట ఫలితార్థమును బూర్వస్వరలోపమే సంధి స్వరూపముగా నెంచుటకుఁ దగినవకాశము గల్గుట స్పష్టమే. అట్టి యప్పకవి సంధిలక్షణము దృష్టియం దుండుటచేతనే యిచట 'చ్యుతి' యని చెప్పఁబడినదా? కాని యప్పకవి ప్రకృతప్రకృతికములయెడ సంధిసందర్భమున ప్రకృతప్రకృతికత్వము లేకుండఁజేసికొన్నాఁడు. దాని వలన నాకొఆకున్ అని యుండ సంధి లేకుండుటయు - నాకొఆకు - అనురీతిగా ద్రుతాంతములు గానపుడు సంధి యగుటయు నప్పకవిమతము. కాని వి. వి. అట్టి వైకల్పిక ప్రకృతప్రకృతికత్వమును ప్రస్తావించియుండ లేదు. అది యెట్లు? అనఁగా ప్రకృతప్రకృతికత్వము లేకపోవుట సంధి కిఁగాఁ జెప్పుట ననుసరించి యట ద్రుతలోపమే పర్యవసాన మైనది. పూర్వస్వరలోపము సంధి కాఁగా నట్టిసంధి యందు ద్రుతము లోపించు నని 'అచాం సన్ధౌ' యనుకారికను నప్పకవియనుగుణముగ నర్థము చేసిన నిబ్బంది యుండఁబోదు. అప్పక్షమున నీకారిక లహోబలవిరచితముల యనవలసియుండు నంత విశేషమును లేదు. అహోబలుఁడు కిమాఖ్యసూత్రమునందలి వాయుశ్శబ్దముచే సాధించినయర్థము కంటె నంబుజాక్షు నిత్యాదు లలిసంధ్యభావ మీకారికయందలి వాశబ్దమువ్యర్థపదచే సాధింపవలె ననఁదగు. తొలిచి తద్ధిత ననురీతిరూపములు సైతము వారింపఁదగినవే యగుటంజేసి ప్రథమోత్తమైకవచనములు రెంట సంధిని 'వా' శబ్దముచేతనే లే దని నియమించుకొనవలసి యుండును ఈకారిక లహోబలకృతము లే యగుచో నింక విచారింప వలసినయాశము లే దని చెప్పవచ్చు. ఆతఁడు తనసిద్ధాంతమున కనుగుణముగనే యట్లు చెప్పియుండును. అట్టిసిద్ధాంతమే పొరపాటయినపుడు కారికచే విశేషార్థము నహోబలుఁడు చూపినదానికంటె నూహించుట యెట్లు?

అట్టియెడల వాఁడు యనుసూత్రము ద్రుతపూర్వాకారమునకును సంధిని జెప్పుచున్న దని యంగీకరింపవలసినయవసర మేమి?

ఇంకేమి ఇత్యాదులు సిద్ధములు గాకుండుట సంకేతలోపమా? ఆ రెండింట సంధిని సాధించుటకయి ద్రుతపరకస్వరసంధి సమ్మత మన్న చూడయితి ననురీతిరూపము లనేకములు చింతామణిసమ్మతము లని చెప్పుట యొప్పునా?

ద్రుతప్రకృతికములను (కివప్తి తప్ప) తదాదులలోను గిమాదులలోను జేర్చకుండుటచే (ప్రయోగానుగుణముగ) ద్రుతపరక మగు నికారమునకు సంధి లేకుండుట సాధింపబడు.

'వాఽఽతి' యను సూత్రమునందలి వాశబ్దమునకు వ్యవస్థ చేసి యింక ఇంగలలో ద్రుతపరక మగు నుత్తునకు సంధిని సాధించుకొనవచ్చు. అఇఉలకు భిన్న మైనయచ్చునకు సంధిర్న యని సంధి నిషిద్ధ మగుటచే వచ్చెన్+ఎవం డనురీతి వానింట నిబ్బందియే లేదు. ఇంక మిగిలినది యుకారము. ద్రుతపూర్వక మగున కారమునకు సంధిర్న అని సంధి ప్రాప్తించుచో సంధిని వారించుటకుం దగినయాధారము లే దనక తప్పదు. రాము డభిరాముడన్ ఇత్యాదులు సాధింపబడ వని స్పష్టమే.
నన్యాదిషథర్మోత యను రీతి సంధి నిషేధింపబడనిచో వచ్చెపుడు మున్నగునవిష్టరూపములును దుర్వారము లగును. (207) అని ననుద్ధరించినను నచ్చుడున్+అంత నచు డంత ననురీతివి దుర్వారము లయియే యున్నవి గదా. అనిష్టార్థ మొకటి యెట్లును తప్పకున్నది.

చిన్నయ యింకాదులలో ఎట్ట కేలకు, ఎట్ట కేని అనునవి చూపెను—ఇందు ద్రుతపూర్వోకారమునకు సంధి వికల్పము గదా. ఎట్టకు నేలకు ననురీతిరూపము గానరాకున్నను ఎట్టకు నేని అని గలదు గావునను ఎట్ట కేలకు నతండు ననురీతివి సాధింపవలసి యుండుటచేతను నిట సంధి వికల్పముగాం జెప్పంబడియే యున్నది—చింతామణియందు సంధిర్న అనునది ద్రుతపూర్వోకారమునకు సంధి

చెప్పవచ్చే యన్న నిట నిత్యసంధి ప్రాప్తింపవలసియే యుండును. అట్లు ద్రుతపూర్వస్వరసంధి యు ప్రాప్తమన్న నెట్లకేలకు నిత్యాదులును సిద్ధింపవు. అట్లుగా నిట నేపక్షము నాశ్రయించినను నియ్యవి విశేషములే యనియుఁ జెంతానుణియుండదే కాక వి.వి. లోను నను క్రమములే యనియుఁ జెప్పక తప్పదున్నది. వీనింబట్టి ఇఁక ఇఁగలు రెంటఁగూడ ద్రుతపరకాకారమునకు సంధి యనుక్రమే యున్న నిబ్బంది యేమి? అట్టియెడలఁ జెంతానుణియుండలిపంధవిధానములు ద్రుతపరకస్వరమునకు సామాన్యముగా సంధిని జెప్పనివే యని యంగీకరించినను నిబ్బంది లేదు. ఇఁకాదుసుఁ దప్ప నితరద్రుతప్రకృతికముల సంధి గలతావులు ప్రత్యేకముగాఁ జెప్పఁబడియే యుంట అనాదిష్టు, చోర్వా (కిపాదుంలో కిపష్టిగణనము) అనువానిచే స్పష్ట మయియే యున్నది గదా.

'లుప్తం శ్లేషో నాచి' యనుసూత్ర మీయర్థమును సాధింపఁ గల్గుచున్న దని యప్పకవీయవివరణానుగుణముగా గ్రహింపఁదగి యున్న దనిపించును. ఈలక్షణము పదాదియకారముపరకతలోఁ బ్రాప్తించుచున్నలోపసంశ్లేషములను వారించుచున్న దన్నను పర్జన్యవల్లక్షణప్రవృత్తి యన్నారు గావున నవసరము లేకున్నను స్వరపరకత్వమున లోపసంశ్లేషములను వారించుచున్నది. సంశ్లేష మన నిట ద్రుతద్విత్వమై యది వారింపఁబడిన దనఁదగు ఇంక లోపమును లేదని చెప్పుచున్నది. దీనివలన స్వరపరకత్వమున ద్రుతము లోపింపకున్న సంధి యగు టెట్లు? అందులకే గదా సంధివిధాన సందర్భములందు విధానసామర్థ్యముచే ద్రుతము లోపింపఁజేయుట. వి.వి. అచాం సన్ధా యని ద్రుతమునకు లోపము చెప్పుటయు–కావున ద్రుతము లోపింప దనునీవిధానము ననుసరించి సంధిన్న, నాఉతః, ప్రాయస్తు–ము న్నగునుత్రొఁ త్వోత్వన ధిక్షుఁ చే ద్రుతపరక మగు నాస్వరములకు సంధి రానేరదు. అనాదిష్టు చోర్వా అనునవి

ద్రుతప్రకృతికములకు మాత్రము ప్రత్యేకముగా సంధిని చెప్పుటచే నట విధానసామర్థ్యము నాశ్రయించి 'లుక్స్వశ్లేషౌన' యని నిషేధింప బడిన ద్రుతలోపము బాధిత మై ద్రుతలోప మై సంధి యగును. సంధి జరుగని వేళ ద్రుతలోపనిషేధమునకు బాధ లేదు గావున నట్లు నిషిద్ధ మైన ద్రుతలోపముచే ద్రుత మట్ల యుండి 'నన్ను నడిగె' ననురీతి రూపము లగుచున్నవి. (ఇట్టి కిమాదులలోఁ గిమష్టిపఠనసామర్థ్యమును. చింతామణి స్పష్టము చేయకున్నను ప్రయోగానుగుణముగ నట్లు పఠింపఁదగును గదా) సంధిర్న వాఽతః అను సూత్రములు సైతము ద్రుతపరకము లగునాస్వరములకు సంధిని జెప్పవనే యని యంగీకరించుచో నటమాత్రము ద్రుతలోపనిషేధము బాధింపఁబడి ద్రుతము లోపింపదా? అనుననుమాన మక్కర లేదు. అట్టిచోట రాముఁ డతఁడు, చూడ కుండెను ము న్నగురీతిగాఁ గళాస్థలములం దావిధులు సార్థకములే యై యుండుటచే నట విధానసామర్థ్యము నాశ్రయించి ద్రుతలోపము చేయుటకు నవకాశము లేదు గదా. ద్రుతపరకస్వరములకు మాత్రమే సంధిని జెప్పినవిధులే ద్రుతలోపాభావమున వ్యర్థము లగును గావున నటనే విధానసామర్థ్యము నాశ్రయించు నవకాశ మున్న దనుట స్పష్టము.

ఇట్లు పరిశీలింపఁగా సంధిర్న మున్నగు సామాన్యసంధివిధులచే ద్రుతపరకసంధి ప్రాప్తికవకాశము లే దని చింతామణియందు గ్రహింపవచ్చును. ప్రథమేచోత్తమే చైవ యన్నది యహోబల కృతము గా దన్నవు డందుఁ జెప్పఁబడినయిబ్బందులు తొలఁగు నట్లుగా ప్రథమోత్తమైకవచనాంతములు ద్రుతాంతము లవుటచే నవ్వానికి సంధి ప్రాప్తింప దనియుఁ జెప్ప నవకాశ మేర్పడి యీ చింతామణి సిద్ధాంతమే వి.వి.కిని సమ్మత మనియుఁ జెప్ప వీ లేర్పడును.

ఇట్టియెడల బాధకాంశముల నిట్లు గుర్తింపవలె. 1. సూరి

చెప్పిన ఇంకాదులకుఁ జింతామణియందు సంధి ప్రాప్తింపదు. 2. సంధి స్తు ద్రుతపూర్వస్య అని వి. వి. ద్రుతపూర్వకాకారమునకు సంధి నిషేధించుట. 3. 'నస్యాత్తద్ధర్మోక్త' యని చింతామణి సంధి నిషేధించుట.

ఇంకాదులకు సంధిని జెప్పకపోవుట యన్నది చింతామణియందొకలోపముగా భావింప నక్కఱలేదు. వీనిలో ఎట్ట కేలకు, ఎట్టకేని యనుచో వికల్పసంధి యెట్లును నసాధ్యమె. అనంగాఁ జింతామణిలోనిసంధివిధులు ద్రుతపరకస్వరములకు సంధిని జెప్పవనే యని యంగీకరించినను నిట్టిచోట్ల నిత్యసంధియే ప్రాప్తించును గాని వైకల్పికసంధికి నవకాశము లేదు గదా! అనాదివశ సూత్రమునకు ముడి వెట్ట వీలు లేదు. ముడి వెట్టుచో ద్రుతపరకస్వరసంధి చింతామణియం దప్రాప్తమే యన్నను బాధ లేను. ఇంక మిగిలినవి ఇంక ఇంగ నను నవి రెండు. ఆరెండింటికయి పెక్కసర్థములు కొనితెచ్చుకొనుటకంటె (శాస్త్రవిరోధముతో పాటు) నయ్యంశ మింద నుక్త నుంటయే యుక్త మయియుండును.

'సంధిస్తు' అన్నది వి.వి.లోనివైరుధ్యము. ద్రుతపరకసంధి సమ్మతము కాక వాఁటత యనుదానిచేఁ బ్రాప్తింపకున్న మఱల నత్వునకు నిషేధ మేల ? కావున నది విరోధించుచున్నది. ఇయ్యది చింతామణి సిద్ధాంతమునే యనువదించుచున్న దన్నను నత్వునకు నిషేధించుటవలె నుత్వునకు నిత్వునకును ద్రుతపరకమునకు సంధిని జెప్పనది యనవలసి యుండు. అట్టియెడల ఉండెడిన్+అతఁడు కొలిచితిన్ + అబ్ధిజ రామున్+అభిరామున్ అనుచో సంధి వి. వి. సమ్మత మనవలయును. వాని సంధింగూర్చి వి. వి. వల ప్రస్తావింపలేదు నిషేధమే యిష్టమైయున్న.

ఈవిధానము నొకరీతిగా నిట్లు పరిశీలింపవచ్చును.

ఇయాంతాస్స్యాధవ శ్శబ్దాః క్వచి దేద న్తతాపి వా అను వి.వి. వచనమునుబట్టి యహోబలపతి ఇయాంతానా మప్యేదంతతా న సర్వత్ర. అథర్వణో క్తేః తేన సందియ మిత్యాదౌ నైదంతత్వ మ్మని వివరించెను. ఇట 'ఏద న్తతా చ' అని యేదంతతను చింతామణియే విధించినది. (సందియము మొదలగు) కొన్నిచోట్ల లేమి విశేషము. కావున దానినే వి.వి. చెప్పవలసియున్నది. అయినను క్వచి దేద న్తతాపి వా అని యేదంతతనే విధించెను. అయినను క్వచి త్తనుటచే సందియ మిత్యాదులలో లేమిని సాధించె నన్నమాట. అనఁగాఁ జింతామణి ఏద న్తతా చ అని సామాన్యముగాఁ జెప్పఁ గ్వచి త్తన్నది వి.వి. (సూత్రమందలిచశబ్ద మిందుకు సాధకము గాఁగలదు. కాని యహోబలపతి యట్లు భావింపలేదు.) అదేవిధముగా నిచ్చట నయిలేము ద్రుతపూర్వకమగు నకారమునకును నెల్లయెడల సంధి లేమియే చింతామణిసిద్ధ మగుచుండఁగా ప్రాయశో న భవేత్ అని యాసంధిలేమి ప్రాయిక మని చెప్పె. అట్టియెడల ఇఁక, ఇఁగలలో సంధిని సాధించుట యిందలి విశేషప్రయోజనముగా గుర్తింపఁదగును. ఇయాంతాః అనుచోటి క్వచి త్తనుశబ్దమువంటి ప్రయోజనమే ప్రాయశ్శబ్దముచే నిట నుద్దిష్టమైన దనవచ్చు.

ఇటఁ గూడ న భవే దచః అని యున్నచో ఎట్ట కేని ఎట్టకేలకు ననుకవియు గ్రహింపఁబడుటే కాక ఇతరములకు సంధినిషేధము సాధింపఁబడియెడునవకాశ ముండెడిది. అత్తునకే కాక యే యచ్చునకును చింతామణిమతమున ద్రుతపరకమునకు సంధి లే దను పక్షమున అతః అని యత్తునే పేర్కొను టేమి? యనవచ్చును. అది యేపక్షమునను తప్పదు. నిజమునకుఁ జింతామణి ద్రుతపరక స్వరమునకు సంధి సంగీకరించునదే యని వజ్ఝలవారివలెనే యంగీకరించినను నత్తునకుమాత్రమే నిషేధించుట యితరములకు నవకాశము కల్పించుటయే యగును గదా. కావున 'అతః' అనుట యెట్లును

సమర్థించుకొనవలసియేయున్నది. వాఽత యనుటచే నత్తునకుమాత్రమే
ప్రాప్తమై సంధిర్న అని యుత్తునకు నప్రాప్తమన వీలులేదు గదా.
ప్రథమశ్చోతనుశ్చైవ యనుట నుద్దేశించి నన్నయ తదితరస్థలములం
దంగీకరించినట్లవు. అంతే గాక 'నిత్య మను త్తమపురుషక్రియాసు'
అనుచోఁ బ్రథమైక వచనస్థానమున నిత్తునకుఁ జెప్పెను గదా. దానికి సంధి
యిష్టమే యగునా? ఉండెడిన్ అను డివర్ణాంతములను వి. వి. సాధిం
చినదే కదా.

కాఁగా అతః అనుదానింబట్టి తదితరములకు సంధి యవుట కాకుంట యనువానిని బ్రస్తావింపకుంటయే యుక్తము.

ఇఁకఁ జింతామణియందలినస్యోత్తనుసూత్రమే మిగిలి యున్నది. దీనింగూర్చి యింతకుముందు పరిశీలించియున్నారము అయిన నిట నొకరీతి సమన్వయము నిట్లూహింపఁదగు నేమో యని పించుచున్నది. లుక్సంశ్లేషో నాచి యని చెప్పినది చింతామణియే కదా. తదనుగుణముగా ద్రుతపరక మగునుకారమునకు సైతము ప్రత్యేకవిధానము లేనపుడు ద్రుతము లోపింపకుండుటంజేసి యీ సంధినిషేధము వ్యర్థము యవుచున్నది. వ్యర్థమై అనాదిష్టమె. ప్రత్యేకవిధానములు లేనిస్థలములందు సయితము సంధి గల దనియు ద్రుతము లోపించు ననియు స్థానాంతరము ను జ్ఞాపకముచేయు. ఇట్టియర్థము ననుసరించి తద్ధర్మార్థకక్రియాపదములందు సంధి నిషే ధించునీవిధానము చరితార్థమే యగును. జ్ఞాపకసిద్ధమైనయీయర్థము వలన నిఁకాదులయందలిసంధిని గుర్తింపవచ్చును. ఇయ్యది స్థలాం తరమునందలి ప్రయోజనముగా గుర్తింపఁదగును. జ్ఞాపకసిద్ధమైన యీయర్థము సర్వత్ర చెల్లవలసినయవసరము లేదు గావున ఇఁకాదు లకు భిన్నమైనవానియందు ద్రుతపరకస్వరమునకు సంధి రాకుండు టయు శాస్త్రానుగుణమే యవుచున్నది గదా.

చింతామణియందు ఇఁకాదు లెయ్యవి? ఇఁక ఇఁగ అనునవి రెండుమాత్రమె కన్పట్టుచున్నవి. ఎట్టకేలకు- ఎట్టకేని అనుచో సంధి యంగీకరింపఁదగినను దాని కాధారము గానరాదు. ఎట్టకేలకు అను చోటిసంధినిమాత్రము సంధిగ్న అని సాధింపఁదగు ననవచ్చు. ఇట ఎట్టకు నేలకు ననురీతిరూప మిప్పటికిఁ గానరాలేదు. ఎట్ట కేలకున్- అనుదానికి స్వరము పర మగునప్పుడు మాత్రము సంధి వికల్ప మవు నెట్లు?

చిన్నయ ప్రథమేతరవిభక్తిసూత్రమునొద్ద ఇందు ఎందు అను నవి కూడఁ జూపెను 'అందు' అను స్వతంత్ర మగుపదము నిట గ్రహింపఁదగియే యున్నది. 'జేరలిచ' అని సప్తమికిఁ జెప్పిన 'యలి' ఇందుకుఁ గూడ నవుటకు అంద్వింపునాస్తు సప్తమీ యని యుందు నట గ్రహించిన ట్లహోబలుఁడు చేర్చెను. 'ఎందు'న 'కలి' రా దనియే తన్మతముగా నెంచవము. జేః అనకున్నను 'అనాదిషు విభక్తిషు'- అనురీతిగాఁ జేర్చెను గదా. కావున 'ఎందు' అను నది యెట్లు గ్రహింపఁబడును? ఎందు అనుదాని నిట నిఁకాదులలోఁ జేర్పఁదగునా? అందు ఇందు అనుస్వతంత్రము లైన పదములును ఇఁకాదులలోనే గ్రహింపఁదగియున్నట్లు తోఁచుచున్నది.

చిన్నయ ప్రథమేతరవిభక్తిసూత్రముదొద్ద ఇందు ప్రభృతులను (అందు ఇందు ఎందు) గ్రహించినట్లుగా 'అనాదిషు విభక్తిషు' అనుదానిచేఁ చింతామణియందు నయ్యవి సంగ్రహింపఁబడవచ్చును.

బాలవ్యాకరణమునందు మాత్ర మియ్యవి గ్రహింపఁబడుట యెట్లు? వజ్ఝలవారు అందును ఎందును అనునవి సప్తమ్యర్థకము లగుటం జేసి యవి ద్రుతప్రకృతికము లగుట వీనిసంధివిషయమునఁ బైవిధి వర్తిల్లుటలో విరోధము లేదు (212) అనిరి. ప్రథమేతరవిభక్తివిధి వీని యందుఁ బ్రవర్తిల్లుటకుఁ గారణ మేమి. అవి సప్తమ్యర్థకము లగుటా? లేక ద్రుతప్రకృతికము లగుటా? సప్తమ్యర్థకములగుటచే నీవిధి

ణము సంధులియాయాస్వరసంధులు ద్రుతపరకస్వరములకు సంయితము సంధిని జెప్పుచున్నవే యని చెప్పకతప్పదు.

ఇంకఁ జింతామణియందు లుక్సంశ్లేషా వాచి యని స్వరపరకతలో ద్రుతలోపనిషేధము ననుసరించి ప్రత్యేకముగా ద్రుతప్రకృతిక ములకు సంధిని జెప్పుచున్న అనాదిష్టు, చోర్వా యనువిధానములు దప్ప నితరము లగుసంధిగ్న మున్నగువిధులచే ద్రుతపరకస్వర ములకు సంధి ప్రాప్తింప దని నిశ్చయింపఁదగును.

వజ్ఝలవారు పై యభిప్రాయములను దార్ఢ్యముగాఁ జెప్పుట సరి కాదు. ఇంకఁ జింతామణిలో ననాస్త్రనుప దొక్కటి యింకా ములకు సంధిని జ్ఞాపకము చేయుచున్న దని చెప్పఁదగు. కాఁగా సంధిర్న మున్నగువిధులు ద్రుతపూర్వస్వరములకు సంధిని జెప్పునవి కావు రామున్+అభిరామున్ ధరణిపతులన్+అదిమి కంటిన్+అంబుజాక్షు అనురీతిచోట్ల సంధిప్రసక్తిం. అనుగుణముగనే లే దని గ్రహింపఁ దగును.

—*—

## అనుబంధం - 3

# నన్నెలె - మమ్మెలె

'అనాదిషు విభక్తిషూత్తో వా' యనుసూత్రమున కహోబలుఁడు వీనిని లక్ష్యములుగాఁ జూపెను. 'అనాదిషు విభక్తిషు' అనుదానిచే నగుసంధి నహోబలుఁడే 'ప్రత్యయగతోకారస్య' యని వివరించెను. నన్నున్, మమ్మున్ అనుచోటియుకారము ప్రత్యయగతమే యగు ననుట స్పష్టము. దీనిం బ్రస్తావించునది 'న్నమ్మ్యో హ్రస్వ శ్చాదే రమి శసి చ' యనునది. ఈసూత్రమునం దున్న అమి, శసి యనుసప్తముల ననుసరించి యిది విధించుచున్న న్నమ్ములు తత్తద్విభక్తిపరకత్వమున నాస్మత్ప్రాతిపదికల కగు నని చెప్పవలసియున్నది. కాని బాలసరస్వత్యహోబలులు పైచోట్ల సప్తమిని షష్ఠిగాఁ బరిణమింపఁజేసి యస్మద్స్థానమునసే న్నమ్ముల నాదేశముగాఁ జెప్పిరి. ఇట్లు సూత్రస్థము లైనపదములవిభక్తిని మార్చుట యే దేని బ్రయోజనము నుద్దేశించి కాక తప్పదు. నిష్ప్రయోజకముగ నేల మార్తురు? నన్నెలె మమ్మెలె ననురీతిగా (ద్వితీయాస్థలమున) సంధిని సాధించుట యట్టిప్రయోజనముగా నూహింపవచ్చును. వజ్ఝలవారు విభక్తిపరిణామము నంగీకరింపరు. కాని బాలసరస్వత్యాదివ్యాఖ్యాత లెల్లరు చూపినదానికి విరుద్ధముగా పరిమితో సమస్తానా మ్మనుసూత్రమును పరిమితే సమస్తానా మ్మని యుండుట నన్నయయాశయముగా నూహించిరి. అందుకుఁ గారణ మేమి? లక్ష్యములే కదా. ఇంకను నధికములగు లక్ష్యములను సాధించునుద్దేశముతోనె య ట్లూహించి రనుట స్పష్టమే. అట్టివారిపాఠ మేని నిరాధార మగుట (బాలసరస్వత్యాదుల పాఠమున కనుగుణము గామి) నంగీకరింపరా దని (ప్రయోజనమున్నను) చెప్పఁదగియున్నది. కాని ప్రస్తుతసందర్భమున బా. స. ప్రభృతులు

విభక్తివిపరిణామము చెప్పుట సంగీకరించుట యుక్త మగుచున్నది. అహోబలపతి స్థలాంతరమున విభక్తివిపరిణామము సంస్కృతసంప్రదాయానుగుణ మగుట నిరూపించియున్నాఁడు. (కవిశి. 459) అట్టి పద్ధతి సంప్రదాయసిద్ధ మగుటచే నిట నంగీకరించుటలో నిరాధారము గాదు గదా. అయ్యును విభక్తివిపరిణామము సంగీకరింపనివజ్ఝలవారు న్నమ్ము లాగమములే యని పేర్కొనిరి.

ఈ న్నమ్ము లాదేశము లైన 'నన్నును గాఁగిలించుకొని' యనురూపము చిం. సాధ్యము గా దనిరి. ఆగమము లన్నతమమతము ననే నన్నును అనుకీతిరూపము సులువుగా నేర్పడుచున్న దని చిం.వి.ప.లోఁ గూడ (222) నభిప్రాయపడిరి. చిం.మతమునఁ బొల్లనకారమె ద్రుత మైయుండఁగా అయ్యెను అగును అనురూపములు సాధ్య మైన వీరికి నన్నును అనురూప మాగమపక్షముననే తప్పఁ గాకుండఁబోవుట వింతయే యనక తప్పదు. అయ్యెన్ అనునది అయ్యెను అని యైనట్లు నన్నున్ అనునది నన్నును గాకుండు టేమొ.

అయిన నాగమపక్షమునను నన్నును గాఁగిలించుకొని యన్నది యసాధ్యమె యనక తప్పదు. అన్పురకత్వమునఁ బ్రాతిపదికకు న్నా అనునది యాగమ మై 'యనన్తస్య' అను సువర్ణక మై యన్యే యని ద్రుతము చేరఁగా నన్నునున్ అని వజ్ఝలవారిమతమున నగును. నన్నునున్+కౌఁగిలించుకొని యని యుండఁగా బర మైనపరుషమునకు సరళమును జేసినయాద్రుత మే మైనది. గణవిరోధము లేకుండ ఖండానుస్వార మైనఁ గావలయును గదా. వీరిమతమున ద్రుతమునకు నుస్వరూపము లేదు. (ఉన్న నీరూపము చింతామణిసాధ్య మగు టెట్లను ప్రశ్నకుఁ దావే లేదు.) కావున నన్నును అనుచోటినువర్ణముచే మీఁది పరుషము సరళ మైన దని చెప్పుటకు వీలు లేదు గదా. కాఁగా నట్లు సరళము చేసిన ద్రుత మైనయాపొల్లనకారము లోపించిపోయినదా?

**ఆదేశసరళములకు ముం దున్న ద్రుతము లోపింపరా దని (వ్యా.సం. స.301) వారును స్పష్టము చేసియే యున్నారు. కాఁగా నీప్రయోగము వారిసమన్వయమును సాధింపలే దనక తప్పదు. కాన నాగము మన్న పక్షమునను నిది చింతామణిసాధ్యము గాలేదు.**

ఇఁక వజ్ఝలవారిసిద్ధాంతము ననుసరించి నన్నునుఁ గౌఁగిలించి కొని యని పదుమ నొకఖండానుస్వార ముం్న దనియు నయ్యది యచ్చు పొరపాటువలనఁ బోయిన దనియు నెంచవలయునా? భారత మేప్రతి యందును నిట ఖండము గానరాదు. చిం.వి.ప.లో ద్రుత స్వరూ పమును వజ్ఝలవారు సమర్థించినపెక్కుచోట్లఁ బైనటిస్థితి గమనింప వచ్చును.

కాన ముద్రితభారతప్రతుల ననుసరించియుఁ దత్తత్సందర్భముల వజ్ఝలవారును జూపినప్రయోగములరీతి ననుసరించియు నన్నును గౌఁగి లించుకొని యనుకీర్తిస్థలములందుఁ బైపదుసములు సరళము లగుటకు నిమిత్తమైనద్రుతము ను(ని)వర్ణమే యనియు నఁనఁగా ను(ని)వర్ణమే ద్రుత మనియుఁ జింతామణి (నన్నయ) మత మనియు నిర్ణయింపఁదగి యున్నదే కద. ఇట్టియెడల నున్న అనుపద అమ్ముస్థానమున నాదేశము కాఁగా 'అన్వే' యని ను ద్రుతము చేరఁగా నన్నునా, నన్నును గౌఁగి లించుకొని యనురూప మాదేశపక్షముననే సముచితముగా సమన్వ యింపఁబడుచున్న దనుట స్పష్టము.

ఇఁక నాదేశము లన్న బాలసరస్వత్యహోబలులమత మెట్లు?(బా. స. ద్రుతము నేరీతిగా భావించెనో నిర్ణయించుటకుఁ బ్రబలమైన యాధా రము గానరామింజేసియు నున్నదానింబట్టి నువర్ణ మగు నవకాశముం డుటంబట్టియు నది య ట్లుంచిన) అహోబలుఁడుమాత్రము ద్రుత స్వత్వము నుస్వరూపముతో నుండు నని తలంచినవాఁ డవుటంజేసి తన

తానుగుణముగా నన్నున్+కౌఁగిలించుకొని నన్నుఁ(ం) గౌఁగిలించుకొని నన్నును గౌఁగిలించుకొని యని యవు నని స్పష్టము.

ఏది యేమైనను నీ ప్రయోగము న్నుమ్ము లాగమములని చెప్పుటకు సహకరింపకపోఁగా బాధకమే యవు నని నిశ్చయింపవచ్చు.

ఇంక నాగమము లన్నపక్షమున నీన్నుమ్ములు ప్రాతిపదికావయవములే యవుటంబట్టి విభక్తిసంబంధులు గామి నిందలియుకారమున కనాదిషుసూత్రముచే సంధి వచ్చుట కవకాశము లేదు. ఇట్టియిబ్బంది బాలవ్యాకరణమునందును గల దని వా రిట్లు చేర్కొనిరి.

నన్నున్+ఏలు అనుస్వారపరకస్థలమున ద్రుతస్వరలోప మెట్లు ఘటిల్లును? అట్టియెడల నన్నున్+ఏలు అనెడియుదాహరణస్థల మెట్లు లభించును? ఇంక నిచట ఉకారసంధియే చేయఁదగు నందు రేని సంధ్యభావరూప మెట్లుండును? మఱియు వీరిపక్షమున నన్నేలు అను రూపము దుర్లభమె కదా. ఇంతియ గాక న్నుమ్ము లాదేశము లను వీరిపక్షమున నన్నును మమ్మును అను ద్రుతప్రకృతికరూపసిద్ధి యెట్లు? తృతీయాదులకు నఁగాగమ మగు నని గదా సూత్రించెను. (చిం.వి.వ. 117)స్వరపరకద్రుతస్వరలోపముంగూర్చి యింతకు ముందు స్పష్టము.

వీరియీవివరణము ననుసరించి బాలసరస్వత్యహోబలులవలెనె చిన్నయ (బ.సీ.) సైతము న్నుమ్ము లాదేశములే యని భావించినట్లు వీరినిశ్చయముగా నెన్నవచ్చు. చింతామణియందుఁ జిన్నయమత మట్లయవుఁ గాక. బాలవ్యాకరణమం దట్లని నిర్ణయించు టెట్లు? కాక చిం.లో న్నుమ్ము లాదేశము లవుటకును సూరి తృతీయాదులకు నుగాగమము చెప్పుటకును సంబంధ మేమి? చిం. తృతీయాదులకు నుగాగమ మన లేదు గదా. ఇంక సూరి సర్వనామపదములయొక్క ప్రక్రియను

నిరూపింపక విశేషము ననుసరించి యాయావిభక్త్యంతములపట్టిక మాత్రమె యిచ్చెను. అందును నన్నును మమ్మును అని చూపుటం బట్టి యట్టిచో నువర్ణస్థితి యనివార్యము. ప్రథమేతరవిభక్తివిధికడ నుదాహరించుట ననుసరించి నన్నును అనుచో న్నువర్ణమునందలియుకారము విభక్తిసంబంధి యనక తప్పదు. అట్టియెడ న్నుమ్ములే ప్రత్యయము లనియు నువర్ణము ద్వితీయ కాగమ మైన దని చెప్పరాదా? ద్వితీయకు సూరి నుగాగమము చెప్పలేదు గదా యనవచ్చును. ఒక్కరు ఇరుగురు ఇత్యాద్యస్థలములలో బహువచనలకారమునకు రేఫము గలదు. ఇది యదంతంబై - మున్నగు సూత్రముచే సిద్ధించునా? లేదు గావున అదంతంబై యనుసూత్రము సరి గా దని గాని ఒక్కరు అనుచో రేఫమును జూపుట తప్పని గాని చెప్పవచ్చునా? అట్లె యిట విశేషముగా ద్వితీయలో నుగాగమమును సూరి యుద్దేశించె నన నవకాశము లేదా? ప్రక్రియ నాతఁడు స్పష్టము చేయలేదు గావున నవకాశము లేక పోలే దని చెప్ప నవరోధము లేదు.

అయ్యు 'నువర్ణంబు ద్వితీయ' యని ద్వితీయావిభక్తి నువర్ణముగా నిరూపించెఁ గావున వీనియందుఁ దుది నున్న నువర్ణమె ద్వితీయావిభక్తి యనుట సూరిమతముగాఁ జెప్పఁదగును. (రామునిని అనురీతి వానిసాధనమునుబట్టియు) అట్లగా నిటఁ గూడ ద్వితీయకు నుగాగమము లే దనవచ్చు. మఱి న్నుమ్ములలోని యుకారము విభక్తిసంబంధి యగుటెట్లు? కాకున్న న న్నడిగె నని సంధి యెట్లు? సూరి సంధి చేసి చూపుటనుబట్టి యీన్నుమ్ములు ద్వితీయావిభక్తి కాగమ మైనవిగా గుర్తింపఁదగును. దానిని ఇత్యాదుల నివర్ణము ప్రాతిపదిక కాగమ మై ప్రాతిపదికావయవమగును. (దానిసొమ్ము.) ఇట న్నుమ్ములు విభక్తి కాగమము లవుటచే విభక్త్యవయవము లై విభక్తులే యగును. కావున నందలి యుకారము విభక్తిసంబంధియే యగుట సంధి వర్తిల్లును. చిం.

వి.ప.లో వీ రిట్లు పేర్కొన్నను వ్యా.సం.సం.లో న్నమ్ములు విభక్తి కాగమములుగా సూరిమతము నెన్నుట యెంతయు నుచిత మై యున్నది.

ఇఁకఁ బైని వివరణమున వీరు నన్నున్+ఏలు అనునుదాహరణ స్థలమె లభింప దని యె ట్లనఁగలిగిరో స్పష్టము గాదు. కొలిచితినిన్ చేయుదునన్ అనునవే చింతామణి సాధించుచున్న పరిపూర్ణరూపము లని నమ్మినవీరు న స్యాత్తనుచో చేయుదున్ అనుయే గ్రహింపవలె ననియుఁ బ్రథమే చోత్తమే చైవ యనుచోఁ గొలిచితినిన్ అనునదే గ్రహింపవలెను గాని కొలిచితిన్ అనునది గ్రహింపరా దనియుఁ జెప్పఁగలిగినవీరు లేదా? చేయుదునాన్ అనుచో అవసానద్రుతలో పము నాపిదప నుత్వలోపమునుఁ జేసి చేయుదున్+అవు డనురీతి నుంచ వలెనే కద. అదే తీరుగా నిట సైతము నన్నును అనుచో స్వరలోప మొక్కటి యేని నేల చేయరాదు? అయ్యవ్యజ్ఝలవా రనుసరించిన పై రీతి ప్రక్రియ యుక్తము గా దని యింతకు ముందు స్పష్ట మై యున్నది.

అయిన నన్నున్+ఏలు అనురీతిస్థలమే యుండదా? స్వరపర కతలో ద్రుతస్వరలోపము నంగీకరింపనపుడు ప్రథమేతరవిభక్తి - ఇఁ కాది-సూత్రములు వ్యర్థములే యని చెప్పవలెను. అట్టిస్థితి యుండనే యుండ దని విరుద్ధముగా నూహించుటకంటె వ్యాకర్తృవచనములను సమన్వయించుమార్గము నాశ్రయించుట యుచితము.

వీ రిచ్చట నన్నున్+ఏలె నని యుండదు గావున నన్నును+ ఏలె నని యుండఁగా ' ఉకారసంధి చేయ నగు నందు లేని సంధ్యభావ పక్షమున రూప మె ట్లుండు' ననుటయు సముచితముగా లే దనియే చెప్పఁదగు. వైకల్పికప్రస్తావముచేఁ బ్రథమేతరవిభక్తిసూత్రము

చేతన సంధి నూహించి రనవలయు. కాని యాసూత్రమున విభక్తిగత మగునుకారమునకుఁ గదా సంధిని జెప్పుచున్నది. న్నుమ్ము లాదేశము లయి ద్వితీయకును నుగాగమ మంగీకరించిన ప్పటిస్థితి యిది. అట్టియెడలఁ బ్రత్యయము లైన నన్నుమ్ములలోనియుకారములకుఁ గదా సంధి రావల యును. ఆగమ నువర్ణమునందుఁ జేయు టెట్లు? విభక్తి కాగమము గాన నాగమనువర్ణము విభక్త్యవయవముగా నందలియుకారము విభ క్త్యుకారమె యగు నని సంధి యగు నందా? నాకొఱకును+ఇచ్చె ఇత్యాదులం దెట్లు? ఇందలియిబ్బందులు స్పష్టమె.

సూరి విభక్త్యుకారమునకు సంధి యని చెప్పి నన్నున్ అనుచో న్నువర్ణమునందలియుకారమునకు సంధిని జేసి చూపు చుండఁగా నన్నును అనుచో నాగమనువర్ణమందలియుకారమునకు సంధి యనుకొనుట కవకాశ మేది? లక్ష్యములు చూపనిచింతామణి యం దెట్లే నూహింతురు గాక బాలవ్యాకరణమునం దట్టియూహాకే యవకాశము లేదు.

కాఁగా వ్యా. సం. న. లో పీకే తలంచినట్లుగ నేని స్వరసంధి సందర్భమున (స్వరపరకతలో సామాన్యముగ) ద్రుతస్వరము లోపించు ననియు నన్నున్ అనుచో న్ను విభక్తి కాగమ మగుటచే నందే యుత్వసంధి యనియు బాలవ్యాకర్త్రుమతమును గుర్తించుట సమంజసము గదా.

చింతామణియం దన్న పీరు నన్నునున్ అనురీతిగా పీనిని సాధించిరి కావున నన్ను నీ నర్చులు, నిన్ను నిప్పుడ యున్నప్పుడు నన్నునున్+ఈన్ నిన్నునున్+అప్ప (857) దనురీతిగా విభాగింపఁబడి యయ్యువి సంధి యైన రూపములే యనవలసియున్నవి. ఇప్పుడు సంధ్యభావపక్షమున నన్నును నీ, నిన్నును నిప్పుడ యనురీతిరూపము లుండవలె. ఇవి దుష్టములు కావు. కాని నాకొఱకు నిచ్చె నను

రీతివానివలె నన్నను నీ ననుకీతి వుండు నని సామాన్యముగాఁ జెప్పుట లక్ష్యానుగుణ మనలేము. అంటిని నిందఱకు ననుకీతివా వలెఁ గ్వాచిత్కము లనవలె.

నన్నొలె మమ్మొలె ననుకీతిరూపములు చిం. పక్షమున నెట్లు?

అందుకయి వజ్ఝలవా రొక వినూత్నసమన్వయము నాశ్రయించిరి. నన్ననున్, నిన్ననున్ అనుకీతివానికి సంగ్రహరూపములుగా నన్ నిన్ తన్ అనుకీతిరూపములు గలవు. నిన్నమ్మిన తన్ బంచిన(888). వీని స్వరపరకత్వమున ద్రుతత్వము రాఁగా నన్నొలె ననుకీతి నవు నని వారి యుద్దేశము.

వీ రింతకు ముందు నన్నొలె ననుకీతిరూపములు సూరిమతమున దుర్లభ మనిరి. అయ్యాది తమపక్షమునను దుర్లభమె యగుటను గుర్తించిరి. 'నన్నొలె ము న్నగునన్న యాదిప్రయుక్తరూపములు పయి చింతామణికారికలచొప్పున లభింపనేరవు.(వ్యా.సం.స.210) ఇంక దీనికి వి.వి. వచనము సాధకము. ఇవి బాల.లో సాధ్యము లగుట సూరి యుదాహరించుటనుబట్టి స్పష్టము. 'నన్నను ము న్నగువానిలోని న్నమ్ములు ద్వితీయాప్రత్యయమునకె పూర్వాగమములుగ సూరిచే నుద్దేశింపఁబడె నని చెప్పుటలో విరోధము లేదు. కాన - న్న మ్ములమీఁదిఉకారము సూరికక్షమున విభక్తిప్రత్యయోకారమె యనఁదగుటంజేసి ప్రకృతసూత్రము వర్తిల్లుటలో వివాదము లే(వ్యా. సం.స.213) దనువీరివివరణమునుబట్టియే యవి బాల.సాధ్యములు. ఆగ మము లన్నవజ్ఝలవారిసమన్వయమువలననే చిం. కసాధ్యము లైనవి.

కాని ప్రౌఢవ్యాకర్తృమతము బాలవ్యాకరణానుగుణము గాక (బా.న.)యహోబలాదులవ్యాఖ్యల ననుసరించి చింతామణికి ననుగుణ మైయున్నది. ప్రౌఢవ్యాకర్త ప్రత్యయము నాగమము నవ్యయమునైన నువర్ణము ద్రుతముగాఁ జేర్చుచు నందు నాగమాత్మక మయిన

దానికి నన్నును అన్న దుదాహరించెను. అనఁగా నన్నును అను చోటినువర్ణ మాగమముగా నైనది. కాఁగా నిది ప్రత్యయము గాదు. ద్వితీయయందును ద్రుత మాగమ మగుటను జెం. ననుసరించియే ప్రౌఢవ్యాకర్త స్వీకరించెను. కాఁగా నన్నును అనుచో న్నువర్ణమే ద్వితీయావిభక్తి. అనఁగా న్నుమ్ము లమ్నుస్నుల కాదే మెలికశావత్తు శము లనునభిప్రాయమునే ప్రౌఢవ్యాకర్త ప్రమాణీకరించె నని గుర్తింపవలెను. ప్రౌఢవ్యాకర్త ప్రాయికముగాఁ జెం.మార్గమునే యనుసరించి లక్షణనిర్మాణము చేసె ననుట స్పష్టము. (చూ.త్రి.శే.)

ఇట్టియభిప్రాయమును దిరస్కరించి యివి యాగమము లనుట వలన సాధింపఁబడు ప్రయోజన మేది? నన్నెలె ననురీతివి ద్రుతద్విత్వములు గావలసివచ్చుటా? నన్నయాథర్వణులమతమున ద్రుతద్విత్వము దుస్సంధి గా దనియె వీరినిశ్చయము గావున దాని నట్లు సాధించిరి. మఱి మమ్మెలె ననునది యెట్లు? మకారద్విత్వము చెప్పఁబడలేదు గదా. అందుకయి వజ్ఝలవారు మమ్ము+శస్ అని మ్మువర్ణమును ప్రాతిపదికకే యాగమమును జేసియు (మనశబ్దముపైని శస్సునకు లవర్ణమును విధించిరిసామర్థ్యము ననుసరించి) ఇట శస్సునకు లవర్ణకము రానేరదు గావున నది లోపించి ద్రుతముతో మమ్మున్ అని యవును. ఇటు శస్సు లోపింపఁగా దానికిఁ బూర్వమునం దున్న మువర్ణమునందలియుకారము విభక్తిగతము నై (లోపించిన దగుటం జేసి యట్టిప్రత్యయలక్షణము నమ్ము అనుదానితుదిఉకారమునం దావేశించుట న్యాయ్యము 214.)యనాదిషు సూత్రముచే సంధి నందు ననిరి. దీని కిది తప్ప నింకొకమార్గము లేదు గదా.

అయిన నన్నెలె ననునది మాత్రము ప్లల సిద్ధము గాదు? నన్నునుస్ అనుచో ద్వితీయైకవచనము వికల్పముగ లోపించును.

అట్లు నువర్ణకము (అమ్ము) లోపింపఁగా నన్నున్-అని యగును. మమ్మున్ అనుదానిలో శస్సు లోపించుటచే మ్మువర్ణమునందలి యుకారమెట్లు విభక్త్యాకారమైనదో పైరీతినులోపముచే నేర్పడిన నన్నున్ అనురూపములో న్నువర్ణమునందలియుకారము సైత మట్లు యగును గదా. మమ్ము+శస్ అనుచో శస్సు లోపించుటకును నన్ను నున్ అనుచో నువర్ణము లోపించుటకును నిట బాధక మగునట్టి భేద మేమి? తెలుఁగుప్రత్యయము నిట లోపింపఁ జేయ నమ్ము+శస్ అనుచో లోపించినది సంస్కృతము గదా యని యాకారణముచే నిది భిన్నముగా నిందలియుకారము విభక్తిసంబధి గా దని నిర్ణయింపవచ్చునా? నిజమున కహోబలపత్యాదులును నిట్టిసందర్భమున నునివర్ణకములకే లోపము చేసిరి. కాని నిరమో మహాత్మాం లుక్చ స్యాత్తనుచో అమః నిః స్యాత్, అమః లుక్చ స్యాత్తనురీతిగా నమ్మునకే లోపము చేయఁదగును. అట్లు గా దని తెలుఁగుప్రత్యయమునకే లోపము చేయదురు గాక. న మ్మేలె ననుచో నెట్టిసమన్వయము నాశ్రయించిరో యట్టిసమన్వయముతోనే న న్నేలె ననియు నగును. కావున నవ్వానిని ద్రుతద్విత్వస్థలములుగాఁ జెప్పవలసినయవసరము లే దనియు స్పష్ట మగుచున్నదే కదా.

అయ్యు నది ద్రుతద్విత్వమై యందము. ద్రుతద్విత్వమును చింతామణి సమ్మతింపలేదు. విధింపలేదు. నో వా ద్విత్వ మ్మను వి. వి. వచనముచేఁ జేయవలెను. అట ద్విత్వం వా యనుటచే నిత్యము కాదు గదా. దానివలన నన్+ఏలె ననుచో ద్విత్వ మైన న న్నేలె ననియు నయ్యది (క్వాచిత్కమును) వికల్పము నవుటంజేసి ద్విత్వము లేనియెడల న నేలె నని యుంపవలె. ఇది తఱుచుగ నుండవలసినదియు ననవలె. అట్టిరూపము లున్నవా? అనఁగా నీవాని ద్రుతమునకు ద్విత్వము నిత్య మని చెప్పవలయునా? దాని కాధార మేది? పైఁగా ద్విత్వం వా క్వచిత్తనుటచే ద్విత్వము వచ్చుటయే

క్వాచిత్క మనదగియుండఁగా నట్లు ద్విత్వము వచ్చినసందర్భము నందు సైతము న నేలె ననుకృతిరూప ముండుటకు వజ్ఝలవారిమతమున నవకాశము గల దనుట వింత గాదు. ఏల యన వీరు ద్రుతాద్ద్రుత, క్వచి చ్చాత్ర దృశ్యతే కపిభాషితే యనుకారికను నో వా ద్విత్వ మ్మనుదాని కనుబంధముగా వ్యాఖ్యానించి ద్రుతమునకు ద్విత్వము వచ్చుసందర్భములయందు ద్రుతముపై నిం కొక ద్రుత మగుట క్వాచిత్కముగాఁ గల దని పేర్కొన్నారు. కాఁగా ద్రుతమునకు ద్విత్వ మగుసందర్భమున సైత మీ ద్రుతముపై నిం కొకనకారము వచ్చియే తీరవలయు నని నియమింప వీలు లేదు గదా. కావున ద్విత్వము కానిసందర్భముతోపాటు ద్విత్వ మగుసందర్భములందు సైతము మఱి యొకనకారము రాక న నేలె ననుకృతిరూపము లేర్పడవలసియే యున్న దనుట స్పష్టము. నో వా ద్విత్వ మ్మనుచోటివాశబ్దమునకు వ్యవస్థ చేసి న న్నైలె ననుకృతిస్థలములందు ద్రుతమునకు ద్విత్వ మగుట (అపుడు ద్రుతముపై నిం కొకనకార మగుటయు) నియత మని గుర్తింప నవకాశము గలదు. కాని వజ్ఝలవా రాకృతిగా నియమింపను లేదు. కాన వీరిమతము ననుసరించి న న్నైలె ననుకృతిని ద్రుతద్విత్వములుగా సమన్వయింపవలసియుండుట యట్లుంచి న నేలె ననుకృతి యపరూపములకే ప్రముఖస్థానము నిచ్చుచుండుటచే నీసమన్వయ మంగీకారయోగ్యముగా లే దనక తప్పదు,

ఇట్టిస్థితి మ మ్మైలె ననుకృతిస్థలమునను గోచరించుచున్నది. ఇట నన్యతరలుక్చ యుక్తస్య యని యొకమకారము లోపింపఁగా మమున్ అం యువును. మమ్మున్ అనునది యేర్పడినపద్ధతిలోనే కదా యిదియు నేర్పడినది. కావున దీని కచ్చు పర మయినపుడు సంధి రా నక్కఱ లేదా? మ మ్మడిగె ననుచోవలెను. మ్ము ఆదేశ మన్న పక్షమున సైత మీయిబ్బంది తప్పదు. కాని యట్టియెడల వజ్ఝలవారు ఆచ్ఛికశబ్దమునందలిద్విత్వములో నొకహల్లు లోపించునపుడు పరిశిష్ట

వర్ణముపై నిల్చియున్నయచ్చు పరరూపసంధి నందకుండుట యచ్చాంధ్రభాషాసంప్రదాయ మగుటంజేసి మను నేలు ఇత్యాదులందు సంధి లే దని (చిం.వి.స.147) పేర్కొనిరి. జడ్డక్షరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపము లేకుండుట యచ్చాంధ్రభాషాసంప్రదాయ మనుట యుచితమార్గము. అట్లు గాక జడ్డ లోపించుచో సంధి లే దని పేర్కొనుచో—కన్నె—కను+ఎత్తె, విల్లు—విలు+అందె ననుకీలిస్థలములలో సంధి లేక యడాగమ మయి కను యెత్తె విలు యందె ననుకీలిగా నపరూపములు గావలసియుండును. విల్లు+ఎత్తె విల్లెత్తె అనియే యవును. విలెత్తె నని యుండ నట్టి విలు యెత్తె ననియు నుండదు. సంధి యవుచో జడ్డ లోపింప దనుటయు జడ్డ లోపించుచో సంధి గా దనుటయుఁ గేవలము సమానము లని యెంచరాదు గదా. మమ్మున్+ఏలె ననుచోఁ గూడఁ బ్రథమేతరవిభక్తి యనుచో సంధి వికల్పము. సంధి యవును. జడ్డక్షరంబుతోఁ బదాదిస్వరము కూడును గావున నపుడు జడ్డ లోపింపదు. సంధి యవుసందర్భమున మమ్మేలె ననియే యుండును. సంధి వికల్ప మవుటంజేసి సంధ్యభావపక్షమునందు జడ్డక్షరంబుతోఁ బదాదిస్వరంబు గూడుట యుండదు. కావున నపుడు జడ్డ లోపించుట కవరోధము లేదు. లోపించిన మము నేలె లోపింపనున్న మమ్ము నేలె నని యవును. ఇట సంధియే వికల్ప మవుటంజేసి జడ్డ లోపించినపక్షమున సంధి లేమి కల్పించుచున్నది. కానీ విల్లు+ఎత్తె ననుచో నుత్తున కచ్చు అనుసూత్రముచే సంధి నిత్యముగనే రావలసియున్నది. కావున నిట జడ్డక్షరముతోఁ బదాదిస్వరము గూడుట తప్పనిసరి యవుటంజేసి జడ్డలోపప్రసక్తియే యుండదు స్వరపరకత్వమున. జడ్డ లోపించిన సంధి లే దను టెట్లు గుదురును? సూరిమార్గ మెంతయు నుచిత మైయున్నది. అది యెట్ల చెప్పఁదగు.

ఇట్టి దాంధ్రభాషాసంప్రదాయమె కావచ్చును. కాని చిం. కాని వి.వి. కాని యీయంశమును బేర్కొనలేదు. అయిన నీలక్షణ

మను క్తకోటిలోఁ జేరును. ఈలక్షణము నంగీకరింపకున్న నిట నితర స్థలములందు నపరూపముల కవకాశము గల్గించిన ట్లవును గదా.

ముత్తముమీఁద ఏ రె ఫ్లే జడ్డలోపించుసందర్భమున సంధి లే దని చెప్పియున్నారు. ననున్+ఏలె ననురీతిస్థలములందు సైత మిట్లే చెప్పఁదగును. అనఁగా జడ్డ లోపముచే సంధి రాదు గాన న మేలె ననుదానివలెనె న నేలె ననియుఁ గా దనియుఁ జెప్పనగును గదా. నను నేలు అనుచోటిసంధ్యభావము మము నేలు అనునది మొదలగుచోటులందువలెనె ద్విత్వములో నొకవర్ణము లోపించిన కారణమున సంభవించు ననియుఁ జెప్పఁదగును గాని (చిం.వి.ప.141 యీమార్గముకంటెఁ గూడ నన్నున్+ఏలు ననున్+ఏలు అనువాని సంధిలో నచటితుదియుణములు ద్వితీయాప్రత్యయస్థములు కాఁబింజేసి రాము నభిరాము అనుస్థలములందువలెనే నన్నునేలు ననునేలు అనుసంధ్యభావరూపములే యొప్పడు (చిం.వి.ప.141) నను మార్గమె ముఖ్యముగ నెన్నఁదగిన దని గ్రహింపవలె ననిరి. ఆగమములు చేసినవీరిమతమున నవియే ముఖ్యమైన దగుట సక్రమమే. కాని యిట్టిముఖ్యమైన మార్గము నను నేలు అనుస్థలమునందు మాత్రమే యేల గ్రహింపవలయునో మమ్ము నేలు ననుస్థలమునఁ గూడ నదియే ముఖ్యమని యేల గ్రహింపరాదో వారు స్పష్టము చేయలేదు. కావున మన మిట్లూహింపవచ్చు. ననున్+ఏలె ననుచో వలె నన్నున్+ఏలె ననుచోటను నుత్వము విభక్తిగతము కాదు. ఇదే పద్ధతి మము నేలె ననుచో ముఖ్యమన్న యెడల మమ్మున్+ఏలె ననుచోఁ గూడ మ్మువర్ణమునందలియు కారము విభక్తిగతము గాకుండఁబోవును. అట్టియెడల మ మ్మేలె ననుదానిని వజ్ఝలవా రింకెట్లు సాధింతురు? ద్రుతద్విత్వమువలె నిట మకారద్విత్వమున కవకాశము లేదు గదా, ‘న నేలె’ వలె ‘మ మ్మేలె’ సాధించుటకు. కావున నను

నేలె ననుచో నే యది ముఖ్యమై సంధిని వారించినదో యది మము నేలె ననుసందర్భమున నుపయోగింపదు.

నిజమున కిది దప్ప స్నమ్మ్యాం ప్రాస్వ శ్ఛాదే రమి శసి చ యని రాయుతో సూత్రముచే విధింపఁబడినయీసమ్ములలో నొకదాని నుకారము విభక్తిసంబంధి యగుటయు నొకటఁ గాకుండుటకు సరియైన కారణము గానరాదు. యుష్మాన్ అనుచో శస్సు లోపించుచుండఁగా నన్నాన్ అనుచో అమ్ము లోపించుచున్నది. లేదా నువర్ణ మన్నను అమ్‌స్థానిక మగుట విభక్తియే యగును గదా నువర్ణమును. అమ్ము లేదా నువర్ణము లోపింపనపుడు నన్నానన్ అని యుండును. కాని యట న్నవర్ణమున దలియుత్తునకు సంధి చేయు మనరు గదా. కాఁగా విభక్తి లోపించునపుడే న్నవర్ణమునందలియుత్తునకు సంధి. యుష్మాన్ అను చోవలెనె. నన్నానన్ అనుచో నువర్ణకమందలియుత్తునకు నన్నాన్ అనుచో న్నవర్ణమందలియుత్తునకు సంధి. యుష్మ+శస్ అనుచో శస్సునకు లోపము నిత్యమగుట నటనిం కొకచోట ననాదిష్టసూత్రము ప్రవర్తించుట కవకాశము లేదు. కాని యస్సందర్భమున (నన్న+అమ్) లోపము వికల్పమగుట రెండు సందర్భములఁ బ్రవర్తింప నవకాశము గలదు గావున నట్లు చేయుట యవిరుద్ధమె.

నన్నాన్+ఏలె సంధ్యభావమునందు నయిన-నన్నా నేలె ననురూపమే నన్నానన్+ఏలె ననుచో నువర్ణమునందు సంధి యగుట వలన సంభవించుచున్నదే. నన్నా నేలె నని యొకేరూపము సంధి యగుటవలనను గాకుండుటవలనను నేర్పడు ననుటొప్పునా? అనవచ్చును. వజ్ఝలవారిపద్ధతిలో నట్టిబాధయు లేదు.

వీరు ద్వితీయాన్తవర్ణము పైని గూడ నన్యద్రుతప్రకృతయ యని ద్రుతమును జేసిరి. కావున ఘనమునున్, వనమునున్ అనురీతి నగును.

ధనమునున్ + అడిగె అనుచో నువర్ణకమునందలియుకారమునకు 'ననాదిషు' సూత్రముచే సంధి యప్రుట కవరోధము లేదు గదా. అట్లు సంధి జరుగఁగా ధనము నడిగె సంధి కానున్న ధనమును నడిగె నని యవును. లుక్చ స్థానత్రంటకు ద్వితీయావిభక్తి లోపింపఁగా ధనమున్ + అడిగె నని యుండును. ఇప్పుడు విభక్తి లోపింప ముందతి యుకారము విభక్తిగత మనఁదగియు డ సంధి వీరిమతము ననుసరించి రావలెను. అయ్యును వారు పేరొ్కన్నట్లుగా బిందలియుకారము ప్రకృతిగత మవుటంజేసి యనాదిషుసూత్రము ప్రవర్తింప దందము. అపుడు సంధి ర్న యని నిత్యసంధి రావలయును వారివివరణమును బట్టియే. కాని సంధి యపటు రా దనిరి గావున నె ల్లని రాకుండఁగా ధనము నడిగె ననురూపము సంధ్యభావమువలన నేర్పడుచున్నది. అనఁగా నింతకు ముందే విభక్త్యకారమునకు సంధి యవుటచే నేర్పడినదో యదియే యిట సంధ్యభావముచే నేర్పడినది గదా. పైని బేరొ్కన్న నన్ను నడిగె నన్నదియు బిల్లె యన్న నయ్యది యసంగత మనుటకు వజ్ఝలవారిపద్ధతిలో నవకాశము లేదు. వ్యా.సం.స.లో నీ రిట్లు రెండువిధములుగ నేర్పడుటను స్పష్టము చేసియుండిరి (209).

కాఁగా నన్నునున్ అనుచో నువర్ణమునందును నన్నున్ అనుచో న్నువర్ణమునందును సంధి చేయుట యవిరుద్ధ మైనది.

అయ్యు వీరు అనాదిషు సూత్రమువివరణమున విభక్తులయు కారమునకు సంధి కల్గె నేని విభక్తిప్రత్యయస్థోకారమునకె యని (209) వివరించి యట్లగుటవలన రామున్ + ఏలెన్ రా మేలెన్ అని గా దనిరి. మఱి మమ్మేలె నని యైనది. అది యట్లుండ నాసూత్రము విభక్తిపూర్త యనుచుండఁగా ప్రత్యయేంతరస్థముల దుత్తునకు సంధి యాసూత్రముచే రాదు గదా. ఇంక ఇట్లుకారసంధిప్రాప్తికర్తా విధానముచే నేతత్సూత్రములకు విషయము కాని యుకారమునకు

'అనాతః' అనుసూత్రమున నిత్యసంధి యుద్దేశింపఁబడిన దనుట స్పష్ట (209 మనుటచే నిటఁ బ్రకృతిగత మైనయుకారమున కనాత యని నిత్యసంధి రావలదా? ప్రకృతిగత మైనయుకారమునకు సంధి రా దని వాశబ్దమునకు వ్యవస్థ చేయుదురా? అసలట నాసూత్రమునకు నీయవి విషయము లైనఁ గదా ప్రవృత్తిగాని యప్రవృత్తి గాని నియమించుట. ఆసూత్రము ప్రత్యయస్థోకారమునకు సంధిఁ జెప్పుటచేఁ దదితరస్థలములందలియుకారమున కాసూత్రముచే సంధి రా వీలే లేమి నింకను రా దని యట నియమించుకొనుట కవకాశ మేది? కాన వజ్ఝలవారి సమన్వయము సరి గామి ఘన్నన్+ఏలె ననుచో సంధి యసలు లే దనుట కుదరకున్నది. ఇంకను వారివివరణము ననుసరించియే యీ సూత్రమునకు విషయము గానియాస్థలములు 'అనాతః' అని నిత్యసంధియు రావలసియుండె. దీనింగూర్చి ... తఃపూర్వము పరిశీలించి యున్నారము.

వజ్ఝలవారు సంధి యైన ఘన్నెలె సంధి కానిఘన్నన్నేలె ఇట్టి మమ్మేలె ననురీతిరూపములసాధనమున ననుసరించిన మార్గము సక్రమముగా లే దని నిశ్చయింపఁదగు

ఇంకను వీరు చన్నే యనునది గూడ ద్రుతద్విత్వ మైనదిగా నిర్ణయించిరి. చనున్+ఏ, చన్+ఏ చన్నె యిక్కడఁ గూడ ద్రుతమునకు (?) ద్విత్వము రానిపక్షమున ననెలె ననురీతిగాఁ జనే యని యుపరూపము గాక తప్పదు. నన్నయయే ద్రుతద్విత్వమును బ్రయోగించుటయే కాక నాదాపుగా నన్నియెడల నిత్యముగనే ప్రయోగించియుండఁగా నిట ద్విరూపకము లేకుండఁగా దీనిని లాక్షణికులు దుష్టసంధి యని యేల తిరస్కరించిరో చెప్పరాకున్నది. ధైర్యశక్తికి స్మరుదుగ ననురీతిని మిక్కిలియరుదు. అట ధైర్యశక్తి

కి నరుదుగ నని యుంటయే ప్రచురము. అథర్వణుఁడే చెప్పినను క్వచిత్ వా యనుట సార్థకమె. కాని అన్విష్టసఖి, న న్నైతె, చన్నై యను రీతిస్థలము లట్టివా? లేక క్వచి ద్వా యనఁగా వికల్ప మగుట కొన్ని యెడలనే కాని పెక్కెడల ననఁగా సాధారణముగా ద్రుతమునకు ద్విత్వము వచ్చుట నిత్యమే యనవలయునా? అయ్యె ద్రుతద్విత్వము నిత్య మన్నను వజ్ఝలవారువివరించిన ట్లీద్విత్వసందర్భమున ద్రుతముపై నకార మగుట క్వాచిత్క మగుట బాధ లే దని యెంచె నేమో. అయ్యె న నేల ననురీతివానిసంగతి యేమో.

పైఁగా వీరు ప్రౌఢవ్యాకర్తృవివరణము ననుసరించి యీద్విత్వమును జిం.చే సాధించుటకును (వ్యా.సం.స.లోఁ గాకున్నను) ప్రయత్నించిరి. లుక్సంశ్లేషా నాచి యని చింతామణి సంశ్లేషమును (ద్రుతము వెనుకటియచ్చు నత్తియుండుట) నిషేధించియుండుట చేత నీద్రుతద్విత్వరూపసంశ్లేషమును యథేష్టముగాఁ జేయరా దనియుఁ బ్రయుక్తముమాత్రమె గ్రాహ్య మనియు (142), ఇట్టి సన్నయాభిప్రాయమునె లుక్సంశ్లేషా విత్యాదిసూత్రమును సవరించు సందర్భమున నథర్వణాచార్యుఁడు నో వా ద్విత్వం క్వచిచ్ఛిష్టం పరప్రాణేన సంగతే యని చెప్పినట్లును (143) జిం.వి.వ.లోఁ జేర్కొనిరి. లుక్సంశ్లేషా నాచి యనుచోఁ దత్కర్తకు ద్రుతద్విత్వము క్వాచిత్కముగఁ జేయునవు ననియే యభిప్రాయ మేని నో వా ద్విత్వమ్మనువి.వి. వచనము దానికి వివరణమే యగును గాని నవరణ మగుట యెట్లు? న న్నైలు అనురీతిది ద్రుతద్విత్వమె కాఁగా నది చిం.చే సాధింపఁబడ దనియే వ్యా.సంస.లోఁ జెప్పిరి. ప్రయుక్తస్థలములలోఁ గూడ గ్రహింపరా దని సూత్రాభిప్రాయమా? అన్విష్టసఖి యని చూపి ప్రౌఢవ్యాకర్త పైనట్లు వివరించుటయుఁ బ్రామా

దికమే. అయ్యు దాని నాతఁడు పిదప సవరించుకొనె ననఁదగును. ద్విత్వము క్వాచిత్కము గాని వచ్చుచోట్ల నిత్యమె యనవలెనా? అని పీ రెవ్వరుఁ జెప్పలేదు. (ధైర్యశక్తికి స్మరుడుగ బాధక మగును గదా.) ప్రౌఢవ్యాకర్త ధైర్యశక్తికి స్మరుడుగ ననురీతిది చూపకుంట విశేషము. ద్రుతద్విత్వము క్వాచిత్కముగ వేని సమ్మతము గా దనియే లుక్సంశ్లేషా నాచి యనుదానిచేఁ ఏతత్కర్తృమత మెన్నఁదగియున్నది

అప్పకవ్యాదులకువలె లుక్సంశ్లేషా నాచి యనుచోటి సంశ్లేషపదమునకు వజ్ఝలవారు ద్రుతద్విత్వ మని యర్థము చేయుట విశేషమే యనఁదగును. అట్లయ్యును ద్రుతము పూర్వాచ్చు నత్తియుండుట సంశ్లేష మనుతమమతముఁ గూడ నిటఁ జూపుట గమనార్హము. అయినను ద్రుతము స్వపూర్వాచ్చు నత్తియుండుట యనుసంశ్లేషమును నిషేధించుటకును ద్రుతద్విత్వరూపసంశ్లేషము యభీష్టముగాఁ బ్రయోగింపరా దనుటకును గల సంబంధ మెట్టిదియో స్పష్టము గాకున్నది. సంశ్లేషము నిషేధించుటచే ద్రుతము పూర్వాచ్చు నత్తి వచ్చెన్ అతఁ డనురీతి నుండకుండుఁ గాక, వచ్చె నతఁ డనుచో నున్ననకారమునకు ద్విత్వ మగుటకుఁ బ్రత్యేక విధానము లేమి నవకాశము లేకపోవుఁ గాక. కాని సంశ్లేషనిషేధము వలన ద్విత్వ మగుటయా? అట నట్లు వివరింపక పూర్వాచ్చు నత్తియుండుట యనునర్థమును జేర్చ నేల? ద్రుతమునకు ద్విత్వ మగునపు డది స్వపూర్వాచ్చు నత్తియుండునా? అనఁగా నన్ నేలె నని యుండునా? అట్లుండ దని నిషేధించుటకు? న నేలె ననురీతిగా నున్నచో ద్రుతము పైనున్నయచ్చుతోఁ గూడ లేదు. (కూడినను నది స్వత్వము గాదు.) కాని ద్విత్వమువలన వచ్చిననకారముతోఁ గూడియే యున్నది కావున నది వారిమతము ననుసరించి స్వత్వమే యగును గాని సంశ్లేషమును గాదు గదా. వ్యా.సం.స. ౪౦౬ుఁ ౫౦ వి.ప.లో నింకను స్పష్టముగాఁ బరవాల్లుతోఁ గూడి పర

స్వరాంగ మగుచు నుండెడిస్థితి — స్వతా — (210) పరహల్లుతో సంయోగించి పరస్వరాంగ మగు లక్షణముగాఁ గలస్వత్వావస్థ(211) యని పేర్కొనిరి. కావున న న్నె లె ననుచో ద్రుతముస్థితి స్వత్వమే యగును గాని సంశ్లేష మగుట యెట్లు? సంశ్లేషనిషేధమువలన న న్నడిగె ననురీతి(స్వత్వ)రూపము లుండనేర వని చెప్పుట కుదురునా? ఇట ద్రుతము పరముగా నున్న (యచ్చుతోఁ గూడియున్నను నపుడు స్వత్వము గాదు. సంశ్లేషము ననరాదు గదా.) నె ల్లె నిం కొక నకారము రా దానితోఁ గూడియే యున్నది, గదా. కాఁగాఁ బ్రౌఢ వ్యాకర్త చెప్పెను గదా యని వఝ్ఝలవా రాయర్థమును గ్రహించుట తమసిద్ధాంతమునకు విరుద్ధ మని గుర్తింపఁదగును.

అప్పకవియుఁ దదనుగుణముగఁ బ్రౌఢవ్యాకర్తయును నిచ్చోట సంశ్లేషపదమునకు ద్విత్వ మనురీతి నర్థము చేయుటకుఁ గొంతే నవకాశ మున్నది. వారు సంశ్లేష మనఁగా మీఁదిహల్లుతోఁ గూడుట యని భావించియున్నవారు గావునను స్వరపరకత్వమున మీఁద హల్లు లేకుండుటంజేసి మీఁదిహల్లుతోఁ గూడుట యున్న దన లసంభవమే యగుచుండ మీఁదిహల్లుతోఁ గూడ దని చెప్పుట ననుసరించి తత్సామర్థ్యమున నావహల్లే మనఁగా ద్రుతము ననుసరించి నకారమే పైని జేరి దానితోఁ గూడుటవలన సంశ్లేషసిద్ధి నూహింప వచ్చును. కాని వఝ్ఝలవారిమతమున సంశ్లేష మనఁగా ద్రుతము పూర్వాచ్చు నంటియుండుటయే కదా. స్వరపరకత్వమున నట్లుండ దని చెప్పుటలో బాధ లేదు కావున సంశ్లేషనిషేధసామర్థ్యమును బట్టి ద్విత్వము నూహించుట కవకాశము వారిమతమున లేదు. అప్పకవిప్రభృతులమార్గ మిటఁ బ్రయోజనవంతమె యైనను వఝ్ఝలవారిట్లు చెప్పుట కవకాశము లేదు. వీరు ద్రుతద్విత్వరూపసంశ్లేష మనుటయు సమంజసము గా దని స్పష్టము. కాఁగా నె ల్లెని

ద్రుతద్విత్వము నన్నయభారతప్రయుక్త (అన్నిష్టసఖిత్యాది) స్థలములం దేని చింతామణిసమ్మతముగాఁ జెప్ప వీలు లేదు.

ద్రుతద్విత్వము విరళముగా నుండఁ దగు నన్నప్రౌఢవ్యాకర్త యేని నన్నేలె ననునది ద్రుతద్విత్వముగా భావించ నగు వీలు లేదు. నన్నును అనుచో నువర్ణము నాగమాత్మక మయినదిగాఁ జూపుటను బట్టియే ప్రథమేతరవిభక్తివిధిచే సంధి యవుటవలన నన్నేలె ననురీతిరూపము లయినట్లు ప్రౌఢ,నుతముగాఁ జెప్పవలె. అన్నిష్టసఖి యనుచో ద్విత్వము నందినది శబ్దగతనకారము అయ్యాది ద్రుతము గాదు. నన్ అనుచో నున్న నకారము ద్రుతమె. విభక్తి యైనను (సూరిమతమున) విభక్తికాగమ మైనను (చిం.ప్రౌఢ.లమతమున) నది శబ్దగతనకార మను వీలు లేదు. నన్నును నన్ను నను నన్ అను రీతిగా నెన్నినను నీనకారము ద్రుతమె యనవలె. కాని యిట్టిప్రక్రియ తద్దిష్టముగా దనవచ్చును. నన్నును, నను (ను) అని యవసానమున ద్రుతలోపము. నన్+అడిగె మున్నగురీతిగా నవసానేతరస్థలములఁ బ్రాప్తించు టెట్లు? ద్రుతస్వరలోప మన్న సూరిమతముగా గుర్తింప నాధారము గలదు. అన్యతరక్ప లుక్తస్య యని చిం.లోను తుదివులు క్రిందినలలకును నను దానిచేత బాల.లోను నను(న్) అనురూప మగును. ప్రౌఢవ్యాకర్త న్నవర్ణము ముక్తమునకు లోపము విధించెను. సూరి యిది స్పష్టము చేయలేదు. ఎట్లయిన నన్ అనుచో నకారము ద్రుత మనక తప్పదు. నన్నేలె నన్నది ద్రుతద్విత్వమె యైనఁ బ్రౌఢవ్యాకర్త యుదాహరింపకుండుట విశేషమె.

నన్నేలె ననురీతిది ద్రుతద్విత్వముగాఁ జెప్పుటకు నాధారము లేదు. ఇంకను నన్నేలె ననురీతియుపరూపప్రక్రియుఁ గలదు. వే తెచ్చుట నైనను ద్రుతమునకు ద్విత్వము క్వాచిత్క మనఁదగియుం

డంగా నన్ నిన్ తన్ అనువానిలో మాత్రమె నిత్య మనవలసివచ్చుట సహజముగాఁ గానరాదు. అన్నిష్టసఖిత్యాదుల నన్న నది ద్రుతమే కాదు. అందుకే యిట్టివానిని (పెన్నరసము మొ॥) ప్రౌఢవ్యాకర్త వేఱుగా సాధించె నది యుక్తము.

మమ్మెలె ననురీతిస్థలముల కనుగుణముగా నన్నెలె నను చోను సంధి యైన దనుటయే యుక్తము. మమ్మున్ మిమ్మున్ తమ్మున్ అనువానియందువలె నన్నున్ నిన్నున్ తన్నున్ అనువాని యందును న్నువర్ణోకారము విభక్తిసంబంధియే యని గుర్తింపఁదగును. అందు కయ్యును బాలప్రౌఢాదులు న్నుమ్ముల నమ్మున్నుల కాదేశములుగాఁ జెప్పియున్నారు. మ్మువర్ణము శస్సుస్థానమున నగుచుండు టంబట్టియు నీమమ్మున్ మిమ్మున్ తమ్మున్ అనుచో మమ్ముల ననురీతిగా లవర్ణము లే దని గ్రహింపవచ్చును.

భూయస ఉక్షసార్థవాచీ యః కశ్చి ద్భవతి నిత్యబహువచనః తస్య జసో మశ్శసో లః అనుచో మనశబ్దముపైని శస్సునకు లవర్ణమును విశేషముగాఁ జెప్పుటవలన 'నీనాతా'లపై లవర్ణకము లే దని వజ్ఝలవారు వ్యాఖ్యానించిరి. అయిన నిట శస్సుస్థానముననే మ్మువర్ణము చేయుచో నటఁ బ్రత్యేకముగా లవర్ణమును విధించుటలోఁ బ్రయోజన మేమి? మనశబ్దముశస్సునకు మాత్రము లాదేశపునర్విధానమువలన మనలన్ అనిమాత్రమె సిద్ధించును. సూరి యుదాహరించినమనలచేతన్ మున్నగురూపములు చింతామణిసమ్మతములు కా (881) వని వజ్ఝలవారే చెప్పిరి గదా. కాఁగా ద్వితీయయందలి పునర్విధానమువలనఁ దృతీయాదులందు మనశబ్దమునకే 'ల' లేకుండుట ప్రయోజనము. నీనాతాశబ్దముల శస్సునకు('మ్మ' ఆదేశముచే) లేనిదానినిమా నన్యాయమునఁ దృతీయాదిబహువచనములందును లాగమము లే దని (వ్యా.సం.స.881) యెఱుంగవచ్చును. మనశబ్దము

కన్నునకు లవర్ణము విధించుటచే నీనాతాలకు రా దన్న వఝ్ఝలవారి సమన్వయములో నీనాతాలకుఁ దృతీయాదులలో లాగమము లే దను టొప్పును. మనశబ్దమునకును దృతీయాదులలో లాగమము రా దనుట విశేషమే యగును.

కాఁగా న్నుమ్ముల నన్నున్నలస్థానముఁ జేయుటలో నిబ్బంది లే దనియుఁ బ్రయోజనము లే గల దనియు గ్రహింపఁదగు. నన్నెత మమ్మెత యనురీతిసంధి సమానముగ సముచితముగ సిద్ధించుటతో పాటు ప్రసిద్ధము లైననన్నను అనురీతిరూపము లే సాధింపఁబడు టయుఁ బ్రయోజనమే కద. ఆగమముగాఁ జెప్పి వఝ్ఝలవారు సాధించిననన్ననున్ అనురీతిరూపములు మిక్కిలివిరళము లనుట స్పష్టము.

కావున బా.స.ప్రభృతులు పేర్కొన్నట్లుగా విభక్తివిపరిణామముతో న్నుమ్ముల నాదేశములు చేయుటె యుచితము. సూరిమతానుసారముగా ద్వితీయాకారమునకు సంధి యగునది నన్ను నిన్ను, నన్ను, మమ్ము, మిమ్ము, తమ్ము ననునాతింటనే. (బా.ఉ.) కాఁగా నన్నెత ద్రుతద్విత్వస్థలము గాదు.



# బిందువు – మకారము

‘కేచిద్వద న్త్యభేదత్వ మనుస్వారమకారయోః’ అను వి.వి. వచన మనుస్వారమకారముల కభేదత్వమును జెప్పుచున్నది. ఇట నభేద మన నెట్టిది? అనుస్వారముస్థానమున మకారము వ్రాసికొన వలెనా? లేదా? అభేదస్థితి నుదాహరించుచు వ్యాఖ్యవారు ‘కమ్మనిల తాంతములకుం బొనసి’ యని చూపిరి. ఇట ననుస్వారముస్థానమున మకారము వ్రాసినచో ‘— కుమ్మొనసి’ యని యది నమ్రప్రాసమె యగును. కాని బిందువు నట్లు యుంచుటచే బిందుపూర్వకమకారమున కును ద్విరుక్తమకారమునకును బ్రాసము చెల్లిన దనవలె. అనఁగా స్థూలముగా నిర్ణయించుచోఁ బ్రాససందర్భమున బిందుమకారము లభిన్నము లని యనఁగా నారెంటికిఁ బ్రాసచెల్లు నని యభిప్రాయము నెన్నవలయు.

దీనిని వీరు స్పష్టముగా సైతము చెప్పి రనవచ్చును. ‘తమకుఁ దాము ద్విత్వంబు లై తనరు నవియుఁ బూర్ణబిందులు దావలఁ బొరయునవియుఁ, గలసి యనునాసికప్రాసము లను పేర, నమ లమరుఁ గావ్యములయందుఁ దమకుఁ దాము — అప్పకవి వివరించినపై నన్న యాభిప్రాయమునే యధర్వణుఁడు కేచిద్వద న్తీత్యాదికారికచే వివరించె (288) ననిరి. పూర్ణబిందుపూర్వకమకారమునకు ద్విరుక్త మకారమునకును బ్రాస వేసికొనవచ్చు నని నన్నయాభిప్రాయము. దానినే యప్పకవి వివరించెను. దానినే యధర్వణుఁ డీకారికచే విశదీకరించెను. అనఁగా • నధర్వణుఁడును బ్రాసనే యుద్దేశించె నని తేలుచున్నది గదా.

ఇట నన్నయాభిప్రాయ మేదో తెలియవలయు నన్న నాయన ప్రయోగము ననుసరింపవలెను. దానిని వీరు ‘— కుంబొ

నసి' యని యిచ్చిరి. కాని యహో. '— కు మ్మొనసి' యని బిందు స్థానమున మకారమునే వ్రాసి చూపెను. కాని ఘం.వ్యాఖ్య అహో '—కుం మొనసి యని చూపినట్లు పేర్కొనుట యేప్రతి ననుసరిం చియో. ఘం.అభిప్రాయము లిట దాదాపుగా వజ్ఝలవారిని యథా తథముగా ననుసరించి యున్నవి. గ్రంథాంతరమున నవి పరిశీలింపఁ బడినవి (శ్రీ. శే.) అహో. వ్యాఖ్యనే దాదాపుగా ననుసరించి చెప్పిన కవిజనమండనము బిందుస్థానమున మకారమును జూపి 'కొంద అను స్వారమకారములకు భేదము లే దనిరి. పదాంతద్రుతము మకారంబు పరం బగునపుడు మత్వంబు నొందు నని కొంద అందురు. అది యాచార్యునకు నిష్ట' (30) మని చెప్పి పై ప్రయోగము నిచ్చినది. దీనింబట్టియు నేఁ డహో. గ్రంథముఁ గన్పించు —కు మ్మొనసి యనుమకార మైనపాఠమే అహో. ఉద్దేశించె నని నిర్ణయింపవచ్చును. దానినే ప్రమాణీకరింపవలసియున్న దని పైని స్పష్ట మగును. కాఁగా నన్నయ ద్విరుక్తమకారమునకుఁ బూర్ణబిందుపూర్వక మకారముతోఁ బ్రాస చెల్లించె ననుట కాధారము లేదు. కాన నట్టిది నన్నయాభిప్రాయ మనుట నిరాధారమే యగును.

ఇట్టిప్రాస చెప్పినయప్పకవి యేని నీప్రయోగమును జూపెనా? నన్నయప్రయోగమె యుండ నేల యుపేక్షించెనో. దానింబట్టి యట బిందువు లే దేమో యని యనుమానించుటకు నగుఁగా నహో. చూపిన'—కు మ్మొనసి' యనుపాఠమె యట నుండె ననుట కవకాశము గల్గుచున్నది.

అప్పకవియభిప్రాయ మేమి? అతఁ డట మకారముతో పాటు నకారమునుగూడఁ బ్రస్తావించెను. ద్విరుక్తనకారమునకుఁ బూర్ణ బిందుపూర్వకనకారమునకును బ్రాస చెల్లు నని మి న్నేఱు-ధాలిం

నాభిని అని చూపెను. కాని యప్పకవి బిన్దుః ప్రవర్తితం క్వచి త్క్వచి త్తనుసూత్రమును వివరించుచో గజబమకారముల (5–157) పరకతయుండే ద్రుతమునకు బిందువు చెప్పి గజబమకారంబులఁదా పలమ్రోలమె (5-158)బిందువు చూపెను. దీని ననుసరించి యప్పకవిమతమునను నకారపరకతయందు ద్రుతమునకు బిందువు లేదు గదా వజ్ఝలవారు 'ఇట నప్పకవి పైరీతి నకారమును జేర్పవక్కఱ లేదు. ధాతి నాభిని, సాన్నిధ్యము, సన్నుతి అనియు నుండఁదగును గదా (293) యనిరి. నకారపరకతలోఁ బ్రాసభంగపుఁజిక్కు లేదు గావున నిట్లు చెప్పనక్కఱ లే దన్నమాట. (293) అయిన మకారపరకతలో ద్రుతమునకు మకారమును జెప్పకొన్న నదియు సమప్రాసమే యగుఁ గావున మకారము నెడలను నిట్టిప్రాసను జెప్పనక్కఱ యుండదు. అహో. ప్రభృతులు —కు మ్మొనసి యని మకారమునే చూపిరి గదా (అప్ప.5.151)

వజ్ఝలవా రిట నప్పకవిలక్షణమునఁ బంచమాశ్వాసస్థలమును గూడఁ బ్రస్తావించిరి. ఆలక్షణము కొంత భిన్నమైయుంట గమనార్హము. ఇట 'తమకుఁ దాము ద్విత్వంబులై తనరునవియుఁ, బూర్ణబిందులు డాపలఁ బొరయునవియుఁ, గలసి యనునాసికప్రాసము లనుపేర, నమ లమరుఁ గావ్యములయందుఁ దమకుఁ దా'మని చెప్పినయప్పకవి పంచమాశ్వాసమున- తమకుఁ దాము ద్విత్వంబులై యమరునవియు, బిందువులు డాపలను వెలుగొందునవియు నొక్కరూపయి పూర్వప్రయోగసరణి నమలు ప్రాసంబులకు నిల్చుఁ దమకుఁ దాము(154) అనెను. ఇట 'నొక్కరూపయి' యనుట పూర్వస్థలమునకంటె విశేషము. ఒక్కరూపగు టెట్టిది? 'లుకి భవే ల్లడయో రేకరూపతా' యను వి.వి.లక్షణము నిట

గమనింపఁదగును. అనఁగా మీఁదినమల ననుసరించి బిందువు నములుగా మాఱు నని గ్రహింపవచ్చు. ఉదాహరణములనుబట్టియు నట్లు చెప్పవచ్చును. తృతీయాశ్వాసమున మిన్నేఱు ధాతం నాభిని, తమ్ములను — భక్తిం మురర — అని యనుస్వారమునే చూపినయప్పకవి యిట ధాత న్నాభిని, భక్తి మ్మురర— అని చూపుట గమనార్హము. పంచమాశ్వాసస్థలమున బిందువులోఁ బాఠాంతర మేమి గానరాదు. పూర్వస్థలముననే భేదము గలదు. మొదటి రెండుపాదములనుబట్టి యనునాసికమును బూర్వోక్తాంశమునే యుద్దేశించె నన్న ననుస్వారమునే చూపకతప్పదు గదా.

అయిన నిట నొకభేద మున్నది. ధాతన్+నాభిని, ధాతం+నాభిని, ధాత న్నాభిని ననురీతి నవుటయే యొక్కరూ పవుట యన్న నది కేవలము గౌరవమే యగుచున్నది. ద్రుతమునకు సంశ్లేషము చేతనే యిట్టిరూప మేర్పడుచుండ బిందుపూర్వకనకారమును ద్విరుక్తనకారము నొక్కరూ పగుటను జెప్ప నేల? అంతేగాక యింతకు ముం దిచ్చటనే గజబసుకాంపరకతయందే బిందువు చెప్పుట నకారపరకతయందు బిందువే చెప్పకుండఁగా నాబిందువున కేదో యగు నన నేల? రెండుమతములయందు నిది యవరోధమే యవును.

అప్పకవియభిప్రాయమ యథర్వణుఁడు విశదీకరించె నని కారికనుబట్టి చెప్పఁగలమా? అనఁగాఁ గారికాకర్తయును ద్విరుక్తనకారమునకు బిందుపూర్వకనకారముతోఁ బ్రాస చెప్పుట యనవసర మని గుర్తించి ద్విరుక్తనకారమునకు బిందుపూర్వకమకారముతోఁ బ్రాస చెప్పె ననవచ్చునా?

కాని కారికయందుఁ బ్రాసప్రసంగ మున్నదా? వాదేశము మున్నగుసంశముల యతిప్రాసలందలివిశేషములను బ్రస్తావించుచో నట్లు స్పష్టముగా నిర్దేశించనే కద. ఇట నట్లు చెప్పమింబట్టి దీనిని

ప్రాసవిషయకముగా నిర్ణయించుటకుఁ గారికయం దాధారము లే దని స్పష్టమే.

అప్పకవి ద్విరుక్తమకారము పూర్ణబిందుపూర్వకమకారము ననఁ గారిక యట్లని స్పష్టము చేయుట లేదు. సామాన్యముగా మకారము బిందువు నభిన్నము లనుచున్నది. అనఁగా నద్విరుక్త మగుమకారమునకును బిందువుతోఁ ప్రాస వేయుటకు వీలు గల్గె

నన్న యనర్థములు గొనితెచ్చుకొన నేల? ఇది ప్రాసవిషయక మనునభిప్రాయమున కాధారమె కారికయందు లేమి నట్టియభిప్రాయమె యిందు విశదీకరింపఁబడె ననుట నొప్పునది గాదు. అప్పకవి తృతీయాశ్వాసమునఁ జెప్పినయభిప్రాయము ననుసరింప లేదు. కాని పంచమాశ్వాసమునఁ జెప్పినదానికి గొంతవఱకుఁ బోలియున్న దనవచ్చును. ద్విత్వంబులై యనుసారునవియు బిందువు డాపలఁ గల్గునవియు నొక్కరూపయి యుంటలో నొక్కరూప గుటయే కారిక యందలియభేదత యనియు మకారమువిషయమున నవసరమని గ్రహింపఁబడలే దనియుఁ జెప్పినఁ జెప్పవచ్చును. భక్తిమ్మర అనుదానినలెనె అహో నను మ్మొనసి యని చూపెఁ గదా. కాని యప్పకవి పంచమాశ్వాసస్థలమునను నన్నయప్రయోగ మీమాంసించుట విచార్య మైయున్నది. నిర్ణాయకముగా లే దని యుపేక్షించుట నొకమార్గము.

వఝలవారి వివరణము ననుసరించి నన్నయాభిప్రాయమునె యప్పకవి వివరింప నభర్వణుఁడు నట్లు చెప్పె. అప్పకవి యథర్వణుని తరువాతివాఁడు గావున నథర్వణుఁడె నన్నయాభిప్రాయమును ముందుగా విశదీకరించె ననవచ్చు. నను మొనసి యను ప్రయోగమునుబట్టి యథర్వణుఁ డట్లు చెప్పెనా?

కాని వఝలవారాతర్వాత ప్రౌఢవ్యాకర్త నను మ్మొనసి యని మకారము చూపుటను ప్రస్తావించుచు—నిర్బాధమును కేచిద్వ

త్రభిన్నత్వమ్ (అభేదత్వ మని యుహాపాఠము. వీరు నదే యింతకు ముందు వివరించిరి. 287.) అనునథర్వణవచనసమ్మతము నగు చింతామణిమార్గము నుపేక్షించి—— మకారద్వయప్రయోగము నన్నయ చేసె నని నూతనపద్ధతిని గల్పించుట కాధార మే మున్నది(293) యనిరి. దీనినిబట్టి కారిక బిందుమకారముల కభేదము చెప్పినది గాన ——కుం మొనసి యని యే యుండవలె నని నిర్ణయించిన ట్లయినది. (చిం.సమ్మత మనుటయు నట్టిద. బిన్దుం ప్రవద న్తి తం క్వచిత్ క్వచిత్తన్నది స్పష్టముగా నిర్ణయింపలేదు. కాన ——కుం మొనసి యను ప్రయోగ మున్న దని నిశ్చయింపఁబడినపుడే యూచిం. సూత్రమునకు మకారంపంక్తయందు బిందు వగు నని వ్యాఖ్యానించుకొనుట న్యక్రమ మగును.) నన్నయాభిప్రాయములె యథర్వణుఁడు విశదీకరించె నన్నమాటనుబట్టి చూచ ——కుం మొనసి యనుపాఠ మున్న నే కారిక కర్థ మగును. అట్టియెడలఁ గారికనుబట్టి పాఠ మిది యని యన్యోన్యాశ్రితముగా నిర్ణయించిన నెట్లు?

ఇంక వారు మకారద్వయప్రయోగ మిట నన్నయ చేసె ననుట కాధారము లే దనిరి. కాని లేకపోలేదు. ప్రౌఢవ్యాకర్త యట్లుదాహరించె నన నాపాఠ మొకప్రతియందు లేదని లే దనలేము గదా. భారతసంశోధితముద్రణము '——ను మ్మొనసి' యనుపాఠమునకె ప్రాధాన్యము నిచ్చి ——కుం మొనసి యున్నది పాఠాంతరముగా నిచ్చినది. ఇట్లు భేద ముండ నన్నయ బిందువునే ప్రయోగించె నని నిర్ణయించు టెట్లు? (కొన్నిప్రతుల కు న్మొనసి యని యుంటను గూడ సంశోధితముద్రణము స్పష్టము చేసినది. ఇది యేల ప్రమాణీకరింపరాదు?) వివాదగ్రస్త మగునీప్రయోగమునుబట్టి నన్నయాభిప్రాయ మిది యని నిశ్చయించుటయు నదియే యథర్వణుఁడు విశదీకరించె ననియుఁ గావున నన్నయప్రయోగ మట్లు యుంట నాధార మనియుఁ జెప్పిన విశ్వసించు టెట్లు? ఇట మకారద్వయ

మున్న పాఠమె ప్రమాణీకరింపఁదగు ననుట కొకయాధార మిట్లు గుర్తింపవచ్చును. ఇట్టిదే యనఁదగినస్థలాంతరమున నన్నయ 'వృష్టిఁ జేసె న్మహానది' యని ప్రయోగించె. ఇటఁ బాఠాంతరము గానరాదు. (సంశోధితముద్రణము గాని వావిళ్లప్రతి మొ॥ వానింటఁ జూపఁబడలేదు) కాని చేసె న్మహానది' యన్నదే కవిప్రయుక్త మనుట యొప్పునే కదా. లేక పాఠాంతరము గానరాకయుఁ దాళపత్త్రప్రతులు దప్పులతిప్ప లనియు 'చేసెం మహానది' యన్నదే నన్నయవ్రాఁతకు మనియుఁ జెప్పవలెనా? పాఠాంతరము గానరాని యీ ప్రయోగమును గూడ వారు స్థలాంతరమున బిందువుతోఁ జూపిరి (290) ఆధారము చూపలేదు. (వంద్యుం ముని అని యిచ్చిరి. అట వంద్యుం బరమున్ అనుపాఠము ప్రధానముగాఁ గానఁబడు.) కాఁగాఁ జేసె న్మహానది యన్న దాధారముగా నిచ్చుట —కు మొనసి యునునదే సరి యైనపాఠముగా గుర్తించుట యొప్పును గదా. సూరి గ్రంథాంతరమున నిట్లు ద్రుతమునకు మకారమును జెప్పుచో నీయభిప్రాయమునె గల్గియుండుట గుర్తింపవచ్చును. కాన —కుం మొనసి యున్నపాఠ మంగీకార్యముగా నిర్ణయింపరామి బిందుమకారములయభిన్నతే నన్నయాభిప్రాయముగా నిర్ణయించుటయే నిరాధారము కాఁగా నర్థానినె యథర్వణుఁ డీకారికచే విశదీకరించె ననుటయు నిరాధారము యగుచున్నది. కాఁబట్టి యథర్వణకారికనుబట్టి నన్నయ ప్రయోగమున బిందువే యున్న దనుట నిరాధారము. (అట్లు యగుచోఁ జేసె న్మహానది యనుచో నపూర్వముగా బిందుపాఠము గల్పింపవలెను.) ఏ మైనను గారికార్థము పైనట్లు చెప్పుట నిరాధారమునకు తీఱదు.

దీనింబట్టి చూడ బా. స. అప్ప. మొ॥ వారు మకారపరకతలో బిందువు చెప్పుట యుకవసరమని చెప్పఁదగును. మకారపరకతలో

(ద్రుతమునకు) బిందు పూర్వ మచ్చుటను గానరాదు. అమ్మ అంమ నెమ్మి నెంమి అనుకీతి కొందఱు వ్రాయుట నేఁడు ప్రత్యక్షము. అట్టి దాని ననుసరించి ___కు మ్మొనసి___కుం మొనసి అనుకీతిగా వ్రాయఁబడియుండుటయు జరుగవచ్చు. వ్రాతప్రతుల నట్టిదానింబట్టి బా.స. యట్లు చెప్పె నేమో. కాని దానిని ప్రమాణీకరింపవలసిన యవసర మున్నదా? ఇన నిం కెన్ని వివరణములు చేయవలెనో.

ముందు బిందువు చేయుటయు దానికి మకారముతో నభేద మని తత్స్థానమున మకారము వ్రాసికొనుటయు గౌరవము. అంతే గాక కేచిత్పక్షము ననుసరించి ___కుం మొనసి యనుకీతి వ్రాఁతకు నవకాశము గల్గుచున్నది. అవి ప్రయోజనవంతము గామి స్పష్టమే. అట్లును గా దని కమ్మని ___కుం మొనసి యనుకీతి ప్రాసకై యిది యుద్దిష్ట మని వక్ష్యలవారివలెఁ జెప్పుట కాకారికయం దాధారము లేమియు స్పష్టమే.

అనంతుఁడు 'బిందుపూర్వ మై తమలోనఁ బొందు బములు' అని ప్రాసమైత్రిని [illegible]లో ___కింబు లెల్ల నుండు నెంమితోడ నని చూపె. లక్షణము ననుసరించి నెమ్మితోడ నని యుంటకు వీలు లేమి స్పష్టము. కాని తెలుఁగున స్థిరపరకబిందు పూర్వ లక్షణ విరుద్ధ మగుట నేమి యుం యుండదు. అప్పకవి గట్టిబిందువు మీఁదిబకారమునకు జమిలిమా ప్రాసమైత్రి నా జరగుచుండు (3-343) నని పూర్ణబిందుపూర్వకబకారమునకు ద్విరుక్తమకారముతోఁ బ్రాసమైత్రిని జెప్పి 'కమ్మతావులు వెదఁజల్లు కంబుజము' లని చూపెను. ఏమైనను బ్రాచీనుఁ డైన యనంతుని వ్రాఁత ననుసరించియు నెంమి అనుకీతియుండుట గల దని యూహింపనగును. అట్టి వ్రాఁత నుద్దేశించి కారిక చెప్పఁబడినదా? అయిన అంమ అని పక్షాంతరమునను బమ్మి ఇమ్మి అనువానికి నవకాశము గల్గు నేమో.

అన లీకారిక యేల చెప్పఁబడినది? బా. స. 'అహ మ్మని' అనుకీతివానిన వర్భమున 'సున్నకు ద్విత్వము రానేరదు కాన మకారము చేసికొనునది' యనెను. శబ్దానా మన్త్యభాగేషు యోఽనుస్వారః ప్రదృశ్యతే తస్యాచి పరతో మస్యాత్సర్వత్ర కవిసమ్మతేః అను వి.వి. వచన మచ్పరకత్వమున సున్నకు మకారమును జెప్పుచున్నది. అహమాదీనాం ద్విత్వ మ్మనుసూత్రవివరణమున నహో. 'యోగ్యతాబలాదచీత్యనుస్మృత్యాచా అనుకరణ ఇతి లభ్యతే (కవిశి. 296) అనుటయు, బా. స. అనుకరణమునందు బిందువునకు మకారము చేసికొనవలె ననుటయు ననుసరించి చూడఁగా 'అచిపరతే' అనునది యనుకరణమునం దని స్పష్టము చేయఁగలదు. అహో. అభిప్రాయ మదియే కదా. అదే సందర్భమున నీకేచిద్వదన్తి యను కారిక గల్గుట 'అనుస్వారమకారయో రభిన్నత్వం చ మకారే పర ఏవ (297 కవిశి.) అనువివరణము ననుసరించి మకారపరకతలో బిందువునకు మకారము సాధించుటకై యేర్పడిన దని స్పష్టము. ఈకారిక నహో. రచించియుండునా? కేచిద్వద న్త్యభేదత్వ మ్మపి సాధారణముగాఁ జెప్ప నేల? మకారపరకతయందే యని గుర్తించినవాఁ డగుటఁ గారికయం దాయంశమును స్పష్టముగాఁ జెప్పియుండును గదా యని యనుమానము సహజము.

శబ్దానామన్త్యభాగేషు—అన్నది బా.స. ననుసరించి యహో. వ్రాసె నని సం. ప్ర. (410) చెప్పినది. కారికలో సర్వత్రపదమున కహో. 'సంస్కృతాంధ్రయోః' (కవిశి. 297) అని యర్థము చేసెను. అయ్యు 'సంస్కృతవాక్యానాం హల్పరత్వాభావే మాంతత్వం నిర్వివాద మితి న తేషా మనుకరణే ఏతదావశ్యకమ్' అని చెప్పె. మఱి యహోబలపతియే కర్తయైన 'సర్వత్ర' యనుపద మేల? కాక సర్వత్ర యని తాను ప్రయోగించినశబ్దమునర్థమువిషయమునఁ దానే పొరపడె ననుట యుచితమా? ఝుంఝు మ్మని రామేసు

మ్మని అనుస్వారమునం గారిక యుపయోగించు ననుచు 'న చ తేషా మపి మా నిత్వమ్. తథాత్వే బాధకాభావేఽప్యథర్వణవచనస్య నిరాకర్తు మశక్యత్వాత్ (298) తెనెను. అనంగాం బక్షాంతరమున నది యనవసరమే యని భావించె నన్న మాట. అట్టిదాని నీతం డేల చెప్పెను? బా. వ. చెప్పినదానిని ప్రమాణీకరి పవలె ననునాగ్రహ మీతని కున్నదా? అహ మ్మని యనుచో బా.వ. సంస్కృతశబ్ద ములయెడను సున్నకు మకారము చేసికో మ్మనంగా నట ననవసర మని తిరస్కరింపలేదా? అసలు దానిని ప్రస్తావింపకే యుండవచ్చును గదా. దీనినిబట్టి చూడ నాకారికకుం గర్త యహో. గా దనిపించుట సహజము. అహో. ముందుగాం జెప్పినవివరణము ననుసరించి వజ్ఝలవారు ధ్వన్యనుకరణశబ్దములందుం బ్రాకృతశబ్దములందును మది సున్నకు మకార మని కారిక కర్థము చేసియుం బిదప 'ధ్వన్యను కరణశబ్దములలో సున్న యున్న దన్నను మకార మున్న దన్నను బాధ లే దనియు ననవచ్చు (వ్యా.సం.ప. 430) ననిరి. నిజ మంతియ. ఇంకం గారిక యేల యన్నం బ్రాకృతశబ్దాకరణమునసే ప్రయోజన వంత మనవలె. 'రామేసు మ్మని' యనురీతిగా సున్నకు మకారము చెప్పనీకారిక ప్రయోజనవంత మగుట కట్టిప్రయోగ మున్నదా? హనుమానుండు ఇత్యాదులను నూరి సాధించుటను వజ్ఝలవా రట్లే గదా విమర్శించిరి. ఇటుం గూడ నట్టిప్రయోగములు లే వని యట్లే చెప్పంగా నీకారిక యసంగత మగును గదా. __అనుకృతేఽస్తి' అహమాదీనాం, ఇత్యాదిగా నీస్థలములు సంస్కృతమునే కాక ప్రాకృతమునుగూడ నుద్దేశించిన వేమో స్పష్టము చేయవలె. రామే సుమ్ అని మకారము వ్రాసికొన పి న్న దన్న యహో.అభిప్రాయ మును విమర్శించుట కుపయోగించును గాని వజ్ఝలవారియాయుక్తి వారి యితరస్థలములవివరణము ననుసరించి కారిక ప్రయోజనవంత మనుట కుపయోగింప దనక తప్పదు.

అహో. వ్రాసియున్నచోఁ దనలక్షణమును దానే ప్రత్యాఖ్యానించుకొనుటయు నట్టిలక్షణమును జెప్పుటయు నుచితముగా సమన్వయింపఁబడవు. అయ్యది యథర్వణుఁడ యైన నెవరు చెప్పినను బా.స. వివరణమువలెనె ప్రయోజనహీన మనక తప్పదు.

ఇట్లు శబ్దానా మన్నది యథర్వణకృత మై యచ్చపరకత్వము ననే మకారము చెప్పఁగా మకారపరకత్వమున మకారమునకై యహో. 'కేచిద్వదన్తి' యని కల్పించెనా? అహో. దాదాపుగా ననవసరమే యనుటంబట్టి శబ్దానా మన్నది తత్కర్తృక మన వీలు లేదు. కాని మకారపరకతయ దనుట యుక్త మైనను బైదానివలె దురుక్తము గాకుంట కేచిత్తనుసీకారికావిషయముసఁ బైదానివలె నిర్ణయించి తీఱ నవసరము లే దనుట గమనింపఁదగును. అయిన నింత మాత్రమున నది యహో.కృతమే యని నిశ్చయింప నాధారమును లే దనుట మఱవరాదు.

శబ్దానా మన్నది అనుస్వారః, తస్య మకారః — అని యనుస్వారమునకు మకార మగుటఁ జెప్పుచుండఁగాఁ గేచిత్తనుకారిక యనుస్వారమకారముల 'కభేదత'యే చెప్పుచున్నది. అయ్యది నహో. సున్నకు మకారము చేసి చూపుట స్పష్టమే.

బిందుపూర్వకమకారమునకు ద్విరుక్తమకారమునకును బ్రాస చెల్లుటయే యుద్దిష్ట మన్నను బీజమున కిది కేవలద్రుతవిషయకమే యనక తప్పదు. ఏలన నితరస్థలముల బిందుపూర్వకమకార మన్న దెచ్చటను నుండదు గదా. సంస్కృతసమాచ్ఛికములం దెందును. కాఁగా ద్రుతమునకు మకారపరకతతో బిందు వైనస్థలములయెడనె యీలక్షణ మవసరము. ప్రాసేతరస్థలముల బిందువు వచ్చు నన్నను

మకారముతో దాని కభేదస్థితిని జెప్పుటవలన నెట్లును బ్రయోజనము లేదు. కావునఁ బ్రాసయంద యిది ప్రధానముగా నుద్దిష్ట మనవలె. ప్రాసయంద మైన ద్విరుక్తమకారప్రాసయందే. నమ్ములమాటము సంరక్ష సేయవే యనుచో మకారపూర్వక రేఫకును బిందుపూర్వక మగు రేఫకును ప్రాస చెల్లదు గదా. ఇట్లే రమ్యసుగుణసాంద్ర సంయమీంద్ర; అమ్లానసుమజాల సంలాలితాంఘ్రుల నిత్యాదిగా యతులు చెల్లు ననుట యెట్లనా? అసలు ప్రాసవిశేషములను జెప్పఁబూనుటయే వ్యాకరణమున నవసరము గాదు. అయ్యు వి.వి. అట నటఁ బ్రస్తావించినది గదా యని యిట న ట్లనుకొనుటకు నిందుఁ బ్రాసయం దని చెప్పఁబడలేదు. ఐనను గ్రహించినలక్షణ మతి వ్యాప్త మగును. దీనిని గూడ వారింపవలె నన్న నింక ద్విరుక్త మకారముతోఁ బ్రాస చెల్లునప్పుడే మకారమునకుఁ బూర్వమం దున్న బిందువు మకారముతో నభిన్న మనవలయును. అట్టియెడల బిందుపూర్వకమకారస్థితి శబ్దమునం దెచ్చటను లేమి ___కుం బొనసి యనురీతిస్థలములనె. అనఁగా మకారపరకతయందు ద్రుతములకు బిందు వైనయెడనె యనుట స్పష్టము. ఇది ద్విరుక్తమకారప్రాసయందే యనియు స్పష్టము గాఁగా ద్రుతమునకు బిందు నెట్లును విశేష ముగాఁ జెప్పక తప్పనప్పుడు మకారమునే విధించిన నది సమప్రా సమే యై ప్రాస సాధారణముగానే సిద్ధించుఁ గదా. అనఁగా ద్రుతమునకు బిందువు చెప్పుటకంటె మకారము చెప్పుటయే యుచి తము. నన్నయప్రయోగమును నట్లు గుర్తింపవలసియుంటయు స్పష్టమే.

కాఁగాఁ బ్రాసకొఱకె కేచిద్వదన్తి యని చెప్పిన నీకారికయుఁ బ్రయోజనవంతము గా దనియే చెప్పవలసియున్నది.

మెచ్చం మా(మ్మా)ధవుఁడని బా. స. ఉదాహరించుటయు నప్పకవియు మకారపరకత్వమున ద్రుతమునకు బిందువు (ఏకరూపత) వివరించుటయుఁ జిం. (బిన్దుం ప్రవదన్తి యనియే కాని.) యిట ద్రుతమునకు మకారమును జెప్పకపోవుటయు ననుసరించి యహో. ఈకారికను జెప్పియుండు ననుట కవకాశము గానవచ్చుచున్నది. (ద్రుతకార్యసందర్భమునఁ గాక యహో. అనుకరణసందర్భమునసే శబ్దానా మ్మకారికాసందర్భముననే ప్రస్తావించుటయు గమనార్హము.) అహోబలుఁడే చెప్పె నన్న సిద్ధానింగూర్చి విచారింపఁ బని లేదు. కాని బా. స. ప్రభృతులమాట లాధారముగాఁ గల్పింపఁ బడిన దన నేల ? వారికి ముందే వి. వి. కర్త స్వతంత్రముగ నట్టి యూహ కల్గియుండె నని యేల చెప్పరాదు ? అనవచ్చును. బా. స. ప్రభృతుల వ్రాఁత ననుసరించిన నీకారికార్థము పరిపడునట్లుగా నది లేక స్పష్టము గామి గమనార్హము. ద్రుతమునకు సంబంధించినదే యైయుండఁగా వి.వి. కర్త మకారపరకతలో ద్రుతమును స్పష్టముగాఁ జెప్పకయే యభేదత్వమును జెప్పెననుటయు శంకాస్పదమే. సరళస్థిరపరకతలో బిందువును జిం వలెనె (తృతీయేఁ ?) స్యుః కవేతరే ఆద్యే ద్వితీయే తుర్యే ప్రాప్నువన్తి నిమిత్తతా మ్మనెఁ గదా) చెప్పెఁ గాని మకారపరకతలో బిందువు చెప్పి అనుస్వారమకారముల కభేదత యని సామాన్యముగా నేల చెప్పను? మెచ్చం మాధవుఁడు, మెచ్చ మ్మాధవుఁ డన్నట్లుగా మకారపరకతయందే యని స్పష్టముగాఁ జెప్పఁదగుఁ గదా. అట్లు గామి సీతం గజరాజగమన, సీత ద్గజరాజ గమన, వచ్చం ధాత్రీపతి వచ్చ ద్ధాత్రీపతి యాదియు నుండునా ? అహో. పక్షమునను నీయంశము చెప్పమి విచార్యమే యైనను దానికిఁ గలపూర్వరంగము ననుసరించి యది యంతగాఁ బ్రధానముగా దనవచ్చును. అహోబలుఁడును బిన్దుం ప్రవదన్తి యను చిం. లక్షణమునొద్దఁ గాని, వి వి. లక్షణమునొద్దఁ గాని మకారపరకతలో బిందువును బ్రత్యేకముగాఁ బ్రస్తావింపలేదు. సరళస్థిరపరకతలో

నగు నని సామాన్యముగనే చెప్పెను. —కు మ్మొనసి అనుకీతివాని నటఁ బ్రస్తావింపను లేదు.

ఇట్లు పరిశీలింపఁగా ననుస్వారమునకు మకార మగుట (అనుస్వారమకారముల కభేద మనుట) యాసీకారికలను, నహోబలుఁడే చెప్పినను నథర్వణుఁడే చెప్పినను నవి ప్రయోజనవంతములు గావని గ్రహింపవచ్చును. అట్లుఁగా ననుస్వారమునకు మకార మగుట నెచట నేని జెప్పవలసిన యవసరము గాఁకరాదని చెప్పవచ్చును. అంమ, నెంమి, అనుకీతి వ్రాఁతను సంస్కరించుటకయియే కేచిద్వద న్తి యన్నది చెప్పఁబడిన దన్నను నది యతివ్యాప్త మగుచునే యుంట యొప్పకున్నది.

అనుస్వారమకారములు భిన్నములే యనక తప్పదు. ఈ కారికలకుఁ బ్రయోజనవంత మగు నర్థవిశేష మేదియే లభించు నేమో యిప్పటికి లభ్యము గాలేదు.



### అనుబంధము—౭

## వికృతివివేకోక్త ద్రుతకార్యాలు

వికృతి వివేకము ద్రుతమునకుఁ జెప్పిన యాయాయికార్యము లాయాయిసందర్భములఁ బరిశీలించి యుంటిమి. మిగిలి యున్న సాధారణలక్షణములు గొన్నింటి నిటఁ జూతము.

ద్రుతమునకు వచ్చువికారములను సామాన్యముగాఁ జేర్కొనుచు వి. వి. 'ద్రుతస్య హాలి బిన్దుస్స్యాచ్ఛ్లిష్టత్వం చ క్వచిత్ స్వతా, లోప శ్చాద్యత్యతృతీయా తు న యుక్తా శబ్దవిన్మతే' యున్నది. హల్పరకత్వమున ద్రుతమునకు బిందువు, సంశ్లేషము, స్వత్వము, లోప మనునాల్గుకార్యము లగును. (అవసానమునఁ గలలోపమును వాక్యావసానగస్య స్యా ల్లోపో నః ప్రాయశోఽత్ర హి యని ప్రత్యేకముగాఁ జెప్పియున్నది.) ఈకారికలోఁ గొరుకుడు పడనిది 'యాద్యత్యతృతీయా తు న యుక్తా శబ్దవిన్మతే' యున్నది. దీని యర్థము ప్రయోగానుగుణముగాఁ గుదురుపడమింజేసియో యగునేమో కాని యహోబలపండితులవారు వివరింపలేదు. పైని జెప్పినవరుస ననుసరించి యాద్యత్యతృతీయము లన బిందుస్వత్వము లగుచున్నవి. ఇవి హల్పరకత్వమున యుక్తములు గా వనుతీరుగాఁ గజసమండనాదులు వివరించుటను వజ్ఝలవారు తిరస్కరించుట సమంజసమే. శబ్దవిదుఁ డైన వి. వి. కర్త హల్పరకత్వమున నీకార్యములు చెప్పుచునే యుండి శబ్దవిదులు తగ వందు రన్న నది యెట్లు గుదురుపడును. 'కేచిన్మత' మనియు ననలేదే. అయ్యది లక్ష్యానుగుణము గామియు స్పష్టమే. మఱి యర్థ మేమి? వజ్ఝలవారు 'యుక్తా = శబ్దములకలయికయందనఁగా సమాసమందు, ఆద్యత్యతృతీయా తు = బిందుస్వత్వసంశ్లేషములు నరావు (౨౯౫) అని యర్థము చేసిరి.

క. మం. ప్రభృతులవివరణమున నిబ్బంది గల్గించిన శబ్దము 'యుక్తా' యన్నదియు. దానికి వీరు సమాస మని యర్థము చేసిరి. 'యుక్తా' యనుదానికి సమాసమునం దని యర్థము సిద్ధించుట సహజము గా కుట స్పష్టమే. కలయికయం దనఁగా సంధి — సంహితయం దని యందర్థము చేయుట యుక్త మనఁదగును. కాని యి ట్లర్థము చేసిన నీలక్షణము లక్ష్యవిరుద్ధ మైపోఁగలదు. అందులకు సమాసమునం దని చెప్పుట విశేషమే.

ఆద్యతృతీయా యనఁగా నాద్య మగుబిందువును తృతీయ మగుస్వత్వమును. అవి రెండే లే వనవలె. వజ్ఝలవారు నడిమి సంశ్లేషము నెట్లు వివరించిరో యర్థము గాదు. సంశ్లేషము ద్వితీయము. 'ఆద్యతృతీయా తు న' అనఁగా ద్వితీయ మగుసంశ్లేషమునకు నిషేధ మెట్లు వచ్చినది? సంశ్లేషమును గూడఁ గలుపుటకుఁ గారికయం దాధార మేదియో వారు స్పష్టము చేయలేదు. కాఁగా బిందుస్వత్వములనిషేధముచే ద్వితీయతుర్యము లగుసంశ్లేషమును, లోపమును గల వని యర్థము సిద్ధించును. లోపము సమాసమున సాధారణము. 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అని చిం. లోపమును స్పష్టము చేసినది. మఱి సంశ్లేషమును గల దన్న పది యెక్కడ? ఏకారణముచేత నేని సమాసమున ద్రుతము నిలిచి యున్నచో సంశ్లేషముమాత్రము వచ్చి బిందువు రానిస్థల మున్నదా? తళుకున్గజ్జె లనుచోఁ దళుకుంగజ్జె లనియు రూప ముండునే కదా. తళుకున్గజ్జె లన్నది వజ్ఝలవారిమతము ననుసరించి స్వత్వరూపము. సంశ్లేష మయినతళుకున్ గజ్జె లని యుండు. సంశ్లేషము నంగీకరించుట ద్వారానఁ దళుకున్ గజ్జె లని యుండు నన్న స్వత్వము లే దని తళుకున్గజ్జె లని యుండ దన నేల? కాఁగా వారిమతము ననుసరించి స్వత్వము నిషేధించి సంశ్లేషము సాధించుట ప్రయోజనహీనము.

అందుకే గదా వీరు వినా ద్వితీయ మ్మనుస్వత్వలక్షణమును సైతము ప్రయోజనహీనముగాం బేర్కొనవలసివచ్చినది. కాన సంశ్లేషము గల దని చెప్పందలంచుచో బిందుస్వత్వములు లే వని చెప్పుట సమాసమం దైనను వ్యర్థమే యనక తప్పదు. అందుకే గావచ్చును వీరు వనిలోపనిగా సంశ్లేషము గూడ నిట నిషిద్ధ మైనట్లు నిరాధారముగా నైనను వివరించిరి. ఆద్యశ్చ తృతీయశ్చ — ఆద్యతృతీయా యన్నది సంశ్లేషమును సంగ్రహింపంజాల దనుట స్పష్టము.

యుక్తి యనుశబ్దమునకు నపూర్వముగా సమాసమునం దని యర్థము చేసినను నాద్యతృతీయా యనుదానియర్థమునుబట్టి కారిక ప్రయోజనహీనమె యైనది. పూచెంగలువ లనురీతి వయుక్తము లగుట క. మం. ప్రభృతులవివరణమువలనియర్థము కాంగా తలుకుంగజెలు (తలుకున్గజెలు) అనురీతివి వారింపంబడుట వ్యాఖ్యాలవారి వ్యాఖ్యానమువలనియర్థ మగుచున్నది.

యుక్తి = సమాసము అనుదానితోపాటు, ఆద్యతృతీయా యనంగా బిందుస్వత్వసంశ్లేషము లనియు వ్యాఖ్యలవారు చెప్పిన దెల్ల నంగీకరించినను నీలక్షణము ప్రయోజనవంతమా ?

బిందుస్వత్వసంశ్లేషములు మూంటిని నిషేధించె ననంగా నాల్గవ దగులోప మగునన్నమాట. సమాసమున ద్రుతమునకు లోపము వచ్చు నని చెప్పిన నెంతయు సూటిగను స్పష్టముగను నుండును గదా. అట్లేల చెప్పండు ? చిం. అట్లే గదా చెప్పినది. బిందుస్వత్వ సంశ్లేషములు లే వని వానిని నిషేధించుటలో లోప మగుటకంటె నింకే దేని విశేషప్రయోజన మున్నదా ?

ఆపిదప వ్యాఖ్యలవారు 'ఈ విషయమునే యింకను విస్తరించి వివరించుచున్నాండు' అని 'స్వత్వం ప్రశ్లేషతా బిన్దు స్సమాసే న

ప్రయోగతః అనుకారికను వివరించిరి. ఈ లక్షణము బిందుస్వత్వ సంశ్లేషములు లేవని స్పష్టముగాఁ జెప్పుచున్నది. ఇట్లు ప్రత్యేకముగాఁ జెప్పువాఁడు ఆద్యతృతీయా తు అన నేల ? ఆకారికా భాగము చెప్పకున్నను నాయర్థములు సిద్ధించుచునే యున్నది గదా. ద్రుతస్య హాలి యని ముందు సామాన్యముగాఁ జెప్పుట నేయే హల్లులు పరమైన నేయే కార్యము లగునో పిదపఁ జెప్పెను. సమాస స్థలమున నట్లు ప్రత్యేకముగా వివరింపవలసినయవసర మేమి ? విస్తరముగా వివరింపఁబోవువాఁడు ముందసమగ్రముగా సందిగ్ధముగా (అనర్థకముగను) జెప్ప నేల ? ఆద్యతృతీయా— అనుభాగము వ్యర్థమే యనకతప్ప దీపక్షమునను.

అయిన నిట మాత్రము స్వత్వము ప్రశ్లేషత బిందువు లేవన నేల ? లోప మగునను టొప్పను గదా.

క. మం. ఈకారికను నిత్యం ప్రశ్లేషతా బిన్దు స్సమాసే తు. ప్రయోగత యని చూపి వివరించినది. స్వత్వం, న— అనుదానిని క. మం. కర్త్రయే నిత్యం, తు అని మార్చె నని వజ్ఝలవారు నిర్ణయించిరి నిత్యం అన్నది పాఠాంతరముగాఁ గవిశి. లందుఁ గానవచ్చు. కాఁగా నిట నేపాఠమును బ్రమాణీకరింపవలయు నన్నది ప్రశ్నమైనది.

స్వత్వం న అనునదే గ్రహింపవలయు ననుటకు వజ్ఝలవారొకయాధార మిట్లు చూపిరి. ఏతచ్చ (స్వత్వము) సమాసే న సంభవతి. ప్రయోగాభావాత్. స్వత్వం ప్రశ్లేషతా — ఇత్యథర్వణవచనాచ్చ యని యహోబలపతి స్వత్వనిషేధమునకే దీని నుదాహరింపఁగా— (వ్యా.సం.స. 300) అహో. స్వత్వము నిషేధమున కీకారిక చూపెను గాన స్వత్వం న— అనుపాఠమె ప్రమాణ మన్నమాట. ఒకవేళ నిత్యం ప్రశ్లేషతా యని యున్న దనుకొందము

అపుడు స్వత్వము నిషిద్ధ మైనట్లు కాదా ? బిందుసంశ్లేషములు నిత్య మనఁగా స్వత్వము లే దని యర్థము సిద్ధించుచునే యున్నది గదా. అహోబ. 'ఏతచ్చ సమాసే న సంభవతి' యనుటలో సమాసమున స్వత్వము లే దనునభిప్రాయము స్పష్టము. అట్టియెడల స్వత్వేతరము లగు (లోప) సంశ్లేషబిందువులు సమాసమునఁ గల్గు ననియే యిట నహోబ. ఎంచె ననవచ్చును గదా. అలుకి చ సంశ్లేషస్యాస్య త్రను సూత్రవివరణమున చశబ్దముచే సంశ్లేషము రానపుడు స్వత్వ మగు నని వివరించి యాస్వత్వము సమాసమున లే దనెను. మఱి సంశ్లేష మైనను సమాసమునఁ గల దని అహోబ. అభిప్రాయము చెప్పకతప్పదు గదా. లేకున్న సంశ్లేషస్వత్వములు రెండును లే వని యైన నింకను బిందువు గూడఁ గలిపి చెప్పఁడా ? కాని యీకారిక స్వత్వమునే గాక బిందుసంశ్లేషములను గూడ నిషేధించుచున్న దే. అట్టియెడల సమాసమున స్వత్వము లే దని కాక లోప మగు నని చెప్పుటయే సక్రమముగా నుండును. దానింబట్టి చూడ స్వత్వం న—— అనునది కాక 'నిత్యం ప్రశ్లేషతా బిన్దుః' —— అనుపాఠమే యుద్దిష్ట మేమో యనిపించుటకే యవకాశ మధిక మగుచున్నది.

అయిన నీయహోబ. వివరణమునుబట్టి యొకయంశము స్పష్ట మగుచున్నది. స్వత్వనివారణమున కీకారిక యుపయోగించుటవలన 'ఆద్యత్తృతీయా తు' అనుదానిం బ్రస్తావింపకుంటయు దానిని వివరింప కుంటయు ననుసరించి దానికి వజ్ఝలవారు చేసినయర్థము నహోబ. ఊహింపలే దనవచ్చును. యుక్తి యన్నది సమాస మనునర్థమును నియంజాలకుంట కారణ మగు నేమో.

నిత్యం ప్రశ్లేషతా బిన్దుః అను పాఠములో నొకయిబ్బంది గలదు. దీనివలన లోపమును లే దని యర్థము చేయ నక్కఱ లేదు.

సమాసే తు అనునప్పటితుశబ్దముచే సమాసమున ద్రుతము లోపింపక నిల్చియుండు సందర్భములుం దని గ్రహింపవచ్చును. కాని యట్టి యెడలఁ దళుకుగజ్జె లనురీతిగా ద్రుతలోపము గల్గినరూపములు సాధువు లగుట యెట్లు.

నుమ్వోత్త్రాత యనుసూత్రవివరణమున అలరుంజోంప మనురీతిని బిందువు అహో. చూపె. అలరుజోంప మనురీతి లోపరూపము లీలేదు. కాని అలరుజ్జోంప మనురీతిసంశ్లేషరూపములనుగూడఁ జూప లేదు. నిత్యమ్మనుపాఠమును వివరించిన క. మం. కర్త తళుకుగ్గజ్జె లని యిచట సంశ్లేషమును బిదపఁ జివురుంజోంప మని బిందువును జూపెను. కాని లోపము నుదాహరింపలేదు. లోపము రాదనియే యహోబలుఁడు నెంచె నేమో. ఏల యన సరళే పరుష్వైవ సమాసే ను ముశో భవేత్తను కారికావివరణమున నహో. కేచిదిత్యుక్తేః పునుగుతావి, కుందనపుచాయ ఇత్యాదీని రూపాణీతి సిద్ధమ్. సరసా దిత్యనేన నలుగడలు ఇత్యాది వ్యావృత్తిః (కవిశి. 318) అనెను. దీనివలన నుమ్ము నిత్యము గా దని తలఁచుట స్పష్టము. వజ్ఝలవారును 'సూరి దీనిని నిత్యముగనె విధించెను. కాని యథర్వణ కారికలోని ప్రయోగః శరణం కవేః, —కేచిత్ —కేచన— స్వరసాత్ — కేచన అనువచనములనుబట్టి యీయాగమము నిత్యము కా దనియే చెప్పనగు (వ్యా సం. స. 345) ననిరి. తళుకుగజ్జె లనురీతి (నుమ్వోత్త్రాత యనుసూత్రవివరణమున బా. స. కూడ అలరున్ జోంపము. —చిగురుంగ్రైదువ్వు (18 పుట) అని ప్రశ్లేషతను బిందువును రెండే చూపెను.) కారికయం దట్లు చెప్పుటకు నవకాశము గలిమి బిందుసంశ్లేషములు నిత్య మనుటవలనఁ దళుకుగజ్జె లనురీతి వసాధువు లని నిర్ణయింపవలయు నేమో యను బాధ లేదు. కాఁగా నిట సూరి మార్గముకంటె నథర్వణాదులమార్గ మించుక భిన్నమైయుండుట గమనింపవలసి యుండును.

బిందుసంశ్లేషములు నిత్యములని. రెండును నిత్యము లగుట యసంభవము. ఒకటి నిత్యముగా వచ్చుచో రెండవదాని కవకాశ ముండదు గదా. కాఁగాఁ గొందమిమ్మాత్రాదుల బిందువు నిత్యముగా నగుటను గుర్తించినచో కెన్నద్మి యనురీతి సంశ్లిష్టరూపమున కవకాశ ముండదు గాన నట్టిచోట్ల సంశ్లేషము లేమిలో బాధ లేదనవచ్చును. చిగురు జొంపము, చిగురుద్జొంప మనురీతిచోట్ల చిగురుఁ జొంప మను రీతి స్వత్వము లేమి సంశ్లేషమును నిత్య మనుటలోఁ బ్రయోజన ముగా గుర్తింపవచ్చును.

ఇట నిత్యం బిన్దుః అని చెప్పియు 'అపరాన్తే సమాసే చ శబ్దే నో బిన్దు రిష్యతే' యనుచో మఱల సమాసమున బిందువును బ్రస్తావించుటలో తఁబ్రా లనురీతిస్థలముల ద్రుతలోపనివారకమై (సంశ్లేష స్వత్వములు) యది యుచితము యగుచున్నది గాన నటను బాధ లేదు. ఇట్లు పరిశీలింపఁగా నిత్యం ప్రశ్లేషతా బిన్దుః అనుపాఠమె యుచితముగా నుండు నని యంగీకరింపఁదగియున్నది.

ఇట్లు పిదప సమాసమున బిందువు గల దనువాఁడు ముందు 'అవ్యుత్పత్తియా తు న' — బిందువు లే దని చెప్పునా? ఇట్లుగా దని స్వత్వం ప్రశ్లేషతా యన్నదే సరియైన దను పక్షము నను సరించి చూచినను నిట వజ్ఝలవారివివరణము కుదురునది కాదు. స్వత్వం ప్రశ్లేషతా యని బిందుస్వత్వములతోపాటు సంశ్లేషమును సైతము నిషేధించుచున్నవాఁ డిచట బిందుస్వత్వములు రెండే సమాసమున లే వని చెప్పుట కుదురునా? వజ్ఝలవా రిట సంశ్లేషమును గూడఁ గలిపి యదియు లే దనుట లక్షణానుగుణము గానేరదు. కావున నేపక్షము ననుసరించినను 'అవ్యుత్పత్తియా తు న యుక్తౌ' — అన్నది లక్ష్యానుగుణముగా నితరలక్షణములతో విరోధింపక వజ్ఝలవారు చెప్పినయర్థము నిచ్చునది గా దని నిర్ణయింపకతప్పదు.

ఆద్యతృతీయా తు అనియే కవిశి. లో౯ గానవచ్చుచుండఁగా క. మం. ఆపాఠమునే వ్యాఖ్యానించుటయు ననుసరించియుఁ బాఠాంతరము గానరాకుండుటయునుబట్టి యది యట్లే గ్రహింపక తప్పదు. అట్టియెడల బిందు స్వత్వములే లే వనియుఁ జెప్పకతప్పదు. బిందు స్వత్వములు లేక లోపసంశ్లేషములుమాత్రమే కలస్థలము లేవి ? సమాసమందుఁ గాని యితరస్థలములందుఁ గాని లోపసంశ్లేషములు మాత్రమే గలతావు లున్నవా ?

సంధియందు ద్రుతము స్వత్వముతో వచ్చితిని యని యను రీతిగాఁ గాని బిందువుతో వచ్చితిం అనియొ నని గాని యుండదు. ఇంక వచ్చితి ననియొ ననురీతి నుండును. 'పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ' —యనుట ననుసరించి మీఁదిస్వరముతోఁ గూడినయది సంశ్లేష మనఁదగును. నాకొఱ కిచ్చె ననురీతి సంధి యువు సందర్భములందు ద్రుతము లోపించును. అనఁగా స్వరపరకత్వమున లోప సంశ్లేషములు మాత్రమే కలవు గాని బిందుస్వత్వములు లేవు. హల్పరకత్వమున నేకార్యము లవునో యింతకుముందు చెప్పెను గావున నిఁక స్వరపరకత్వమున నగుకార్యము లిటఁ జెప్పెనా ? (నో వా ద్విత్వం క్వచిల్లిప్తః —అనుచో వ్యాఖ్యలవారు శ్లిష్ట మైయున్న నకార మని వివరించిరి. (క్వచిద్ఘట మ్మని క. మం. పాఠము.) స్వరపరకత్వమున సంశ్లేషస్థితి గల దన్నమాట. సంధి యువుచో ద్రుతలోపము గలిమియు స్పష్టమే.

అయిన యుక్తి యనఁగాఁ గలయిక సంధి యని యర్థము చేయవచ్చును. కాని సంధియం దనఁగా స్వరపరకతయందే యనుట యెట్లు? పూచెం గలువ లిత్యాదులు సంధులుగా వ్యవహరింపఁబడకుండుట సూరిగ్రంథమునవలెఁ జిం., వి. వి. లయందును స్పష్టమే యైన నిట నాకొఱ కిచ్చె నన్నవి సంధిస్థలములు గాఁగా నాకొఱకు నిచ్చె

నన్నవి సంధిస్థలము లనఁదగునా ? అయినఁ బూచెం గలువ లనుచో మాత్ర మది సంధికార్యము గాదా ? 'అచాం సన్ధా' యనుకారిక యవసర మైనయర్థమును స్పష్టముగాఁ జెప్పుచుండఁగా నిట్లిట నస్పష్టముగాఁ జెప్పనేల ? అయ్యు బిందుస్వత్వములు లే వనుటకంటె లోపసంశ్లేషములు గల వనుట యొప్పును. స్వరపరకత యం దని స్పష్టము చేయఁదగు. లుక్సంశ్లేషౌ నాచి యచిం. స్వరపరకతలో లోపసంశ్లేషలను నిషేధింపఁగా నటనే లోపసంశ్లేష లగు నని వి. వి. చెప్ప నగునా ? సంశ్లేష మన నట ద్రుతద్విత్వము గాఁగా నిట మీఁదినవర్ణముతోఁ గలియుట యని స్వరపరకతలో భేదమును గల్గుచున్నదె.

ఇట్టియనుమానములకు సరియైనసమాధానములు లభ్యములు గాకున్నవి. మొత్తముమీఁద నీయర్థముసైతము సంతృప్తికరముగా లే దనకతప్పదు.

మఱి యిటఁ దత్కర్త యేమి చెప్పఁదలచెనో స్పష్టము గాకున్నది. ఇంకను నిశితపరిశీలనముతో నిఁక ముందు తేలఁగలదని యాశింతము.

హల్పరకత్వమున ద్రుతమునకు వచ్చుకార్యములు సామాన్యముగా నిట్లు చెప్పి యం దేయవి యే యే హల్లులు పర మగునపు డగునో మున్నగునంశములను స్పష్టము చేయుచు వి. వి. పిదపఁ జేర్కొన్నది.

అలక్షణమును కవిశి. "ఆద్యే తృతీయే చ కపా స్తృతీయాస్స్యుః కపేతరే ఆద్యే ద్వితీయే తుర్యే చ ప్రాప్నువన్తి నిమిత్తతా' మ్మని చూపినది. క. మం. కారిక నిట్లే స్వీకరించి స్వతంత్రముగా వివరించినది. ఇందుఁ 'దృతీయాః' అన్నది సరి కా దని వ్యక్షల

వారు 'తృతీయే' యని యిచ్చిరి. క. మం. కర్తకుఁ ప్రత్యేకముగా వి. వి. దొరుకలే దనియు, సహా. గ్రంథమె దానికి మూల మనియు నందుచే వి. వి. కారికల సహా. కంటె భిన్నముగాఁ జూపుట తగ దనియు విమర్శించిన వజ్ఝలవారు (వ్యా.సం.స. 413, 432) మార్పులు చేయుట సమర్థింపఁదగినదిగా లేదు. అథర్వణోక్తియందు లోప మున్న నది వ్యాఖ్యానమున వివరించుకొనవలయునే కాని మూల మునే సవరించుట యెట్లు ? కారిక సహా. నిఁరింపనున్న నేమో కాని యాతఁడు వ్యాఖ్యానించియే యున్నాఁడు. 'కపాః=కచటతపాః, తృతీయాః గజడదబా శ్చ బిందుస్వత్వయో ర్నిమిత్తతాం ప్రాప్ను వన్తి. కచటతపేభ్య ఇతరే వర్ణా స్సర్వే బిందుసంశ్లేషలోపేషు నిమిత్తతాం ప్రాప్నువన్తి (కవిశి. 310) దీనినిబట్టి తృతీయాః అను పాఠమె యుండవలె ననుట స్పష్టము. (ఆద్యే తృతీయే తుర్యే యని యుత్తరార్థమున తృతీయే యని కవిశి. (310) లోఁ గానవచ్చు చున్నను 'బిందుసంశ్లేషలోపేషు' అను వివరణము నందలిసంశ్లేషమును బట్టి ద్వితీయే యనియే యుండవలె నని గుర్తింపఁదగును.)

'తృతీయాః అనుపాఠముచేఁ గల్గుఁబ్బంది యేదియో విచా రింపఁదగియున్నది. దాని వజ్ఝలవా రిట్లు పేర్కొ-రి.

'కచటతపేతరవర్ణము లెల్ల బిందుసంశ్లేషలోపములకు నిమి త్తము లని చెప్పినపుడు గజడదబలకు బిందునిమిత్తత గల్గుటకై వాని కచటతపలలోఁ జేర్చుట యనావశ్యకము (వ్యా. సం. స. 300)

ఆద్యే ద్వితీయే తుర్యే కపేతరే నిమిత్తతాం ప్రాప్నువన్తి అనుదానిచే స్థిరపరకతలోవలె సరళ పరకతలో బిందు వవ్వుచుండు నటఁ జెప్ప నేల ? అనువజ్ఝలవారియుక్తి యుక్తమె అయ్యు మువ్మొ దట గుర్తింపవలసినయంశము, తృతీయాః అనుదళము సహా.

వివరించుట ననుసరించి యిదియే కారికయందలిపాఠ మనుటతప్పదు. కాని దానివివరణములో అహో. పొరపడినచో నది వ్యాకర్తలోపము గానేరదు గదా. పై నుదాహరించిన అహో. పంక్తులలో తృతీయాః గజడదబాశ్చ అనునప్పటిచశబ్దము చే బిందుస్వత్వములకును సరళములు నిమిత్తము లని యర్థ మగుచున్నది. వజ్ఝలవా రన్నట్లు అహో. వివరణమునే క. సం. ప్రభృతు లనుసరించుట (పరుషసరళంబులు పరంబు లగునపుడు బిందుస్వత్వములును, 35.) వలన సందును ప్రమాదము యేర్పడినది.

ఆద్యే — బిందుసందర్భమునందును తృతీయే — స్వత్వసందర్భమునందును కపాః — పరుషములు, తృతీయాః స్యుః — సరళము లగు నని గ్రహింపదగును. ఇట్లనుటనుబట్టియే ద్రుతమునకుఁ బరుషములు పర మగునపుడు బిందుస్వత్వము లగునను నర్థము సిద్ధించుచున్నది. కాఁగాఁ దృతీయాస్స్యుః అనుచో ద్రుతమునకుఁ బరమై పరుషములు సరళము లగు నని యర్థము గ్రహింపఁగా వజ్ఝలవారు చెప్పినసరళపరకద్రుతబిందువిషయమునఁ బునరుక్తి దోషము లేదు గదా.

'తృతీయే' యనువజ్ఝలవారివివరణముచొప్పునఁ బరుషములకు సరళము లగుట వి. వి. లో నుక్తమైనది. దీనింగూర్చి వా రింతకు ముందు 'వికృతివివేకము చింతామణికి శేష మగుటచే గజడదబాదేశవిధి పునరుక్తముగాఁ జెప్పఁబడ దయ్యె (296) ననిరి. అయిన నీచెప్పినద్రుతకార్యములు పునరుక్తములు గావా ? చిం. చెప్పలేదా ? ఈ సందర్భమున వి. వి. చిం. శేషము కాదా ? ద్రుతకార్యము లెల్లఁ జెప్పుచో సరళాదేశము చెప్పిన నది యొక్కటె పునరుక్త మగు ననుట సక్రమము గాదు గదా. 'పరుషపరకద్రుతకార్యములు మున్నగువానివిషయమునఁ జింతామణిచెప్పినవిషయము

లను సుబోధమునకై భంగ్యంతరముగా నథర్వణుఁడు వివరించుచున్నాఁ డని కదా (295) వీ రారంభముననే చెప్పిరి. సుబోధమునకై చెప్పుచో సరళాదేశము చెప్పమి ద్రుతముపై పరుషములకు సరళము లగుట యొక్కటి చిం. లో సుబోధ మైన దని కాక యట్టికార్య మథర్వణునకు సమ్మతము కాదేమో యను సందేహము గల్గించును.

'తృతీయాః' అనుపాఠమున నిం కొకలోపము నిట్లు చెప్పిరి. గజడదబలు బిందుసంశ్లేషలోపములతో పాటు స్వత్వమందును నిమిత్తములు గానోపును గాన నట్లు చెప్పకుండుటయు సరికాదు (301). బిందునిమిత్తతకై కచటతపలలోఁ జేర్ప నేల యనిరి గదా. అయిన నిట ఆద్యే తృతీయే చ యని స్వత్వమును జెప్పఁబడినదే. మఱి కచటతపలకు స్వత్వనిమిత్తత చెప్పఁబడఁగా వానితోఁ గలిపినగజడదబలకు స్వత్వనిమిత్తత చెప్పకుండు టేది? స్థిరములకు స్వత్వనిమిత్తత చెప్పఁబడలే దని వారు చెప్పవలసియున్నది. బిందునిమిత్తత పునరుక్తమగుచున్న దన్నవిమర్శనము నుపసంహరించుకొన్న గజడదబలకు స్వత్వనిమిత్తతయుఁ జెప్పఁబడినట్లు గాదు. (తృతీయాః అనుదానికన్వయ మెట్లు? సరళాదేశమే యనవలె. కాని యట్టియెడల స్వత్వనిమిత్తత చెప్పకుండుట గజడదబలకే కాక స్థిరములయెడను గలదు గదా.

వజ్ఝలవారింతకుముందు గిరివ్రజ మన్, పురంబు మున్నగు స్థలములందుమాత్రమె శ్లిష్టత్వం చ క్వచిత్ అనుదానికిఁ బ్రవృత్తి యగు నెఱుంగునది (297) యనిరి. (గిరివ్రజ మన్, అని 'కామా'తో నిట విడిగాఁ జూపిరి, గాని యంతకుముందు గిరివ్రజ మన్పురంబు అని (282) చూపిరి. ఇది వారిమతమున స్వత్వము. ఆవిరోధ మట్లుండఁగా) పురంబుచోఁ బరుషము పర మైనది. పరుషపరకత్వమున సంశ్లేషము 'ఆద్యే తృతీయే చ' అనుసీకారిక చెప్పుట లేదు. అందుకే

ద్రుతస్య హాలి బిన్దు స్స్యాచ్ఛిష్టత్వం చ క్వచిత్ స్వతా యనుదానిచే సాధించి రనఁదగు. ఇటఁ బరుషపరకత్వమునఁ జెప్పనిసంశ్లేషము 'శ్లిష్టత్వం చ' అనునాకారికచే కాఁగా, (సరళ) స్థిరపరకతయందలి స్వత్వముమాత్ర మిటఁ జెప్పకున్నను 'స్వతా' యనునాకారికచే రాదా ? (శ్లిష్టత్వం చ) క్వచి త్తన్నాఁడు గనుక (పరుషపరక) సంశ్లేష మరుదు. కాని స్వతా యనుచోఁ గ్వచి త్తనలేదు గాన సాధారణముగనే యగును గదా. స్వత్వము చెప్పలే దనువిచారము వజ్ఝలవా రందవలసినది కాదు.

దీని ననుసరించి చూడఁగా ద్రుతస్య హాలి బిన్దు స్స్యా త్తను నాకారికచేతనే యాయాయిష్టముల నాయాద్రుతకార్యము లగుటను గుర్తింపవచ్చు ననవలసియున్నది. అప్పుడు ప్రస్తుతకారిక మొత్తమును బునరుక్తి యనియో యింకను స్పష్టతకయి చెప్పఁబడిన దనియో వజ్ఝలవారివ్యాఖ్య ననుసరించి చెప్పవలసినస్థితియు నేర్పడుచున్నది. (ఆ కారికను బ్రక్రియయెడ నుపయోగింపరా దనుట స్పష్టము.)

కాఁగ గిరివ్రజ మన్ పురం బనుచో శ్లిష్టత్వం చ క్వచి త్తను దానికిఁ బ్రవృత్తి యనుటయే పొరపాటు. అది ద్రుతము గామి ద్రుత కార్యములప్రసక్తియే లేదు. స్వరలోపము మైనది. అన్వరంబు అన్ పురం బని యో ట్లయిన వ్రాసికొనవచ్చును. (చూ. ద్రు.)

అయిన స్థిరపరకతలో స్వత్వము చెప్పకుండుట యొప్పునా ? కపాః తృతీయాః స్యుః అనుచోట్నన సరళస్థిరపరకత్వమున స్వత్వము చెప్పఁబడలేదే. అట స్వత్వ మధర్వణున కనిష్టమా ?

చిం. స్పష్టము చేసిన ద్రుతకార్యములనె యిట వి. వి. వివరించిన దని గుర్తింపవచ్చును.

పరుషపరకతలోఁ జిం. పరుషా ద్రుతప్రకృతికాత్సరళాస్స్యుః తద్రుతశ్చ బిన్దుస్స్యాత్, అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరత యనెను. అవికారగతే యన్నది స్వత్వమె యనుట స్పష్టము. ఆద్యే (కపాః తృతీయాః స్స్యుః) అని చిం. మొదటిలక్షణమును, తృతీయే చ కపా స్తృతీయాః స్స్యుః అని చిం. రెండవలక్షణమును వి. వి. సంగ్రహించినది.

సరళస్థిరపరకతలోఁ జిం. లుగ్వా యని లోపమును, అలుకి చ యని సంశ్లేషమును, బిన్దుం ప్రవదన్తి యని బిందువును జెప్పినది. ఆద్యే ద్వితీయే తుర్యే చ కపేతరే సమిత్తతాం ప్రాప్నువన్తి యని వీనిని వి. వి. సంగ్రహించినది. అలుకి చ సంశ్లేషః అనుచో చశబ్దముచే స్వత్వము వివరింపఁబడినది. చిం. స్పష్టముగా నుచ్చరించినసంశ్లేషమునే యిట వి. వి. పేర్కొన్న దని గ్రహింపవచ్చు. విశేషముగాఁ జెప్పఁదలంపిందుఁ గానరాదు. లేనిచో సరళస్థిరపరకతలో బిందువు సామాన్యముగాఁ జెప్పినా? స్థిరములలో నేవి పర మైన నగునో యగుచోఁ బూర్ణ బిందువే యగుటయు స్పష్టము చేయలేదు గదా. ఆద్యే తృతీయే యనుచోఁ బూర్ణఖండములు రెండు గ్రహింపవలసియుండ నుత్తరార్థమునం దాద్యశబ్దముచేఁ బూర్ణ మొక్కటి గ్రహింపవలయుటయె విశేషము.

ఏమైనను సరళస్థిరపరకతలో స్వత్వము లేదని వి. వి. తలఁచిన దనవలెనా ?

స్వత్వ మన్నది సాధారణము. దానికి నిమిత్తములను ప్రత్యేకముగాఁ జెప్ప నక్కరలేదు. ఏదియుఁ బరముగ లేకున్నను ద్రుతము స్వత్వస్థితిలో నుండ కేమగును? ఏమైన నయిన నది విశేషకార్యమగును. కాన దానిం జెప్పవలె. ఈ యుద్దేశముతోనే చిం. స్వత్వ

మును స్పష్టము చేయలేదు. (చిన్నయయు స్వత్వమును సూత్రమున విధింపకుంట స్పష్టమె.) కాన స్వత్వస్థితిలో నుంటను విశేషకార్యముగాఁ జెప్పనక్కఱ లేదు గాన సరళస్థిరములు స్వత్వమునకు నిమిత్తము లనియుఁ బ్రత్యేకముగాఁ జెప్ప నక్కఱ లేదు. స్వత్వము లేకున్న నది విశేష మది చెప్పవలె. నిత్యం ప్రశ్లేషతా బిన్దుః అనుచో బిందుసంశ్లేషములు నిత్య మనుట స్వత్వము వారింపఁబడిన ట్లయినది. (సరియ. స్వత్వం ప్రశ్లేషతా యనుచోఁ జెప్పిన స్వత్వము నిషేధింపఁబడినదే.) అయినఁ బరుషపరకత్వమునఁ 'దృతీయే' యని స్వత్వము నేల ప్రస్తావించెను? అనవచ్చును. అట స్వత్వ మగు నని చెప్పఁబడ లేదు. బిందుసందర్భమునను స్వత్వసందర్భమునను కపాః తృతీయాః స్యుః అని పై పరుషములు సరళము లగుటయే విధేయాంశము. సరళస్థిరపరకత్వమున స్వత్వదశలో లేనివిశేషము పరుషపరకత్వమునందలిస్వత్వస్థితిలో (మీఁదిపరుషములు సరళము లగుట యన్నది) నుంట నట నది ప్రస్తావింపవలసివచ్చిన దని గుర్తింపఁదగును. చిం. లోను 'అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్నితే పరత' యనుచో స్వత్వదశయందును బై పరుషములు సరళములే యగుట విధేయముగాఁ జెప్పఁబడుట నిట స్మరింపఁదగును.

ఇట్లు పరిశీలింపఁగా స్వత్వమునకు సరళస్థిరములు నిమిత్తము లగు నని చెప్పమి నిబ్బంది లేదని గ్రహింపవచ్చును.

(తృతీయా స్స్యుః తృతీయే స్స్యుః అనుచో భేద మల్ప మయినను) అధర్వణకారికల కహోబలగ్రంథమే మూల మని గుర్తించియు మార్పు లున్నచోట్ల క. మం. ప్రభృతుల విమర్శించియు నిట వజ్ఝలవారు తృతీయే స్యుః కపేతరే అనుపాఠమె గ్రంథకృదభిప్రేత మనుటకు సందేహము లేదని (301) సవరింపఁబూనుట సరిగాదు. గ్రంథకృదభిప్రేత మనుటలోనె 'తృతీయే' యనుదాని కాధారము లేదనియు

నది వఝ్ఝలవారి సృష్టియేయనియు స్పష్ట మగుచున్నది. అహోబల పండితీయమునుండి యథర్వణగ్రంథమును గ్రహించిన సీతారామకవి దాని నేల యట్లు సవరింపవలసెనో తెలియకున్న (413) దని వేతాళ సందర్భమున ననిరి. దీనింబట్టి సవరింపవలసిన తావు లున్న సవరింపఁదగు నని యభిప్రాయ మేమో. ప్రయోజన మెది యేని సాధింపఁదలఁచినను నందుకయి మూలగ్రంథము నెంతయు సవరింపఁదలఁచుట యుక్తము గాదు. మూలమందలిదోషము వివరణమునఁ దెల్పుటయే సముచితము.

కాఁగా అహో. చూపినకారికను (తృతీయాః) యథాతథముగా గ్రహింపవలసియుంటయు నం దనిష్టార్థము లేకుంటయు గుర్తింపఁ దగును.

*నుడితొలిహ్రస్వము — ద్రుతలోపము :*

వఝ్ఝలవారిశ్లే నఖణ్డః ప్రథమార్ధస్యాన్నస్య లోపశ్చ నేష్యతే యనుదానిం జూపిరి. క. మం. ఈ పాఠమునే వ్యాఖ్యానించినది. కాని 'నస్య లోపశ్చ నేష్యతే' — యన్నది పాఠాంతరముగా నున్నను నది స్వీకరించుటకుఁ దగినయాధారము కవిశి. లోఁగానరాదు. ఈభాగము నహో. వ్యాఖ్యానింపలేదు. అహో. వ్యాఖ్యానింపని దెల్ల నాదు లే దని చెప్పరాకున్నను నిట కవిశి. లోఁ ప్రధానముగా నీయఁబడిన వైకృతేఽత్ర కదాపి చ యన్నదే గ్రహింపవలె ననుట నిట్లు గుర్తింపఁదగును.

'వికృతివివేకే తు కెందమ్మి చెందొవ ఇత్యాదావనుస్వారస్యార్థబిందుతాయాం ప్రాప్తాయాం న ఖణ్డః ప్రథమార్ధస్యాద్వైకృతేఽత్ర కదాపి చ ఇత్యుక్తమ్ (కవిశి. 212) అన్నాఁ డహో. ఇట

(సాధ్య) పూర్ణమునకు ఖండము ప్రాప్తించుచున్న దనుసహో. వివరణము ప్రామాదికమె. పూర్ణమునవలెనె ఖండము సైతము తద్ధర్మితం చ బిన్దు స్స్యాత్తనుదానిచే ద్రుతమునకె ప్రాప్తించును. పూర్ణమునకు ఖండము వచ్చు ప్రసక్తి యెచ్చటను లేదు. అయ్యుఁ గొందర్మి యనురీతిరూపములవారణ మీకారికకుఁ బ్రయోజనముగాఁ జెప్పఁబడుట యుక్తమే. దీనివలన నెట్టివిశేషార్థమును జెప్పక యుత్తరార్థము. వైకృతేఽత్ర కదాపి చ యని యుంటయే యుచితము. ఇంకను 'కదాపి చ' యనుదానివలననే ఇఁక అనుచో బిందుసాధనమునకై విశేషవ్యాఖ్య చేసె ననియు గమనింపఁదగును. ఉత్తరార్థము నన్య లోపశ్చ నేష్యతే యని యున్న నది విశేషార్థద మగుట దానిని వివరింపకుండు టెట్లు? దానియర్థము వివాదాస్పదము గాని యస్పష్టము గాని గాదు గదా మానుకొనుటకు. ప్రస్తుతస్థలము బిందు విషయక మగుటచేఁ బూర్వార్థమునె వివరించె ననియు నుత్తరార్థము ద్రుతవిషయక మగుటచేఁ జెప్పలే దనియుఁ గాన 'నన్య' యనుపాఠమె యహో. ఉద్దేశించె ననియుఁ జెప్పుట కూడ బలీయము గానేరదు. అతఁ డుదాహరించిన కెందమ్మిచెందొవ యనుచోట్ల ద్రుతముకార్యమె కద బిందువు. పిదప ద్రుతకార్యములు వివరించినసందర్భమునను నీకారిక ప్రసక్తి లేదు.

'నన్య లోపశ్చ నేష్యతే' యనుదానిని వ్యాఖ్యానించిన క. మం. కర్త చెంగల్వ కందోయి కెంజాయ (ఇత్యాదులు) అని యుదాహరించెను. ఖండబిందువు లేమి; ద్రుతలోపము లేమి అను రెండంశములకు నివి లక్ష్యములు. కందోయి యన్నది చివర నీక నడుము నిచ్చుట గమనార్హము. దీనివలన సరళపరకతచేఁ బ్రాప్తించు ద్రుతలోపము వారించుట దీనియుద్దేశము గా దనవలయును. చెంగల్వ, కెంజాయ యనుచోట్లఁ గూడ (కందోయినివలెనె) ద్రుతలోపము లేకుంటయు ఖండబిందువు రాకుంటయుఁ గల దని లక్ష్యములనుబట్టి

తత్కర్తయభిప్రాయము నెన్నఁదగును. అహోబలుఁడు చూపిన కెందమ్మి చెందొవ యన్నవానివంటివె క. మం. చూపిన — కెంజాయ చెంగల్వ యనునవి సైతమని గ్రహింపవచ్చును. కాఁగా సమాసమున నైననుమాగమద్రుత మిట లోపింపలే దన్నమాట. అట్టిది యవసరమా? ప్రథమప్రాస్వముమీఁదనే యేమి? చిగురుంగైదువు, తళుకుంగజ్జ లిత్యాదిస్థలములమాత్రము ద్రుతము లోపించుచున్నదా? అందుచేతనే యహో. కెందమ్మి చెందొవ యనుచోట్ల ద్రుతలోపమును వారింపవలసినయవసరము నూహింపలే దనియు నందుచే ద్రుతలోపము రాదని చెప్పలే దనియు గ్రహింపవచ్చును. విధానసామర్థ్యమువలన నా ద్రుత మెట్లును లోపింపదు గదా. క. మం. వలెఁ దలఁచిన. నస్య యనుపాఠము నుద్దేశించిన — క. మం. చూపిన వాని వంటివె యైన — కెందమ్మి, చెందొవ యనుస్థలమును ద్రుతలోపమును ప్రస్తావింపఁడా? దీనిచే వారింపఁబడె నని (క. మం. వలె?) వివరింపఁడా?

'నస్య లోపశ్చ' యనుపాఠమును వ్యాఖ్యానించినవజ్ఝలవారు కవిశి. లో వైకల్పికే౽త్ర యని యుంటయుఁ జాము నస్య యనుపాఠమును వివరించుటకు నాధార మెదియో స్పష్టము చేయరైరిట. కాని యహో. వ్యాఖ్యానమును విమర్శించిరి. అది పైని జూతము.

అసలు 'నస్య లోపశ్చ నేష్యతే' యన్నది చెప్పవలసినయవసర మున్నదా యన్నదియుఁ బరిశీలింపఁదగును. క. మం. ఉద్దేశించె ననఁదగినప్రయోజనము సరిగా దని స్పష్టమే. ఇఁక వజ్ఝలవారు “కన్దోయి మున్నగుచోటులందు ద్రుతలోపము గల్గిన — కదోయి మున్నగురూపము లుండనేరవు (౩౨౦) అనిరి. ఆవయవికనకారము ద్రుత మని నిశ్చయించుకొన్నవా రగుటచే వజ్ఝలవారు కన్ + దోయి యని యుండఁగా నకారము ద్రుతము గా దని యింతకుముందు

గ్రహించితిమి (చూ. ద్రు.) ద్రుతమే కాకుంట లోపప్రాప్తియే లేదు గావున నిట నివారింపవలసినయవసరము లేదు. కనుదోయి, కన్దోయి యనుచో సహా. 'క్వచిద్భవేత్సమాసేఽపి ప్రాణిమాత్రస్య సంశ్రుతిః' అని స్వరలోపమే విశేషముగా వివరించెను. ద్రుతలోపముం గూర్చి ప్రస్తావింపకపోవుట (కవిశి. 569) గమనార్హము. ఇది ద్రుత మని యతఁడు నెంచలే దన్నమాట.

వజ్ఝలవారిమతము సంగీకరించి యూనవయవికనకారము ద్రుతమందము. అయిన కన్+దోయి యనుచో ద్రుతలోపము నిట్లు సూత్రింపవలెనా? వీ రింతకుముందు ఏఁబడి కన్గవ మొ న్నగుచోట్ల పరళాదేశాదికము వచ్చుటకు నీయుభయత్వ కారికలోని (నో రన్యస్యాపి సర్వం స్యా ద్బహుళం సత్ప్రయోగతః) బహుళశబ్దమె సాధక మని గ్రహింపవలయు (వ్యా. సం. స. 97,99) అనిరి. అట్లె కన్దోయి యనుచో ద్రుతము లోపింపకుంటయు నాకారికయందలిబహుళశబ్దము చేత సిద్ధము గాదా? దీఁ నొక్కటి వేఱు చేసి చెప్పనేల? మీన్ మెఱసె ననుచోఁ గూడ నకారము ద్రుతమె యనవలెఁ గదా. ఆవయవికనకారము ద్రుత మన్నచో నట స్థిరపరకతలో లోపము రాదా? దానిని వారించుకొను టెట్లు? మీన్ అనుచో ద్రుతము (తొలి) హ్రస్వముపై నున్నదా? అనఁగా మఱల నిట నో రన్యస్యాపి యనుచోటి బహుళశబ్దమునే యాశ్రయింపవలె. కన్గవ యనుచోట మీ న్మెఱసె ననుచోట నుపయోగించినబహుళశబ్దము కన్దోయి యనుచో లోపమును వారించుట కుపయోగింప దనుట సంగతము గాదు గదా. కాన నావయవికనకారము ద్రుత మన్నను నన్య లోపశ్చ యనుదానివలన నిటఁ బ్రయోజనము ప్రత్యేకముగా నేమియు లేదు పైఁగాఁ గన్దోయి యనుచో వారించుట మీ న్మెఱసె ననుటివాని కసాధుత్వమును జ్ఞాపకము చేయుచు ననర్థకము కాఁగలదు.

క. మం. కందోయి యని యుదాహరించినచోట నదియు (కెంపు చాయ) కెంజాయ యనురీతిగనె కన్ను+దోయి యనుచో నూతనత్వాదికత్వముచేతనే యగు నని యెంచ నగును. అపుడు ద్రుతలోపాభావము విధానసామర్థ్యముచేతనే సిద్ధ మగును. ఆవయ వికమగు నకారము ద్రుతమె యగు ... దగినయాధారము క. మం. లోఁ గానరాదు. కాన నిచ్చోటి ద్రుతము సామాసిక మైన యాగమమే యనఁదగు. కెంజాయ, చెంగల్వ అనువానినడుమఁ జూపు టనుబట్టి యట్లూహించుట యొప్పనే కదా.

కన్దోయి మున్నగుచోటులం దనిరే. కాని వజ్ఝలవా రింక నొకటి యిట నుదాహరింపలేదు. ఏ నైనను నావయవికనకార స్థలము లున్న నవి నోరన్యస్యాపి యనుదానిచేతనే సాధ్యములు గాఁగలవు.

కన్దోయి మున్నగుచోటులం దనిరే కా... వజ్ఝలవా రింక నొకటి యిట నుదాహరింపలేదు. ఏ నైనను నావయవికనకారస్థలము లున్న వని నోరన్యస్యాపి యనుదానిచేతన సాధ్యము... గాఁగలవు.

ప్రత్యయాగమాదు లగుద్రుతము (అంతమందుఁ గలద్రుత ప్రకృతికములయెడ) నడిలొల్లి ద్రుహ్రస్వముపై ...ంట దాదాపుగా లే దనియే చెప్పవలె. నిన్, నన్, తన్ అనుమూఁడింటఁగన్పించు. నిన్+ వలచి 'నివలచి' యని ద్రుతము లోపించుటలేదు. నిన్ అనురీతిరూప ములను చిం. కాని వి. వి. కాని స్పష్టము చేయలేదు. ప్రౌఢ. పేర్కొ న్నది. 'నిన్నును' అనురీతిచోట్ల న్నులోపముచే 'నిను' అనురీతి సాధించుకొనవలె ననక తప్పదు. నిన్ బిలిచిన తన్ బంచిన - అని సరళాదేశము గలదు. కాని ద్రుతమునకు ఖండబిందువే కాక పూర్ణ బిందువును గానరాదు. అనఁగా నిను, నను, తను, అనుచోట్ల ద్రుతము

నకు హల్పరకత్వమున సంశ్లేషము దప్ప నెట్టి వికారము లే దన్న మాట. సరళస్థిరపరకతలో లోపము లేనట్లే పరుషపరకతలో బిందువును లేదు. కాన నిట లోపకార్య మొక్కటె కాక బిందువును వారింప నవసర మున్నది. సూరిగ్రంథమున నన్న విభాషాపదముచే బిందువు వారింపఁబడుఁ గాన నుడిలో లిహ్రస్వముపై (ఖండ) లోపము లే దని గ్రహింపవచ్చును.

ఇంక సమాసములయందుఁ బ్రత్యేకముగా విధింపఁబడిన నుమాగమవిధానస్థలముల విధానసామర్థ్యముచే నెట్లు నా ద్రుతమునకు లోప ముండదు. పెందూళి, కెంజడ లనుచో సరళ (స్థిర) పరకతలో లోపించునా? 'నిత్యం ప్రశ్లేషతా బిన్దుః' అనుకారికనుగూర్చి యింతకుముందే గమనించియుంటిమి. కాన నటఁ బ్రసక్తి లేదు. తోడఁబుట్టు విత్యాదుల నుడిలో లిహ్రస్వముపై ద్రుత ముండుట గానరాదు. (ఉన్నను తోడంబుట్టు విత్యాదులవలె బిందువిధానము ననుసరించియె ద్రుతలోపము వారిత మగును.)

నిన్ వలచె ననురీతిస్థలములకయియే యిట్లు సూత్రించె నని చెప్పవలసివచ్చుట సహజముగాఁ గానరాదు.

కాఁగా నస్య లోపశ్చ యనువిధానమునవసరము లే దనియే చెప్పఁదగును. సూరియుఁ గన్దోయి యనియే యుట నుదాహరించుట విశేషము.

ఏమైనను నస్య లోపశ్చ యనుపాఠమును బ్రమాణీకరించుటకుఁ దగినయాధారము కానరా దనియే చెప్పఁదగియున్నది.

నస్య లోపశ్చ యనునుత్తరార్థమువలననే న ఖణ్డః ప్రథమాద్ద్విస్వాత్తనుపూర్వార్థము సైతము సంధిసందర్భమునందలిదే యని వ్యాఖ్యలవారు చెప్పుట కవకాశము గల్గిన దని యూహింపవచ్చును. వైకృతేఽత్ర కదాపి చ యనుపాఠము నంగీకరించుచో సంధికార్య మాత్రసాధనపర మని యర్థము చేయుట కవకాశము (320) లేదు గదా. సంధికార్యమాత్రసాధనపర మని యహో. అందులకే చెప్పి యుండలేదు.

న ఖణ్డః ప్రథమాద్ద్విస్వాత్తనులక్షణము సార్వత్రిక మైన దిగాఁ జెప్పినఁ గల్గునిబ్బందులను వ్యాఖ్యలవారు పేర్కొనిరి.

ఒకయిబ్బంది నహోబలుఁడే గుర్తించెను. నుడితొలిహ్రస్వముపై ఖండబిందువు లేదని సామాన్యముగాఁ జెప్పిన—అంట, ఇఁకల యందును ఖండస్థితి విరుద్ధ మగును. అందుకయియే యహో. కారికలో "హ్రస్వశబ్దేన హ్రస్వాజన్తో హల్వివక్షిత" (313) యని వివరించెను. హ్రస్వశబ్దమున కిట్టి విశేషార్థమును జెప్పుటను వ్యాఖ్యలవారు తిరస్కరింపలేదు. వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి యని యట్లు చెప్పఁదగు ననవచ్చును. భావిక్రియాసు యస్య స్యా దేత్వ మేవ ప్రయోగత యనుచో భావిక్రియ యనుదానికి వ్యాఖ్యలవారు 'భవిష్యదర్థబోధకతద్ధర్మాద్యర్థకక్రియాపదములం (122) దని యర్థము చేసిరి. కాఁగా నిట హ్రస్వశబ్దమునకు హ్రస్వాజంత మైనహ ల్లని యర్థము చేయుటను వ్యాఖ్యలవారు నామోదించిరి కాని యట్టియర్థము చెప్పుట వలనను ననర్థము గల దని యిట్లు నిరూపించిరి.

ఇట్టివ్యాఖ్యానముచేత ఇచ్చుధాతురూప మగు ఇండుఅనుదానికి రూపాంతరముగ ఇఁడు అనుస్వార్థబిందుకరూప ముండవచ్చు. ననియు. (320) ఇచ్చుధాతువుపైఁ ప్రార్థనార్థమున బహుత్వమున ఏకత్వేఽథ బహుత్వే ముడుఙ్ సంప్రార్థనపరాత్తుః అని డు ఙగును. డుఙ్ఙు ఙిత్తు

గావునఁ బూర్ణమును ఖండమును ముందు రావచ్చును. ప్రాస్వాజంత మగువాల్లు గాక ప్రాస్వాచ్చే యగుటచే నీనుడితో లివర్ణముపై ఖండ బిందు వుండుట యవిరుద్ధ మగుట నీవ్యాఖ్యవలనఁ బ్రయోజనము లే దని యభిప్రాయము. కాని ఇచ్చు+డుజ్ ఈ+డుజ్ ఇ+డుజ్ అని రైనపిదపఁ గదా బిందుప్రసక్తి. 'ఈ' యాదేశము చెప్పఁబడినదా? ప్రాస్వము నట్ల గదా. అవి రెండు రాక ఖండమే వచ్చునన నెట్లు? ఇమ్ము ఇందు అనురీతిరూపములే వి. వి. లోను స్పష్టము చేయఁబడ లేదు. అట్టియెడల నట నిబ్బంది గల్గు నని చెప్పుట సక్రమమా? వఝ్ఝలవా రిట్టికార్యములు చిం.వలె వి.వి. కూడఁ బ్రత్యేకముగా వివరింప లే దనుచు (వ్యా.సం.స. 1521) భూయసీ దేశ్యశబ్దేషు, భాషేయ మమితా, తత్తత్పదం పరిగ్రాహ్య మ్మనువానిం జూపిరి. స్పష్టముగాఁ జెప్పమి ననుసరించి (భాషేయ మమితా యనుదానిచేతఁ గాని) తత్తత్పదం పరిగ్రాహ్యం యద్యత్స హృదయే హిత మ్మనుదాని ననుస రించి ఇందు, అనురూపమె సహృదయహిత మగుటఁ బరిగ్రాహ్య మన్న ఇఁడు రూపప్రసక్తి యుండదు గదా. స్పష్టము చేయని ప్రక్రియనుబట్టి యిట విరోధము నూహించుటలో నది బలీయముగా నిల్వదు.

తరువాత వఝ్ఝలవారు చుండు అనుదానికిఁ బర్యాయముగ చుఁడు (రారు నుఁడీ) యనురూప ముండనేర దనియు ననిష్టార్థములు సంభవించుచున్నవి (320) యనిరి.

అఁట యిఁక చుఁడుశబ్దంబులం దప్ప నని సూరి చుఁడుశబ్దమును జేర్కొనుట ననుసరించియే వీ రిట నద్దానిని బ్రస్తావించి రని యూ హింపవచ్చును. సూరి చుఁడు శబ్ద మెట్లేర్పడినదో నిరూపింపలేదు. ప్రతిపదోక్తావ్యయముగా నెంచియుండును. వి.వి. చుర్దేశో్య మధ్య మార్థే స్యా ప్రార్థనే ముమ్ముఁడుజ్ స్థితః అని పేర్కొన్నది. అహో.

దీనిని వివరింపలేదు. స్థితః అనియే పాఠ మగపడు. క.మం.లోను నిట్లు యున్నది. వజ్ఝలవారు మాత్రము స్థితిః అని చెప్పి ముమ్ముదుజ్జు లవు ననిరి. స్థితః అనుపాఠము చూపిన క. మం. ముమ్ముదుజ్వర్ణకములుగల దై యున్నది (160) కాని యిట 'చు' అనునది ధాతువా? ప్రాతిపదికమా? దీనియర్థమేది? స్పష్టము గాదు. ఇట్టియెడలవజ్ఝలవారుమధ్యమపురుషమున ఏకత్వమున ముమ్మనుప్రత్యయములును బహుత్వమున దుజ్వర్ణకము నగు నని (1419) చెప్పుట నిరాధారము. 'చు' అనునది ధాతు వనఁదగునా? మధ్యమపురుష వివక్షించుటకు? ధాతుభిన్నములపై నిట్లు చేయుట యెచ్చటను గానరాదు గదా. అందుకే సూరిచుఁడు నిట్లు నిరూపింపలే దనవచ్చు. ముమ్ముదుజ్ స్థితః దేశ్యః చుః మధ్యమార్థే ప్రార్థనే స్యాత్ అని ముమ్ముదుజ్జులు గలిగిన దగుదేశ్యమైనచుశబ్దము మధ్యమార్థమునఁ బ్రార్థనమునం దగు నని యర్థము చేయఁదగును. దీనిచొప్పున ముమ్ముదుజ్జులు విధింపఁబడుట లే దనియు చుము, చుమ్ము, చుండు అనురూపముల వర్ణనమే యిం దుద్దిష్టమనియు నూహింపవచ్చును. కిలార్థకము, కదా, అనుపూర్వోక్తశబ్దములవలె చుము.చుమ్ము, చుండు అనునవియు నవ్యయము లగుశబ్దములే యని గ్రహింపఁదగును. సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు మూఁడుశబ్దము డుజ్వర్ణ మని ఖండబిందుపూర్వక మైన డువర్ణమును డుజ్వర్ణ మని పేర్కొన్నట్లే ఇట చుండు అనుశబ్దమును వర్ణించుపట్టుల డుజ్జు గలిగినచుశబ్ద మనుట యొప్పును. అపు డిట చుండు అనుచోటను ఖండము సిద్ధము. కాఁగా హ్రస్వాత్పూర్ణోఽపి భవే త్తని దానికిఁ బూర్ణబిందు వయి చుండు అనురూపము సిద్ధమగును. కాఁగాఁ జుఁడు అనుదానిలోనిఖండము సిద్ధమె యని గుర్తింపఁదగును. చకారమువలన చుఁడు అనుచో సిద్ధఖండము ప్రవర్తిల్లుచున్నది. (7పుట) అనెఁ గ.మం.కర్త. సాధ్యమని యుండవలె ననియు సిద్ధమని యుంట ముద్రణస్ఖాలిత్య మనియు వజ్ఝలవా రనిరి (323) డుజ్జు

గలదైౖ యనుటలో గ.మం.కర్తకుఁ బైయభిప్రాయమె యున్నదన్న సిద్ధమె యగును గదా. హ్రస్వాజంతమైనహల్లు అను మహో.వ్యాఖ్య ననుసరించి యిట ఖండబిందు వుండుట కవకాశము చాలకున్నది. అహో. తిఙ్మధ్యశేషషష్ఠీ సూత్రవివరణమున ఆదిశబ్దముచేతనుమ్ము కదా ఇత్యాదులు గ్రహింపఁబడు ననుచో (కవిశి. 254) నుమ్మును ప్రస్తావించెను. ఇట సాదేశముతోఁ జూపుట ప్రమాదమె. అయ్యుఁ జుమ్ము శబ్దమును బ్రత్యేకముగాఁ జూపుట ననుసరించి చుఁడు అనున దియుఁ బ్రత్యేకపదమె. అఁటాదులవలె నిదియు నెపుడు నే దేనిశబ్దముపై నుండియే ప్రయోగింపఁ బఁడుచున్నను స్వతంత్రపదమె యనక తప్పకున్నది. కాఁగా నెట్లును జుఁడులో ఖండ ముంట యహో.వ్యాఖ్య కువిరుద్ధమె యగుచున్నది.

ఇట్టియొక్కరూపమువిషయమున నిబ్బంది గల్గుచున్నదన్న కారణముచేఁ గేవల మహో.వ్యాఖ్యను దిరస్కరింప నవసరము లేదు. వి.వి.లక్షణము లెల్ల సమగ్రముగా లక్ష్యసంగ్రాహకములుగాఁ జెప్పఁజాలము గదా.

కాని యసలు హ్రస్వశబ్దమునకు హ్రస్వాజంతమైనహల్లని యర్థము చేయుటయే సహజముగాఁ గానరాదు. కారికాకర్త యా శబ్దమున కట్టియర్థము నుద్దేశించె ననుట నమ్మ శక్యముగా లేదు. ఖావి క్రియాను అనురీతివానివిషయము తత్తత్సందర్భముల స్పష్ట మగు.

పోనీ యహో. చెప్పినయర్థమున ననర్థము లేకున్నను వజ్ఝల వారు చెప్పినయర్థమునఁ బ్రయోజనవిశేష మున్న దేమో చూతము. వారీకారికను సంధికార్యమాత్రసాధనపర మనుట యుక్త మనిరి. అట్టియెడల అఁట ఇఁకలతోపాటు చుఁడులోను ఖండబిందు వుంటయు ఇఁడు అనురీతి నేర్పడ నవసరము లేకుంటయుఁ బ్రయోజనములుగా

వా రెంచి రనవచ్చును. అది యనవసర మైనవు డందుకయి దీనిని గ్రహింపఁ బని లేదు.

న ఖణ్డః అన్నది సంధికార్యములసందర్భమునమాత్రమె వర్తిల్లు నన్న సంధికార్యముగా రావలసినఖండము నుడితొలిహ్రస్వముపై రాదని యర్థము. సంధిలో ఖండ మగుట యన్న ద్రుతకార్యములసందర్భముననే యనవచ్చు. అనఁగా నుడితొలిహ్రస్వముపైని ద్రుతమునకు ఖండబిందువు రా దని యర్థము. అట్టియెడల వీరు పదము మొదటిహ్రస్వమునకంటెఁ బరముగ అర్ధబిందువు లేదు. అట్టియెడ ద్రుతలోపము సైతము సమ్మతము కాదు (౩:౭)అని కాక ప్రథమాత్ హ్రస్వాత్ నస్య ఖణ్డః లోపశ్చ నేష్యతే యని పదము మొదటిహ్రస్వమునకంటె బర మైనద్రుతమునకు ఖండబిందువును లోపమును లే వని స్పష్టముగనే చెప్పఁదగును. సూరి ఖండబిందువు లేమిని సాధారణముగా నెల్లభాష నుద్దేశించి చెప్పుట ద్రుతమునకే లే దనలేదు. సంధికార్యములందే యని తలఁచువా రట్లు చెప్పవచ్చును గదా.

ఏ మైనను సంధిసందర్భమునమాత్రమే నుడితొలిహ్రస్వముపై నీలక్షణము ఖండమును నిషేధించుచున్నది. అనఁగా సంధికంటె నితరస్థలములం దీనిషేధము లే దన్నమాట. అట్టియవుడే గదా అఁట, ఇఁకలలో ఖండబిందు వుంట యవిరుద్ధ మగుచున్నది. అహో. వ్యాఖ్యను విమర్శించుచు ఇందు అనునర్థమున 'ఇఁడు' అనునవిష్ట రూపము గావలయు ననిరే. మఱి వీరివ్యాఖ్య ననుసరించి గాదా? జీ త్తగుటచే రాముఁడు అన్నట్లుగా ఇఁడు అని ఖండము రాకతప్పదు ఇట ఖండబిందువు సంధికార్యమువలన నవునది కాదు గనుక నీలక్షణముచే నిషేధము లేదు గదా. అఁట ఇఁక చుఁడులందువలె ఇఁడు అనురీతిగాను ఖండబిందు వుంట యవిరుద్ధమే యనవలె. కాఁగా నహో. వ్యాఖ్యలోఁ జూపినయొకలోపము వజ్ఝలవారివ్యాఖ్య

యుందును గలదు. ఇంకను అహో. హ్రస్వాజంత మైనవాళ్లువయి లే దనుటచే రండు ఇత్యాదుల ఖండబిందుఘటితరూపప్రసక్తి లేదు. కాని వీరివ్యాఖ్య ననుసరించి రండు — రఁడు, కొండు — కొఁడు, కండు — కఁడు, పొండు — పొఁడు అనురీతిగా నెన్నిస్థలముల నుడితో లి హ్రస్వముపై ఖండబిందుప్రసక్తి యుండలేదు. అవి యెల్ల నిష్ట రూపములే యగునా ? ఇట్టిచోట్ల (ఇందు — ఇఁడు అనుచోవలెనె) దుబ్జుజిత్వమునుబట్టి బిందువు రావలె. ఇది సంధికార్యము కాదు గదా. కాఁగా సంధికార్యమాత్రసాధనపర మనుటవలన వీరు పెక్కుపరూపములను సాధించుచున్నా రని నిర్ణయింపకతప్పదు. అహో. సాధించిన యుపరూపము 'ఇఁడు' ఒక్కటే కాని వీ రట్లు తక్కువ చేయరు.

అయిన నింతకుముం దనుకొన్నట్లుగా ఇందు అనురూపము వలెనె రండుమొదలగుచోట్ల తత్తత్పదం పరిగ్రాహ్యా మ్మనుదాని చేతనే గుర్తింపఁదగు నన్న నీయిబ్బంది యుండదు. కాఁగా వ్యఖ్యల వారు తమమార్గమున నేర్పడునవిష్టరూపములను వారించుమార్గము చూపకరో యహోబలుని విమర్శించుట సరి గా దని మాత్రము గుర్తింపకతప్పదు.

ఇంక నీకారిక సంధికార్యసందర్భముననే ప్రవర్తించు ననుట కును నం దాధారము లేమి స్పష్టము. 'వైకృతేఽత్ర కదాపి చ' యన్నది స్వీకరింపవలసియున్నది గదా.

అత్ర వైకృతే కదాపి చ ప్రమాద్ధ్రిస్యాత్ ఖణ్డః న అనుచో నశబ్దమునకు లేదు అనఁగాఁ గాదు అని యర్థము చేయఁగా నుడితొలి హ్రస్వముపై సాధ్యఖండము లే దని తేలును. నుడితొలిహ్రస్వ ముపై ఖండ మున్నది, అఁట ఇఁక ఇఁగ చుఁడు శబ్దములందు. చుఁడు శబ్దమువిషయమున నహో. పొరపడె ననవచ్చును. క. మం.

ననుసరించియు చూడులోఁ గూడ ఖండము సిద్ధమే. కావున నడిలో లి ప్రాస్వముపై ఖండము గలఅఁటఇఁకఇఁగచూఁడు అనునాల్గింట నున్న ఖండము సిద్ధమె యని గుర్తింపవచ్చును. కాన నడితో లిప్రాస్వముపై వ్యాకరణముచే సాధింపఁబడినఖండబిందువులు గలతావు లేవియు భాషలో లేవు.

ఇట్లీకారికను సాధ్యఖండబిందువిషయకముగా గుర్తింపఁగా నడితో లిప్రాస్వముపైని సిద్ధఖండమునకు నిషేధ ముండదు. కావఁ ప్రయోగానుసారముగా అఁటఇఁకఇఁగచూఁడులలో ఖండబిందు వుంటలో విరోధము లేదు. సిద్ధబిందు వగుటచేఁ ప్రయోగానుసార ముగా గుర్తింపవలసినదే కాన నడితో లిప్రాస్వముపైని ఖండబిందు వుండ దని సామాన్యముగా ఁషేధింపఁబడలేదు గాన నిచ్చట (నడి తో లిప్రాస్వముపై) నుండవలె నని యొచ్చటను సిద్ధబిందువిషయము నఁ జెప్పరాని లక్షణముతో బాధ లేదు. సూరి సిద్ధబిందువు గల యఁటాదులను స్పష్టముగా నిర్దేశించి యింక నెచ్చటను వట్టిఖండ బిందువు లే దని స్పష్టము చేయఁగా వి. వి. అట్లు సిద్ధఖండము నడి తో లిప్రాస్వముపైఁ గలస్థలములను స్పష్టము చేయలే దంతియు. సూరి దీర్ఘముపై సాధ్యపూర్ణము లే దనుచో సిద్ధపూర్ణమునకు దీర్ఘముపై నవకాశము నిల్చనే కాని యాతావులు స్పష్టము చేయలేదు. ఇట వి.వి. నడితో లిప్రాస్వముపై సాధ్యఖండబింతువు లే దనుసందర్భ మట్టిదిగా గుర్తింపఁదగును.

కావున నఁ=కాదు నడిలో లిప్రాస్వముపై ఖండబిందువు రాదు అని సంధిసందర్భమునఁ గాని మఱి యొచ్చట నేని ప్రాప్తించుచున్న ఖండము రా దనఁగా నడితో లిప్రాస్వముపై సాధ్య ఖండము లేదను కిఁ బైనట్లు గ్రహించుట శ్రేయము.

# ద్రుతకార్యపర్యాలోకనము

ద్రుతకార్యానుశీలనమునం దాయాయెడల సందర్భానుసారముగా నాయాలాక్షణికుల యభిప్రాయములను గుర్తించితిమి. లభ్యమగుమేర నితరాంధ్రలాక్షణికులు చెప్పిన యంశములు నిట స్మరింతము.

***స్వరపరకద్రుతకార్యములు :***

సంస్కృతమున వ్రాయఁబడియున్న యాంధ్రలక్షణగ్రంథములు పెక్కులు చిం. తో నేదో యొకవిధమైన సంబంధము గల్గియుండుట గుర్తింపవచ్చును. త్రి. శ., సా. త్రి. శ., ఆం. కౌ. (సం.), వై. చం., చిం. లకు నిట్టిసంబంధము గలదు. పైవానితో పాటు చింతామణికిని మూలము లేదా యాధార మనఁదగి మన కిపు డుపలబ్ధము గాకున్న లక్షణగ్రంథ మొకఁ డుండెనేమో యని వీని కీమత్తారతమ్యములతోడి సన్నిహితసంబంధ మనుమానింపఁ జేయును. ఇంక ముందు పరిశోధనములఁ దెల్లము గాఁగల దని యాశింతము.

లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య (సర్వత్రలుక్సమాసేషు) అనునది చిం. లోవలె సా. త్రి. శ. లో నున్నది. లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య — ద్రుతస్యాచిపరే లోపసంశ్లేషౌ న స్తః. రాము నాశ్రయింతు, కృష్ణు నర్చింతు, వచ్చె నొక్కఁడు (సా. త్రి. శ సంధి. 13) ఇట్లే ఆం. కౌ. (సం.) న లుక్సంయోగౌ వచి నస్య — (సంధి 37) నకారస్యాచి పరే లోపసంయోగౌ న స్తః ఉ. రాము నర్చింతు, కృష్ణు నాశ్రయింతు, బాలు నూరడింతు, కన్నియ నొప్పగించె ఇత్యాది. ఇట వృత్తులును వైచిం. సూత్రమున కహో. వ్యాఖ్య వలెనె యున్నవి.

అజ్వత్ప్రదాదియస్య స్యాత్ ప్రాణానామ్ వస్య తు ష్ష్ట్యాచి తద్వత్ స్యాత్ అని త్రి. శ. (౭. కాం.) లో నజ్వత్త్వార్థ్యము విహితము. త్రి. శ. (ప్రధానముగా) మొదలగు గ్రంథములకు వ్యాఖ్యయా యనందగి విస్తృత రూపమై సా. త్రి. శ. కానవచ్చు.

స్వరపరకతలో ద్రుతమునకు ద్విత్వము కొందఱు దుస్సంధి యని తిరస్కరించినను గొందఱు అంగీకరించిరి. (చూ. త్రి. శే.) యశ్చ- **అతత్సనామాదియకారస్య నామ్నః పరతో లుక్ స్యాత్.** రాముఁ డెవ్వఁడు గురుఁ డిచ్చోట (దీనింబట్టి పదాదియకారము ఇ, ఈ, ఎ, ఏ యనునచ్చులకు ముందుంట యూహింపవచ్చును.) వాక్యేతు, **అతత్సపదం కిం?** బ్రాహ్మణుఁడు యజ్ఞము సేసె సా. త్రి. శ. పరి. 28 ఇట తత్సమేతర మని వివరించినసా. త్రి. శ. అంతకుముందు 'వస్యా త్వస్య నామ్నో లుక్— ష్ట్యప్రాణసహితవ్య నామాదివకారస్య నామ్నః పరతో లుక్ స్యాత్. కృష్ణుఁ డుండె, రాముఁ డొప్పె (౭6) నని చెప్పుచో అతత్సవిశేషణము చేర్చకుంట విశేషము. ఈ లక్షణలక్ష్యములనుబట్టి చూడఁ జం. లో నైతము 'సర్వత్రాజ్వత్త్వార్థ్యం జ్ఞేయం యస్య అనుదానిలోనికిఁ గాక ద్రుతప్రకృతికేభ్యః అన్నది లుక్సంశ్లేషౌ నాచి యనుతరువాతిభాగములోనికె యన్వయింపవలయు నను వజ్ఝలవారియభిప్రాయమె తత్కర్తయభిప్రాయముగా నెన్నఁదగి యున్నది. కాని ఆం. కౌ. (సం.) ద్రుతిన స్సర్వత్ర యోఽచ్— ద్రుతప్రకృతికాత్పరతో నామాదియకార స్సర్వత్రాజ్వత్ స్యాత్ వచ్చె నెవుడు, చనె నెవ్వఁడు, ఉండె నెక్కడ, కలిగె నేమి ఇత్యాది (సంధి. 36) అన్నది, బా. స. ప్రభృతులమార్గమునె బలపఱచు చున్నది.

త్రి.శ. పద్యాదేస్తు క్వచి స్న లుక్ అనుట యింతకు ముందటి యకారవకారములు రెండింటివిషయమునను నని చెప్పవచ్చును. సా. త్రి. శ. పద్యాదే ర్భాషా— పద్యాద్యతత్సమాద్య యకారస్య వా లోప స్స్యాత్ — అథర్వణభారతే, కీచకవాక్యం- “యింక నొకసారి పల్కు నటే లని చిందునో నోటిముత్యముల్, వికచసరోరుహాక్షి వినవే నను మన్నన చేసి కావుమా, యకట మనోభవాశుగచయంబుల నాతను వ్రల్లను నొచ్చితో దయా కరుణ సూపి యేలుకొనుమీ కిను కిప్పుడు సేయ నేటికే— (సా. త్రి. శ. పరి. 29) అన్నది. పద్యాదిని యకార మట్లు నున్న దనుట కిది బల మైనయాధారముగా నిర్ణయింపఁజాలము. యకారమునకు స్వరములతో యతిమైత్రి గలదు గదా. వకారముగివయమున నిట్టి ప్రయోగము ప్రబలాధారము కాఁగలదు.

న పద్యాదేః క్వచిత్ — పద్యాదేరోష్ఠ్యప్రాణపరస్య వస్య క్వచిత్ స్థలే లోపో న స్యాత్, జైమినిరామాయణే సీతాకళ్యాణే - “వువిద యొకర్తు మేనఁ దొడవు ల్గిలించె ముదంబు మీరఁగా, వనజ కప్పు డొర్తు వెలయ న్మెసఁగన్ దిలకంబు దిద్దె నొక్కవనిత దొడ్డ మేన రయికె గాటు కలదె గనులందొకర్తు సాంద్రకవమృగనాభి పంకమొక కాంత యలందె విలాస మొప్పఁగన్— (సా. త్రి.శ.పరి.27) ఇటఁ బద్యాదిని వువిద యనుచో ‘నుఁవ’ యని యచ్చును నిల్పిన తొడవుల్ అనుచో వువర్ణముతో యతి చెల్లదు గదా. కావునఁ బద్యాదిని వకారలోపము లేదనుట కిది ప్రమాణమే యగును. ఇట్టివే. గో—వుల గణింపఁ దాతయును వోపఁడు (భాగ. ఉ. 40?) దే—వునకు సమఁగువాడ నని వుస్సిరతన్ (వృషాధిప-98) వొక్కఁడిడించి పోవుటయు భీతిల్లి (నవనాథ. 92 వుట - అప్పా. రావుగారి పీఠిక. 111) కా—వునఁ [illegible] సందియము లే దూహింప (ధర్మ - 227 వుట) నన్నది యింకను విలక్షణముగా నున్నది.

  

దీనింబట్టి ఉ - వులకు యతి సంగీకరింపవలసియుండెడి. అప్పుడు పైని కూడ ఉవిద—తోడవుల్ అని ఉ-వుయతి చెల్లెనన వచ్చు. కాని సా. త్రి. శ. వకారమున చూపినది.

కాని సా. త్రి. శ. ఆపిదప యణ్ప్రాణవత్ — అతత్సమా మాన్యయకారస్య ప్రాణవత్కార్యం స్యాత్, యెప్పుడు, వశ్చేత్స్య ప్రాణే — నామాద్యవకారస్య చోష్ఠ్యప్రాణే పరే ప్రాణవత్కార్యం స్యాత్, వువిద, వుంగరము, వొక్కండు, వోయారము. (పరి- 31, 32) అనుచో వృత్తియందు శబ్దాంతరయోగము ప్రస్తావింపఁబడ కుంటనుబట్టియు, నుదాహృతులు నట్లు ప్రత్యేకముగాఁ జూపుటయు ననుసరించి సాధారణముగా నెల్లెడఁ బ్రాణవత్కార్యము చెప్పఁ బడిన ట్లున్నవలయు. తద్వ్యాదే ర్వ్యాభాషా యన్నదియు నిదే సూచించు. లేకున్నఁ బద్యాదియందలకు శబ్దాంతరములో [illegible] ఎట్లు? వువిద- తోడవుల్ అనురీతి ప్రయోగము ననుసరించి పదాదిని యు, వు, వూ, వొ, వోలు లే వని పీరు చెప్పఁజాలకపోయి రేమో. కాని యట్టి యతిస్థలములు ప్రామాదికములుగా సూచించు చప్పకవ్యాదులు పదాది యకార, వువూవొవోలను దరస్కరించిరి.

*పరుషసరళద్రుతకార్యాలు :*

ద్రుతి మనుసంజ్ఞ గానరాని లక్షణగ్రంథములు నకార మని పేర్కొనఁగా ద్రుతముపైఁ బరుషములకు సరళములను జెప్పుట దాదాపు లక్షణగ్రంథములం దెల్లఁ గానవచ్చును.

జత్త్వం చ వర్గాద్యానాం తతః పరమ్ అని (త్రి. శ. 2 కాం) పేర్కొన్నది. నస్య స్యాద్వా హలో బిన్దు రివ్యక్తే హలి సర్వేషా మ్మని యింతకుముందు ద్రుతమునకు లోపము వికల్పముగను బిందువును చెప్పఁబడినవి. ఇట తతః అన్నది ద్రుతమును, ద్రుతమునకు నైనబిందువును దెల్పును. కాన ద్రుతమునకు, ద్రుతస్థానిక మగు

బిన్దు రిష్యతే హలి సర్వేషా మ్మతి, తి.శ.(౨కాం.) హల్పరకతలో బిందువును సాధారణముగాఁ జెప్పినది. ఇట ఖండమును గ్రహింప వీ లున్నది. కాని సా. త్రి. శ. బిన్దుస్స్యాచ ద్రుతస్య- పదాంతస్య ద్రుతస్య పూర్ణబిందు స్స్యాద్ధలి పరే సోమచంద్రస్య మతే రాముం జానకీపతిన్, కృష్ణుం దయానిధిన్, నృపతిం మూర్ధన్యన్, హరిం లోకేశ్వరున్, విష్ణుం బరమున్ (విష్ణున్ పరమున్ అని యుంట విచార్యము. ఇట నిల్లైన బిందువు ఉపలక్షించోట పకారమే యుంట ప్రామదసగాని (పమూర్వ ముండదగు) విష్ణుం భావింతున్ — హలి కిం. రాము నాశ్రయింతున్ నేహ.

దీనింబట్టి సరళస్థిరపరకతయు దూవలెఁ బరుషపరకతయందును బూర్ణబిందువుమాత్రమే చెప్పఁబడిన దనవలసియుండెఁ గదా. ప్రాతిస్విధసాధారణ చ ... ఖండము నుండు నన సరళస్థిరపరకతలోను ప్రాస్వమునై ఖండ ముండనాయు (చి... ను తద్ద్రుతం చ బిన్దు స్స్యాత్ తన్నది పూర్ణబిందువుమాత్రమే చెప్పుచున్నదా? బిందు వనఁ బూర్ణ బిందువే యనుపక్షప్రాయములోనే బిన్దుం ప్రపద్యతే తం క్వచిత్కచిత్తని పూర్ణబిందు వని పేర్కొనక బిందు వనెనా? నలలో భిన్నయుతో దుర్వా యనుచోఁ గూడ నిట్లే గదా. సన్నిహితము లైయున్న యితర గ్రంథము లాధారముగాఁ బరిశీలించిన చింతామణి యింకొకతీరుగా సాక్షాత్కరించునేమో) ఇట్టియెడ పూచెఁ గలువ లని యుండ రాకున్నది. పూచెం గలువ లనియో యుండవలె. భేదము నే తీరుగ నేని నిరూపింపవలెనే.

కేతన ద్రుతముల కిట ఖండము చేసి యాఖండబిందువునకుఁ బూర్ణము చేసినట్లు తోఁచుచున్నది. (ఆం. భా. భూ. ౯౭, ౯౮) ఇట్టి పద్ధతి గౌరవహేతువు గాన ద్రుతమునకు బిందువు ఖండపూర్ణములు రెండును ద్రుతమునకే విధించుటయే యొప్పుచున్నది. బా. చం. హ్రస్వాద్బిందుశ్చ (సంధి. ౨౮) అన్నది. ఇట వృత్తి — "హ్రస్వా

త్పరతో బిందు (పూర్ణము) బిందుకో (అర్ధబిన్దు ర్బిన్దుకః వై. చం. సంధి.27) వా స్యాత్ హరియు గాంచె, హరియుఁ గాంచె. బిందుశ్చ యుటచే బిందుకము సాధారణము. హ్రస్వదీర్ఘములపై నగును. హ్రస్వముమీఁద నున్న బిందుకముతో పాటు బిందువు నగును అని యు దీర్ఘముమీఁది ద్రుతమునకు బిందువె (ఖండము) కాని బిందువు (పూర్ణము) లే దని చెప్పినట్లు ఉన్నది.

పరుషపరకతలో ద్రుతమునకు లోపము లాక్షణికులు పెక్కురు చెప్పకుంట ప్రయోగానుసారము యుండవగు. కాని త్రి. శ. లో నట్టియభిప్రాయము గోచరించు.

నస్య స్యా ద్వా హలి — అన్నది హల్లు పరమైననకారము (నో ద్రుతాభిధః 1 కాం.) నకు లోపము వికల్ప మన్నది. నో హలి వా (సా. త్రి. శ. సంధి 40) పదాంతస్య నస్య వా లుక్ స్యా ద్ధలి పరే. వచ్చెన్ గణపతి — వచ్చె గణపతి, ఇచ్చెన్ జగన్నాథుఁడు — ఇచ్చె జగన్నాథుఁడు మెచ్చెన్ రాముఁడు — మెచ్చె రాముఁడు.

ఇట్లు త్రి. శ. హల్పరకతలో ద్రుతలోపము సామాన్యముగాఁ జెప్పుటచేఁ బరుష పరకతలోను ద్రుతమునకు లోపము వచ్చుచున్నది గదా. సా. త్రి. శ. న పరుషే పుష్పద న్తస్య — పరుషాక్షరే పదాంతస్య నస్య న లుక్ స్యా త్పుష్పద న్తస్య మతే. వచ్చె కమలాక్షుఁడు, తెచ్చె దామరసాక్షి, ఇచ్చె పరమాత్ముఁడు, ఇతి న. కిం చ సూత్రే హలీత్యుక్తత్వాత్ (అచ్చర్ణము త్రి. శ. లో అని గ్రహింపవచ్చును,) ద్రుతస్య పరుషాక్షరే పరే లోపే ప్రాప్తే సతి పరనిత్యాంతరంగాపవాదానా ముత్తరో త్తరం బలీయ ఇతి న్యాయేన పుష్పద న్తస్య ప్రబలత్వా త్తస్మి న్నలుక్ ఇతి బోద్ధవ్యమ్ (సంధి. 12) అనెను. దీనివలన త్రి. శ. పరుషపరకద్రుతలోప మంగీకరించి నను బర మగుటచేఁ బుష్పదంతమతము గ్రాహ్య మనుటచేఁ బరుష

పరక ద్రుతలోప మధర్వణాంగీకృత మైనను బిరపడఁ దిరస్కరింపఁబడిన దనవలె.

దత్త్వం చ వర్గాద్యానాం తతః పర మ్మనుచో తతః పర మ్మనుటవలన ద్రుతయుక్తమగు పదమునకుఁ బర మైన కచటతపలు గజడదబ లగు ననుటవలన నస్య స్యా ద్వా హాలి యని ద్రుతము లోపించుపక్షమునఁ బైరూపము లట్లే యుండు నని యర్థ మగును. దీనివలనఁ గా తగ, మొ॥ ప్రయోగములు సాధింపఁబడువీ లున్నది. (చూ. పరుష పరక ద్రుతలోపము) ఏమైనను నధర్వణుఁడు పరుషపరకతలో ద్రుతము లోపించుట గల దనియు నపుడు పైపరుషములు సరళములుగా ననియుఁ జెప్ప దనవలసియున్నది. సా.ప్ర.శ. వద్యార్ద్వి భాషా యను లక్షణమునకు లక్ష్యముగాఁ జూపిన యధర్వణభారతపద్యము ని గలదు. భారతకర్తయు నీ ప్ర.శ. కర్తయు నొక్కర యన్నఁ బరుష పరక ద్రుతలోపము తత్సమ్మత మనుట కది ప్రబలాధార మగును. అట 'యిటకు నొకసారి—' అని కశాకర్త వ్రాసె. నొచ్చిపో — యె కిరుసాపి —యనుచోఁ జతుర్థపాదమున ద్రుతప్రకృతికముపైఁ బరుషము సరళము గాకయే ద్రుతము లోపించినది. భూతార్థక ప్రథమపురుషైకవచనము (పోయెన్) ద్రు. ప్ర. యే కదా.

వై. చం. లో 'సరళస్యానాదేశత్వే ఏవ లోపకార్యం ద్రుతస్యేష్యతే'— యనునప్పటి విశేష నాదేశములు గానిసరళములు పరమైనపుడే ద్రుతమునకు లోప మిష్ట మని స్పష్టము చేసె. సూరి నాది (సంధి - 30) అని సూత్ర.లోను, ద్రుతంబున కచ్చు రా లోపంబు లే (2 - 27) దని శ. ల. సం. లోను జెప్పి ఆం. శ. శా. లో స్వరపరుషంబులు రాఁ గలుగ (సంధి - 85) దనెను.

స్వత్వసంశ్లేషలనుగూర్చి పైని జూతము

పరుషపరకతలో ద్రుతమునకు బిందువును మీఁది పరుషములకు సరళములును వలె సరళస్థిరపరకతలో ద్రుతలోపమును సామాన్యముగా లాక్షణికులు చెప్పిరి. కాని క. సం., ఆం. భా. భూ. వంటికొన్నింట సరళస్థిరపరకలో నకారత్వము ప్రస్తావించుట కానరాదు. పరుషములతోఁ గూర్చి పాల్కురికత్వమున నెల్ల త్రి. శ. సాధారణముగ వైకల్పిక లోపము చెప్ప సా. త్రి. శ. పరుషపరకతలో వారించి సరళస్థిర పరకతలో నంట స్థిరపఱచుట చూచితిమి. ఆం. శా. (సం.) ద్రుతిన సిరసరళేషు నస్య వా లుక్ — ద్రుతప్రకృతిపదా త్పరతః స్థిర సరళేషు నస్య వా లుక్ స్యాత్ ఉ. తేఁచెద గజవరదుని, కొలిచెద భర్త్రార్తిహారుని, ఇచ్చె వరదుఁడు వరములు — ఇత్యాది (సంధి. 32)

బిందువు :

స్థిరసరళయోర్ద్రుతస్య (వై. చం. సంధి. 27) — ద్రుతస్య బిందుః ప్రకృతిభావలోపౌ స్తః స్థిరసరళయోః పరతః అని వృత్తి. వై. చం. సూత్రగ్రంథము పాణినీయమార్గములోఁ జెప్పఁబడఁగా సిద్ధాంతకౌముదివలెఁ బిదప నిట్లు గూర్పఁబడినదేమో కాని వృత్తి యందున్న యర్థము సూత్రమున స్పష్టము గాదు తలంచుగా. ఏమైనను నిట వృత్తి బిందుశబ్దముచే అర్థబిన్దుర్బిన్దుః (వై. చం. సం. 27) అను దానిం బట్టి యరసున్నను చేర్కొన్నది. (లక్ష్యము చూపలేదు.) కానను తెలుఁగువృత్తియు నరసున్ననే వివరించినది. కాని సరళస్థిరపరకతలో ద్రుతమునకుఁ బూర్ణబిందువే గాని ఖండము లేదు గదా. కావున సంస్కృతవృత్తిలో బిందుశబ్దస్థలమున బిందుశబ్దమె యుండవలె. లేదా వై. చం. విలక్షణముగా సరళ స్థిరపరకతలో ఖండమును విధించుచుఁ ప్రయోగదృష్ట మగుచున్న

పూర్ణము ననాధువు చేయుచున్న దనవలయును. త్రి. శ. వారి బిన్దు రిత్యతే సర్వేషా మ్మతి బిందువు పరుషపరకతయందువలె విధించినను పరుషసరళస్థిరములు మూఁడింట ద్రుతమునకుఁ బూర్ణమే యగుటను సా. త్రి. శ. నుబట్టి గ్రహింపవలయుట స్పష్టము.

ఆం.కౌ (సం.) బిందు శ్చాచార్యాణాం ఆచార్యాణాం మతే తస్య నకారస్య బిందుశ్చ వా స్యాత్ .... ఉ. రామం చంద్రాస్యం గంజాక్షుం బరముం దలఁతున్ (సంధి. 34) అన్నది. ఇట ద్రుతిన స్థిరసరళేషు వా లుక్, సంయోగ శ్చాలుకి కర్తవ్య- యను 32, 33 సూత్రములనుబట్టి యీబిందువు సరళస్థిరపరకతలోను నగు నని చెప్ప వచ్చును. కాని పరుషపరకస్థలములే యుదాహృతములు. పరుష పరకత్వమున నస్య వా బిందుశ్చ యని యింతకుముందే బిందువు విహితమైయున్నది. (ఇటఁ గూడ వృత్తి బిందుశ్చ 'వా' స్యా త్తనియే చెప్పె.) పిదప అనుస్వారాచ్చ— బిందోః పరాశ్చ పరుషా స్సరళా ఏవ స్యుః ఉ. రాముం గరుణాకటాక్షుం గృష్ణుం బావన చరిత్రుం దలఁతున్ (35) అనుటంబట్టి 34.సూత్రము పరుషపరకత యందును బిందువు చెప్పుచున్న దన్న నస్య వా బిన్దుశ్చ —యను నింతకుముందటివిధి వ్యర్థమే యగును ఇట్టి బిందువు పైఁ బరుషము లకు సరళము లగు నని చెప్పుపద్ధతి సిద్ధాచ్చ యనులక్షణమున సా. త్రి. శ.లోను నుంట గమనించితిమి. అయ్యును బిందు శ్చాచార్యాణా మ్మనుసూత్రమునొద్ద సరళస్థిరపరకస్థలములఁ గూడ రెండు మూఁడే నుదాహరించిన బాగుండెడిది. ఆం. కౌ. (సం.) కూడఁ బరుషపరకతయందుమైతము పూర్ణబిందువునే చూపి ఖండ బిందువును వివరింపకుంట గమనార్హము.

ఇట సరళము లేవి పరమైనను ద్రుతమునకుఁ బూర్ణ మగుటను లాక్షణికులు స్పష్టము చేసిరి. ఇక స్థిరములు నేవ్వణములు పరమైన

వుడు బిందు వగునో లాక్షణికులు కొందఱు పరామర్శించిరి. సూరి ఆం.శ.శా.లో పరళంబు రా నెఱసున్న శ్వాచిత్కంబుగఁ జూపట్టెడు (సంధి—105) అనియును సూత్రత. లో ఝుయి ద్రుతస్య పూర్ణబిన్దు రన్యతరస్యాం (సంధి. 32) మొదలుగా వర్గయుక్పరళత లోను జెప్పె నది బా.వ్యా. లోఁ బ్రసిద్ధము. త్రి. శ., సా. త్రి. శ. స్థిరములందును నేవి పర మైనను బూర్ణ మగు ననియే చెప్పిన వనవలె. నృపతిం మూర్ధన్యాఖన అనునాసికతో పాటు సా. త్రి. శ. హరిం లోకే శ్వరున్ అనియుఁ జూపుట గమనించితిమి.

శ. సం. 'నాంతపదములమీఁదఁ గచటతపవర్గముల్ కూడి కదియఁ బలుక నిరుడ నున్న నకారంబు బిందు వగు (1-32) నన్నది. అంగజగురుండు కరుణఁ గాచెం జగంబు, కంజలోచనుండు ప్రోచుం జగంబు (కంబు— బ్రోచున్ జగంబు— అనుముద్రితపాఠము ప్రామాదికము. పైఁగా సంధి యతి గాని ప్రాసయతి గాని కుదు రదు. 1-3 పాదములనుబట్టి యీ రెండవ పాదమునను ద్రుతమునకు బిందు వై ప్రాసయతి చెల్లింపఁబడుట సక్రమము.) అండజహ యుండు దనుజహంత్రిం డిగ్గె ను, నని ప్రయోగింపఁదగుఁ గాళియాహి దమన. (33) కచటతపవర్గముల్ అనుటచే వర్గాక్షరపరకతలోనె బిందువు. కాన నంతస్థాదులు పర మైన ద్రుతమునకు బిందువు రాదు. 'యరలవశషసహాళ'లకు ముందటిద్రుతమునకు బిందువు లే దని స్పష్టమగుచున్నది.

ఇఁక వర్గాక్షరము లన నేవి? (ద్రుతముపైఁ బరుషములు సరళము లగుఁ గావున) వర్గలలో రెండు మూఁడు నాలు గైదక్షర ములు పర మైనవుడు ద్రుతమునకుఁ బూర్ణ మగు నన్నమాట. వర్గ యుక్సరళము లగుట 2, 3, 4, వర్ణములు పర మైన బిందు వగుటకు వీలు సూరి సమ్మతము. పంచమాక్షరముల మిగిలె. అందు ఙ, ఞ,

ణాదు లగుపదములు తెలుఁగున సంస్కృతసమములం దేవి లేమి (హ్రస్వస్వరాంతపకారంబును ణాయుళలను బడాదిని లేవు — ఆం. శ. శా. పం. 46. సంస్కృతసమములయెడను ణళలు లేవు గదా.) తత్పరకత్వ ప్రశ్న లేదు. మిగిలినవి సమలు. తరువాతిపద్యమున క. సం. తమ్మియి మ్మగుకొమ్మ దాల్చె న్మరారి (34) అని చూపినది. తాల్చె న్మరారి యన్న యతిభంగము. మకారపరకతలో ద్రుతము నకు బిందు వైనంచుల కిది లక్ష్యము గావలె. లో— కంబు లెల్ల నుండు నెమితోడ (ఛందో. 1. 1) నన్నట్లుగా 'తంమి' అని మొదటఁ గూడ మకారమునకు ముందు బిందు వుంచె నేమో తత్కర్త. నకారమున కుదాహరింపకున్నను సమలు పర మైన ద్రుతమునకు బిందు వవు ననియే యర్థ మగుచున్నది.

అప్పకవి 'తృతీయచతుర్థవర్గములఁ గలుగుసరళములు సమలి వులును బరము లైన బిందు వగు నని(5-101)పిదప గజబమకారపరకత యందుఁ జెప్పె (5-157). కాఁగా 151, 157-ల ననుసరించి డడఢ, థదధ, గజబము—అన్నవి పర మైనపుడు పూర్ణ మగు. కాఁగా నిట సరళము లన్నియుఁ జెప్పఁబడిన వప్పకవీయమునను. ఇఁక వర్గాక్షరములలో క. సం. కనుగుణ మగునకారము నప్పకవి యెటఁ బ్రస్తావింపలేదు. అయ్యు నొక్కచో థాతం నాభిని అని చూపినపక్షము గలదు. అవసరమునుబట్టి చూచిన (మకారపరకతయందు నవసర మేమో కాని) నకారపరకతలో ద్రుతమునకు బిందువు చెప్పరా దన వచ్చును. అట్లు చెప్పవలసినప్రయోగములు గానరావు. ఏ మైనను నకారపరకతలో ద్రుతమునకు బిందువు వివాదగ్రస్త మైనది.

మకారపరకబిందువుఁగూర్చి గ్రంథాంతరమునఁ బరామర్శింపఁ బడియున్నది. (త్రి. శే.)

ఇట్లుండ నవ్య. వచనములలో వర్గయుక్కులు నెల్లఁ బ్రస్తావింపరాకున్నవి. త థ, థ ధ, అనునాల్గే పేర్కొనె. సా.ప్రతి.శ. నిన్నుం భావింతున్ — అని చూపె. ఇతఁడు చూపిననాల్గింటిలోను మిగులునవి మూఁడే. అప్పకవియే 'తవర్గంబునందు ద్వితీయవర్ణము సంస్కృతాంధ్రశబ్దాదులందు లేదు. గానఁ' తత్పరకతా ప్రసక్తియే లేమి నటనే స్పష్టము చేసెను. ధుతనము ధూత్కార మనురీతి నొండురెండు కోశములు చూపినను బ్రయోగములు వెదుకవలసినవె. అట్టియెడఁ దత్పరకతలో బిందువు చెప్ప నేల? చెప్పిన బిందువు చేయుట లక్షణవిరుద్ధము గాకపోవచ్చును. కాని ప్రయోగవిరహిత ముఁగ నంగీకరింప నేల? కాఁగా త,థ, ధ అన్నవి మూఁడే మిగిలినవి. అంతకు ముందు మెఱసెను ఖడ్గ మని చూపినసూరియు వర్గయుక్పరక సూత్రమునొద్ద వర్గయుక్కులలో మొదటి దగుఁదగిన ఖకారమును జూపక వచ్చెం ధాత్రీపతి యని ధకారమునె చూపుట విశేషము. ఒకానొకచో ననుటచేఁ బ్రయోగానుగుణముగా గుర్తింపవలసి యున్నది. సూరి యట్లు స్పష్టము చేయలే దంతియ. ఏం ఖరవృత్తి జూఁపఁడగవే విరహార్తులపై మరందవత్స్వంఖ— (సారం—2-183) అనుచోఁ గలదు. కాని వినుము—విను—విన్— అనుచో నున్న నకారము ద్రుతమె కామి నది విలక్షణప్రయోగ మనక తప్పదు.

ఇంకే మేని బ్రయోగము లున్న వేమో వెదకి గ్రహింప వలసియున్నది. ఒకానొకచోఁ గాఁబడియెడి నని సూరి పేర్కొనుటం బట్టి ప్రయోగానుసారముగా గ్రహింపవలసినదే కాని వర్గయుక్పరకపరకతలో బిందువు సాధారణముగాఁ జేసికొన వీలు లేదు గదా. వెం. వ్యా. ద్రుతకార్యములను దాదాపు సూరివలెనె చెప్పినను స్థిరపరకతలో బిందువు లే దని, ఇచ్చె ధనము, ఇచ్చెను ధనము,

ఇచ్చె న్ధన మని (సంధి. ౫౧) చూపి వర్గయుక్సరళతలో బిందు వంగీక రింపకుంట విచార్యము.

స్వాత్వసంశ్లేషములు :

లాక్షణికులు పెక్కురు పొల్లనకారమున ద్రుతముగా నిర్వ హించినవా రగుటంజేసి స్వాత్వసంశ్లేషము లని విశేషముగాఁ జేర్కొ నుట గానరాదు. అయిన మొదటినుండియు వీని ప్రస్తుతి కొండొకచోఁ గానవచ్చునే యున్నది.

వరుసవరకసంశ్లేషము

సా. త్రి. శ. సంశ్లేషో రావణస్య (సంధి. 41) —లోపాభావ పక్షే తస్య నకారస్య వర్ద్రాణేన సహ సంశ్లేషశ్చ స్యా ద్రావణస్య మతే. కృష్ణు న్దేవునిగా నెంతున్, రాము న్బలరిపునేవ్యున్, దేవు న్భాషింతున్, అని సంశ్లేషము చెప్పినది. కాని యిట సరళస్థిర ములే యుదాహరించుట యాదృచ్ఛిక మనవచ్చును. ఆదేశసరళ పరకస్థలమునను ద్రుతమునకు సంశ్లేషము దీనిచే సిద్ధింప నవకాశ మున్నది గదా. పరుష పరక ద్రుతలోపమునువలె సంశ్లేషము లేమిని సా. త్రి. శ. ప్రస్తావింపలేదు. చింతామణియందువలెనె సా. త్రి.శ. లోను స్వాత్వ ముచ్చరింపఁబడలేదు. కాని వర్ద్రాణేన సంశ్లేషశ్చ యని, కృష్ణు న్దేవునిగా నని యిటఁ జూపుటచేతను, నింతకు ముందు ద్రుతలోపాభావపక్షమును వచ్చెన్ గణపతి యని చూపుటచేతను ద్రుతమును మీఁదిహల్లుతోఁ గలుపక వేఱుగా వ్రాసిన నది స్వాత్వ మని గుర్తింపఁదగియున్నది. కాఁగా సా. త్రి. శ. ఆదేశసరళస్థలమునఁ జూపిన 'కృష్ణున్ గంజాక్షు, ననురీతిది స్వాత్వ మగు. ఇట్టియెడల

నా దేశసరళపరకతలలో కృష్ణు స్తంజాతుండని మీరందఱు వ్రాల్లులో గలిపి వ్రాయుట యనుసంశ్లేషము దుష్ట మనినాను, సరళస్థిరపరకతయందు మాత్రమే యట్లు వ్రాయవచ్చు ననియుం జెప్పుట యుక్తిశూన్యము.

ఆం. శా. (సం.) సంయోగశ్చాలుకి కణ్వస్య— లోపాభావ పక్షే తస్య నకారస్య పరసవర్ణేన సహ సంయోగశ్చ వా స్యాత్ త్వణ్వమతే ఉ. బలభురిపున్యన్ బుద్ధిన్ దేవుని నెంతు రామునిన్ —కరుణాబంధున్ ఇత్యాది. [సంధి - 63 ప్రతిప స్థిరసరళేషు నస్య వా లుక్— అనుపూర్వసూత్రముచే దుతమునకు లోపము రానపుడు సంశ్లేషము వచ్చు నన్నసారళ్స్థిరయందే సంశ్లేష మగు నని యర్థ మగుచున్నది. కాని యిందు రామున్ కరుణా బంధున్ అనియుం గలుపుటం బరుషపరకతలలో నస్య వా బిన్దుశ్చ (తస్య నకారస్య వికల్పేన బిందుశ్చ స్యాత్, రాముం దలంతున్, పరముం గళానిధిన్— ఇత్యాది.) (౬౫) అనుదాహృచేం బాక్షిక మగు బిందువు (ఇందు నైతము ఖండబిందు ప్రసక్తి గానరాకుంట విశేషమే.) రానిపక్షమున సంశ్లేష మగు నని చెప్పవచ్చు. కాని యట్లని తత్కర్త స్పష్టము చేయలేదు. అంతకుముందు ముద్రిత ఆదే స్తృతీయాః— ద్రుతప్రకృతేః పరతో వర్గాదీనాం పరుషాణాం వర్గతృతీయా స్సరళాః స్యుః (24) అనుచో కొలుతున్ గరుణాకటా క్షుని తలంతున్ గమలాక్షుని, సేవింతున్ జంద్రమౌళి, కృష్ణున్ బర మున్, బరమపవిత్రుని అని చూపెను. ప్రస్తుతసంశ్లేషసందర్భము నను పరవర్ణేన సహ సంయోగశ్చ— యని సేవ్యున్ బుద్ధిన్ దేవు నిగా అని ద్రుతమును మీరందఱు వేఱుగాం జూపుట వ్రాయునగాని ప్రమాద మన్నను, పై తీరుగానె బుద్ధి నేవ్యు నన్నసంశ్లేష మనియు కృష్ణున్ బరమున్ అన్న నది సంశ్లేషము గా (స్యాత్వముగా?) దనియుం జెప్పవలె. స్వాత్వప్రసక్తి యుంమను గానరాదు.

వెం. వ్యా. కూడ సరళస్థిరపరకతలో సంశ్లేషమును జెప్పినది. (సంధి 21) కాని పరుషపరకతలోఁ జెప్పలేదు. అయ్యును నిట 'సున్నయు ద్విత్వంబును వైకల్పికంబుగా నగు' నని చెప్పి యుదాహృతులలో బిందువు చూపినపిదప వచ్చెను గమలాక్షుఁడు వచ్చెన్ గమలాక్షుఁ డని చూపినది. బిందుద్విత్వములు రెండును వికల్పముగాఁ జెప్పుటచే నవి రెండును రానిపక్షమున వచ్చెన్ గమలాక్షుఁ డని నకారపుఁబొల్లు యుల్లై యుండు నన్నమాట. దీనిని సంశ్లేషముగా వ్యవహరింపకుంట విశేషము. ఇచ్చ్వ స్థన మని యింతకు ముందు మీఁదిహల్లుతోఁ గూడుటను సంశ్లేషముగాఁ జూపి యిట నకారమును విడిగా నుంచుటలో నిది సంశ్లేషము గా దని భావ మేమో. అట్లు యగుచో సరళస్థిరపరకతలో వచ్చెన్ గోవిందుఁ డనురీతి వ్రాఁతయు, నాదేశసరళపరకత్వమున వచ్చె స్గమలాక్షుఁ డనురీతి వ్రాఁతయు దుష్టము లని నిర్ణయింపవలసియుండును. అట్టికల్పనము సక్రమముగాఁ దోఁచుట లేదు. ఈ రెంటికి భేద మేమి? ద్రుతము పొల్లైయుండ ద్విత్వము 'ను' అగుట విశేషము. వ. పం. కూడఁ బరుష(ఆదేశసరళ)పరకతలో ద్రుతమునకు సంశ్లేషము చెప్పలేదు.

*సరళస్థిరపరకసంశ్లేషము :*

ఆదేశసరళపరకతలో సంశ్లేషమువిషయమునవలె సరళస్థిరములు గొన్నింటివిషయమున సంశ్లేషమువిషయమున నభిప్రాయభేదములు గానవచ్చు.

అప్పకవి కడుఁ దృతీయచతుర్థవర్గములఁ గలుగు సరళములు సమలిపులును బరము లైనతఱిని నాంతపదాంతద్రుతంబు పొల్లు బెఱికి యై నిత్యముగఁ బూర్ణబిందు వగును (౩-౧౫౧) అనెను. అనఁగా తదధ, థవధ, అన్నవి పర మైనపుడు బిందువు నిత్య మన్నమాట.

థకారపరకతలో బిందువుఁ గూర్చి యట్టియవకాశము లే దని యప్పకవియే స్పష్టము చేయుట గమనించితిమి. కాఁగా తద,థ, దధలు పరమైన బిందువు మాత్రమే యగు ననవలె. నిత్యముగ బిందు వగు నన్నను నిట లోపస్వత్వముల స్థితి యప్పకవి యంతకు ముందే స్పష్టము చేసె. 'వదలక కాచె లేవలు మీఁఱఁ గ్రేవుల గోపకులను తీవి గూడి మాడి (5-148) అని మొదలుగ లోపస్వత్వములు చూపె. లోపస్వత్వములు లేనిపక్షమున ద్రుతమున కిట బిందువు నిత్య మన్నమాట. అనఁగా తాదులు పర మైనపుడు ద్రుతమునకు సంశ్లేషము లే దని యర్థము. తత్సందర్భమున వీనితో ద్రుతమునకు సంశ్లేషము నప్పకవి యుదాహరింపకుంట గమనింపవచ్చును.

దీని ననుసరించియే కావచ్చు తె.వ్యా. 'తదథ దధరక్ష- ఈ యాఱువర్ణములకు తాదు లని పేరు. (సంధి-64) తాదులు పర మైనపుడు సంశ్లేషము రాదు' అన్నది. ఇట తె.వ్యా. రక్షల నదనముగాఁ జేర్చినది. తె.వ్యా. క్షకారమును వర్ణాంతరముగాఁ బరిగణించినది గావునఁ దత్పరకత్వము నిట వేఱుగాఁ బ్రస్తావించియుండును. వచ్చెన్ క్షత్రియుఁ డన్నను (వచ్చెన్ ఋషి యన్నట్లుగా)నది సంశ్లేషమె యగును. మీఁదివాల్లుతోఁ గలిపి వ్రాయకున్నను నది సంశ్లేషమే యని తె.వ్యా.లో నున్నది గదా. కాన క్షకారము నటఁ జేర్చుట యనవసరము. (లోపము వచ్చు నని చెప్ప లేని విశేషము కాఁగలదు.) ఇట్లే రేఫము సంయుతము. అనఁగా వచ్చెన్ రాముఁ డని యున్నను నది సంశ్లేషమె యగుట తె.వ్యా.కు ననుగుణమ యైయుండఁ దత్పరకత్వమున సంశ్లేషనిషేధ మేల? అప్పకవి నరకదనుజాంతకు గ్రాహిణే యానుజాన్ (5-148) అని సంధికలిలో సంశ్లేషమును జూపియే యుండఁగా తె.వ్యా. రవర్ణమునుగూడ నిట నేల చేర్చినదో స్పష్టము

గాదు. అప్పకవీయానుగుణముగాఁ జూచిన, ఠడఢ, థదధలు పర మైన సంశ్లేషము లే దనవలె. చేసెన్డక్కలు నెగడె న్దమములు, ఇచ్చె న్ధన మనురీతిగా దదధపరకసంశ్లేషమును లాక్షణికులు చూపియే యున్నారు. ఠథాదిపరకసంశ్లేషము నైతేను నిషేధింపవలసినయవసరము గానరాదు.

పైయుప్ప. కనుగుణముగనె కావచ్చును. ప.సం.కూడ టతవర్గంబులతోడను ద్రుతము సంయోగంబున కుదుర దని వివరించినది. కాని పిదప 'ఇట్టిద్రుతమునకు దిట్టంబుగాఁ గొన్నియెడలఁ గృతుల నున్న వడయు ననియుఁ గొందఱు పలుకుదురు కెందమ్మి చెందొవ- (సంధి-71) యున్నది. అనఁగాఁ గెందమ్మి చెందొవ యనుచోఁ దవర్గీయము గాన సంయోగము లే దని యభిప్రాయ మగునా? నెగడె న్దమము లని సూరి చూపెను. ప్రాంతాదికార్యములసందర్భమున ద్రుతమున కెచ్చటను సంశ్లేషము లేదు. చెన్గలువ, క్రొన్జెమట, క్రొన్బసిండి యనురీతిగాను నుండదు గదా. ప.సం. ప్రాంతాదస్థలము నిట నుదాహరించుట సరిగా దనఁదగు. ఇట్టిద్రుతమున కన్నను టతవర్గాక్షరపరక మని యర్థము గా దనియు నట్టిలక్ష్యము యాదృచ్ఛిక మనియుఁ జెప్పినను టతవర్గాక్షరములకు సంయోగము లే దని సామాన్యముగా నంగీకరించుటయు నొప్పను. మెచ్చె న్నలినాక్షుఁడు ఇత్యాదులును నసాధువులె యనవలెనా? ఇది కవి ప్రయోగవిరుద్ధము గదా.

ఇంకను కెందమ్మి చెందొవ యనుచోఁ ద్రుతమునకు బిందువు నిత్యముగా నగు నన తెలియదు. 'కొన్నియెడల నున్న వడయు ననియుఁ గొందఱు పలుకుదు' రనుట నిటఁ బక్షాంతరమున కవకాశము గల్పింపంబడిన ట్లయినది. కెందమ్మి యనురీతిస్థలముల బిందువు పాక్షిక మనుటయుఁ గుదురదు. కాన నీలక్షణలక్ష్యములు ప్రామాదికము లన వలసియున్నది.

*సంశ్లేషస్వరూపము :*

త్రి.శ. సంశ్లేషమును జెప్పలేదు. సా. త్రి.శ. రావణమతము ననుసరించి విశేషముగాఁ జెప్పినది. అయ్యున్ నో వాలి వా యనుచో లోపాభావపక్షమున వచ్చెన్ గణపతి యని చూపి, వచ్చె న్గణపతి యన్నది సంశ్లేష మనుటంబట్టి, వచ్చెన్ గణపతి- స్వత్వమును, వచ్చె న్గణపతి సంశ్లేషము నైనది. ద్రుతము పొల్లనకారమె యని భావించు పక్షమున స్వత్వసంశ్లేషల నిట్లు నిర్ణయింపక తప్ప దని గుర్తించితిమి. అయినఁ బొల్లనకారమె ద్రుతి మైన శబ్దానిని మీఁదిహల్లుతోఁ గలిపి వ్రాయుటను (సంశ్లేషము) విశేషముగాఁ జెప్ప నేల? తె.వ్యా. అథస్స్వాదికలో నకారమును పైహల్లుతోఁ జేర్చి వ్రాయకపోయినా సంశ్లేష యనే చెప్పవలసినది (22పుట) అని యనుట గమనార్హము. ఆం.కౌ (తె.) వేఱ హల్లు స్సఁ (బరుపేతరము) జను వచ్చు నల్ల నకార (4పుట) మని నకారము లోపింపక నిల్చినందులకు 'వేదుక న్వచింతు' వని చూపినది. కాని సంశ్లేష మని ప్రత్యేకముగా విధింప లేదు. త్రి.శ. కూడ సంశ్లేష మును విశేషముగాఁ జెప్పకుంట యిందు వలననే యనవచ్చును. అనఁగా ద్రుతము లోపింపనిపక్షమునం దద్దానిని వచ్చెన్ గంజాక్షుఁ డని విడిగా నేని, వచ్చె న్గంజాక్షుఁ డని మీఁదిహల్లుతోఁ గూర్చి యే నెట్లే వ్రాయవచ్చు. కాన మీఁది హల్లుతోఁ గూర్చి వ్రాయుట విశేషకార్యముగఁ జెప్పలే దనఁదగు. రావణుఁడు నట్లె ఆం.కౌ. (సం) ననుసరించి కణ్వుఁడును సంశ్లేష మును జెప్పుటలో (సంశ్లేషో రావణస్య) వారిమతమున ద్రుత మేదో యెఱుంగుట కాతనిలక్షణగ్రంథము దొరుక దాయె. కాక సా. త్రి.శ. నిర్వహించినట్లుగనె పొల్లునకారమె ద్రుత మని కణ్వరావణులమత మున నన్న సంశ్లేషము చెప్పుట ప్రయోజనవంతము గా దని చెప్పక తప్పదు. వారి మతమెట్లున్నను దాని ననువదించిన సా. త్రి.శ; ఆం. కౌ.(సం.) పొల్లనకారమునె ద్రుతముగా నిర్వహించుట, కణ్వరావణ

